# జైమిని భారతము
# సంశోధనాత్మక పరిశీలనము



(1)

సిద్ధాంత వ్యాసము



డాక్టర్ ముదిగొంత వీరేశలింగము

# జైమిని భారతము
# సంశోధనాత్మక పరిశీలనము

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి
డాక్టరేట్ పట్టము పొందిన సిద్ధాంత వ్యాసము


రచయిత :

**డాక్టర్ ముదిగొండ వీరేశలింగము**

ఎం.ఎ., పి.హెచ్.డి.,



"This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme - Aid to publish Religious book."

సెప్టెంబరు 1988

ప్రథమ ముద్రణము

వేయి ప్రతులు

హక్కులు రచయితవి



వెల : నలుబది రూపాయలు

"శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు శ్రీశివలెంక శంభుప్రసాద్ ధర్మనిధి"-
ఆర్థిక సాహాయ్యమున ముద్రింపబడిన గ్రంథము: వారికి కృతజ్ఞతలు:

ప్రకాశకులు (ప్రతులకు):

శ్రీమతి ముదిగొండ జ్ఞానప్రసూన

12-4-77 పాపయ్యపేట

వరంగల్ - 506002 (ఆంధ్రప్రదేశ్)

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్

హైదర్‌గూడ, హైదరాబాద్-1

సీ. ప్రణవపీఠంబున మంత్రపరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భాషిణులుఁ బరాపశ్యంతి మధ్యమా
వైఖరుల్ దేవి పర్షసరణి
జపహార కీర పుస్తక విపంచీసమంచి
తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందళీ బృందంబు
చంద మేదేవి యానందమూర్తి

తే. వాంఛ నేదేవి కాంచనగర్భచతుర
పూర్వదంతకవాటవిస్ఫుట మనోజ్ఞ
చంద్రకాంతశిరోగృహస్థలవిహార
మమ్మహాదేవి వాగ్దేవి సన్నుతింతు.

—పిన వీరభద్రుఁడు.

రెండు రససముల పెందుగా గల్గిన గ్రంథము లగుటచే తొణికిసలాడుటయును వీలులేదు. కవి సామర్థ్యం మిరచటనే బహిర్గతమగుచున్నది. ఏ పద్యము చూచినను గంభీర భావములే వినిపిల్లును, నీరసత త్త్వము మృగ్యమై - ధార కెట్టి లోపమును లేకున్నది.

జైమిని భారత భాగములుగా కనుపించు కొన్ని గ్రంథములు మనకు ఆశ్రమ వాసాంతర్భాగముగా "సీతావిజయ" మని యేబది అధ్యాయములలో "గ్రంథ" లిపియందు (నెం. 6496) యెనుబదియారు కమ్మలలో వ్రాయబడిన దొకటియు, ఒరియా లిపిలో నూట యేబదిమూడు కమ్మలలో వ్రాయబడిన (మెకంజీ) జైమిని భారత.... మరొకటియు, ఇండియా ఆఫీసు లైబ్రరీలో నున్నవి. తంజావూరు టి.ఎం ఎస్.ఎస్.ఎమ్. లైబ్రరీలో "సేతు మాహాత్మ్యము" అను (నెం. 8088) పేర నొక సంస్కృత గ్రంథముగా నున్నది. అట్లే (నెం. 8690) సేతు మాహాత్మ్యము (స్కాంద పురాణాంతర్గతమని), (నెం. 8678) సంస్కృత జైమిని భారతము కలవు.

డాక్టర్ దస్తూన్ రాజా గారి "కేటలాగస్ కేటలాగోరమ్" ఏడవ సంపుటిలో (1973) యావత్తు భారత దేశమునందలి జైమిని భారతము తాళపత్ర ప్రతుల జాబితా తెలుపబడినది. వివిధ భాషలలోని ఈ ప్రతులు దాదాపు డెబ్బది యైదున్నవి. ఇవి నాటకములుగను, జై.భా. గీతగను, జైమిని రామాయణము, భాగవతము, అను పేరను, ధర్మ సంవాద, రావణ చరిత, హనుమద్విజయము లను పేరను గలవు. ఇవి పశ్చిమ బెంగాల్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్, మైసూర్, గుజరాత్, మహారాష్ట్ర, కేరళ, రాష్ట్రములందును, బంగ్లాదేశ్ లోను ఉన్న ప్రముఖ విశ్వవిద్యాలయములలోని తాళపత్రాలయములకు సంబంధించినవి. వీనిని పరిష్కరించి ప్రకటించవలెననినను, సరిపోల్చి మూలముతో చూడవలెనన్నను, తేలికగా జరుగు విషయము కాదు. దీనికి అంగబలమును, అర్థబలమును, ఓపికయు కావలసియున్నవి. వీనిని పరిశీలించిన గాని,సంస్కృత జైమిని భారతము సంపూర్ణముగా వ్రాయబడినదని నిశ్చయింప వీలుకాదు. తిరిగి వ్రాయు నపుడో- మరెప్పుడో-"లిపి"మారి యుండవచ్చును. ఈ రోజున ఇదియు మరొక "సమస్య"యే యైనది.

పరిశోధనలు ఈ రోజున అనేక అంశములను గూర్చి అనేక దృక్కోణ ములలో కనబడుచున్నవి. ఎం. ఏ., చదివిన పిమ్మట పరిశోధన చేసి డిగ్రీ

సంపాదించుటతో పరిశోధన స్తబ్ధము కాదు. ఒకమారు ఆ రుచి కల్గినచో మరది పోవుట దాదాపు "అసాధ్యము" అనియే చెప్పవలయును. కష్టసుఖములను, నిద్రాహారములను, ఆర్థిక బాధలను తట్టుకొనుట కూడ అసాధ్యమే. వీనినెదుర్కొని కొనసాగించిన వారు కూడ మనకు కనబడుచున్నారు.

1960 లో నేను బి.ఏ., విద్యార్థిగా ఉన్న సమయమునందు విద్యాధికు లగు కొందరను చూచి, వారిని ఆదర్శముగా నుంచుకొని, బి. ఏ., తరువాత 1965 లో ఎం. ఏ., పూర్తి చేసియున్నాను. విలువగు అనేక సాహిత్య సభలకు వెళ్లి, వాని విలువలు నాకు తెలివిడి కాకున్నను, నాడి మనస్థితిని మాత్రము మరువలేను. సంస్కృతము, తెలుగుతో కలసిన గ్రూపును కూడ బి. ఏ., లో మార్చుకొనవలెనను ప్రయత్నము కూడ ఈ నాటి ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖలో రీడర్, నాడు మా ఉపన్యాసకులు, డాక్టర్ ప్రమోద గణేశ లాలే గారి వలన విరమించుకొనుట జరిగినది. 'ఆ' ప్రయత్నము ఫలించినచో- ఈ నాటి 'స్థితి' వేరుగా నుండెడిది. ఆచార్యులలో కొందరు నేడు పదవీ విరమణ చేసినవారు- వారిలో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు చిరస్మరణీయులు. మరికొందరు గురువులు పదవిలో నున్న వారు ఇంకను నన్ను వారి అంతేవాసునిగా చేసికొనిన వారు- అందరును జగమెరిగిన వారే. వారికి నా వందనములు.

కుటుంబము నుండి వచ్చిన 'నా' 'అభిరుచిని' గమనించి, చేసిన పనిని దృష్టిలో నుంచుకొని 1974 లో "విషయాన్ని" సూచించి- "అవకాశము" కల్పించినవారు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు; వారికి కృతజ్ఞతలు. ఆ నాటికి నేనుద్యోగములో నున్న కతముగా, రెండును నిర్వహించుట కష్టసాధ్యమనుటను తెలుపుట అతిశయోక్తి కానేరదు

డాక్టర్ ఎం. కులశేఖరరావుగారు - ప్రతి విభాగమును - శ్రద్ధతో, దయతో, విలువగు సమయమును, జ్ఞానమును వెచ్చించి, క్రమము [illegible], తీర్చిదిద్దినారు విలువగు సూచనలు చేసినారు పర్యవేక్షించినారు వారికి కృతజ్ఞతాంజలులు ఘటించుచున్నాను.

ఈ సిద్ధాంత వ్యాసమును సూక్ష్మేక్షికతో చక్కగా చదివి, పి హెచ్.డి. డిగ్రీకి అర్హమైనదిగా ప్రకటించిన పరీక్షకులు- ఢిల్లీ విశ్వవిద్యాలయ [illegible] శాఖ

లోని డాక్టర్ (శ్రీమతి) టి. సుశీలగారికిని, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయపు పూర్వపు తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య డాక్టర్ జి. ఎన్. రెడ్డి గారికిని వినమ్రతా పూర్వక ప్రణామములు.

తరచు యోగక్షేమములు కనుగొని, అవసరమైనప్పుడు చక్కని సూచనలు చేసినవారు డాక్టర్ పి.జి. కాలేగారు; ముద్రణకు ముందు జైమిని భారతము వావిళ్ళ ప్రతితో (1968), కొండపల్లి వీరవెంకయ్య గారి ప్రతి, బహుజనపల్లి సీతారామాచార్యుల వారు ప్రకటించిన ప్రతి (1872); ఎం. ఎతిరాజులునాయుడు గారి ప్రతి (1900)- మూడు ముద్రిత ప్రతులను పోల్చి చూచుటకును, పాఠ భేదములను వ్రాసికొనుటకును అవకాశము కలిగించి, ఆ ప్రతులను నా కిచ్చినది. తగు సమయములో సహాయము నొసగ్గిన మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల ఆచార్యులు డాక్టర్ దేవళ్ళ చిన్నికృష్ణయ్య గారు - వారలకు నమస్సుమములు. అంతే కాదు; మద్రాసు విశ్వవిద్యాలయమునందలి తాళపత్రాలయములోని D-14 కాగితపు ప్రతిని, ప్రభుత్వ తాళపత్రాలయాధికారులు సరిపోల్చుటకిచ్చి సహాయము చేయుట కృతజ్ఞతా పాత్రమే. తంజావూరులోని నెం. 111 మరియు నెం. 112 తాళపత్ర ప్రతులు రెండును వావిళ్ళప్రతితో సరిపోల్చుట కవకాశ మిచ్చిన తంజావూరు మహారాజ శరభోజీ సరస్వతీ మహల్ గ్రంథాలయ అధికారులకు మరువలేను.

పరిశోధనా సమయమున వర్తించిన గ్రంథాలయ అధికారులకు నా కేల్మోడ్పులు. వారిలో ఉస్మానియా విశ్వవిద్యాలయము, ఆదిలాబాదు-మంచిర్యాల ప్రభుత్వ కళాశాలలు, ఓరుగల్లులోని శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాల, మద్రాసు శాసనాంధ్ర గ్రంథాలయము, ఉ.వి.సంస్కృత అకాడమి, హార్వర్డు - హిందీ జైమిని భారతము జెరాక్సు కాపీని వెంటనే పంపిన ఆ విశ్వవిద్యాలయము ఉన్నవి.

ముద్రణ కాలమునందు స్వంత గ్రంథముగా భావించి కన్నులో కన్నుంచి -ఒకటికి రెండుసార్లు ప్రూఫులను చూచి యిచ్చిన పెద్దలు - విజ్ఞులు - శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికిని - సవినయముగా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

పైన పేర్కొనబడిన నెంబర్లు గల వివిధ తాళపత్ర ప్రతులు, ముద్రిత ప్రతులు, నేను "జైమిని భారతము" సంపాదకత్వము వహించి, "శుద్ధప్రతి"ని సిద్ధము చేసి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి సమర్పించుటకు ఉపయుక్త

మగుచున్నవి. కొన్ని ముద్రణా స్ఖాలిత్యములు గల వారిక ప్రతియే నాకు లభించుటచే దానినే ఉపయోగించుకొనినాను. సంస్కృతములో గోరఖపూర్ వారి జైమిని భారతమును వాడుకొనినాను.

దరఖాస్తు చేసిన వెంటనే దయార్ద్ర హృదయముతో, ఈ గ్రంథ ముద్రణకు-ఏబది గ్రంథము లిచ్చు పద్ధతిలో-అయిదువేల రూపాయలు ఆర్థిక సహాయము చేసిన తిరుమల-తిరుపతి దేవస్థానము-తిరుపతి అధికారులకును, ఆ సిబ్బందికిని నా హార్దిక కృతజ్ఞతలు. ఇది నిజముగా ఆ వేంకటేశ్వరుని కృపయే.

కోరిన వెంటనే తమ అమూల్యమైన అభిప్రాయములు వెలిబుచ్చిన డాక్టర్ ఎం. కులశేఖరరావు గారికి మరియు డాక్టర్ పి. శి లాలేగారికి వినమ్రతా పూర్వక ప్రణామములు.

ఈ గ్రంథమును చక్కగా ముద్రించి, రూపొందించిన శ్రీ పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ - హైదరాబాదు వారికి, ముఖ్యముగా శ్రీ శ్రీనివాస్ గారికి కృతజ్ఞతలు.

ఏ దినమును, ఇబ్బంది కలిగించక, ఆత్మీయత-ఆదరణలతో తమలో నొకనిగా చూచి సహకరించిన అసంఖ్యాక మిత్రులకు అభివాదములు.

అనేక బదిలీలకు గురియై, ఆయా ప్రదేశములకు వెళ్లి నా పని నేను నిర్వహించ, గృహ విధులను నిర్వహించుచు, సహకారము నందించు నా జీవిత సహచారిణి శ్రీమతి సౌ. ముదిగొండ జ్ఞానప్రసూనకు ఆశీర్వచనములు.

ఈ రచనా కాలమున తోడ్పడిన ప్రతి వ్యాసరచయితకు, గ్రంథ రచయితకు, వ్యక్తిగతముగా నా ప్రణతులు. "ఎందరో మహానుభావులు... అందరకు........"

వీలైనంత శ్రద్ధగా ఈ గ్రంథము తన రూపును దిద్దుకొనినది కొద్ది దోషములు దొర్లి ఉండవచ్చును. తప్పులు నాయవిగను, గుణములు సహృదయు లవిగను భావించ ప్రార్థన. సాహితీ లోకమునకు ఈ గ్రంథము ఏమాత్రము ఉపయోగపడినను, నా కృషి సార్థకమైనదిగా భావించెదను.

ఓరుగల్లు,<br>రుధిరోద్గారి<br>భాద్రపదము

బుధజన విధేయుడు,

**ముదిగొండ వీరేశలింగము.**

# అభినందన

ఆంధ్ర సాహిత్య చరిత్ర పథంలో ఉజ్జ్వలమైంది కవి సార్వభౌముడు శ్రీనాథుడు నివసించిన యుగం. ఆ మహాకవికి సమీప కాలంలో జీవించి, చక్కని రచనలు చేసి, తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కవి పిల్లలమర్రి పిన వీరభద్రుడు. అనేక కావ్యాలతోపాటు ఆ కవి జైమిని భారతం అనే కథాత్మక కావ్యాన్ని తెలుగు వారికి అందించి ధన్యుడైనాడు. డా. ముదిగొండ వీరేశలింగం గారు జైమిని భారతాన్ని సమగ్రంగా పరిశీలించి, పరిశోధించి ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించినారు.

సార్వకాలీనము సార్వజనీనమూ అయిన మహాభారతాన్ని వ్యాసుడు రచించినాడు, అయితే ఇది ఇతిహాసం కావడం చేత పలు ఉపచరితలు, మన్వంతరాలు వంటి కావ్యేతర వస్తు సముదాయం దానిలో చోటు చేసికొన్నవి. బహుశా, ఇటువంటి పట్టాదేవి లేని భారతాన్ని జైమినిముని వ్రాయడానికి పూనుకొని ఉంటాడు. కేవలం మనోహరమైన కథా గుచ్ఛాన్నే మనకు అందించాలని ఆయన అనుకొన్నట్లు కనిపిస్తుంది. జైమిని భారతం అనే పేరు దీనికి ఉండడంచేత మహాభారతాన్ని సమగ్రంగా ఆయన వ్రాసినాడు కాబోలు. కాని ఇపుడు మనకు లభించేది కేవలం అశ్వమేధ పర్వం మాత్రమే అయినా, జైమిని దాన్ని ఉదాత్త కథోపేతంగా తీర్చి దిద్దితే, తెలుగులో దాన్ని పిన వీరన మరింత మనోహరంగా సంతరించినాడు.

జైమిని భారతం కేవలం మహాభారత కథనం చేసి ఉంటే దానికి ఇంతటి ప్రాముఖ్యం ఉండేది కాదు. అనేక కథలు, మహాభారతముతో సంబంధం లేనివి దీనిలో ఉన్నాయి. ఉత్తమ శిల్పభరితంగా ఉన్న ఈ కథలు కావ్యానికి శోభను కలిగించేవిగా ఉన్నాయి. వానిలోని మాధుర్యాన్ని, శిల్ప లక్షణాలను డా॥ వీరేశలింగంగారు చాలా చక్కగా ఈ గ్రంథంలో ప్రదర్శించినారు.

మహాభారతంలో శ్రీకృష్ణుడు ప్రధాన పాత్ర వహించిన మాట నిజమే అయినా, ఈ భారతంలో అతని ప్రాముఖ్యం మరింత హెచ్చింపబడింది. పాండవులు శ్రీకృష్ణుని బంధువులుగా, స్నేహితులుగా, సహచరులుగా చిత్రింప

బడడమే కాక, జైమిని భారతంలో వారు శ్రీకృష్ణ భక్తులుగా తీర్చిదిద్దబడినారు. ఆ మహానుభావునికి వారు భక్తులైనారు కాబట్టే, పరివారం అంతా నశించి పోయి నప్పుడు, ధనం అంతా హరించి పోయినప్పుడు మహాభారత యుద్ధం తరువాత యుధిష్ఠిరుడు అశ్వమేధ యాగం చేయడానికి పూనుకోవడం, దాన్ని నిర్విఘ్నంగా కొనసాగించడం సార్థకమైనది. శ్రీకృష్ణుడు భగవత్స్వరూపుడు, అంటక మటనా సమర్థుడు కాడా మరి! మన దేశంలో కృష్ణభక్తి సంప్రదాయం ఏ విధంగా ఆవిర్భవించింది, ఏ విధంగా వికాసం చెందింది, ఏ భాషల్లో ఈ వాఙ్మయం ఏర్పడింది అనే విషయాలను ఈ పరిశోధకుడు చర్చించడమే కాక, అనేక అధి కారికమైన నిర్ణయాలు చేసినాడు. ఈ నిర్ణయాలు సోపపత్తికంగా ఉన్నాయి కాబట్టి ఆమోద యోగ్యంగా ఉండడంలో సందేహం లేదు. ఇదే సందర్భంగా అనేక విషయాలను, ఉత్తర దక్షిణ భాషా వాఙ్మయాలను సంబంధించు వాటిని చేర్చి, ఈ వ్యాసానికి గౌరవాన్ని కలిగించారు పరిశీలించగలగారు. ఇంక శ్రీకృష్ణుడు ఈ అశ్వమేధ పర్వంలో, మనుష్య మాత్రుడుగా ఏ విధమైన పాత్ర వహించాడు, అతని ప్రాముఖ్యం ఏమిటి అనే విషయాలను కూడ ఈ పరిశోధకుడు చర్చించి, ఆలోచింపచేసే అనేక విషయాలను వెల్లడించినాడు.

విష్ణుభక్తులు తమ ఇష్టదైవాన్ని తొమ్మిది విధాలుగా భజిస్తారని, వాటిని నవవిధ భక్తులు అంటారని సాంప్రదాయికంగా ఉన్న పద్ధతి. ఈ నవవిధ భక్తులు మనకు ఆంధ్రమహాభాగవతం వంటి భక్తి కావ్యాల్లో ప్రస్ఫుటంగా దర్శనమిస్తాయి. కాని, కథాత్మకమైన జైమిని భారతం కూడ ఈ భక్తి భావాలకు ఆలవాలంగా ఉన్నదనే విషయాన్ని సూచించడం కాక, అవి ఏఏ ఘట్టాల్లో ఏ విధంగా ప్రవర్తితమైనాయో చాల చక్కగా సమన్వయం చేసి చూపించినారు ఈ డాక్టరుగారు. ఇక్కడ సిద్ధాంతం చెప్పడం లోనూ, సమన్వయం చేయడం లోను, పరిశోధకుడు నిశితమైన నిష్పక్షపాత వైఖరి అవలంబించడం చేత ఈ పరిశీలన చక్కని మార్గంలో నడిచింది. సంస్కృతంలో ఉన్న జైమిని భారతం, పిన వీరన తెలుగులో వ్రాసిన జైమిని భారతం - ఇవే మనకు సామాన్యంగా తెలిసేవి. ఈ పరిశోధకుడు ఇతర భాషల్లో ఉన్న జైమిని భారతాలను గురించి కూడ చెప్పినారు. కన్నడంలో ఉన్న జైమిని భారతంలో ఉండే విశేషాలు ఈ వ్యాసంలో అనేకం ఉల్లేఖింపబడినాయి. మరాఠీ గ్రంథాన్ని గురించికూడ అవసర మైన సూచనలు దీంట్లో ఉన్నవి. అన్నిటికి మించి, విదేశ భాషలైన జర్మను,భాషలో

ఆంధ్రంలో జైమిని భారతం ఏ విధంగా ఉన్నది అనే విషయాలు కూడ ఈ పరిశోధనలో చేరినాయి. ఇవి ఆసక్తికరంగా ఉన్నవి.

పిన వీరన స్వతంత్ర భావాలు కలిగిన కవి. అది ఆయన రచనలు చూస్తేనే తెలియవస్తుంది. కాళిదాసు వ్రాసిన శాకుంతలం నాటకాన్ని, నాటకంగా వ్రాయక ఆయన దాన్ని ఉదాత్తకావ్యంగా సంతరించినాడు. ఆ విధంగానే, జైమిని భారతాన్ని గ్రహించినపుడు, కథాసూత్రం మాట ఎట్లా ఉన్నా, అనేక సందర్భాల్లో నూతనమైన విషయాలను చేర్చి ఉన్నాడు. ఈ సిద్ధాంత వ్యాసకర్త నిశితమైన దృష్టితో సంస్కృతాంధ్ర జైమిని భారతాలను తులనాత్మకంగా పరిశీలించినాడు. తెలుగు కవి చేసిన అన్యథాకల్పనలను ప్రదర్శించి వాటి ఔచిత్యాన్ని చర్చించినాడు. ఈ పరిశీలన అంతా సూక్ష్మేక్షికతో జరిగింది. ఆసక్తికరంగా ఉన్నది. పరిశోధక విద్యార్థులకు, సాహిత్య జిజ్ఞాసువులకు ఈ భాగం ఎంతో ఉపయోగకరంగా ఉన్నది.

మూడు విధాలైన ధ్వనుల్లో రసధ్వని కావ్యానికి ముకుటాయమానమైందని వేరే ప్రత్యేకంగా చెప్పపనిలేదు. పిల్లమర్రి కవి రసధ్వనికి తన కావ్యంలో అగ్రపీఠమే వేసినాడు ఈ విషయం పరిశీలనా దృష్టితో చూస్తేనేకాని వర్ణన మీయదు. వీరేశలింగంగారు ఈ కావ్యంలో ఉండే రసధ్వనిని గురించి, రసశిల్పాన్ని గురించి చక్కని పరిశీలనాత్మక చర్చ చేసినారు. ఈ భాగం పండితుల ఆమోదాన్ని పొందుతుంది అనడంలో సందేహం లేదు.

ఈ జైమిని భారతంలో రామాయణ ఉత్తరకాండ కథ ప్రసంగ వశాన వచ్చింది. కాని, కవి దానికి ముఖ్యేతివృత్తంతో సమానమైన స్థాయిని కలిగించినాడు. ఈ ఉత్తర రామాయణాన్ని తీసికొని ఈ పరిశోధకుడు 'ఉత్తర రామాయణము-ఉత్తరోత్తర పరిశీలనము' అనే భాగంలో ఆలోచనకు రేకెత్తించే అనేక విషయాలను చర్చించినాడు. అనేక సూక్ష్మ విషయ వైశద్యానికి ఈ భాగం ఆలవాలంగా ఉన్నది. అసమాన శూరులు లవకుశుల గొప్పతనం దీనిలో ఉన్నది. అజ్ఞాత వాసంలో ఉన్న సీతాదేవి ఆవేదన ఇక్కడ వ్యక్తమైంది. వాల్మీకి మధ్యవర్తిత్వం ద్యోతకమైంది. అన్నిటికి మించి శ్రీరామునికి కుశలవులకు కలిగిన యుద్ధాన్ని పర్షియా దేశంలో సంభవించిన రుస్తుం సొహరాబ్ యుద్ధంతో పోల్చి వీరేశలింగం గారు ఒక నూతన భావ వీచికను రూపొందించినారు.

ఇక్కడ జరిగిన తండ్రి కొడుకుల యుద్ధానికి, అక్కడ జరిగిన యుద్ధానికి భేద సామ్యాలు చక్కగా వ్యక్తీకరింపబడినాయి. ఒకటి ఎందుకు మోదాంతమైంది? రెండవది ఎందుకు విషాదాంతమైంది అనే చర్చ చేయబడింది. ఒకదానికి ఒకటి మూలమా లేక ఈ కథలు సార్వత్రికమా అనే సమస్య ప్రదర్శింపబడింది. ఈ భాగం ఎంత ఆసక్తికరమైందో ఈ గ్రంథం చదివినప్పుడు మీకే తెలుస్తుంది.

ఈ సిద్ధాంత వ్యాసంలో ఉండే అనేక విషయాల్లో కొన్నింటిని మాత్రమే నేను ప్రస్తావించినాను. ఈ గ్రంథంలోని పరిశీలన అగ్రశ్రేణికి చెందింది; పరిశోధన నిశితదృష్టితో నడిచింది; విశ్లేషణ శాస్త్రబద్ధంగా ఉన్నది. అందుచేతనే ఉత్తమ సిద్ధాంత గ్రంథం రూపొందింది. ఇంత మంచి గ్రంథాన్ని పాఠకులకు అందించిన డా॥ ముదిగొండ వీరేశలింగంగారికి నా అభినందనలు

విజ్ఞానపురి - హైదరాబాదు

27-9-88

ఎం. కులశేఖరరావు

# Jaimini Bharata

Jaimini Bharata, a composition in sanskrit is attributed to Jaimini, a disciple of Vyasa. It is told that Jaimini had written another Mahabharata, but Vyasa asked him to retain only the Asvamedhaparvam. This legend suggests that Asvamedhaparvam has its own peculiar style, which became popular in later times.

This work of Jaimini clearly shows that it was written mainly to propagate Bhakti or devotion. In this respect, it aligns itself with the purana literature of Sanskrit.

The background of this work is the despondent mood of Yudhisthira, after the Mahabharata war. He was so dejected that he thought it fruitless to go on pilgrimage. Vyasa then suggested that he would get rid of all the sins, if he could perform Asvamedha sacrifice. Though it was a difficult undertaking, especially in the post-war conditions, Yudhishtira conceded to do so and, customarily, a horse was released, with Arjuna as his protector Lord Krishna also accompanied him The Asvamedhaparvam of Jaimini describes the encounters of Arjuna with various kings.

The theme, which is otherwise heroic, has been rendered as a romantic one by the author A number of stories are written around the character of

Arjuna. There are some other legends which glorify unstinted devotion. The legend of Chandrahasa is one such. 'The Bhakti is enriched by many a adventurous deed on the part of the heroes. The legend contains almost all the elements of romantic tales like other romantic tales. These stories aim only at entertainment, through weaving legends of adventure, fantasm, valour inspired by erotic sentiment, free play of human and animal characters and in atmosphere surcharged with eerie magico-religious sentiment. Asvamedhaparva of Jaimini is by far the first work containing romantic tales leading to the glorification of Bhakti. In this work the legends of Chandrahasa, Mayuradhvaja, Tamradhvaja and a peculier version of Ramayan-all aim at devotion. Krishna appears in many legends as a Divine being, protecting his devotees. The legends indicate, at many places, a gentle sense of humour of the poet. The story of Lava and Kusa, for example is a fine blending of Valour & Devotion

This work is translated in many languages. The stories have become very popular in Marathi and Kannada literature, as they have got a mass appeal

In Kannada, it is translated by Lakshmisa, a poet of eleventh century. In Marathi, various legends have served as themes for various works. For example, a 'Chandrahasopakhyana' is a metrical composition in Marathi done by Ranga Krishna, a poet

from Tanjavur. The entire work is available in simple Marathi prose.

The heroic-romantic nature of the work attracted Pillalamarri Pinaveerabhadra kavi, a poet of great repute in Telugu literature. He has faithfully followed the original Sanskrit text, and has rendered it in elegant style. It is reckoned as the most important work of sixteenth century.

Dr. M. Veereshalingam has done a signal service to Telugu literature, by writing a doctoral thesis on the work. He has given a critical analysis of the work, evaluating it from the point of view of characterization, mythology, style, sentiment and motif. The analysis is informative and refreshing. He has displayed a keen sense of Analytical Method of Research methodology. I know Dr. Veereshalingam right from his studenthood in Warangal College. I know him as a deligent and inteligent student The present thesis speaks volumes for his patience and intelligence, in giving a new dressing to the old topic. Treatment of classical subjects requires a cautious thinking, which is amply reflected in the doctoral thesis of Dr Veereshalingam. I am sure that this work will stimulate further interest among the scholars to study romantic classical legends, with modern outlook. I congratulate Dr. Veereshalingam for having written a valuable thesis.

-P. G. LALYE
Dept. of Sanskrit
Osmania University.

Hyderabad
27-9-1988

# విషయానుక్రమణిక

ప్రకరణము 12

ప్రకరణము 13



ప్రకరణము 14

## ప్రకరణము 15

ప్రకరణము 16



ప్రకరణము 17

అనుబంధము

# వాఙ్మయమున శ్రీనాథయుగము

## ప్రవేశిక

ఆంధ్రవాఙ్మయములో శ్రీనాథయుగము పూర్వప్రబంధయుగముగా పేరెన్నిక నందినది. ఈ యుగములో పెక్కురు కవులు తమ తమ వ్యక్తిత్వములను జూపి గ్రంథములను వెలయించి యున్నారు. కొందరు ఈ యుగమును కావ్యయుగమని పేర్కొనియున్నారు. ఈ యుగకవులలో కొందరు స్వతంత్ర రచనములను గావించిరి. ఈ యుగకర్త శ్రీనాథుడు.

ఈ యుగమున కవులు పలువురు గలరు. వారిలో జక్కన, పోతన, అనంతామాత్యుడు, వినుకొండ వల్లభరాయడు, గౌరన, మడికి సింగన, దగ్గుపల్లి దుగ్గయ, కొలని గోపరాజు, దూబగుంట నారాయణ, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, నంది మల్లయ- ఘంట సింగయ, వెన్నెలకంటి సూరన- ప్రఖ్యాతులు. మరి కొందరు కూడ చేరవలసియున్నది. నిశ్శంక కొమ్మన, వెన్నెలకంటి అన్నయ, కొలని గణపతిదేవుడు, అయ్యలరాజు తిప్పయ్య, ఆంధ్రకవి రామయ్య, బొప్పరాజు గంగన్న, ఏర్చూరి సింగన్న, వెలిగందల నారయ్య, కాకునూరి కవులు, భైరవకవి, నూతనకవి సూరన, చంద్రమౌళి, దేవరాజభట్టు, కూచిరాజు ఎఱ్ఱన్న, అడిదము కవులు, పూసపాటి రాజులు, తాళ్లపాక కవులు, ప్రోలుగంటి చెన్నయ్య మంత్రి- మున్నగువారు విలసిల్లినారు.

ఈ కవులలో శ్రీనాథునకు, పోతనకు, తాళ్లపాకవారికి వాఙ్మయమున ప్రత్యేక స్థానము గలదు. నంది మల్లయ- ఘంట సింగయ జంటకవులు.

తెలుగువారి దురదృష్టమున పినవీరభద్రుని తక్కిన గ్రంథములు కానవచ్చుటలేదు. ఇది కాలవైపరీత్యము. ఈ కవి వివిధ రీతుల తన జైమిని భారతమును వెలయించి, పూర్వాంధ్రకవుల పోకడలను పుణికి పుచ్చుకొని, (తక్కిన) తరువాతి కవులపై ప్రభావమును జూపినాడు. సంధియుగమున నున్న మహాకవి. ఈ గ్రంథము (జైమిని భారతము) వీరభద్రుని విశిష్ట వ్యక్తిత్వమును వెలార్చు

ఉన్నది. అర్థ వైశిష్ట్యమును గ్రహించుట కీతని గ్రంథమును సమగ్రముగా నవలోకింపవలసి యున్నది.

## కులగోత్రములు

పినవీరన తల్లిదండ్రులను గూర్చి తన "శృంగార శాకుంతలము" లో చెప్పికొనెను.

"సాధ్వీమతల్లి నాగమాంబికను, విద్యాభారతీజాని గాదనకుం బుత్రుని వీరభద్ర పదపద్మ ధ్యాన శుద్ధాంతరంగుని నన్నుం బిలిపించి" (I-31)

దీనిని బట్టి ఈతని తల్లి నాగమాంబ యనియు, తండ్రి గాదన యనియు తెలుసు.

వివిధ సాహిత్య చరిత్రకారులు పినవీరన గోత్రమును, కులమును గూర్చి ఈ విధముగ తెలిపినారు.

1. గురజాడ శ్రీరామమూర్తి గారు ఈతని గోత్ర విషయము నీ విధముగ వ్రాసెను.[1]

"కవులన్...మా నన్నయభట్టు దిక్కకవి వేజా ప్రెగ్గడన్ సోమునిన్" (జై భా. I-6) లోని 'మా' అను దానిని బట్టి చూడ, నన్నయభట్టును పినవీరన యొక్క వంశము వారును నొక్క గోత్రము వారై యుందురని చెప్ప నొప్పి యున్నది. నన్నయభట్టుది భారద్వాజస గోత్రము కాన, పిన వీరన గోత్రమును నదియే యని యూహింపనై యున్నది" అని వ్రాసి ఈతనిని భారద్వాజస గోత్రము వారని చెప్పెను.[2]

'మా' అనుట 'మా కవి సమూహము' అనుట కావచ్చును.

2. కందుకూరివారు తమ "ఆంధ్రకవుల చరిత్రము" (Vol-I) లో ఈ విధముగా వ్రాసినారు:

"పిల్లలమఱ్ఱి పినవీరన యనెడి యీ కవి నియోగి బ్రాహ్మణుఁడు. గాదయామాత్య - నాగాంబికల పుత్రుడు" అని వ్రాసి ఈయన నియోగి యని తెల్పినారు.

3. శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావు "ఆంధ్ర వాఙ్మయ చరిత్రము"[3] లో ఈ విధముగా వ్రాసినారు:

"పిల్లలమఱ్ఱి యను గ్రామము నిజాం రాజ్యములో నల్లగొండ జిల్లాలో నున్నది. ఇప్పటి కాలము నందున్న పిల్లలమఱ్ఱివారి కుటుంబము లన్నియు వెలనాటి వైదిక శాఖలో చేరినవి. పినవీరభద్రకవి నియోగి యని మ.రా.శ్రీ. శం.వి. పంతులు గారు వ్రాసియున్నారు. వీరి వ్రాత నిరాధారము. అది యటుండ ఇప్పటి కాలపు నియోగి వైదిక భేదములను బట్టి యిట్టి నిర్ణయము చేయుచుండుట చరిత్రముల యథార్థతకు విరుద్ధమని నాకుఁ దోచుచున్నది. సుమారు 2, 3 శతాబ్దముల క్రిందటి వరకు ఇట్టి భేదము లేదనియు, ప్రాయశః యంత ప్రబలముగనైనను లేదనియు, చరిత్ర విమర్శకుల యభిప్రాయమని వక్కాణించి చెప్పవచ్చును. ఒకటే కుటుంబమునందు కొందరు వైదిక సంప్రదాయమున నుండుటయు కొందరు లౌకికవృత్తులలో మెలంగుటయు దటస్థించుచుండెను. బహుశః యిప్పటికాలములో వలె గాక సంబంధ బాంధవ్యములు గూడ నుండి యుండవచ్చును. కనుక యా నాటి కవులు నియోగులే గాని వైదికులు కారని చెప్పుట నప్పటికిలేని భేదము నారోపించుట యని యుచితజ్ఞుల యభిప్రాయము" అని వ్రాసిరి.

4. శ్రీ దాగంటి శేషయ్య గారు ఆంధ్రకవి తరంగిణి అరవ సంపుటమున కవిని గోత్రమును గూర్చి ఈ క్రింది విధముగ వ్రాసిరి:

"అమాత్య, మంత్రి" శబ్దములు నియోగిబ్రాహ్మణ సూచకముగ గ్రంథములందుపయోగించుట సర్వసామాన్య విషయము.

"సామాన్యముగ వైదిక బ్రాహ్మణులకుఁ బూజ్యార్థ ద్యోతకములగు "అర్య, భట్ట" శబ్దములను గ్రంథములయందు వాడుచుందురు. నియోగ బ్రాహ్మణకవులలో గొందరికి "అర్య, భట్ట" శబ్దములుపయోగించినట్లు శ్రీనాథ భట్టాదుల వలనఁ దెలియు చున్నది. కాని "అమాత్య", "మంత్రి" శబ్దము లుపయోగించిన వైదిక కవులు కానరారు. ఎక్కడనైన ఒకరిద్దరున్నను నది సామాన్యవిధి కాదు. నియోగి బ్రాహ్మణులలో నామాంతమున "రాజు" అని చేర్చుట కన్పట్టును. కాని వైదిక బ్రాహ్మణులలో నట్టి యాదారము గన్పింపదు.

"పిల్లలమఱ్ఱి యను గృహనామము గలవారు వైదిక బ్రాహ్మణులలోను, నియోగి బ్రాహ్మణులలోను, గూడ కలరు. వైదిక పిల్లలమఱ్ఱి వారు కాశ్యపస గోత్రులు. నియోగి పిల్లలమఱ్ఱి వారు భారద్వాజస గోత్రులు.

"సోమయామాత్యుని సీమంతినీ పరిణయములోని వంశ వర్ణనమును చదివిన వారికి, శకుంతలా పరిణయములోని కంద పద్యము నాతడు చూడ లేదనుట కంటె నాపద్యములోని ప్రతి యతనికి లభించియుండునని తలచుటయే సమంజసముగ నుండునని తోఁచును.[4]

"ప్రక్షిప్తమని యనుకొనుచున్న పద్యములోని "శివభజనాసక్తుని శివ" అనునది కూడ నీ పద్యము ప్రక్షిప్తమను నూహకు బలమొసగు చున్నది. పిన వీరభద్రుడు శివభజనాసక్తుఁ డైనట్లెచ్చటను జెప్పియుండలేదు. గద్యలో 'ఆరాధితామర వీరభద్ర' అని వ్రాసి యున్నారు. పై కంద పద్యమునకు తరువాతి పద్యములోనే "వీరభద్ర పద్మధ్యాన శుద్ధాంతరంగుని" అని చెప్పికొని యుండుటచే ఆ పద్యమునకు ముందు పద్యములో "శివభజనాసక్తునిశే" నని పునరుక్తిగఁ గవి చెప్పియుండడు. పైని వ్రాసిన యంశములన్నిటిని నిష్పాక్షికముగ విమర్శించినచో నీ కందపద్యము ప్రక్షిప్త మనియుఁ బినవీరన నియోగి బ్రాహ్మణుఁ డనియు దోపక మానదు. ఇతడు నియోగి శాఖకుఁ జెందిన వాఁడని యాతని గద్యయందలి "గాదయామాత్య" శబ్దమే స్పష్టముగ చెప్పుచున్నది."

"పినవీరన కవికి దరువాత 100 సం॥లలో నున్న ముద్దరాజు రామన్న రాఘవ పాండవీయమునకు వ్యాఖ్యానము వ్రాయుచు, బిన వీరన విరచితమైన శృం. శా. లోని పద్యము చూపుచు, పిల్లలమఱ్ఱి పినవీరమరాజు గారన్న" అని వ్రాసియున్నాడు. దీనిని బట్టి చూచినను జిరకాలమునుండి యీ కవి నియోగి బ్రాహ్మణుఁడుగనే పరిగణింపంబడుచుండెనని తెలియుచున్నది."

పై విధముగ వ్రాసి చాగంటి శేషయ్యగారు, పినవీరనను నియోగి బ్రాహ్మణుఁడని తేల్చినారు.

5. నూతలపాటి పేరరాజుగారు "విజయనగర చరిత్రము" లో నీ విధముగ వ్రాసినారు:

"పినవీరభద్రకవి నియోగి బ్రాహ్మణుఁడు. గాదయపుత్రుడు భారద్వాజ గోత్రుడు." అని వ్రాసి, నియోగియని, భారద్వాజ గోత్రుఁడని తేల్చినారు.

6. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారి "శృంగార శాకుంతలము" పీఠికలో గాని,

7. సమగ్రాంధ్ర సాహిత్యములో గాని, ఈ విషయము స్పృశింపఁబడ లేదు.

ఈ విధముగ వివిధ సాహిత్య చరిత్రకారులు తమ యిష్టానుసారముగ తెలిపిరి. కాని సప్రమాణముగ నెవ్వరును ఈయన గోత్ర విషయము తెలుప లేదు. పైగా "కశ్యపాన్వయు", "మా నన్నయభట్టు" అను నీ రెండు విషయములు ఆధారముగ శృంగార శాకుంతలములో "కవితా పట్టాభిషిక్తు నన్నయ భట్టోపాధ్యాయు (I-11)" అని వ్రాసెననియు తెలిపి, శృంగార శాకుంతలములో "మా" అని పిలువలేదనియు, జైమిని భారతములో మాత్రము 'మా' అని పిలుచుటచేత ఈయన వైదిక బ్రాహ్మణుఁడు కాడని శేషయ్యగారు తెలిపినారు.

కొలని గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో-

ఉ. "అనఘు హళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును ఘను నాగరాజుఁ గవిసోమునిఁ దిక్కన సోమయాజిఁ గే
తనకవి రంగనాథు మలితజ్ఞుని నెల్లుని నాదిరాజు సో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్."

అని నుతించినాఁడు. ఇందు "మత్కుల చంద్రుల" అని చెప్పఁబడు చున్నది. దీనిని బట్టి ఇందు చెప్పఁబడిన వారందరు నియోగులే యని చెప్ప వచ్చును.

ఇంతేకాక, "అమాత్య" శబ్దమే కాక "రాజు", "మంత్రి" శబ్దములు కూడ నియోగులకే వర్తించును. బ్రాహ్మణులలో నితర శాఖలలోని నియోగులను తప్ప మరియే శాఖకుఁ జెందిన వారును 'రాజు' శబ్దముతో వ్యవహరింపఁబడరు గాదిరాజు కూడ బిరుద నామమే. దీనిని బట్టి పినవీరన నియోగి యని స్పష్టపడు చున్నది. వీరభద్ర నామము ముఖ్యముగ శైవులలో, ఆ వెనుక నియోగులయందు మాత్రము కానఁబడుచున్నది. కాని వైదికులయందు కానరాదు దీనిని బట్టి మనము పినవీరభద్రుడు నియోగి యనియే నిర్ధరింపవచ్చును.

పిన వీరన వంశీయుడే అయిన పెనుమళ్ల సోమమంత్రి నియోగి. నేటికిని పెనుమళ్ల వారు నియోగులే. పెనుమళ్ల వారే కాదు, సోమమంత్రి సీమంతినీ పరిణయమున వంశవర్ణనలో పేర్కొనిన 'తెలిదేవర' వారు 'అతుకూరి' వారు-వీరందఱును నియోగులే. ఈ నాటికిని నీ మూడు కుటుంబములవారును పరస్పర సంబంధము గలిగి యున్నారు. ఇది యొక్కటియే పిన వీరన నియోగి యని తెలుపుచున్నది.

## వీరభద్రుని బాల్యము - విద్యాభ్యాసము

పినవీరభద్రుడు బాల్యమున కాలమును వృథా చేసినాడని పెక్కురు సాహిత్యచరిత్రకారులు తమతమ గ్రంథములలో పేర్కొనియున్నారు. ఏ యాధారములతో వారా నిర్ణయమునకు వచ్చినారో తెలియరాదు. కాని ఈ కవి రచియించిన ప్రస్తుతలభ్యమానమగు గ్రంథములను, వానిలోని శైలి, పూర్వకవిస్తుతులను చూచినచో ఈ కవి రచనముపై పూర్వకవుల ప్రభావమెక్కుడుగా నుండని కానవచ్చును. ముఖ్యముగా సంస్కృతకవుల రచనా రీతులీతని కవితలో గలవు. ఏ కవి గాని, బాల్యమున కాలము వృథా చేసి, తదుపరి జీవితమున కవిత్వ మేకధాటిగా చెప్పలేడు. అట్లు చేసిన వారరుదు. ఈ కవి తన విద్యాభ్యాసమే గురువు వద్ద చేసినాడో తెలియరాదు. అట్లు తెలియరాకున్నను నీతని గ్రంథములను బట్టి యీ కవి ప్రత్యక్షముగా పెక్కు సంస్కృతాంధ్ర కవుల రచనలు చదివినాడని తెలియవచ్చుచున్నది. అట్లు చదివినాడనుటకు, ఈ కవిపై వారి ప్రభావమే కారణము. మఱొకముఖ్య విషయమేమనగా, పూర్వకవులందరి కన్న సమకాలీనుడగు శ్రీనాథుని గ్రంథముల ప్రభావమీతనిపై బడి గ్రంథములలో ప్రతిబింబించినది. దీనిని బట్టి శ్రీనాథుని గ్రంథము లీతనిని మిక్కుటముగ నాకర్షించిన వనుటలో సందేహము లేదనియును జెప్పగలము. ఈ విధముగా నీకవి శ్రీనాథుని గ్రంథముల నామూలాగ్రముగా మిక్కిలి భక్తితో జదివి తన రచనమున వానిని పొందుపరచుటలో నీతనికి శ్రీనాథునిపై గల భక్తి వ్యక్తమగుచున్నది. ఇట్లే పెక్కురు సంస్కృతాంధ్ర కవుల ప్రభావము కన్పట్టుచున్నది. అ ప్రభావమును చూచినచో, ఈ కవి తన బాల్యమున తప్పక చాలశ్రమ కోర్చి

ప్రయాణపతి పూర్వ, సమకాలీనుల రచనములను చదివినట్లు ఈ గ్రంథము తెలుపుచున్నది. అవన్నియును జీర్ణము చేసికొనిన పిమ్మటనే ఈ కవి తన రచనమునకు గడంగినారు. ఈ శ్లో. విధము చూచినను, వీరభద్రుడు వాఙ్మయమున పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథములు సంపూర్ణముగ నవలోకించినట్లు ద్యోతమానమగుచు, సాహితీ లోకమున రాణకెక్కిన కవులలో నొక్కరైనారు.

1 కవి జీవితములు-(పుట 109), వావిళ్ళ వారి ప్రతి ముద్రణము 1918. గ్రంథ కర్త గురజాడ శ్రీ రామమూర్తి గారు.

2. నన్నయభట్టు ముద్గల గోత్రుఁడు

3. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము Part I (1330-1500 A.D.) శ్రీ అచ్యుతరావు. ప్రచురణ 1933. ch. viii - పుట 160

4. ప్రక్షిప్త మనుకొను పద్యము.

కం॥ ఆసుకవి చేత "శివరా
నాసక్తుని చేతఁ "గశ్యపాన్వయు" చేరన్.
(శృం. శా.) I-30.

దీనిని బట్టి ఈతని గోత్రము కశ్యప గోత్రమని కొందఱు తెలుపుచున్నారు.

## అలభ్యములు

పినవీరభద్రుడు తన గ్రంథములను గూర్చి శృంగార శాకుంతలములో తెలుపుకొనియున్నాడు.

సీ. రచియించినాఁడవు రమణీయ వాగ్రీతి
  నవతారదర్పణం బభినవముగఁ
బల్కినాఁడవు లేటపడఁజేసి నారదీ
  యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున
  మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మాన
  సోల్లాససారము సముల్లసిత కయ్యె

తే. భారతీ తీర్థయతి సార్వభౌమ గురుకృ
పాతిశయ లబ్ధ కవితావిభూతి గలిగి
గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత
విపుల చాటూక్తినిర్నిద్ర వీరభద్ర. (1-33)

ఈ పద్యమాధారముగ నీతని గ్రంథములు నాలుగు గలవని తెలియుచున్నది.

(1) అవతార దర్పణము
(2) నారదీయము లేక నారద పురాణము
(3) మాఘ మాహాత్మ్యము
(4) మానసోల్లాస సారము లేక అభిలషితార్థ చింతామణి.

ఇదే రీతి 'సీమంతినీ కల్యాణ' గ్రంథములో పేర్కొనబడిన ఈ క్రింది పద్యమును బట్టి మరికొన్ని విషయములు తెలియుచున్నవి :

సీ. అవతార దర్పణం బన్న కావ్యముఁ జేసె
నారూఢి నారదీయంబు పలికె,
మహనీయమగు మాఘమాహాత్మ్యము రచించె
శాకుంతలముఁ జెప్పె సరసపదజి
నొక్క రాతిరి యందు నొనరించె మధుర వా
క్ప్రౌఢిచే జైమిని భారతంబు
లలితమౌ మానసోల్లాస సారంబన్న
కబ్బంబు భాషించె నబ్బురముగ

గీ. మఱియు బహురూప కావ్యనిర్మాణ నిపుణుఁ
డగుచు నుతిఁగాంచె సకల దిగంతరముల
గుకవి జనగర్వ తిమిర సంకోచకృత్ప్రి
భాత రవి యైన పినవీరభద్రసుకవి. (సీమంతినీ కల్యాణము I-47)

దీనిని బట్టి

(1) అవతార దర్పణము
(2) నారదీయము
(3) మాఘమాహాత్మ్యము
(4) శృంగార శాకుంతలము
(5) జైమిని భారతము
(6) మానసోల్లాస సారము

అను వారు గ్రంథములు గలవని తెలియుచున్నది.

పై వరుసలో (1) శృంగార శాకుంతలము
(2) జైమిని భారతము

అనబడు రెండు గ్రంథములు మాత్రమే నేడు లభ్యమగుచున్నవి.

ఇవి కాక ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు తెలిపిన గ్రంథములలో-

(1) పురుషార్థ సుధానిధి.
(2) శాకుంతలము —గలవు

ఈ విషయమే, కందుకూరి వీరేశలింగము గారు కూడ తెలిపినారు.[3] పైన తెలుపఁ బడిన యారు గ్రంథములకు దోడు 'పురుషార్థ సుధానిధి' కూడ

పీఠన గ్రంథమై దివరకు అరువ్వొక్క గ్రంథములు కనుపించుచున్నవి. ఇందు నామమాత్రములుగనున్నవి యైదు. రెండు ముద్రితములైనవి. ఇవియే నేడు ఆంధ్రసాహితీవేత్తలకు, పాఠకులకు రసాస్వాదనకు కారణభూతములగుచున్నవి. ఇచట మన మొక్కొక్క గ్రంథమును చూడవలసి యున్నది.

1. అవతారదర్పణము :

ఈ గ్రంథనామమును బట్టి యేతద్గ్రంథము విష్ణుమూర్తి పది యవతారముల కొక దర్పణమని మాత్ర మూహింపగలము

2. నారదీయము లేక నారద పురాణము

ఈ గ్రంథమును పిదపీఠన తరువాత అల్లాడ నరసింహకవి తెలుగులోని కనువదించెను

3. మాఘ మాహాత్మ్య మనగా మాఘ మాసమునకు గల ప్రాముఖ్యమును గూర్చి వ్రాసియుండవచ్చునని మాత్రము తెలిసికొనవచ్చును (ఈ మాఘ మాహాత్మ్యమునకు వచనములో నొక యముద్రిత గ్రంథమున్నది )

4. పురుషార్థసుధానిధి యను గ్రంథము విద్యారణ్యస్వాముల వారిచే సంస్కృతమున వ్రాయబడినది అందలి రెండు శ్లోకముల భావము మాత్రము 'ప్రబంధరత్నావళి'లో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు తెలిపినారు

సీ. కాశ కర్పూర నీకాశఁగా భావింపఁ
గవితా నిరూఢిఁ బ్రఖ్యాతి నెసఁగు,
యావకారుణ దేహయష్టిఁగాఁ జింతింప
మదకుంభియానల మరలు గొలుపు,
నీల జీమూత సన్నిభఁగా విలోకింప
సకల మాయా ప్రపంచంబు నడచుఁ,
గనక చంపక దామ గౌరిఁగా శీలింప
నంహస్సమూహంబు సంహరించు,

గీ. శంభుదేవి విశాలాక్షి సదసదింప
యోగిజనసేవ్య యోగ పయోదశంప

శ్రీకరకటాక్ష లేశరక్షిత నిలింప
ముఖ్యగంబులు మొలిపించు మూలదుంప. 1

సీ. భర్గభట్టారకు పర్యాయమూర్తికి
షాణ్మాతురుని దూర్మి జనకునకును,
మేషరాజము నెక్కి మేదిరౌతున కమ
రాధీశు పొరుగు దిశాధిపతికి,
హరిణవాహనుని నెయ్యపు సంగడీనికి
సామిదేవీ ప్రియ స్వాంతునకును,
యాయజూకుల యింగ్ల యనగు జుట్టమునకు
స్వాహాస్వధా ప్రాణవల్లభునకు,

గీ. దండములు పెట్టెదము మొక్కెదము కరములు
సేవయొనరించెదము మమ్ముఁ గావు శ్రోవు
యాగవేదికి విశ్వేయు మూరగింపఁ
బ్రతిమజున్మల యింటి కల్పద్రుమంబు.

(ప్రబంధ రత్నావళి పుట 182, పద్యములు 460-461):
(5) మానసోల్లాస సారము లేక అభిలషితార్థ చింతామణి.

ఈ గ్రంథము సంస్కృతమున చాళుక్య సోమేశ్వరదేవునిచే రచింపఁబడినది. ఆ గ్రంథపీఠికలో శ్రీ శ్యామశాస్త్రి, (ఆంగ్లమున) తద్గ్రంథ ప్రకరణము లైదు గలవనియు, నొక్కొక్క దానియం దిరువది యుపశీర్షికలు గలవనియు జెప్పినారు.

తద్వివరములు :-

ప్రకరణము 1 - మతము, సాంఘిక సేవ, విగ్రహ నిర్మాణము, రోగములు - చికిత్సలు.

ప్రకరణము 2 - రాజ్యతంత్ర మేదు విభాగములుగ చేయబడినది. అందు రాజు, మంత్రి, సేనాధిపతి, కోశము, రాజ్యము, దుర్గము, సైన్యము (శాంతిభద్రత), యుద్ధము, పొరుగు రాజులతోడి సంబంధములు, (సామ, దాన, భేద, దండోపాయములు) గలవు.

ప్రకరణము 3 - శిల్పము, చిత్రకళానైపుణ్యము, తత్సాధ్యములు, సాంసారిక సుఖ విషయము.

ప్రకరణములు 4, 5-గణితము, దశాంశపద్ధతి, పంచాంగ నిర్మాణము, నక్షత్ర- గ్రహ- శకున- హస్తసాముద్రిక శాస్త్రములు. అశ్వ, గజ శిక్షణ రీతులు, వాని రోగములు- చికిత్సలు, భూగర్భశాస్త్రము, పాక, సంగీత శాస్త్రములు, ప్రయాణము, సుగంధ ద్రవ్యములు, వస్త్రరంగము, రసాయన శాస్త్రాది విషయములు, రత్న విషయములు, వివాహములు, బిడ్డం పెంపకము, మదిరా విషయము- మున్నగు పెక్కు విషయము లుటంకింపబడినవి.

ఈ క్రింద యభిలషితార్థ చింతామణిలోగల రెండవ ప్రకరణములోని విషయముల నిచ్చుచున్నాను. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు శత్రుప్రస్తావన తన గ్రంథములో చేసియుండుట కారణముగ, దానిని గైకొనుట సంభవించినది.

మానసోల్లాస సారము—రెండవ ప్రకరణము. (సంస్కృత మూలము)

(1) స్వామి, (2) అమాత్యుడు, (3) సుహృదుడు, (4) కోశనిరూపణము, (5) రాష్ట్రము, (6) దుర్గము, (7) బలము, (8) ప్రభుశక్తి, (9) మంత్రశక్తి, (10) ఉత్సాహశక్తి, (11) సంధి, (12) విగ్రహము, (13) యానము (రాజయాత్ర), (14) ఆసనము, (15) ఆశ్రయము, (16) ద్వైధీభావము, (17) సామము, (18) దానము, (19) భేదము, (20) దండము.

ముఖ్యవిషయము .- పైన పేర్కొనబడిన విషయములను వీరభద్రుడు 'మానసోల్లాస సారము' లో రాజపద్ధతి, కోశపద్ధతి, రాష్ట్రము దుర్గ పద్ధతులను పెం తెలిపెననియు. "ఈతని పేర నవరత్న పద్యములును, సప్తాంగపద్ధతి పద్యములును రచింపబడినవి. వీనికిం గర్త పినవీరభద్రుఁడు కాదఁగును." అనియు వేటూరివారు వ్రాసియున్నారు. ఈ సందర్భమున నీ పద్యములు మూలముతో సరిపోల్చి చూచిన నీ గ్రంథకర్త పినవీరభద్రుడే యని మనము నిర్ధరింపవచ్చును.

## లభ్యములు

పిన వీరభద్రుని గ్రంథములలో లభ్యములు

(1) శృంగార శాకుంతలము.

(2) 'జైమిని భారతము' - అనబడునవి.

శృంగార శాకుంతలము ప్రసిద్ధమగు శకుంతల కథ. 'భారత ప్రోక్త కథ మూలాధారముగ, కాళిదాసు నాటక క్రమము కొంత' గైకొని వ్రాయబడినది.

జైమిని భారతము సంస్కృతమున జైమినిచే వ్రాయబడినది. పిన వీరన దానిని యథాతథముగ కొన్ని వర్ణనములను గైకొనియు, సంగ్రహించియు, నుపమలను గూడ గైకొనియు, మూలకథలో మార్పులు చేయక, తన రచనను సాగించినాడు. ఈ గ్రంథము శ్రీకృష్ణమాహాత్మ్యమును తెలుపు భక్తి ప్రధానమైన రచన. కాని పెక్కు యుద్ధములు కూడ వర్ణింపబడినవి. ఈ యుద్ధ వర్ణనలను జూచిన, నీ కవి యుద్ధములను దర్శించియే వ్రాసినాడనుట సత్య దూరము కాదు.

సమగ్రమైన జైమిని భారతము కానరాదు. లభ్యమైన యశ్వమేధ పర్వమును గూర్చిన సంపూర్ణ విమర్శనము మున్ముందు చేయగలను

1. 'ప్రబంధ రత్నావళి' — శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

2. 'ఆంధ్ర కవుల చరిత్ర' - Vol I. శ్రీ కందుకూరి వీరేశలింగం.

# పినవీరభద్రుని కాలము

i. శాసనాధారములు

ii. సాహిత్య చరిత్రలు

iii. "జైమిని భారత"
"గ్రంథస్థ" విషయము

ఈ కవి కాలమును గూర్చిన సాహిత్య చరిత్రలేకాక, మనకు కొన్ని శాసనములును, డాక్టర్ పాటిబండ మాధవశర్మ గారి యముద్రిత సిద్ధాంత వ్యాసమును ఉపకరించుచున్నవి. సాహిత్య చరిత్రకారులు 1450 ప్రాంతము వారనిరి. కాని జైమిని భారతములోని పద్యములు కూడ మనకిచట ఉపయుక్త మగుట నుద్దేశించి కాలక్రమ నిర్ణయమును సాగించవలసి వచ్చినది.

సాహితీ చరిత్రలు వ్రాసిన వారలు

(1) శ్రీ గురజాడ శ్రీరామమూర్తి
(2) శ్రీ కందుకూరి వీరేశలింగము
(3) శ్రీ కవిత్వవేది
(4) శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావు
(5) శ్రీ చాగంటి శేషయ్య
(6) శ్రీ ఉండవల్లి లక్ష్మీరంజనము
(7) విజ్ఞాన సర్వస్వము
(8) శ్రీ ఆరుద్ర-సమగ్రాంధ్ర సాహిత్యము
(9) శ్రీమతి డాక్టర్ నాయని కృష్ణకుమారి
(10) డాక్టర్ పాటిబండ మాధవశర్మ (అముద్రిత సిద్ధాంత వ్యాసము)

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కాలమును నిర్ణయించుట కాధారములు శృంగార శాకుంతలమ్ లేక ఆ గ్రంథమున పూర్వము తాను వ్రాసిన గ్రంథములను మాత్రమే పేర్కొనియున్నాడు. ఇక జైమిని భారతములో తానా గ్రంథము నంకిత మిచ్చినది సాళువ నరసింహరాయలకని పేర్కొని యున్నాడు.[1] అంతేగాదు. నరసింహరాయల కిష్టదైవము శ్రీ వేంకటేశ్వరస్వామి. ఆ వేంకటేశ్వరుని పినవీరన స్తుతించియున్నాడు.

శ్రీ వేంకటాద్రి నాథ ద
యా వర్ధితరాజ్య సన్ను తార్థిజన మహీ
దేవగ వైరి న్నృపరా
జీవ నికర చంద్ర నారసింహ నరేంద్రా (జై భా 5-1)

ఇక దక్షిణ కోట్ల పై స్తుతి కానరాదు.

(i) శాసనాధారములు

సాళ్వ నరసింహుని వంశములో 'సాళ్వమంగు' యను నాతడు విజయ నగరాధీశుడగు మొదటి బుక్కరాయల కడ సైన్యాధిపతిగ నుండెను. ఆయన మధురనేలు సుల్తాను నజీరుద్దీను నోడించి, 'కొండై' మండలమున సాంబువ రాయని ప్రతిష్ఠించి, 'సాంపరాయ స్థాపనాచార్య' బిరుదము వహించెను. ఇది క్రీ.శ. 1346 లో జరిగినట్లు శాసనాధారములు కలవు. అట్లే సాళ్వ మంగు రాజు శ్రీరంగమున విగ్రహప్రతిష్ఠ చేసినట్లును జైమిని భారతములోని పద్యమున నీ క్రింద తెలుపబడుచున్నది.

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
  కొనివచ్చి సంపరాయనికి వచ్చె
సామ్రాజ్యమున నిల్పి సంపరాయ స్థాప
  నాచార్యబిరుద విఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
  మాడలద్దేవునమ్మడికి నొసగె
మధురసురత్రాణు మడియించి పరపక్ష
  సాళువబిరుదంబు జగతి నెరపె

తే. గబ్బితనమునఁ దేజి మొగంబు గట్టి
తలిమి నగరంపుగవఁకులు విఱుఁగ ద్రోలి
తానువేసిన గౌరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు.

(జై.భా. 1-82)

ఈ కార్యములన్నియు 1371లో జరిగినట్లు శాసనాధారములు తెలుపుచున్నవి. జైమిని భారతములో సాళ్వనృసింహుని తండ్రియగు గుండరాజు విజయములు, సాళ్వతిప్పని విజయములు వర్ణితములు.

''సాళ్వాభ్యుదయము'' వలన గుండడు చంద్రగిరికి చేరువనున్న కల్యాణ పురమునకు పాలకుడని తెలియుచున్నది. సంగమ వంశస్థుల సేవించి, యనేక

విజయములకు గారణభూతుడైన ఈయన శక్తిని గుర్తించియే సైన్యాధికారిగా నున్నను, రాజ్యాధికారము నిచ్చి యుండును.[2]

శాసనాధారముల వలన, సాళ్వ తిప్పరాజు, "సాళ్వ తిప్పగోప"దని నామాంతరము గలిగి, విజయనగరాధిపతియైన రెండవ దేవరాయల చెల్లెలిని హరియమ్మను పెండ్లియాడెనని తెలియుచున్నది. ఈ సంబంధము వలన గూడ సాళ్వవంశస్థుల రాజ్యాధికారము స్థిరపడి యుండవచ్చును. అట్లు కల్యాణ పురమున నుండియే పరిసరస్థములైన చంద్రగిరి మున్నగు ప్రదేశముల యందు పర్యవేక్షణాధికారమును సాళ్వ గుండని కుమారుడగు నరసింహరాజు నెఱపు చుండెడివాడు. కొన్ని దినములకు కల్యాణ పురమునుండి రాజధానిని చంద్రగిరికి మార్చుకొనెననియు "సాళ్వాభ్యుదయము" విపులీకరించుచున్నది. చంద్రగిరి రాజ్యములోని తిరుపతినుండి వెల్వడిన సాళ్వ నృసింహుని[3] మొదటి శాసనకాలము 12-9-1456. అప్పటినుండి క్రీ. శ. 1489-90 వరకును సాళ్వ నృసింహుని శాసనములు--చిత్తూరు, కడప, కర్నూలు, సేలం, పెనుగొండ, నెల్లూరు.-- జిల్లాలలోని వివిధప్రదేశములందు కనుపించుచున్నవి.

ఈయన కుమారుడు - ఇమ్మడి నరసింహరాయల పేర 1491 నుండి శాసనములు దృష్టమగుటచేత[4] సాళ్వనృసింహుడు క్రీ. శ. 1491 వఱకు జీవించియున్నట్లు చరిత్రకారులు భావించుచున్నారు. విజయనగరాధీశుడైన మల్లికార్జున రాయల క్రిందను (క్రీ.శ. 1450-67), విరూపాక్షరాయల క్రిందను (క్రీ.శ.1468-86) నుండి సాళ్వనృసింహుడధికారమును నెఱపుచుండెను. జైమిని భారతమునందు సాళ్వనృసింహుని విజయములు వివరింపబడినవి. అతడు తమిళదేశము నాక్రమించిన చోళులను పారద్రోలెననియు, ఒడ్డెరాజులను నిర్జించె ననియు, బాలదుర్గము, పెనుగొండ యందలి ప్రతిపక్షులను జయించెననియు పిన వీరన యుటంకించెను. (జై.భా1-45)

మల్లికార్జునరాయల పరిపాలనాకాలమున గజపతుల దండయాత్రల[5] క్రీ.శ. 1454-55 లలోనను, క్రీ.శ.1464 లోనను[6] జరిగినట్లుగా చరిత్రకారులు శాసనాధారములను బట్టి పేర్కొనుచున్నారు. విరూపాక్షరాయల కాలమున (క్రీ.శ. 1474-76) కూడ గజపతుల దండయాత్ర జరిగినట్లు శాసనాధారములున్నవి.[7] గజపతుల నూచముట్టుగ సాళ్వనృసింహరాయలోడించి యవమానము [illegible]

1474-76 యుద్ధముననే యగుచున్నది. ఆ దండయాత్రనే వీరభద్ర కవి తన జైమిని భారతమునందు పేర్కొన్నచో జైమిని భారతరచనము 1474 తరువాతనే యగును, సంగమవంశమున చివరి రాజైన ప్రౌఢదేవరాయలు రాజకీయ సంక్షోభముచే భయపడి పారిపోగా సాళ్వనృసింహుడు విజయనగర రాజ్యమునకు మకుటాధిపతి యయ్యెనని చారిత్రికులు చెప్పుచున్నారు. సాళ్వ నృసింహుడు క్రీ. శ. 1-11-1486 దినమున విజయనగర సాదిమాజ్యాధినేత యయ్యెనని శాసనములు పేర్కొనుచున్నవి.[5] ఇది శాసనస్థ విషయము.

## (ii) సాహిత్య చరిత్రలు

(1) గురజాడ శ్రీ రామమూర్తి గారు 'కవి జీవితములు' అను గ్రంథములో వీరభద్రుని కాలము దాదాపు క్రీ. శ. 1400 గా నిర్ణయించి యున్నారు.

(2) ఆంధ్రకవుల చరిత్రలో కందుకూరి వారు- శ్రీనాథుని వార్ధకదశలో వీరభద్రుడు యౌవనమున ఉండియుండుననియు, వెల్లంకి తాతంభట్టు "కవిలోక చింతామణి" యందు పినవీరన పద్యముల నుదహరించినట్లును తెలిపియున్నారు.

(3) శ్రీ చేకుమళ్ల అచ్యుతరావు "ఆంధ్ర వాఙ్మయచరిత్ర" లో పిన వీరన కాలము 1485-1498 వరకు నిర్ణయించినారు.

(4) ఆంధ్రకవి తరంగిణిలో శ్రీ చాగంటి శేషయ్యగారు అయిదు, ఆరు సంపుటములలో తెలిపిన అంశములను బట్టి- 'జైమిని భారతము వీరభద్రుని చివరి గ్రంథమనియు, 15 వ శతాబ్ది ఉత్తరార్ధమనియు, నైషధాంధ్రీకరణము తరువాత కొన్ని సంవత్సరములకు గాని పిన వీరన జన్మించలేదనియు' పేర్కొనినారు.

(5) నరసింహరాయల పట్టాభిషేకము జరిగినది 1-11-1486 తేదీగా శాసనమున పేర్కొనబడినది. కాన 1485 వ సంవత్సరమగుటకు వీలుండదు. జైమిని భారతములో గల పట్టాభిషేక వర్ణనా పద్యమొందు కూడ మనము గ్రహింపవలసి యున్నది. ఆ కారణముగా పట్టాభిషేకము జరిగిన పిమ్మటనే గ్రంథరచనము జరిగినట్లు ద్యోతకమగుచున్నది. ఆస్థానకవి కానిదే వీరభద్రుడు పట్టాభిషేకమును గూర్చిన వర్ణనము చేయుట కవకాశము లేదు.

1456 నాటికే సాళ్వ నరసింహరాయల దాన శాసనములు కనబడు చున్నవి. అనగా నాటికే తన యధికారమును నెరపుచుండియు, 1-11-1486 నాటికి "సార్వభౌమత్వ" సిద్ధిని బొందినట్లును చెప్పవచ్చును. పదునైదవ శతాబ్ది యందుత్తరార్ధమున రచన జరిగెననుట నిజమేయైనను, దానిని నిరూపింప వలసిన యావశ్యకతయు గలదు.

(6) శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారు, తమ సాహిత్య చరిత్రలో (పుట 95)–

"నరసింహరాయలు క్రీ. శ. 1487 లో విద్యానగర సింహాసనము నలంకరించి యుండుటచే పిన వీరభద్రకవి కూడ నీ కాలమున నుండియుండును" అని పేర్కొనినారు.

(7) విజ్ఞాన సర్వస్వము (Vol. III)లో (పుట 928) శ్రీ శివశంకర శాస్త్రిగారు–"నరసింహరాయల (కాలము) క్రీ.శ. 1487-90 వరకు రాజ్యపాలన చేసియుండుటచేత వీరభద్రకవి అపుడు వర్ధిల్లినవాడు"- అనినారు.

(8) శ్రీ ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యము'లో (5 వ, 6 వ సంపుటము లలో) పిన వీరన కాలమును గూర్చి తెలుపలేదు.

(9) డాక్టర్ నాయని కృష్ణకుమారి గారు సాహిత్య అకాడమివారి "శృంగార శాకుంతల" పీఠిక యందు -

"1445 నాటికి పిన వీరన పదేండ్ల ప్రాయము వాడైనను, మరియొక్క పదునేనేండ్ల తరువాత, అనగా 1460 ప్రాంతమున గాని కావ్యరచనకు అర్హ వయస్కుడై యుండడు. అనగా క్రీ. శ. 1460-74 ల మధ్య శాకుంతలము రచించి" నాడని తెలిపినారు

(10) డా॥ ఝాన్సీలక్ష్మిగారి యముద్రిత సిద్ధాంత వ్యాసములో[12]

"Early in Virupaksha's reign about 1469 (Hist. Insc. P. 226) the Pandyas under Bhuvanaika Samara Kolhan occupied Kanci[13] forashort while and were driven back by Saluva Narasimha"

(Fur. Sources) I P. 128,

"In the Course of this confusion Saluva Nara-shimha must have occupied the throne by the end of 1486 A. D. (Vide Genealogy)" -

ఇవన్నియు జూచిన పిమ్మట 1456 వ సం. నందలి దాన శాసనము మొదటిదిగా మనకు కన్పట్టును. ఇచట తద్దాన శాసన విషయముల నరసిన ఇహా విషయములు గ్రాహ్యమగును. ఈ శాసనము తేది 12-9-1456. (సంఖ్య-4)-

Saluva Narasingadeva Maharaja

Summary: (on the north wall in the First Prakara of Tirumal aTemple)

1378 Saka (No. 8. T.T.)

**Donor's name and Reference :**

Saluva Narasingadeva Maharaja, Son of Gundaya Deva Maharaja, entitled "Srimanmahamandaleshwara, Medini Sara ganda and Katari Saluva. He became the de facto ruler of the entire South owing to his personal talents and he got from his uncle and Kinsmen.

**Gifts and Donations:**

A Sarvamanya (Tax-Free) grant of Alipuram Village in Chandragiri Rajya, was made for the Pur-pose of propitiating Sri Venkatesa with one (Super Offering) as udaya kale (Sandhi) in his name each in the morning.

సమన్వయము : పైవానిని బట్టి రెండు విషయములు స్పష్టమగుచున్నవి. 1486 నాటికే సాళ్వ నరసింహరాయలు రాజ్యమునకు వచ్చినను, విజయనగర రాజ్యమున కితడు పట్టాభిషిక్తుడు కాలేదని తెలియుచున్నది. పట్టాభిషిక్తుడైన రోజును తదితర విషయములు శాసనమున దెలుపబడినవి. దీనినిబట్టి నరసింహ రాయలు పట్టాభిషిక్తుడైన రోజు 1-11-1486 అగును. కాని నరసింహరాయల చివరి శాసనము 1485 లోననే కలదు. అనగా 20-4-1485 వరకే కలదు. కాగా, సంవత్సరమున్నర తరువాతి వరకు 'సార్వభౌమ' బిరుదాంచితుడై పట్టాభిషిక్తుడయ్యె. ఈ పట్టాభిషేకము పూర్తియైన పిమ్మటనే జైమిని భారత రచనము జరిగినది. జైమిని భారతమున సాళ్వ నరసింహరాయల పట్టాభిషేకము వర్ణితము. ఈ క్రింది పద్యము జూచిన స్పష్టము.

సీ. హతరిపుక్షత్రియుం డయ్యు సామ్రాజ్యంబు
గరిమఁ జేయనినాఁటి కడమ యొకటి
యోగీంద్రవంద్యుఁ డయ్యును నుగ్రసేనుని
నోలగించిననాఁటి యొచ్చె మొకటి
భువనైక వీరుఁ డయ్యు విభాకర తనూజు
కావఁ గోరిననాఁటి తక్కు వొకటి
యాది లక్ష్మీనాథుఁ డయ్యును బలిదైత్యు
నడుగఁ బోయిననాఁటి హైన్య మొకటి

తే. తలఁచి "మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొల్వ నసహాయ శూరత వెలసి దాన
శక్తి నవతార మెత్తిన శౌరి గాక
క్షితిప మాత్రుండె సాళ్వ నృసింహవిభుఁడు.

(జై. భా. 1-44)

మరొక పద్యములో—
"రాయ మీసర గండ, ధరావరాహ,
విజయ విఖ్యాత, గుండ భూవిభునృసింహ,
సార్వభౌముని బిరుదైన సాళువంబు."

(జై. భా. 1-45)

పై పద్యములో "రాయమీసర గండ, ధరావరాహ, విజయ విఖ్యాత, సాళువ" యను బిరుదములు గలవనియు, నందలి 'సాళువ' బిరుదము సార్వభౌముఁడగు నరసింహరాయలకే ప్రయోగింపబడినదనియు గ్రాహ్యమగుచున్నది. ఈ నాలుగు బిరుదములను నరసింహరాయలకు గలవు. ఇవియే కాక, "సాళువ బిరుదాంక" (2-116) 'విశ్వజగదేకచ్ఛత్ర' (5-204) కూడ గలవు. ఈ విషయములన్నియు 'సార్వభౌమ' బిరుదము వచ్చిన పిమ్మటనే 'జైమిని భారత' గ్రంథమంకిత మీయబడినట్లు తెలుపుచున్నవి. ఈ విధముగా జైమిని భారతము 1-11-1496 తరువాత వ్రాయబడినట్లును, అంకితమీయబడినట్లును దెలియుటకు జైమిని భారతము కారణమగుచున్నది.

### గ్రంథముల రచనా కాలము : పౌర్వాపర్యము :

పినవీరన శృంగార శాకుంతలమున—

'రచియించినాఁడవు రమణీయ వాగ్రీతి
 నవతారదర్పణం బభినవముగఁ
బల్కినాఁడవు తేటపడఁ జేసి నారదీ
 యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున
 మాఘ మాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మాన
 సోల్లాససారము సముల్లసితశయ్య'

అను పద్యము వ్రాసి, తన గ్రంథములను లోకమున కెరుకపరచినాడు. అనగా శృంగార శాకుంతలము వ్రాయకపూర్వ మీకవి (1) అవతార దర్పణము, (2) నారదీయము, (3) మాఘ మాహాత్మ్యము, (4) మానసోల్లాససారము—అను నాలుగు గ్రంథములు వ్రాసియున్నాడు. చిట్టచివరి గ్రంథము జైమిని భారతమగును.

శృంగార శాకుంతలమున జివరకు "లబ్ధకవితావిభూతి గలిగి గౌరవము గాంచినాదవు కవులచేత" యని గలదు. దీనినిబట్టి పూర్వము నాల్గు గ్రంథములు

వ్రాసిన గౌరవ పీతనికి గలదని స్పష్టము. అవతార దర్పణ పీతని మొదటి గ్రంథము. కాన నందలి శైలి సులభమై యుండి యుండవలయును. జైమిని భారత గ్రంథము పరిణత వయస్కుడైన పిమ్మట వ్రాసియుండును. కావ్యరచన మున కర్త వయసుడైన పిమ్మట దాదాపు పాతిక వత్సరములకు శాకుంతలము వ్రాసియుండుట సంభవమగును. ఇట్లూహించిన, కవి జన్మము 1425-30 ల నడుమను, 1445-75 ల నడుమ యలభ్య గ్రంథముల రచనమును, 1475-80 ల నడుమ శృంగార శాకుంతలము రచనయు, 1486 పిమ్మట జైమిని భారత రచనమును (1490, 91 లలో) జరిగి యుండవలయును. శాకుంతల, జైమిని భారత గ్రంథముల నడుమ ఐది సంవత్సరముల కాలముండి యుండవలయుననుటకు వానిలోని శైలియే కారణము. శ్రీనాథుని మునలితన మున, నీతడు కౌమారమున నున్నాడనుట సత్యమే యగును. జైమిని భారత రచనము పినవీరభద్రుని కరువది సంవత్సరముల వయస్సు వచ్చిన పిమ్మటనే జరుగుట రూఢి యగుచున్నది.

1. సాళువ నరసింగ మహీ
   పాలుని నత్యంత ఘనకృపాలుని ననుహ్యా
   త్పాలిత నగరీ పశ్య
   త్పాలుని నా చేయు కృతికిఁ బతి గావింతున్.

   (జై. భా. 1-11)

2. Epigraphica Carnatica
   [Epi. Car] Vol xi. ed. 14.
3. T. T. Devasthanam inscriptions
   [T. T. D. I] Vol. 5. No. 4.
4. Historical inscriptions of Southern India
   [Hist. Ins.] By Sewell. pp. 230, 31.
5. MER 70/1917, 386/1915.
6. MER 51/1919 "The Suryavamsi Gajapatis of Orissa", by Dr. R. Subramanyam pp. 44, 45.
   MER 84/1919, 93/906.
7. "The Suryavamsi Gajapatis of Orissa" - pp. 78-79. by Dr. R. Subramanyam.

8. పుట. 110. - కవి జీవితములు - వావిళ్ళ ప్రతి; 1918.

9. ఆంధ్ర కవుల చరిత్ర - కందుకూరి. (1917).

10. A History of Andhra literature in Vijayanagar empire - I part. 1880 నుండి 1500 వరకు-శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావు. 1988.

11. ఆంధ్ర కవి తరంగిణి - 5,6 సంపుటములు. 1960 (ద్వితీయ ముద్రణ).

12. Thesis of Dr. P. Jhansi Laxmi
"The History of Sangama Dynasty"
[Ph.D. thesis in History submitted to Osmania University]
1961. pp. 346, 57, 58, 62.

13. "పాండ్యాం ద్రవిళాంగ మాళవశక ప్రాగ్జ్యోతిష
క్షోణీభృత్పుందాస్య ప్రతివర్ష దత్త వివిధోపగ్రాహ్య
రత్నాంకు మత్కాంచీ వేంకట కాళహస్తి నగరీ కల్యాణ సౌధాంచల
ప్రాంచద్భాసన సాళ్వ శంకిత శశ" (జై.భా.) 7-288.

## జైమిని భారతము

తెలుగు సాహిత్యమున పిన వీరన శృంగార శాకుంతలమున కెంత ప్రాధాన్యమున్నదో, జైమిని భారతమున కంతకంటె హెచ్చు ప్రాధాన్యమున్నది. దీనికి కారణము లేకపోలేదు. శృంగార శాకుంతలము కథ మహాభారతము నందలి యొక యుపాఖ్యానము మాత్రమే. జైమిని భారత మట్లు గాదు. అది భారతము పేరనే వెలసినది. అందలి పర్వములలో నొకటి యగు నశ్వమేధ పర్వము పూర్తిగా నిందున్నది.

పినవీరన జైమిని భారత గ్రంథావతారికలో 'జైమిని భారతము భూమి నపూర్వమనియు' (1-17) కృతిపతి తనను, తద్భారత మందలి 'యశ్వమేధ పర్వము' తెలుగున జేయు మనినట్లును జెప్పినాడు (1-18); ఆశ్వాసాంత్య గద్యలలో 'జైమిని భారతమునం దశ్వమేధపర్వంబు' నని స్పష్టపఱచి యుండుట చేత, మూలగ్రంథమున గూడ యా భారతము నం దశ్వమేధపర్వమున్నట్లు గ్రాహ్యము. ఇది సంస్కృత మూలము గ్రహించియు విశదపరచవచ్చును.

### సంస్కృత మూలము

మహాభారతము సంస్కృతమున వ్యాసర్షి ప్రణీతమై వ్యాప్తిలో నున్నది. అందలి పదునెనిమిది పర్వములలో నశ్వమేధమనునది పదునాల్గవది. దానిని (తెలుగు భారతానువాదము) నన్నయ, తిక్కన, శంభుదాసుడను ఖ్యాతి వహించిన నెఱ్ఱాప్రగ్గడలను ముప్వురు కవిత్రయమను పేర యనువదించిన విషయ మాంధ్ర సాహితీలోకమున సుపరిచితమైనదియే. కవిత్రయ రచిత మహాభారత మను ఉద్గ్రంథము పినవీరన జైమిని భారతమునకుముందే సాహిత్యప్రపంచమున కవులకుపజీవ్యమైనది. కాని పినవీరన వ్యాసభారతము ననుసరింపలేదనియు, జైమిని భారతమునే యనుసరించెననియు తెలియుచున్నది. ఈ విషయము మూల జైమిని భారతముతో బోల్చి సరిచూచి వెల్లడించినాను. దీనినిబట్టి పినవీరన కృతికి మూలము జైమిని రచిత భారతమే యనుట నిర్వివాదాంశము.

## జైమిని భారత రచన

ఈ సందర్భమున మనకు గొన్ని సందేహములు కలుగవచ్చును. జైమిని యను నతడు భారతమున నొక్క యశ్వమేధపర్వము మాత్రమే రచించెనా? లేక తక్కిన పర్వములు కూడ రచించెనా ? ఒకవేళ జైమిని సంపూర్ణముగ రచించినచో తక్కిన పర్వములు ప్రచారములో లేక, యొక్క యశ్వమేధ పర్వము మాత్రమే వ్యాప్తిలో నుండుటకు గారణమేమి ? ఈ విషయములు చర్చించుటకు మనము వ్యాస రచిత మహాభారతము పుట్టుపూర్వోత్తరములను దెలిసికొనవలసియున్నది.

నేడు లక్ష శ్లోక పరిమితి గల మహాభారత మంతయు వ్యాసకృతమని ''శత సాహస్ర్యాం వైయాసిక్యాం'' అను వాక్యము వలన స్థూలముగా విదిత మగుచున్నది. కాని మహాభారతమును మనము సూక్ష్మదృష్టితో బరిశీలించిన నిది సరికాదని విశదమగును. ఇందుకు మనకు మహాభారతమునందే ప్రమాణము లున్నవి.

ఇపుడు మనకు కన్పించు మహాభారతము గాక వ్యాసుని శిష్యులైన 'సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు, వైశంపాయను'డను నైదుగురును మహాభారత సంహితను రచించినట్లుగా నీ క్రింది శ్లోకములు తెలుపుచున్నవి.[1]

''వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్
సుమంతుం జైమినిం పైలం శుకం వైవస్వమాత్మకమ్
ప్రభుర్వరిష్ఠోవరదో వైశంపాయనమేవ చ
సంహితాస్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః''

(ఆది-౧-౬౦-౬౨)

వ్యాసుడు వేదములను భారతమును 'సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు, వైశంపాయనుడు,'-మున్నగు నైదుగురు శిష్యులచేత జదివించెను. వారైదుగురు నైదు వేర్వేరు భారత సంహితలను ప్రకాశింపజేసిరి.

భారతమునందే గాక ఆశ్వలాయన గృహ్య సూత్రములలోనను, భారత మహాభారతములు వేఱనియు, సుమంత జైమిన్యాదులు భారత సంహితలను ప్రత్యేకముగా రచించిరనియు నిట్లు జెప్పబడియున్నది.

"సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్ర భాష్య భారత మహా భారత ధర్మాచార్యాః" (అశ్వలాయన గృహ్య సూత్రము ३ ४.४)

"సుమంతుడు, జైమిని, వైశంపాయనుడు, పైలుడు, సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యులు" —అనబడిన పై వాక్యమును బట్టి వ్యాస శిష్యులు భారత సంహితలు జేసినట్లు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి వ్యాసశిష్యు డైన జైమిని, భారతమును సంపూర్ణముగా రచించెననియు దెలియుచున్నది.

ఇట్లు భారతము జైమినిచే రచింపబడినను, నందులో నొక్క యశ్వమేధ పర్వము మాత్రమే యెట్లు నిలచినది, తక్కిన వేమైనవి యను ప్రశ్న తిరిగి మనకుదయించును. అంతే కాదు. సుమంత్వాదులు వ్రాసిన తక్కిన భారతము లేమైనవి యను దానికి మనము సమాధానము జెప్పవలసి యున్నది. ఆ సమా ధాన మిది:

వ్యాసుడు తొలుత 8800 శ్లోకములు గల భారతమును 'జయ'మను పేర రచించెను. ఆ వెనుక, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని, పైలుడు, వేర్వేరుగా, భారత సంహితలను రచించిరి వీరిలో వైశంపాయనుడు, సుమంత, పైల, జైమిని, భారత సంహితలను బరిశీలించి వానిలోని విషయములను గ్రహించి వ్యాస భారతమును బెంపు చేసెను. అందుచేత, సుమంత, పైల రచిత భారతము లంతర్హితములైనవి. జైమిని భారత సంహితలో నశ్వమేధ కథ తక్కిన వానికన్న భిన్నముగా నుండుటచేత, నది మాత్రము నిలచినది. వైశంపాయనుని వెనుక 'సౌతి' యను నాతడే రెండింటికి పూర్ణస్వరూపము నిచ్చియున్నాడు అందుచే నేటి సంస్కృత భారతమున వ్యాస, వైశంపాయన, సౌతి కృత భాగము లున్నవని, తెలుగున గవిత్రయము వలె సంస్కృతమున గూడ ముప్పురు కవులు మహాభారత కర్తలని గ్రహింపవలెను.[2]

నేటి పరిశోధనల మూలమున జైమిని కృతములైన యితర పర్వము లున్నట్లు మనకు దెలియుచున్నది.

## ఆది పర్వము

తెలుగు లిపిలో ముద్రితమైన సంస్కృత భారతాదిపర్వమున నాలాయన్యుపాఖ్యానము రెండధ్యాయములును, సుభద్రా పరిణయ వృత్తాంతము నాలుగధ్యాయములును, పర్వాంతమందు ప్రక్షిప్తములని గందు. భారతమునకు సంస్కృత వ్యాఖ్య వ్రాసిన నీలకంఠాచార్యు లీ యారధ్యాయములు జైమిని భారతములోనివని వ్యాఖ్యానించలేదని తెలియుచున్నది.[3]

## అశ్రమవాస పర్వము

ఇది లభ్యమగుచున్నదని లండను నగరమున గల 'ఇండియా ఆఫీసు లైబ్రరీ' వారి సూచీపత్రములనుండి తెలిసినది. ప్రస్తుత పరిశోధన కిది యనవసరమైనను, భావి పరిశోధకుల కుపయోగించునని వాని వివరముల నధోజ్ఞాపికలో నిచ్చితిని[4].

## అశ్వమేధ పర్వము

## (ఆంధ్రానువాదము)

పిన వీరన జైమిని యశ్వమేధ పర్వమునే యనుసరించెను. ఈ కవి వ్యాసాది కృత సంస్కృత భారతమును గాని, తిక్కన యనువాదమును గాని గ్రహింపలేదు ఈ క్రింది మరికొన్ని విషయముల నీ సందర్భమున గ్రహింపవలసి యున్నది.

జైమిని యశ్వమేధ పర్వమునకును, వ్యాసభారతాశ్వమేధమునకును భేదములున్నవి సంస్కృత భారతాశ్వమేధమున యనుపర్వ విభాగ మిట్లున్నది.

(1) అశ్వమేధపర్వము - 16 అధ్యాయములు.
(2) అనుగీత పర్వము - 38 అధ్యాయములు.
(3) అశ్వమేధ పర్వశేషము - 47 అధ్యాయములు
(4) వైష్ణవ ధర్మశాస్త్రము - 4 అధ్యాయములు

ఈ నాల్గింటితో కలిపి 125 అధ్యాయములు, 4618 శ్లోకములు-అందు గలవు. ఈ యశ్వమేధ పర్వమును దిక్కన నాలుగాశ్వాసములలో, 980 గద్య

పద్యములుగా రచించియున్నారు. జైమిని యశ్వమేధ పర్వమున ననుపర్వ విభాగము లేదు' అది వ్యాసరచన కన్నను విపులముగ నున్నది. కథాకథనము నను భేదము లున్నవి. ఆ వివరముల ననువాద పద్ధతి యందు నుటంకించి యున్నాను.

ఈ మార్పులన్నియును జూచిన మనకు శ్రీ సూక్తంకర్ గారు తెల్పిన విషయముల యందును, డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారు పేర్కొనిన విషయముల యందును సత్యము గోచరించుచున్నది.

1. "ఆది కాలమున గాతకులును గథకులును భారతమును వల్లెవేసి జ్ఞాపకము ననుసరించి దానిని బలుచోట్ల బఠించుచుండిరనియు, దానిని విన్నవారు మరల నట్లే జ్ఞప్తి యందుంచుకొని వేఱుచోట్ల వినిపించుచుండిరనియు, నీ. విధముగా భారతము లిఖితరూపము నొందువఱకు దేశకాల వ్యక్తి భేదముల ననుసరించి శబ్ద విన్యాసమునందే కాక వస్తు విన్యాసమునందును నించించుక మార్పు చెందుట తటస్థించుచుండెననియు శ్రీ సూక్తంకరు గారు చెప్పుచున్నారు" (BOR I Edition Pro LXXVI).[6]

(2) "వ్యాసుడు వేదవిభజనము చేసిన పిమ్మట నా విధానమునే యవలంబించి బహుకాలమునకు తరువాత అతని శిష్యులో లేక పండితులో భారత విభజనము జేసియుందురు. పర్వసంగ్రహ పర్వసంఖ్యాపనము లట్లు తరువాతి కాలమున జరిగియుండుననుట విశ్వసింపదగి యున్నది"

(3) "వ్యాసుని శిష్యులలో జైమిని కూడ నొకడు. అతడు కూడ వైశంపాయనాదులవలెనే భారత కథను వ్యాసముఖము నుండియే యెఱింగెను. అతడు వ్యాప్తికి దెచ్చిన భారతము నందలి యశ్వమేధ పర్వ భాగ మిప్పటికిని లభించుచున్నది. దానికి, మహాభారతమునందలి యశ్వమేధ పర్వముతో శబ్ద క్రమముననే కాక కథా క్రమమునం గూడ సంబంధ మంతగా గానిపింపదు. అది నిజముగా జైమిని ప్రపంచించిన భారత భాగమే యైనచో నోటిద్వారా వ్యాప్తినొందు గ్రంథము కాలక్రమమున నెంత వ్యత్యాసమునకు దావొసంగునో తార్కాణము కాజాలును."

పుట 431. (నన్నయ భారతము)

ఈ విషయము లన్నిటిని గ్రహించిన వివిధములగు పరిస్థితులలో వ్యాస భారతములో మార్పులు వచ్చుటయు, ఫలితముగా జైమిని భారతము రచింప బడుటయు నందునను గేవలం మొక్క యశ్వమేధ పర్వమే లభించుటయు జరిగినది.

అశ్వమేధ పర్వమునందలి ముఖ్య విషయ మశ్వమేధమను యాగమును గూర్చినది. అది భారతీయ వైదిక వాఙ్మయమున బ్రచురసిద్ధి వడసినది. కాబట్టి దాని గూర్చిన సంగ్రహ చరిత్ర నీ సందర్భమున జేర్చితిని. సంస్కృత వ్యాస భారతాశ్వమేధ పర్వముతోబాటు, తిక్కన యనువాదమును, నితర భాషలలో ననువదితములైన యశ్వమేధ పర్వములు నీ పట్టున బరిశీలితము లైనవి.

ఈ (సంస్కృత) జైమిని భారతాశ్వమేధ పర్వమును దెలుగు లోనికి "వాణి నా రాణి[6]" యని బేర్కొనట్లు జెప్పబడిన పిల్లలమఱ్ఱి పిన వీరభద్రు డనువదించినాడు[7]. ఇతడు గ్రంథము లెన్నియో వ్రాసెను, నేడీ జైమిని భారతమను యుద్గ్రంథము మనకు లభ్యమగుట మన యదృష్టము.

జైమిని భారతమును గూర్చిన గాథలెన్నియో ప్రచారములో నున్నవి. వానిలో నశ్వమేధమను పర్వమే మన కుపలభ్యమై జనాదరణను బొందినట్లు దెలియుచున్నది.

## ఆంధ్రానువాద ప్రశస్తి

వీరభద్రుడు జైమిని భారతమును దెలుగున మొదట యనువదించిన తరువాతనే యీ గ్రంథవ్యాప్తి, ప్రశస్తి లోకమునకు వెల్లడియైనది. ఆ వివరణము నీ క్రింద బొందుపఱచుచున్నాను:

(1) "వాణి నా రాణి" అను పిన వీరన వాక్యమీ గ్రంథము మూలముననే ప్రచారములోనికి వచ్చినది.[8]

(2) ఇది వీరము-భక్తి-సమ్మిళితమైన గ్రంథము.

(3) ఇందొక్క కథయే మూలమైనను, తదనుబంధముగా నెన్నియో కథలు గలవు.

(4) ఈ పరిశోధనలో నియమబడిన పట్టికనబట్టి పెక్కురు రచయితలు తెలుగులో నీ గ్రంథ భాగమును బద్య, వచన, హరికథ, నవల, నాటక, పురాణములుగా స్వతంత్ర రచనలు గావించినారు. అవి ముప్పదికి పైగా గన్పట్టినవి. ఇన్ని విధములుగా తిరిగితిరిగి రచింపబడినదీ మహోత్కృష్ట గ్రంథము. ఈ గ్రంథ భాగములో హెచ్చుగా నాకర్షణమను బొందినవి చంద్రహాస, ప్రమీలార్జునీయ కథలు ఈ కథలాధునికులగు చిఃకమర్తి లక్ష్మీనరసింహము గారిచే "చతుర చంద్రహాస"మను పేర నాటకముగను, "ఆంధ్ర నాటక పితామహ"దనబడు ధర్మవరము కృష్ణమాచార్యులచే "చంద్రహాస" "ప్రమీలార్జునీయ" నాటకములుగను రచియింపబడినవి [9]

(5) ఈ గ్రంథము వివిధ భాషలలోని కనువదితము కన్నడమున దీనిని లక్ష్మీశకవి[10] రచించినాడ ఈతడు వీరభద్రునికి దరువాతివాడు. తెలుగు వచనములో సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు రచించినాడు. మహారాష్ట్రము నను దీని యనువాదము గలదు అట్లే బెంగాలి భాషలో దీనికి నెనిమిది యను వాదములగుపడుచున్నవి [11] ఈ గ్రంథమునకు హిందీలో నొక యనువాదము కలదు [12] వివిధ భాషంలోని యనువాదకులందఱును బిన వీరనకు దరువాతి వారే యని, ఆయా సాహిత్య చరిత్రలు తెలుపుచున్నవి

(6) ఆంధ్రదేశమునందలి నలుమూలలకు నీ కథలు ప్రాకి, సుప్రసిద్ధములై, బుఱ్ఱకథలై, చలనచిత్రములై వెండితెర కెక్కినవి.

(7) ఈ గ్రంథము - కవి కాలమును స్పష్టము చేసినది

(8) 'శృంగార శాకుంతలము కన్న జైమిని భారతము మిగుల ప్రశస్తి' వహించినది

(9) ఈ గ్రంథ మొక్కరాత్రిలో వ్రాయబడెనను గాథయు నీ గ్రంథ వ్యాప్తినే సూచించుచున్నది.

## అశ్వమేధ ప్రాధాన్యము - చరిత్ర

శతపథబ్రాహ్మణములో పదమూడవ కాండమున, నశ్వమేధయాగమును గూర్చిన వివరణమున్నది.[13] ఇది దాదాపు ఆ కాండమున సగము కలదు.

అశ్వమేధయాగమును గూర్చిన సర్వవిషయములీ గ్రంథమున విశదీకృత మొనర్పబడి యున్నవి. ఇది యైదధ్యాయములలో గలదు దీనిని గూర్చిన ప్రస్తావనము ఋగ్వేదమునను, శుక్లయజుర్వేదమునను గలదు.

చక్రవర్తిత్వమును నిరూపించుకొను రాజు లీ యాగమును జేసినట్లు పురాణ గ్రంథములలో గలదు. ఇంద్రు డీ యాగమును పెక్కు పర్యాయములు చేసినను, యాగ నియమమును పాడింపలేదు. ఐశ్వర్యము, అభివృద్ధి, మోక్షము మున్నగు వానికై రాజులీ యాగమును జేసిరి.

రాజులు తమ యాధిక్యమును నిరూపించుకొనుటకు యాగాశ్వమును పూజించి, ముఖమున నొక ఫలకమును గట్టి లోకయాత్రకు వదలెదరు. యాగము నిర్వహించి చేయువారు దమ పక్షమున నెవ్వరినైన సైన్య సమేతముగ నశ్వము వెంట నంపుదురు. ఎకటి వారెవ్వరైన యాగాశ్వమును బట్టుకొని వీరితో యుద్ధ మొనర్చి జయించి, తమ యాధిక్యమును దెలుపుకొనవచ్చును. అట్లు గెల్వనిచో వారు సామంతులగుదురు. చిట్టచివర కా యశ్వము దేశము లన్నియు దిరిగి స్వస్థానము జేరును. అంతకాలము వఱకును యాగదీక్షను బూనిన యాగకర్త స్త్రీ సంగమము లేకుండ నుండవలెను. యాగాశ్వము సంవత్సర కాల మట్లు యాత్ర గావించిన పిమ్మట మూడు దినములు యాగము జరుగును. అశ్వమును బవిత్రస్నానము జేయింతురు. మూడవ దినమా యశ్వమును బలి గావించి, నిర్ణీత స్థలమున బట్టుబట్టచే గప్పియుంతురు. యాగకర్త వారసుని గోరుచో నాతని పట్టమహిషి, నాటి రాత్రి యంతయు నశ్వముతో గలసి యుండవలయును. ఆ సమయమున బట్టమహిషి యాగాశ్వమును బొందుటకై నిర్మల హృదయముతో నుండవలయును. దానిని 'అశ్వసేవ' యందురు. దీనిని గూర్చి యాపస్తంబ శ్రౌతసూత్రములలో నీ విధముగ నున్నది.

'అంబే అంబాల్యంబికేతి జపంత, మహిష్యశ్వముపసంగమ్య' 'గణానాం త్వా గణపతి గెం హవామహ' ఇత్యభిమంత్ర్య 'ఉత్సక్థ్యోర్గుదం దేహీతి' ప్రజాననే ప్రజననం సన్నిధాయోప విశతి. సుభగే కాంపిల వాసీతి క్షౌమేన వాససా ధ్వర్యు ర్మహిషీ మశ్వంచ ప్రచ్ఛాద్య 'వృషాగెం రేతోధా రేతో దధాత్వితి' 'జపత్యాగ్నీధ్రం ఏతాం రాత్రి మృత్విజో యజమానం జాగరయంతి'

(ఆపస్తంబ శ్రౌత సూత్రము)

శతపథ బ్రాహ్మణములో నీ విధముగ గలదు [14]

(నిరాయత్యాస్వస్య శిశ్నమ్ మహిషీ ఉపస్థే 'వృషా వాగీ రేతోధా రేతో దధా త్వ' ఇతి మిథునస్యైవ సర్వత్వాయ).

పట్టపురాణి 'అ బే అంబాల్యంబికే' అను మంత్రమును జపించుచు (వది-పబడిన) యశ్వముం దాసి 'గణానాం త్వా' యను మంత్రముతో నా యశ్వము నభిమంత్రణము జేసి 'ఉత్సక్థ్యోర్గుదం దేహి' యనుచు శయనింప వలయు అపు డధ్వర్యుడు, 'సుభగే కాంపిల వాసిని' యను మంత్రముం జదువుచుం బట్టుబట్టతో రాణిని యశ్వమును గప్పును. అగ్ని దుదు 'వృషగ్ం రేతో దధా' యను మంత్రమును జపించును. ఆ రాత్రి తక్కిన ఋత్విజులు మహారాణి నిద్రింపకుండం జేయుదురు. [15]

ఆ మరునాడు పట్టపురాణి 'అశ్వసేవ'ను వీడుట తోడనే మృతాశ్వమును ఖండించి వండుదురు.

ఇదియే ఋగ్వేదమున గూడ తెలుపబడినది

ఈ విధముగా యాగాశ్వపు మాంసమును దేవతార్పణము గావించి, స్వీకరింతురను విషయము 'Introduction to translation of Rig-veda' అను గ్రంథమున Wilson అను నాంగ్ల రచయిత విమర్శించి యున్నాడు. (PP. xiii-xiv).

ఆ యశ్వము దేవత్వమును బొందు ననుట కూడ ఋగ్వేదమున దెలుప బడినది. [16]

పిమ్మట దానాదికములు గావింపబడును. ఋత్విక్కులను, బ్రహ్మయు, దదితర రాజులు, దక్కిన వారెల్లరు పక్వాన్న భోజనము జేసి, పిమ్మట సత్క రింపబడుదురు.

బ్రాహ్మణులకు దాన మొసంగబడును.

ఈ యాగమునకు నిరువది వేల బ్రాహ్మణులు కావలయును. వీరికి సువర్ణ సహితమైన యొక యశ్వము, గజము, రథము, గోసహస్రము, రత్న ములు, దక్షిణగా నీయవలయును,

చైత్ర పౌర్ణిమ నాడు యాగాశ్వమును విడువవలయును. అశ్వము సామాన్యమైనది కాక, నల్లనగు చెవులు గల్గి, బంగారు వర్ణముగల తోకయు, చందన వర్ణమును గల్గినదై యుండవలయును. నిరాఘాట వేగము గల్గినదై యుండవలయును

భూప్రదక్షిణమునకు న్విడువక పూర్వము దాని ముఖమున నొక బంగారు "వీరాంకము" గట్ట వలయును.

మలమూత్రములు విసర్జించిన చోట, హోమము జేసి, గోసహస్రమును బ్రాహ్మణులకు దక్షిణగా నొసంగవలయును. యజ్ఞదీక్ష గైకొనినవారు "అసి పత్రవ్రతము" బూని బ్రహ్మచర్యము సలుపవలయును. ఈ వ్రతము నింద్రుడు పాటింపలేదు ఆ కారణమున యాగము లొనర్చియు వ్యర్థమైనది. ఈ విధాన మును వ్యాసుడు ధర్మరాజునకు వివరించెను.

ఈ విషయమునే మరికొన్ని గ్రంథములు దెలిపినవి. ఐతరేయ బ్రాహ్మణము, విష్ణు పురాణము, భాగవత పురాణము, మత్స్య పురాణము, భారత మను గ్రంథములు వివరించినవి.

### అశ్వమేధ యాగ కర్తలు[17]

(1) జనమేజయుడు (2) మానవుడు (3) శతానీకుడు (4) అంబష్ఠుని కుమారుడు (5) యుధాంశ్రేష్ఠుడు (6) విశ్వకర్మ (7) సుదాసుడు (8) మరుత్తు (9) అంగుడు (10) భరతుడు (దుష్యంత పుత్రుడు) (11) దుర్ముఖుడు (12) అత్యరాతి —

వీరిలో దుష్యంతుని కుమారుడగు భరతుడు నూట ముప్పది యాగముల చేసెనని మహాభారత చరిత్రము చెప్పుచున్నది. ఈ యశ్వమేధ యాగకర్తలలో జనమేజయుడు ముఖ్యుడు. ఈయన యశ్వమేధయాగము జేసినట్లు మహాభారత మున లేదు గాని సర్పయాగమునకు వచ్చిన 'యాస్తీకుని' తా జేయబోవు హయ మేధమునకు రావలయునని కోరినట్లున్నది. 'విష్ణు, శ్రీమద్భాగవత' పురాణములు రెండును, పరీక్షిత్పుత్రుడగు జనమేజయుడు, కావషేయుడు పురోహితుడుగా

నశ్వమేధము జేసినట్లు జెప్పినవి. హరివంశమున జనమేజయుడు వాజిమేధము జేయునపుడు బట్టమహిషి యగు 'వపుష్టమ' యశ్వమును సేవింపుచుండ, నా యశ్వము కదలినట్లును, కదలుట దోషముగాన, జనమేజయుడు ఋత్విక్కులపై గినిసి (వా రశ్వమును సరిగా విశసింపలేదని) యా ఋత్విక్కులను దన దేశము నుండి యన్యదేశమునకు దొలగి పొందని యాజ్ఞాపించి, తన భార్యయగు వపుష్టమ శీలము చెడినదని నిందించుచుండ విశ్వావసుడను గంధర్వరాజు వచ్చి 'యశ్వము గదలుటకు ఋత్విక్కులుగాని, వపుష్టమ గాని, దోషులు కారనియు, దేవేంద్రుడు నీ యాగము జూచి సహింపక యశ్వమున బ్రవేశించి కదలె'నని సమాధాన పరుప, జనమేజయుడఁగి 'హయమేధము జేయువారిలో నేనే కడపటి వాడ నగుదును గాక! నేడు మొదలు రాజులెవ్వరును నశ్వమేధముజేసి యింద్రున కాహుతు లీయక పోదు'రని శపించెను. కవషుని బుత్రుడు తురుడు రెండశ్వ మేధముల జేయించెను.

ఏ కారణము వలననో హయమేధము కలియుగమున లేదను వాదమేర్పడి,

''అశ్వాలంబనం, గావాలంబనం, సన్యాసం, పలపైతృకం, దేవరాత సుతోత్పత్తిం; కలౌ పంచ విసర్జయేత్' అను వాక్కు లోకమున నేర్పడినది.

ఈ వాదమునకు విప్రతిపత్తిగా నీయుగమునను హయమేధము జేసిన వారు కలరు. మౌర్యరాజ్య ధ్వంసకుడైన పుష్యమిత్రుడు, చాళుక్యవంశములోని మొదటి పులకేశి, విష్ణుకుండిన రాజగు మాధవవర్మ (ఈతడు పదునొకం డశ్వ మేధములను జేసినట్లు 'పొలమూరు' శాసనమున గలదు) హయమేధము జేసిన వారుగా జూపట్టుచున్నారు. కడపటి యశ్వమేధము 'కనోజ' దేశపురాజైన జయ చంద్రునిది. పృథ్వీరా జీతని యాగమును విఘ్నము జేసెను.

ఇట్లే యశ్వమేధము మహోత్కృష్ట యాగములలో నొకటియై, బ్రహ్మ హత్యాది దోషనివారిణియై, యుండెడిది, కాని కాలక్రమమున, మత సాంఘిక పరిస్థితులలో సంస్కరణములు వచ్చి నే డీ హయమేధము రూపుమాసినది.

## అశ్వమేధము[18]

''ప్రాచీన కాలములో గుర్రములకు చాల ప్రాముఖ్యముండెను. కస్సీ (Kassites) జాతివారు బాబిలోనియా ప్రాంతమువారు వారినే ఋగ్వేదములో

"కేలిన్" జాతి వారని వ్యవహరించిరి ఈ జాతివారు సవారీలో ప్రవీణులు. వీరి వలెనే శకులు (సిథియనులు) కూడ సవారీలో ప్రసిద్ధిచెందియుండిరి. గుఱ్ఱపు సవారీ, ధనుర్విద్య, వారి ప్రత్యేక లక్షణములు. గుఱ్ఱపు మాంసము తినుట, గుఱ్ఱపు పాలు త్రాగుట కూడ వారి ప్రత్యేక లక్షణములు ఈ కారణములచేత ప్రాచీన కాలమందు అనార్య జాతులలో గుఱ్ఱమునకు ప్రాముఖ్యముండెను. ఆర్యులు గుఱ్ఱముల సవారీలోనను, ధనుర్విద్య యందును శకుల వలె నారితేరిన వారు. వారిలో అశ్వమేధము ప్రబలియుండెను. ఈ యాగము సామ్రాజ్య చిహ్నముగా చేసిరి. లేదా సంతానాది కామ్యకవ్రతముగా చేయుచుండిరి. అశ్వమేధము నందలి కార్యకలాపము ఉత్తమమైనదిగా కానరాదు."

## బాల భారతము[3]

## (అశ్వమేధ పర్వము)

(1) వ్యాసుడు ధర్మరాజునకు ధనార్జనోపాయము తెలిపి యశ్వమేధము సేయునట్లు చెప్పుట.

(2) కృష్ణుడు ద్వారకకుఁబోయి మగిడి వచ్చుట.

(3) కృష్ణుడు పీనుగై పుట్టిన పరీక్షిత్తును బ్రతికించుట.

(4) అర్జునుడశ్వము ననుగమించి రాజుల నెల్ల జయించి వచ్చుట.

(5) ధర్మరాజశ్వమేధ యాగము నిర్విఘ్నముగ నెరవేర్చుట.

(6) యాగ సమయమున నకులంబు బ్రాహ్మణులకు సక్తుప్రస్థుని చరిత్రంబు చెప్పుట.

---

1. వీరిలో శుకుడు వ్యాసరచిత మహాభారతమును ప్రచారములోనికి దెచ్చెను

2. 'మహాభారత చరిత్ర' - పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి మహాభారత రచనా విధానము - శీర్షిక. పుటలు - 28, 29, 30.

3. మహాభారత చరిత్ర - పుట 36.

4. లండన్ నగరములో గల India office Library లో నేటికిని జైమిని వ్రాసినదని పేర్కొనబడిన యాశ్రమవాస పర్వము గలదని వారి సూచీ పత్రము వలన (Catalogue) తెలిసినది దాని వివరము లనుబంధములోని తక్కిన యశ్వమేధపర్వ వివరణములతో గలిపి వ్రాసియున్నారు. ఆద్యంతములు సంస్కృత శ్లోకములు గలవు ఆశ్రమవాస పర్వమును గూర్చిన వివరములు ప్రస్తుత మనవసరము దానిని పరిశీలించుటకై వారికి వ్రాసితిని. చాల రోజుల వఱకు జవాబు రాలేదు పంపవనిగోరుచూ తిరిగి తిరిగి వ్రాయగా గ్రంథాలయము మార్చుచున్నామని వ్రాసినారు. మరల ప్రత్యుత్తరము వ్రాయలేదు.

5. నన్నయ భారతము - డాక్టర్ దివాకర్ల వేంకటావధాని సిద్ధాంత వ్యాసము - ముద్రణము 1960. పుట 432, 480, 481.

6. పిల్లలమఱ్ఱి పినవీరన
కిల్లాంట వాణి యట్టులే కాకున్నన్
దెల్లముగ నొక్క రాతిరి
తెల్లగ తెలవారు వరకు తేగలడె కృతిన్.''

చాటు పద్య మణిమంజరి - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి- పుట 141

7. తే.గీ వాణి యిల్లాలుగా గవిశ్రేణి కెల్ల,
బ్రధుతరాశ్చర్యకరమైన బిరుదు పూనె
దుహినగిరిరాజు రామసేతువుల నడుమ
నితని కెన యైన కవివరుడెందు గలడు.

(సీమంతినీ కల్యాణము 1-46)

ఈ అంశమును గురజాడ శ్రీ రామమూర్తి గారు, చాగంటి శేషయ్యగారు, కందుకూరి వారు, కవి జీవితములు, ఆంధ్ర కవి తరంగిణి, ఆంధ్ర కవులచరిత్రము అను గ్రంథములలో పేర్కొని యున్నారు.

8. ''కవితాలహరి'' లో ఆచార్య డాక్టర్ బిరుదురాజు రామరాజు గారు పినవీరభద్రుని జైమిని భారతమును గూర్చి వ్రాయుచు, 'వాణి నా రాణి'' అన్నాడంటే అతని అభిప్రాయం వాణి తన మంత్రాధిష్ఠాన దేవతయైన రాజ్ఞి యని, పినవీరిన శారదాస్తుతి చేసిన పద్యాలవల్ల (1-5) ఈ విషయం స్పష్టంగానే తెలుస్తుంది. దేవీ ఉపాసకులు రాణీ, రాజ్ఞి యిత్యాది పేర్లుంచుకుంటారు రాణి పేరులోని ఈ పరమార్థాన్ని మరచిపోయి ఎవరో పినవీరనకు వాణిని రాణి చేసినారు. వాణి అతనికి రాణియే కాని అందరు చెప్పుకునే అర్థంలో మాత్రం కాదు'' అని పేర్కొనినారు ముద్రణ (జనవరి 1976).

9. ఈ అంశమును విస్సాకోట మాధవరావు గారు "కావ్య శిల్పము" అను గ్రంథములో పేర్కొనినారు. పుట 318.

10. కన్నడ కవి చరిత్ర - మూడవ భాగము.

11. **History of Bengali Language ch. iv. p. 207.**

12. హిందీ యనువాదమునకు హార్వర్డు విశ్వవిద్యాలయము నుండి 'xerox' కాపీ పంపబడినది ఆ ఛాయా చిత్రము నూటపది పుటలలో నున్నది అదియు నాకు నుపయుక్తమైనది. పూర్వము మన దేశీయులు రచింపగా, క్రమముగా నది వారి వద్దకు జేరి యుండవచ్చును

13. శతపథ బ్రాహ్మణము - 13 వ కాండ పుట 274 **Part v. oxford univ. Press.** ముద్రణ 1900

14. శతశథ బ్రాహ్మణము - 13 వ కాండ, 5 వ అధ్యాయము - 2 వ బ్రాహ్మణము 1-2-3 మంత్రములు.

15. మహాభారత చరిత్రము 'మత సంస్కారణలు' - శీర్షిక - పుటలు 335-336, పిఠాపురము - 1933

16. **Rig Veda I. 62-20, 21.**

17. పుట 119 - మహాభారత చరిత్ర.

18. రామాయణ విశేషములు - సురవరం ప్రతాపరెడ్డి, మార్చి 1957 పుట 120.

19. రామాయణమునకు బాల రామాయణము వలె, భాగవతమునకు బాల భాగవతము వలె, భారతమునకు 'బాల భారతము' గలదు అది అగస్త్యకృతము - ఈ అగస్త్యుడే 'ప్రతాపరుద్ర యశోభూషణము' అను ప్రసిద్ధాలంకార శాస్త్రము రచించిన విద్యానాథుడని సంస్కృత వాఙ్మయ చరిత్రము తెలుపుచున్నది. అతడు సంస్కృతమున డెబ్బదినాల్గు గ్రంథములు రచించినాడని తెలియు చున్నది. మధురా విజయమును రచించిన గంగాంబ అగస్త్యు నిట్లు స్తుతించినది.

'చతుస్స ప్తతికా ప్రోక్తి వ్యక్త వైదుష్య సంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహా యేత్కో న కోవిదః' (14 శ్లో)

సంస్కృతాగస్త్య బాల భారతము ముద్రితము కాలేదు. దీనికి మహామంత్రి తిమ్మరసు 'మనోరమ' యను వ్యాఖ్య రచించియున్నాడు. అదియు నముద్రితమే.

పై విషయము కీ శే. కొత్తపల్లి సూర్యారావు గారి తెలుగు బాల భారతము నుండి గ్రహింపబడినది.

**ఉపాఖ్యానము :**

జైమినీయాశ్వమేధము ననుసరించి పిన వీరభద్రుడు వ్రాసిన జైమిని భారతములో ఉపాఖ్యానములకు దగు స్థానము నీయవలయునన్న నెట్టి సందేహము నుండ నక్కరలేదు.

'ఉపాఖ్యానము' అను పదము వివిధ భాషలలో నీ క్రింది యర్థమున కనబడుచున్నది.

ఉపాఖ్యాన్ } పుం. నం.
ఉపాఖ్యానక }

చిన్న కథ లేక పౌరాణిక కథ

పై రెండర్థములు కనబడగా సంస్కృతములో[1] నుపాఖ్యానమునకు అర్థములు ఈ క్రింది విధములుగా చెప్పబడుచున్నవి:

'Episode' అను పదమునకు Shankar Narayana నిఘంటువులో 'ఉపాఖ్యానము' అనియు (పుట 127); Chambers Twentieth Century dictionary లో (పుట 858) (1959 Edn).

(1) A story introduced into a narrative or poem to give variety

(2) An interesting incident.

(3) A passage affording relief from the principal subject.

అనియు వివరింపబడి యున్నది.

తెలుగులో శబ్ద రత్నాకరమున ఉపాఖ్యానమునకు 'ఇతిహాసము' అను నర్థము చెప్పబడి యున్నది.

ఈ విధముగా నుపాఖ్యానము అను పదము పలు భాషలలో సమానార్థములో చెప్పబడు చున్నది అంతేగాక 'ఉపాఖ్యానము' అను పదమును విడదీసినచో 'ఉప+ఆఖ్యానము' అను పద్ధతిలో సవర్ణదీర్ఘ సంధియు నగుచున్నది. అనగా ఆఖ్యానమునకు-

(1) Allusion to some old tale

(2) A tale

(3) Story

(4) Especially a legendary work such as the Mahabharata అను నర్థములు గలవు 'ఉప' యను నుపసర్గ ఆఖ్యానము అను పదమునకు చేర్చుటచే, గ్రంథమునందు ప్రధానముగా నడచు కథకుస ంబంధించి యున్న 'ఉపకథ' యని చెప్ప వీలగుచున్నది.

శ్రీమదాంధ్ర మహా భారతములో ఆనుశాసనిక పర్వమును గూర్చిన విభాగములో నుపాఖ్యాన విషయములను గూర్చి వ్రాయుచు డాక్టర్ కులశేఖరరావు గారు ఉపాఖ్యాన మనగా నేమి యను ప్రశ్నకు సమాధానము చెప్పుచు, సర్ మోనియర్ విలియమ్స్ పండితుడు ఉపాఖ్యాన మనగా, a subordinate tale or story, an episode, అను నర్థమును వ్రాసి యున్నట్లును దెలిపి యున్నారు [2] అంతేగాక, మహా భారతమున నున్న ఉపాఖ్యానములను వారు ఈ క్రింది విధమున వింగడించిరి.

(1) ప్రధాన కథకు పూర్వరంగముగా నున్న ఉపాఖ్యానములు.

(2) ప్రధాన కథతో పరోక్ష సంబంధము కలిగి, అందలి పాత్రములు కనబడక ప్రసక్తానుప్రసక్తముగా ప్రధాన కథ యందలి పాత్రముల చేతగాని, కవి వలన గాని వివరించబడినవి

(3) ఒక సిద్ధాంతమును గాని, నీతిని కాని ప్రతిపాదించి, దానిని పుష్టి చేయుటకు చెప్పబడినవి

(4) పౌరాణిక ప్రాముఖ్యము గలిగిన ఘట్టములు వచ్చినపుడు, ఆ విశేషములను ప్రపంచించుట కుల్లేఖించిన కథలు

(5) వైదిక సంప్రదాయమునకు సంబంధించిన వ్యక్తులు, క్షేత్రములు, మహిమలు వీరికి చెందిన కథలు - సంవాదాత్మకములు, ఆధ్యాత్మిక చర్చలు.

పైన తెలుపబడినట్లుగా డాక్టర్ కులశేఖరరావు గారు మహా భారతములోని యశ్వమేధ పర్వపుటుపాఖ్యానములు నాలు గాశ్వాసములలో కలసి పదునొకండు గలవని వింగడించిరి. కాని లోగడ తెలుపబడినట్లు భారతాశ్వమేధ పర్వములోని ఉపాఖ్యానములు పదునొకండింటిలో ప్రధాన కథ తప్ప తక్కినవన్నియు జైమినీ యాశ్వమేధముతో భేదమును జూపుచున్నవి.

జైమినీ యాశ్వమేధపు టనువాదమగు పినవీరభద్రుని గ్రంథములోని యుపాఖ్యానములను గూర్చిన ప్రస్తావన "పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి" అను గ్రంథములో గలదు.[3]

జైమిని భారతములోనను, వ్యాసకృత భారతములోనను, శ్రీకృష్ణుడే కథానాయకుడగుచు, కథనంతను నడపించిన వా డగుచున్నాడు. ఆ మహానుభావుని ప్రోత్సాహమునను, సమక్షమునను, ధర్మరాజాశ్వమేధయాగమును నిర్విఘ్నముగా సాగించును. ఇది ప్రధానముగా నంతస్సూత్రమైన కథ యగుచున్నది.

డాక్టర్ సుబ్రహ్మణ్యము గారు, "జైమిని భారతమున వ్యాసుడు ధర్మబోధకిచ్చినంత ప్రాముఖ్య ముపాఖ్యానముల కీయలేదు" అని తెలిపినారు.[3]

ఉపాఖ్యానములకు భారతమున వ్యాసు డీయని ప్రాముఖ్యము జైమిని యిచ్చినాడు.

పైన పెక్కు భాషలలో చూపట్టిన నిర్వచనములను బట్టి పరిశీలించిన ప్రధానకథకే యెక్కుడు ప్రాముఖ్యము చూపబడవలెననియు, నుపాఖ్యానములు ప్రధాన కథాగమనమునకు దోడ్పడుచు, ఎడనెడ విశ్రాంతి దాయకము లగుచుండు ననియు తెలియుచున్నది. కాబట్టి ప్రధాన కథాగమనమునకు, తచ్ఛిల్పమునకు, నీ యుపాఖ్యానములు తోడ్పడుచున్నవి. అనగా సర్వే సర్వత్ర గ్రంథముల యందుపాఖ్యానముల స్థానము బోధపడుచున్నది. వ్యాసుడు ధర్మబోధ కేవలము ప్రధాన కథలో మాత్రమే చూపలేదు. ఉపాఖ్యానములలో కూడ ధర్మబోధ స్పష్టపడుచున్నది.

డాక్టర్ కులశేఖరరావు గారు మహాభారత గ్రంథములోని యానుశాసనిక పర్వమునకు పీఠిక వ్రాయుచు, పదునారవ పుటలో భారతమునందలి పంచేంద్రియోపాఖ్యానము చిన్నదియైనను నుత్తమ విశేషములు గల యుపాఖ్యానముగ వెలయుచున్నట్లు వ్రాసిచ్చినారు. అట్లే జైమినిభారతమునందు వర్ణింపబడిన యుపాఖ్యానములు సైతము సమగ్రముగ పరిశీలించి యందలి గుణవిశేషములను జూడవలసియున్నది

4)

వీరభద్రుని జైమినీయాశ్వమేధ మష్టాశ్వాస సమన్వితము. ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధానంతరము శాశ్వతైశ్వర్యములు సంపాదించి రాజ్యాదిక సర్వస్వమును పరిపాలించుచు మిక్కిలి ఖిన్నుడై వ్యాసునితో తాను జ్ఞాతివధ నొనరించి నట్లును, వాయునందనునికి పట్టము గట్టి కాననములకు నేగెదననియు, నశ్రుజాలముతో చెప్పి, తా నేకతువుల నాచరించిన పాపములు హరించునని యడిగెను. వ్యాసుడు ధర్మరాజుతో, 'అశ్వమేధయాగము చేసిన పాపములు హరించు'నని తెల్పి ప్రోత్సహించెను. దానికి సిద్ధపడిన ధర్మజుడు తగిన ధనము కొరకును, హయము కొరకును విచారించగా వ్యాసుడు భద్రావతీ పురము నేలు యౌవనాశ్వుని వద్ద గల యశ్వము యాగోచితమైనదియు, సురక్షితమైనదనియు వివరించగా, భీముడు దానిని దెత్తుననియు శపథము చేసెను కర్ణసుతుడైన వృషకేతుడును, ఘటోత్కచ కుమారుడైన మేఘవర్ణుడును సిద్ధపడగా, ధర్మరాజు సంతసమంది, శ్రీకృష్ణుని స్తుతించి, దర్శించి, యాతని యానతి గైకొని భద్రావతికి వీరత్రయమును పంపెను.

మూడవ యాశ్వాసము నుండి ఉపాఖ్యానములు ప్రారంభమగుచున్నవి. మూడవ యాశ్వాసములో మరుత్తుడు గావించిన హయమేధ యాగ వృత్తాంతమును వ్యాసర్షి ధర్మజునికి నెఱింగించినాడు ఇది భారతము నందును గన్పట్టుచున్నది. ఇచట కేవలము ధర్మబోధయే గాక, వ్యక్తిగతము, గుణశీలసంబంధమునైన ద్యూతవ్యసనము మానుమని వ్యాసమహర్షి హితవు చెప్పుటయు కననగును. కురుక్షేత్ర రణము జరుగుటకు గల కారణములలో ధర్మజుడు రాజ్యము పోగొట్టుకొనుటయు, దానికి ద్యూతవ్యసనము కారణమగుటయు ననుటకు సంశయమక్కరలేదు. ఈ యుపాఖ్యానము కేవల మొక్క పద్యములోననే తెలుపబడినది కాని యట్లొక్క పద్యముననే వర్ణించుట సందర్భసహితమే. సందర్భరహితము గాదు. ఈ మరుద్వృత్తాంతము సంస్కృత జైమిని భారతములో కేవలము రెండు శ్లోకములలోననే ప్రస్తావించబడినది. ధర్మరా జడిగిన ఈ వృత్తాంతము వ్యాసునిచే తెలుపబడుచు, ధర్మరాజు శీలమును గూడ వ్యక్తము గావించుచున్నది.

మహాభారతములోని ఏకవాక్యగతములైన ఉపాఖ్యానములు :-

(1) ఆదిపర్వము (8-76).

"ష్మతియు సనత్కుమారు నంశంబునఁ బ్రద్యుమ్నుండు పుట్టె నప్సరసల యంశంబులఁ గృష్ణుని షోడశ సహస్రాంతఃపుర వనితలు పుట్టి రయ్యై వేల్పుల యంశంబుల యదువృష్ణిభోజకాంధక వంశంబుల వీరు లనే కులు పుట్టిరి''.

(ii) ఆది-(4-6)

''ఆ త్రసునకుఁ గాళింది యనుదానికి నిలినుండు పుట్టె వానికి రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్య సాధారణశక్తియుక్తుండై''

ఇట్టివి మహాభారతమున నెన్నియో గలవు. కాని ప్రధాన కథ కివి తోడ్ప డుచునే యున్నవి.

సంసారధర్మములందు భీరువులైన మానవులకు తరణోపాయములను దెల్పుమని ధర్మరా జడుగగా వ్యాసుడు వివరించినవానిలో మోక్షోపాయ కథనము, జారస్త్రీ లక్షణములు, స్థిర లక్ష్మీయోగము- తదుపాయములు గలవు. ఇవన్నియు కథాకథన దృష్టితో కథను బెంచుటకు వ్రాసినవి కావు. పైన వింగడించిన రీతిలో పౌరాణిక ప్రాముఖ్యమున్న ఘట్టములు వచ్చినపుడు తద్విశేషములను ప్రపంచించుట కుల్లేఖించినవి యని గ్రహింపవచ్చును.

నాలుగవ యాశ్వాసములో జైమిని మహర్షి జనమేజయున కగ్నిదేవుడు నీలధ్వజున కల్లుడైన విధము ప్రధానముగ దెలియజేసెను. ఈ యుపాఖ్యానములో నర్జునుడు క్రమక్రమముగ రాజుల గెల్చుచు, మాహిష్మతీపురమునందు నీలధ్వజుని కుమారుడైన ప్రవీరుని తోడను, నీలధ్వజునితోడను యుద్ధము చేయుచు, నారాయణాస్త్రముచే నీలధ్వజుని పావకాస్త్రమును దునుమాడయత్నించగా, నగ్నిదేవుడు మైత్రిని చూపి నీలధ్వజుని హయమేధతురగమును వదలుమని కోరెను. జ్వాల (నీలధ్వజుని భార్య) తన నాథుని యుద్ధమునకు బ్రేరేపించెను. పిమ్మట జరిగిన యుద్ధములో నీలధ్వజుడు సర్వస్వమును నోడి విరమించి, యశ్వరక్ష వ్రతమున నొక్క యేడు వెంటవచ్చుటకై సమ్మతించెను. అంతటితో, పతివ్రతా జ్వాలాదేవి పగదీర్చుకొనటకై నిశ్చయించి, కాశీ నగరమున కేగి రాజును, నిజ సోదరుడును నైన నల్మకుని నర్జును వధింప బ్రేరేపించెను. తగిన కాలమునకై, స్త్రీవి

యందుమని దెల్పిన యాతని వాక్కుతో దృప్తినొందక నిజరాజ్యమునకు వచ్చుటకై గంగానదిని దాటుచు, నదీమతల్లిని "అపుత్రక" యని నిందించెను. భీష్ముని మరణమునకు గారణమైన అర్జునుని గంగ కోపించి యారునెలలలో నర్జునుని శిరముర్విపై బడుగాక యని శపించెను. జ్వాల చితిపై బడి శరీరము విడచి బాణరూపము దాల్చెను.

ఈ కథలో "స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః" అను నీతి ప్రధానమైనది. నీలధ్వజుని కుమార్తె స్వాహాదేవి స్వయంవరణమున నగ్నిదేవుని భర్తగా గొనుట పదమూడు పద్యములలో వర్ణితము. స్త్రీ బుద్ధిని ప్రళయాంతముగ వర్ణించుటలో గవి కృతకృత్యుడయ్యెను. ఇంతియేగాక మన స్తత్వ చిత్రణమునను, నీలధ్వజుడు పశ్చాత్తప్తుడై యశ్వము నర్జునునకు దిరిగి యిచ్చుటయందును నీతడు నమ్రతాశీలియని నిరూపించుచున్నది. ఏతదుపాఖ్యానములోని గంగాశాప మర్జునుడు భవిష్యద్రణములో పడనున్నపాటును గూడ చెప్పకయే చెప్పుచున్నది. తండ్రి యను విషయము గ్రహింపక బభ్రువాహను డర్జునుని మృతినొందించుటకు గంగశాపమే కారణ మగుచున్నది. ఈ యుపాఖ్యానము భావికథాద్యోతకమై యలరారుచున్నది. ఒక నీతిని జెప్పి దానిని బలపరచుటకును నీ యుపాఖ్యానముపయోగపడిన దనుటకు నెట్టి సందేహమును నుండదు.

నాలుగవ యాశ్వాసమునందు మనకు గనబడు మరియొక వృత్తాంతము సౌబరి యాశ్రమ వృత్తాంతము. ఆ మహర్షి యుద్దాలక ముని చరిత్రము వివరించినాడు. సౌబరి యాశ్రమమున శత్రువులగు సింహంగుఋ- లేడిపిల్లలు, నెమళ్లు- పాములు, పిల్లులు- ఎలుకలు మిత్రులై వర్తించుచున్నవి. ఇది సంసారమునందలి రాగద్వేషములను సమముగా గ్రహించవలెననుటను స్పష్టమొనర్చుచున్నది. రాగ ద్వేషము లెట్లు పరస్పర శత్రువులో పైన పేర్కొనబడిన జంతువులును నట్లే పరస్పర శత్రువులు. శ్రీకృష్ణుడు, భగవద్గీతలో స్థితప్రజ్ఞుని గూర్చి తెలుపుచు, ఈ క్రింది శ్లోకమును పేర్కొనియున్నాడు

"దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మని రుచ్యతే." (2-56)

"దుఃఖమునం దెవరి మనస్సు ఖేదము నొందదో, సుఖమునం దెవరికి నాసక్తి లేదో, అనురాగము, భయము, క్రోధము నెవరికి లేవో, వానిని స్థిత ప్రజ్ఞుడగు ముని యని చెప్పుచున్నారు."

ఈ విధముగా సర్వవిషయములయందును సమాన దృక్పథమున్న పద్ధతియే సౌబరి యాశ్రమమున గలదు. ఈ యభేద దృష్టియే పరస్పర విరుద్ధములైన స్వభావముగల జంతువులలోనను గన్పట్టుచున్నది. ఆ విషయము నీ కథ చెప్పకయే చెప్పుచున్నది. ఈ గ్రంథము నందంతటను నీ వృత్తాంత మాదర్శ ప్రాయమై కాంతాసమ్మితమైనట్టి సహజనీతిబోధను జూపునట్టిదిగా నెంచనగును. వేదాంత విషయములిట స్థాలీపులాకన్యాయమున వివరింపబడినవి.

సౌబరి యాశ్రమమున నుద్దాలకముని భార్యయైన చండి శిలాకృతి నొంది యుండ నర్జును డా శిలను దాకి నిజస్వరూప మొందింపగా సత్వమును విడివడెను. ఇట్లా యాశ్రమమున నీతని కర్తవ్యము తగిన విలువను గలిగియున్నది. కావున నీ యుపాఖ్యానము పెక్కు విధములుగ నీ యుద్గ్రంథమునకు ముఖ్యాతిముఖ్యమైనది. ఉద్దాలకునకును జండికకును మనస్తత్వ వైవిధ్యము సర్వ విషయముల యందును గలదు. ఇట్లు వైవిధ్య స్వభావము గల్గి సంసారము నీదలేకయు, విడువలేకయు సతమతమగు భార్యాభర్తలు పెక్కురు మనకు గన్పట్టుచున్నారు. వారికి చండికయును, నుద్దాలకుడును ప్రతీకలు. చండికలో గల ప్రధానమైన లోపము - అతిపరుష వచనమను దుశ్శీలత. ఈ సంఘటనను వర్ణించుచు కవి యామెను 'వేపచెట్టుతో బోల్చుచు, మాధుర్య గుణ మెట్లా వృక్షమునందు మృగ్యమగునో అట్లే చండికయు దుశ్శీలతను విడచుట యసంభవమనెను. బాల్యమున నుండి యౌవనమున నడుగిడినను, వయసులో మాత్రము కానవచ్చుచు, మనస్తత్వంలో నే మాత్రమును మార్పులేకపోవుటను కవి వివరించెను. ఆ యుద్దాలకుని బాధలను జూడ నొల్లకయు, నగ్నిసాక్షిగ నుద్వాహమైన భార్యను విడువ నిచ్చగింపకయు నున్న యాతని గురువైన కౌండిన్యుడు, "చేయవలసిన కార్యము చేయవద్దనియు, చేయకూడని దానిని జేయుమనియు జెప్పవలయు"నను నుపాయము జెప్పెను. పైతృకాచరణ సమయమున నాతడు తృప్తిగా భుజించి (పొరపాటున) పార్వణమును గంగలో పడవేయు మనగా నామె దానిని పెంటపై బడవేసెను. దాని కా మహర్షి శిలాకృతిలో బడియుండ శపించి, పార్థుని రాకతో శాప

ముపసంహరింపబడుననియు శాపోపసంహారమును వివరించెను. శాపోపసంహార మగుటతో నుద్దాలకుడు పూర్వ విషయములను స్మరించి, గార్హస్థ్య ధర్మములను, దత్కారణమైన చండిని వీడి సన్యసించెను. ఇట్లుద్దాలకుని సన్యాసమునకు చండియే కారణమైనది. ''కామి గాని వాడు మోక్షగామి కాడు'' - అను వేమన పలుక్కు లిట నపవాదమగు చున్నవి.

పంచమాశ్వాసములో తురగరక్షకుడై వెడలుచున్న క్రీడి, హయమేధాశ్వ మొక సరస్సులోని నీరు త్రావి హఠాత్తుగా తురగి యగుటయు, క్రోల్పురి యగు టయును గాంచెను. తత్కారణం బేమని యడిగిన జనమేజయునికి జైమిని, ''యీ సరో మధ్యమున బూర్వము పార్వతి పరమేశ్వరునికై తప మొనర్చు చుండగా రాక్షసు డామెను జెనక యత్నించెననియు, తత్ఫలితముగా నామె శపించెననియు, సరోవర నీరము త్రావిన వారెల్ల పుంస్త్వము గోల్పోయి స్త్రీలగు చున్నారనియు'' దెలియజేసెను. అంతేగాక కృతయుగములో నొక మౌని ఈ సరోవరమున స్నానమునకై వచ్చి మహా గ్రాహముచే జిక్కి విడిపించుకొని ''యే జంతువైన నేతత్సరోవరమునందు దిగిన నది మహావ్యాఘ్ర మగు'' నని శపించె ననియు వివరించెను. పై రెండు వృత్తాంతములలో మొదటిదగు విషయలోలు పత్వము పెక్కు బాధలకు దారితీయునని వివరింపబనిలేదు. ఇదియు నీతి బోధ కమగు నుపాఖ్యానమే. కావ్య ప్రయోజనమును సాధించ నెంచిన వీర భద్రుడు మనకు గననగు నీ యుపాఖ్యానములను రచించుటలో కృతకృత్యు డైనాడు.

షష్ఠాశ్వాసమంతయు గుశలవోపాఖ్యానమై యొప్పుచున్నది. బభ్రువాహను డర్జునునితో దలపడిన రీతిని వర్ణించుచు జైమిని పై యుద్ధమును శ్రీరామునితో లవకుశులలోన గుశుడు చేసిన యట్టిదిగ నుపమించెను. మరొక కారణమేమనగా- రామకథను ఏదో విధముగ వ్రాయుట పుణ్యకార్యమగునని కవులు భావించుట. ఈ కథా ప్రస్తావనకు ఆ భావము కూడ ప్రోద్బలము కావచ్చును. రెండువందల డెబ్బదిమూడు పద్యగద్యములతో వ్రాసిన ''లవకుశోపాఖ్యానము'' సంపూర్ణ లక్షణములు గలదై యలంకృతితో గూడ విరాజిల్లుచున్నది.

"........... ఏ తదాఖ్యానమున్
వినినన్ వ్రాసి పఠించినన్ జనులకున్ సిద్ధించు నశ్రాంతమున్
ధనధాన్యాదిక పుత్రపౌత్రసుఖ నానాభోగ భాగ్యోన్నతుల్. (6-269)

క. వెలయగ సీతకథ విను ధ
న్యులు తక్కినకథలు వినఁగ నొల్లరు మదిఁ గా
కులరొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్. (6-270)

ఈ యుపాఖ్యానము సర్వ సుగుణ విశేషసముపేతము. ఇందలి గుణవిశేషము లీ గ్రంథమున సంగ్రహింపబడినవి

కవిత్రయములో నొక్కఁడును, వీరభద్రునికి దాదాపు మూడు శతాబ్దుల ముందటివాడునునగు మహాకవి తిక్కన నిర్వచనమున నుత్తర రామాయణ కథను బది యాశ్వాసములలో వ్రాసెను. ఇందలి కొన్ని ఘట్టములే వీరభద్రుని గ్రంథమున గలవు.[4]

ఈ మహాగ్రంథమున రామోపాఖ్యానము వ్రాయుట వీర రసమును నుచ్చ స్థాయిలో వర్ణించుటకు దార్కాణ మగుచున్నది. లవకుశుల వీరము సమాహార రూపమున బభ్రువాహనుని వీరముతో, శౌర్యపరాక్రమములతో నుపమింపబడి నది. శ్రీరాము డెట్లు తన కుమారుడగు కుశుని ధాటికి తట్టుకొనలేక బాధ నొందెనో, బభ్రువాహనుని శౌర్యాగ్నికి దండ్రియగు నర్జునుడు కూడ నట్లే ఓర్చు కొనలేకుండెను. ఈ గుణవిశేషమును బట్టియే రామోపాఖ్యానము ప్రమాణముగా నిచట గ్రహించబడినది.

మరొక విషయము- అపవాదు నాధారముగా జేసికొని శ్రీరాముడు, సీత నడవికి పంపుట. శ్రీ మహాలక్ష్మి స్వరూపిణి యగు సీత శీలమును రజకుడు విమర్శించుట, శ్రీరాముని దృష్టిలో బాధయే. కాని నిరపరాధి యగు సీతను ధర్మము కొరకు మాత్రమే విడచిపుచ్చెను. తమ్ములతో శ్రీరాముడు పల్కిన పల్కులివి :

"మంగళచరిత్ర యగు సీ
తాంగన నపవాదభీతుఁ డగు నాథుఁ ద్యజిం
పంగ నగు నేడు దుష్టభు
జంగము తన ప్రాత కుప్పసం బూడ్చుగతిన్". (6-42)

సీత మంగళచరిత్ర యగునని శ్రీరామునికి దెలియును. అయినను నాతడు ధర్మదృష్టిని వీడలేదు. కావుననే "రామో విగ్రహవాన్ ధర్మః" అను వాక్య వచ్చినది. అందువలన నాత డపవాదభీతిచే రాజ్యమునైనను, పుత్రులనైనను, దేహమైనను గణుతింపననియు, వానిని తృణముగ నెంతుననియు బల్కెను. మానసిక చిత్రణమునను, ధర్మాధర్మ నిర్ణయమునందునను శ్రీరాముని శీలము లోకమున కాదర్శప్రాయము. ఏకపక్ష నిర్ణయమైనను నాతడు ధర్మము త్యజించ లేదు. సోదరులును, రాముని యాజ్ఞను నెరవేర్చిరి. ఇదియు లోకాదర్శ విషయమే. సీతయును దన జీవితమున నపవాదును బొందుటకన్న మరణమే మేలని భావించినది.

శ్రీరాముని పౌరుషమునే తాను గర్భమున ధరించినది. లవకుశులను గని విద్యాబుద్ధుల గరపి విలువిద్యలో మేటియగు శ్రీరామునే యుద్ధమున నోడింప జేసినది. ఈ ఘట్టములో సీత పౌరుష ప్రధానమైన పాత్రను వహించినది. మానమే స్త్రీలకు ప్రధానమను నంశము లోకమునకు సీతాదేవి యాదర్శపూర్వక ముగ చాటియున్నది. నేడును నాదర్శ దంపతులకు సీతారాములే ప్రమాణము.

ఈ యుపాఖ్యానము ప్రధాన జైమిని భారత కథతో పరోక్ష సంబంధము గల్గియున్నది. నీతిని ప్రతిపాదించి, దానిని పుష్టి యొనర్చుటకే కథ తగినదై యున్నది. బభ్రువాహన వృత్తాంతమును, యుద్ధరీతిని వివరించ వలయునన్న 'లవకుశోపాఖ్యానము' మిగుల రసవత్తరముగ వ్రాయవలెనని జైమినియు, వీర భద్రుడును గ్రహించినారు. ఇది సోదాహరణమైనది. వైదిక సంబంధమైన శ్రీరాముని మహిమను చాటుటకే యుపాఖ్యానము వ్రాయబడినది. ఇందెట్టి అనౌ చిత్యమును గానరాదు. ఈ కథ యత్యంతావశ్యకమై, చక్కని యుత్కంఠను గల్గించుచు, మణిమాలలోని మధ్యమణివలె నీ గ్రంథరాజమున స్పష్టమైన పాత్రను ప్రవేశ పెట్టుచున్నది.

వీరవర్మకు యము డిల్లటపు టల్లుడైన విధమును జెప్పునట్టిది చివరి యాశ్వాసములోని మొదటి యుపాఖ్యానము. సప్తమాశ్వాసములో యాగతురగము మహావిష్ణు భక్తుడగు మయూరధ్వజుని వారి నుండి శ్రీకృష్ణ మాహాత్మ్యమున బయల్వెడలి సారస్వత పురమునందలి వీరవర్మ రాజ్యమునకు వచ్చినది. వీరవర్మ ధర్మవర్తనుడు. సుమాలిని యాతని దుహిత. యము డామె నుద్వాహమై మామ కండగా నుండెను. సవనాశ్వము నా వీరవర్మ చేజిక్కించుకొని, శ్రీకృష్ణార్జునులతో సమముగ యుద్ధము సాగించెను. సార్థక నామధేయుడైన వీరవర్మ వారి నుక్కిరిబిక్కిరి గావించి, చివరకు కిరీటితో మైత్రి వహించెను.

మహాభక్తుడు, ధర్మ వర్తనుడైన వీరవర్మ వృత్తాంత మీ యుపాఖ్యాన రూపమున ముప్పది మూడు పద్యములలో రచింపబడినది. మహాభక్తుడై, ఋజుమార్గగామి యైనపుడు శ్రీహరియు నాతని నేమియు జేయజాలడను సత్యము నీ కథ అభివ్యక్తము గావించుచున్నది. యాదృచ్ఛికముగా వచ్చిన (భక్తులమధ్య) వైరమును సమసిపోవునట్లు చేయుట శ్రీకృష్ణుని విధి. దాని నాతడు నిర్వర్తించెను. ప్రధాన జైమిని భారత కథనమున కిది యెంతయు దోడ్పడుటయే గాక గ్రంథాది నుండి సర్వత్ర కననగు భక్తిని ప్రేరేచుట కుపయోగించుచున్నది.

ఈ గ్రంథములో చిట్టచివరి యుపాఖ్యానము చంద్రహాసోపాఖ్యానము. నారదుడీ కథను విజయునకు వినిపించును. చంద్రహాసుడు భక్తాగ్రేసరుడు. జ్ఞాన తపోవయోవృద్ధుడు. రాజ్య కాంక్షచే దుష్టబుద్ధి పన్నిన ఉపాయము లన్నియు నాతనికి నపాయములు కాలేదు. శ్రీ మహావిష్ణు భక్తులకు నపకారము జేసిన వారెల్లరు నిట్టే పెక్కు బాధలతో నశింతురను నీతియే ఈ భాగమున ప్రధానాంశము. గ్రంథాంతమున దిరుగులేక వర్ణితమైన భక్త్యుద్రేకమునకు జంద్రహాసుడు ప్రతీక. ఇంద్రసుతుని జూచి కృష్ణుడు చంద్రహాస శీలమును దెలుపుచు—

"చంద్రహాసునిఁ బరమ వైష్ణవునిఁ జూడు"
"వీఁడు జ్ఞాన తపోవయోవృద్ధు గాని
క్రూర సమరాంగణమునఁ దారుణ్యతనుఁడు" (8-129) జై.భా.

అని పేర్కొనినాడు. ఈ విధముగ తొంబది పద్యములలో నీ మహాభక్తుని కథను సంస్కృతమున జైమిని మహర్షి తన భారతములోనను, తెలుగున వీర భద్రుడు తదనువాద గ్రంథమునను రచించినారు. చంద్రహాసోపాఖ్యానము చివర

"ఈ కథ విన్న మర్త్యుల కభీష్టచయ ప్రదమంచు జెప్పి" (8-128) అని ఫలశ్రుతిని గూడ చెప్పి కథా ప్రాముఖ్యమును ద్విగుణీకృతము గావించెను.

అదృష్టవంతుని జెరచువారును, దురదృష్టవంతుని బాగుపరచువారును లేరను నీతిని ప్రతిపాదించి, దానిని బుష్టిచేయుటకు ఈ కథ వివరించబడినది. ఈ భాగము ప్రధాన కథతో ప్రత్యక్ష సంబంధము గల్గినది. ఈ గ్రంథమునందు కథలన్నియును పౌరాణిక భక్తిని గొనసాగించుచు, భక్తివీరమును, దానికి గల ప్రాముఖ్యమును జాటుచున్నవి. భక్తులందరును వీరులై, భక్తివీరమునకు కడుంగడు నాశ్రయమిచ్చిరి. కథా కథనమున నెచటను రసదృష్టి కుంటు వడలేదు. ధర్మజుని యాగ నిర్వహణమున కీ యుపాఖ్యాన సప్తకము అవినా భావసంబంధము గల్గియున్నది. ధర్మజుడు, కురుక్షేత్ర యుద్ధమున నెట్లు ధర్మ వీరమును బ్రదర్శించినాడో, అట్లే జైమిని భారతమున దానిని బ్రదర్శించినాడు. పాప నిర్వృతికై యాగము చేయుట ధర్మవీరమునకు నిదర్శనము. పాండవమధ్య ముడు దీనికి నాలంబనమైనాడు. ఈ విధముగ సంస్కృతవాఙ్మయమున జైమినియు, ఆంధ్రవాఙ్మయమున వీరభద్రుడును భక్తివీరము నాధారముగా ధర్మసంస్థాపనము గావించినారు. స్థాలీపులాకన్యాయమున జిన్నకథలను, కొన్ని మరికొంత పెద్ద కథలను జెప్పిన నీ కవి "ఉపాఖ్యానశిల్పము" ను బహునైపుణ్యముతో బ్రద ర్శించియున్నాడు. గ్రంథమునందలి భాగమేదియును పెంచుట కుద్దేశించినట్లు గానవచ్చుటలేదు. ఈ యుపాఖ్యాన సప్తకము, ఆకసమునందలి నక్షత్ర సప్త కమువలె భాసిల్లుచున్నది. ఈ యుపాఖ్యానములు- ఏదో మాహాత్మ్యమును గల్గి, పాత్రలచిత్రణ ప్రధానకథకు బ్రాణసదృశమై యొప్పుచున్నవి. ఈ మహద్గ్రంథ మున కథాశిల్పమునకును, నుపాఖ్యానశిల్పమునకును నవినాభావసంబంధము గలదు. ఈ రెండును బరస్పరాశ్రితములు. అందుచే ప్రధానేతివృత్తమును, తత్ప్రాధాన్యమును నుపాఖ్యాన రూపమున భాసిల్లుచున్నవి.

## అశ్వమేధ పర్వము - తెనుగు భారతము - జైమిని భారతము

కవిత్రయమువారి ఆంధ్రమహాభారతములో అశ్వమేధ పర్వమున నాలుగాశ్వాసములు గలవు. ఇందు ప్రథమ ఆశ్వాసములోని పద్యగద్యములు (233) రెండు వందల ముప్పది మూడును, రెండవ ఆశ్వాసములో (228) రెండువందల యిరువది యెనిమిదియును, మూడవ ఆశ్వాసములో కూడ (228) రెండు వందల యిరువది యెనిమిదియును, నాలుగవ యాశ్వాసములో (287) రెండువందల యెనుబది యేడును గలవు. ఈ నాలుగాశ్వాసములలోని పద్యగద్యముల సంఖ్య యంతయును వెరశి తొమ్మిది వందల డెబ్బది యారు (976)గా గన్పట్టుచున్నది.

పై జెప్పిన యట్లే పిల్లలమఱ్ఱి పినవీరన జైమిని భారతములో కూడ అశ్వమేధపర్వము గలదు. ఈ విధముగా గన్పట్టుచున్న అశ్వమేధపర్వములో నెనిమిది ఆశ్వాసములలో నీ కథ గలదు. ఆ యాశ్వాసము లన్నిటను గలసి (1474) పదునాలుగు వందల డెబ్బది నాలుగు గద్యపద్యములు గలవు.

ఈ విధముగా నాలోచించినచో, వ్యాసకృతమును, తిక్కన యనువాదమును నగు భారతాశ్వమేధ పర్వములోనను, పినవీరన యశ్వమేధ పర్వమునను కథాప్రారంభము దాదాపు సమముగనే గన్పట్టుచున్నది. అనగా యుద్ధానంతరము విచారించుచు, మరణించిన వారిని గూర్చి ధర్మరాజు చింతించుచుండ, వ్యాస శ్రీకృష్ణులు ప్రబోధించి యూరడించుచుండిరి. కాగా, వారు ధర్మరాజును అశ్వమేధయాగము చేయ ప్రోత్సహించిరి. రాజ్యమును వీడి కాననములకు నేగుటకు సిద్ధమైన ధర్మరాజును నశ్వమేధయాగము సేయుటకు ప్రోత్సహించిన వ్యాసునితో వలయు ధనమెచట నున్నదని ధర్మరాజు ప్రశ్నింప, మరుత్తుని చరిత్రమును జెప్పి, హిమగిరి ప్రాంతములో పెక్కు వైభవములు గలవు, కాన వానిని గైకొని యాగమును గొనసాగించుమని వారు పల్కుటయు రెండు గ్రంథములలో గానవచ్చును.

ఆ పిమ్మట తిక్కన భారతాశ్వమేధ పర్వములో, సంవర్తుడు, మరుత్తుని యజ్ఞమున కుపద్రష్ట యగుటయు అగ్ని దేవు డింద్రసందేశము మరుత్తున కెరింగించుటయు, యాగంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుటయు, డెబ్బది పద్యములలో కానవచ్చుచున్నవి. ఈ విషయములు పీరభద్రుని జైమిని భారతమున లేవు.

పిదప శ్రీకృష్ణుడు ధర్మజాజునకు మనస్తాపోపశమనంబు చేయుటతో అశ్వమేధ పర్వములోని తక్కిన కథ కొనసాగుచున్నది. ఇందు కొంత వేదాంతాది బోధయు, శరీర గుణములును కాననగుచున్నవి. అంతటితో నాగక వ్యాస కృత భారతాశ్వమేధపర్వమున, శ్రీకృష్ణు డర్జునునకు తత్త్వజ్ఞాన స్థిరీకరణము చేయుటయు, శ్లేష్మాది రోగవికారములును, తత్త్వజ్ఞాన విశేషప్రదర్శనమును, ప్రథమాశ్వాసము చివరివరకును వివర్ణింపబడినవి. ఈ విషయములన్నియు పీరభద్రుని జైమినీయ అశ్వమేధమున లేవు.

ద్వితీయాశ్వాసము బ్రాహ్మణగీతలతో ప్రారంభమై అంతర్యాగ ప్రకారంబు, ఇంద్రియ మనః పరస్పర సంవాదప్రకారము, జీవాత్మ స్వరూప నిరూపణ ప్రకారము, జనక-యమ సంవాదము, మనోబుద్ధ్యహంకారాది తత్వ ప్రకారము, అవ్యక్తనామ తత్వనిరూపణ ప్రకారము, సత్త్వం బవశ్యానుష్ఠేయ మగుట నిరూపించుట, ద్వితీయాశ్వాసము నందలి పద్యగద్యము లన్నింటియందును వివరింపబడినవి.

ఇంతవరకును పై జెప్పబడిన ద్వితీయాశ్వాసములోని విషయము లెవ్వియును పీరభద్రుని యశ్వమేధపర్వమునందు కానవచ్చుట లేదు

ఇవన్నియును జెప్పిన పిమ్మట తాను ద్వారక కరుగవలయునని శ్రీకృష్ణ డడుగుటయే రెండు గ్రంథములలో కాననగును.

ఈ సందర్భమున గల ముఖ్య విషయములలో నొకటి యేమనగా అచ్చటచ్చట కనబడుచున్న ధృతరాష్ట్రి ప్రస్తావన యే మాత్రమును జైమినీయ అశ్వమేధమున లేదు. ఇది గమనీయార్హము.

ఉదంకాశ్రమమునకు శ్రీకృష్ణుడు వెళ్ళుట, ఉదంకునకు దన విశ్వరూపమును జూపుట, ఉదంకుని చరిత్రము, కుండలము లిచ్చి ఉదంకు డహల్యను సంతోషపెట్టుటయు వంద పద్యములలో తిక్కన వర్ణింపగా నివి జైమినీయము లోనను, పీరభద్రానువాదముననను పరిహరింపబడినవి.

ఆ పిమ్మట వ్యాసుడు పాండవుల నశ్వమేధ యాగోన్ముఖుల జేయును. ఈ విషయము భారతములో నశ్వమేధపర్వములో తృతీయాశ్వాసము సగము

కథ జరిగిన పిమ్మటయే. శ్రీకృష్ణ, వ్యాసాదులచే హయమేధ సంరంభము జాగృతము అంతవరకును గాలేదు జైమినీయాశ్వమేధములో నశ్వమేధపర్వ మున కిచ్చిన ప్రాధాన్యము వ్యాసాశ్వమేధమున నశ్వమేధ పర్వమున కీయబడ లేదనుట తెలియుచున్నది.

అంతియే కాదు. తృతీయాశ్వాసపు చివరి భాగములో బరీక్షిత్తును బ్రతికించుటయు శ్రీకృష్ణుని చేతనే గావించబడినది - దీనికి గారణము కుంతీ సుభద్రల ప్రార్థనమే- అన్నియును సిద్ధమై హయమేధ యాగము ప్రారంభ మగుటకు ముందు జరిగిన పని యిది.

ఆ పిమ్మట వ్యాసుని రాకయు, నశ్వమేధము ప్రారంభమగుటయు జరుగును. అశ్వము ధర్మజునిచే విడువబోవు సమయమున గాంధారీ ధృత రాష్ట్రుల యనుజ్ఞ నాతడు గైకొనినట్లును జెప్పబడినది. కాని ఈ విషయము జైమినీ యాశ్వమేధమగు ననువాదములో లేదు పరిహరింపబడినది.

స్థూలముగ నాలోచించినచో చతుర్థాశ్వాసములో మాత్రమే వ్యాసభారతము లోని యశ్వమేధ కథ ఉటంకింపబడినది

హయము వెంట రక్షణకై వెళ్ళిన పాండవ మధ్యముడు త్రిగర్త దేశాధీశు లతో, సింధు దేశాధిపతులతో, బభ్రువాహనునితో బోరుటయు, సంజీవనీ మణిచే బ్రతికింపబడుటయు, పిమ్మట మేఘసంధి యను జరాసంధ పౌత్రుని యుద్ధమున నోడించుటయు, నట్లే మగధ, వంగ, పుండ్ర, మ్లేచ్ఛ, చేది, గాంధార దేశాధీశుల జయించుటయు నూటయేబది పద్యములలో వర్ణింపబడినది.

తిరిగి హస్తినాపురమునకు వచ్చునెడ శ్రీకృష్ణు డాతని రాక నెరింగించెను.

ఈ విషయ మంతయు జరిగిన పిమ్మట సత్త్రప్రస్తుని కథయు జెప్పబడి నది. అనగా పై విషయములలోని నూట యేబది పద్యములలోని కథయే నూతన విషయములు జేర్పబడి జైమిని కృతమైనది. ఈ చేర్పులు వీరభద్రునివి కావు- అని సంస్కృత జైమిని భారతము చెప్పుచున్నది. ఇట్టి జైమినీయమునుండి, వ్యాసాశ్వమేధము బరిహరించినచో, తెలుగులో పదునొకండు వందల గద్య పద్యములతో నైదాశ్వాసముల కథ యగుచున్నది

పరిమాణమును బట్టి చూచిన ఉపాఖ్యానములు ప్రధాన కథను మించి యున్నవా?

ఇతిహాసములను గూర్చి Aristotle చెప్పిన విషయములను Beeching ఈ విధముగా సంగ్రహీకరణ మొనర్చెను.[6]

"The fable or theme of an Epic must have dignity It must represent great actions and involve great issues. Also it must be single and entire: not like a chronicle whose events have no real connection with each other."

ఈ విషయమును బట్టి పరిశీలించినచో, ప్రధానకథకు ఈ గ్రంథములోని ఉపాఖ్యానములతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధమున్నట్లు తోచక మానదు. ఈ గ్రంథములోని లోకయాత్ర, యుద్ధములు పూర్తియైన పిమ్మటనే ప్రధాన సమస్య పరిష్కారమగుచున్నది ఆ కారణమున పరిమాణమును బట్టి చూచిన, ఉపాఖ్యానములు ప్రధాన కథను మించియున్నను, కవి కల్పిత కథాకథన శిల్పమును పోషించుట కేర్పడినట్లు గ్రహింపవలసియున్నది.

ఇట్లు ఉపాఖ్యానములు ప్రతిపాదించుటలో కవి సాధించిన ప్రయోజనములు:

(1) కథాకథన శిల్పమునందలి అంతస్సంబంధము.

(2) ఒక్కొక్క ఉపాఖ్యానమునందును నొక్కొక్క నీతిని ప్రతిపాదించుట

(3) ఉపాఖ్యాన రచనను ప్రదర్శించుటలో ఒకచో సంక్షిప్తము మరొక్కచో, విపులము.

(4) కథయొక్క అవసరమును బట్టి దాని స్వభావమును, పరిమాణమును కవి నిర్ణయించుకొనుట

(5) ఇవి ప్రధానకథ కడ్డురాకుండుట.

(6) విష్ణుమాహాత్మ్యమును ప్రపంచించి చాటుటకు ఉపాఖ్యానము లాధారముగా గైకొనుట.

(7) ప్రధానకథను సంక్షిప్త మొనర్చుట - కవి భావించిన భావయిత్రీ శక్తి గ్రంథమునకు గల్గుట.

(8) రస ప్రధానమైన రచన గావించుటకు పెక్కు సంఘటన లవసర మగుట. ఇది రసప్రధానమైన రచనమగుట నీతడు సప్తవిధకవులలో మార్దవకవి యగుట.

(9) రసము, నీతి, మాహాత్మ్యము- మున్నగునవి విడదీయరాని అనుబంధమును గల్గియుండుట.

ఇన్ని విధములుగా విషయ విభాగము జరిగిన పిమ్మట జైమిని తన గ్రంథమును బహుళార్థకము గావించుటచే, వీరభద్రుడు కూడ దాని ననువదించుటలో నదే ప్రయోజనమును బొందెనని తెలియుచున్నది.

1. Critical Edition of Andhra Mahabharata by Telugu Department. Osmania University.
   పీఠిక - పుట 2 (అనుశాసనిక పర్వము)
2. పుట 188 ''పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు'' సమీక్షాత్మక గ్రంథము - డా॥ జి వి. సుబ్రహ్మణ్యము
3. పుట 189- ,, ,,
4. ఈ సందర్భమును ''ఉత్తరరామాయణ'' విమర్శనమున వివరించియున్నాను.
5. షోడశోధ్యాయము - ఉద్దాలకముని చరిత్రము
   హంసధ్వజ వృత్తాంతము - 17, 18, 19, 20, 21, అధ్యా
   ప్రమీల వృత్తాంతము - 22 అధ్యాయము
   కుశలవోపాఖ్యానము - 25 నుండి 36 అధ్యాయముల వరకు
   తామ్రధ్వజ, మయూరధ్వజ వృత్తాంతము 41 నుండి 46 అధ్యా
   వీరవర్మ వృత్తాంతము - 47, 48, 49 అధ్యాయములు
   చంద్రహాసోపాఖ్యానము - 50 నుండి 60 అధ్యా వరకు
   ఈ విషయములు సంస్కృత జైమిని భారతమునందే గలవు
6. పుట 81 "The adventure of Criticism" [1941]
   Prof. K.R. Srinivasa Iyengar: "Literary forms: Epic."

## వాసుదేవుని ప్రాచీన చరిత్రము[1]

బెస్‌నగర శాసనము వాసుదేవుని చరిత్రమును ముందుగా తెలుపుచున్నది. అచట రాజపుత్రస్థానములోని 'ఘసౌండి' యను చోట శిథిలావస్థలోని గోడపై వాసుదేవుని యొక్కయు, బలదేవుని యొక్కయు పూజాస్థానమునకు ఈ గోడ కట్టబడినదని తెలియుచున్నది ఈ మధ్య కనుగొనబడిన పై శాసనములో Heliodorus అనునొక యవన రాయబారి ఒక స్తంభమును తాను వాసుదేవుని గౌరవించుటకై స్థాపించితిననియు, ఆ ధ్వజము శ్రీ వాసుదేవుని పూజించుట కేర్పాటు చేసితిననియు తెల్పుకొనెను.

పాణిని మహర్షి తన వ్యాకరణ సూత్రములలో 'వాసుదేవార్జునాభ్యాం వుణ్' (4-3-98) అని సూత్రించినాడు. అట వాసుదేవుని భజించువాడు వాసుదేవకుం డనబడునని దాని యర్థము. ఈ సూత్రమునకు వెనుక "భక్తి" అని సూత్రించినాడు. వాసుదేవః భక్తిరస్య – వాసుదేవకః అని యేర్పడును. "ఋష్యంధక వృష్ణి కురుభ్యశ్చ" అని కూడ గలదు. దీనినిబట్టి వాసుదేవుడు వృష్ణి వంశములోని వాడని తెలియును.

శ్రీ మహాభారతములోని శాన్తిపర్వములో వాసుదేవుని గూర్చి బహుళముగా చెప్పబడినది. అట్లే శ్రీమద్రామాయణ బాలకాండములో 40 వ సర్గములో 'వాసుదేవ' శబ్దము- ఆయనను దేవదేవునిగను, సకల ప్రామాణికులగు ఆస్తికుల కత్యాదరణీయుడుగను తెలుపుచున్నది.

వసతి-దీవ్యతి. వాసయతి-దీవ్యతి-అను నుత్పత్తులు-అంతటనుండువాడు, అంతయు నితనియం దాధారపడి యుండునని తెలుపుచున్నవి (సర్వత్రాసౌ వసతి-సమస్తంచ వసత్యత్ర). దేవ- అను పదమునకు వెలుగొందువాడు-'దివ్'-ధాతువునకు-క్రీడ, విజిగీష, వ్యవహారము, ద్యుతి, స్తుతి, మోదము, మదము, స్వప్నము, కాన్తి, గతి అని యర్థములున్నవి.

భాగవతములో పోతన వాసుదేవపరతత్త్వమును చెప్పినాడు. "జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము-తేజస్సు"- అను నారు గుణములతో ఈ తత్త్వము నిండియున్నది.

## భాగవతములో చెప్పబడిన విష్ణ్వవతారములు[2]

అవతారములు దశావతారములనియు నేకవింశత్యవతారములనియు, మన్వంతరావతారములనియు భాగవతమున గీర్తింపబడినవి. శ్రీమహావిష్ణువు ఏకవింశత్యవతారములు భాగవత ప్రథమ స్కంధములో పేర్కొనబడినవి. అవి ఈ క్రిందివి:

1. ఆదిపురుషరూపము (అఖండ బ్రహ్మచర్యము)
2. వరాహదేహంబున రెండవ యవతారము.
3. నారదుడను దేవర్షి.
4. నరనారాయణావతారము.
5. కపిలుడను సిద్ధుడు.
6. దత్తాత్రేయుడు.
7. యజ్ఞుడు
8. ఉరుక్రముడు
9. పృథుచక్రవర్తి.
10. మీనావతారము
11. కమఠావతారము.
12. ధన్వంతరి.
13. మోహినీరూపము.
14. నరసింహావతారము.
15. వామనావతారము.
16. పరశురామావతారము.
17. వ్యాసావతారము.
18. రామావతారము.
19. బలరామావతారము.
20. కృష్ణావతారము.
21. బుద్ధావతారము [3]

### శ్రీ వేదాళ వారు తెలిపిన అవతారములు

1. బ్రహ్మ మానస పుత్రులు ఏకరూపమున చెప్పబడిన యవతారము.
2. ధ్రువావతారము (ఉత్తానపాదుని కుమారుడు)
3. హయగ్రీవావతారము.
5. హంసావతారము
4. కల్కి అవతారము[4]

### దశావతారములు

సర్వసాధారణముగా ఈ దశావతారములు శ్రీ మహావిష్ణువును గూర్చి తెలుపుచునుండు దైవాంశలందురు కాని కొందరు మానవ శరీర నిర్మాణ సంబంధియైనట్లును తెలుపుచున్నారు.

### దశావతారములు – మానవ జీవితము[5]

**మత్స్యావతారము:–** బృహదారణ్యకమును (ఈ గ్రంథరచయితయు) వేదాంతియగు థేల్స్ (6 వ శతాబ్ది); సృష్టి ప్రారంభము జలమయమని తెల్పినారు. దీనినిబట్టి ప్రాణికోటికి నాధారము జలమే యని చెప్పబడినది. కావుననే ప్రప్రథమమున మత్స్యావతారము నీటిజంతువైనది. మత్స్యమునకు శరీరమున్నను నవయవములు స్పష్టములు గావు. ఇట్టి వానిని Vertebrata అనియందురు.

**కూర్మావతారము –** ఈ యవతారములో కూర్మము నీటిపైనను, నేలపైనను కూడ పయనించగల జంతువు శరీరము ఖరువై స్పష్టాస్పష్టమైన అవయవములతో నీటిలో వేగముగను, భూమిపై నెమ్మదిగను వెళ్లగల జంతువుగా నిర్మించబడినది. ఆంగ్లమున దీనిని Amphibica అందురు.

**వరాహావతారము :** ఈ యవతార నిర్మాణములో వరాహము స్పష్టమైన అవయవ నిర్మాణము గల్గినదై భూచరమయ్యెను, జలమునిన నత్యంత ప్రీతిపాత్రముగ నెంచిన జంతువగుచున్నది. ఈ యవతారమునుబట్టి (జీవితము) ప్రారంభస్థితిలో జలగత నిర్మితమయ్యెను, తదుపరి దశలో భూమిపైననే జీవించగల దశను క్రమబద్ధము చేసికొనుననుటగా గన్పట్టును. దీనిని ఆంగ్లమున Mammal అందురు.

నరసింహావతారము : ఇందు మానవుడు, సింహము కలసినట్టి రూప మున్నది. సింహము మృగరాజు. ఇది జంతువులలో శ్రేష్ఠమైనది. మానవుడు ప్రాణికోటిలో శ్రేష్ఠమైన జీవి సింహము శిరోభాగమగుటచే ఈ యవతారము నందు మృగలక్షణమే ప్రధానము.

వామనావతారము : ఇది యాంగ్లమున under - developed body అని పేర్కొనబడినది. ఇది సంపూర్ణ మానవావతారమే. కాని హ్రస్వా కృతి. శారీరకమగు హ్రస్వత కనబడినను, వామనుడు బుద్ధిలో బృహస్పతి. పొట్టివారు పుట్టెడు బుద్ధులు గల్గియుందురనుట కిది నిదర్శనము.

పరశురామావతారము "పరశు" అనగా గొడ్డలి. గొడ్డలిని ధరించిన మానవుని ప్రకృతి క్రూరాత్మకమని వేరుగా జెప్ప నవసరము లేదు. దయాధర్మము లీతనిలో మృగ్యము. తనకున్న ఆయుధము పదనుగా నుండుటయే ఈ వ్యక్తికి గల పరమాశయము (ధర్మము). ప్రతీకార చర్యకు ప్రతిరూపమే ఈ యవతార నిర్మాణమున నుద్దేశ్యము ఆయుధగతమైన విజయమే పరమావధి.

రామావతారము : రామావతారము సంపూర్ణ మానవావతారము సర్వమానవులకు గమనీయ రూపము. కమ్మని యవతారము బాధ, త్యాగమే మానవ రూపమున మహత్కార్యము. దైహికముగా తానెన్ని బాధలు పడినను ఇతరులకై చూపు త్యాగము సర్వోత్కృష్టముగా నెంచిన వ్యక్తి. విధి నిర్వహణ మిట నంతిమ లక్ష్యము. తజ్జనితమైన యానందము సాధించుటకై కష్టపరంపర నెదుర్కొనుట ఈ యవతారములోని యాదర్శము. ఇది యంశావతారముగ చెప్పబడి, మహనీయ మానవుని లక్షణముల సూచించుచున్నది.

శ్రీకృష్ణావతారము : విధి నిర్వహణమే ఈ యవతార ప్రధాన లక్షణమైనను, వివేచన, ఉపాయశీలత్వము, కష్టముల నెదుర్కొనుటయు, అలంబన లక్షణములు. ఇవన్నియును ధర్మోపయుక్తములు. విశ్వమున నెట్టి విషయములకును నంటియు నంటక నుండు యోగియే సుఖజీవియనుట చెప్పుటయే చెప్పుచున్నది

**బుద్ధావతారము :** ఇది వైరాగ్య ప్రధానమైన యవతారము. "కామి గానివాడు మోక్షగామిగాడు" అను వేమన సూక్తి ఈ యవతారములోని ప్రధానాంశము. సంసారజీవిత మనుభవించుచు, వ్యామోహము లేక నిర్వాణమే సర్వోత్కృష్టమైనట్లు గ్రహించుటయే చరమలక్ష్యమను నంశమిట ప్రధానము. సుఖములెన్ని యున్నను, కష్టపరంపర తప్పదనియు, సర్వసంగ పరిత్యాగమే తుది లక్ష్యమని చాటు నవతారమిది భూతదయ, శాంతి ప్రధాన గుణములు.

**కల్కి అవతారము :** ఆకలి, నిరుత్సాహము, అసంతృప్తి ప్రధాన లక్షణములు. కలియుగాంతమున సర్వనాశనము జరుగుననుట - ఇది క్రమానుగతమనుట - ఈ యవతారమునందలి తాత్పర్యము.

## దేశీయ భాషలలో కృష్ణభక్తి గ్రంథములు

**ఉత్తర భారత భాషలు.** ఈనాటి ఉత్తర భారత భాషలలో హిందీ సాహిత్యము - జనసంఖ్య, వైశాల్యము దృష్ట్యా - ప్రముఖ స్థానము వహించుచున్నది. హిందీ భాషలో గల కృష్ణభక్తి గ్రంథములు విస్తృతములు. అంతేగాక, ఈ భాషలో రాధా మాధవ సంప్రదాయము (Radha Madhava Cult) చెప్పుకొనదగినట్లున్నది. ఈ సంప్రదాయము చైతన్య ప్రభువుతో ప్రారంభమైనదని చెప్పుదురు.

### హిందీ సాహిత్యములో కృష్ణకావ్య వికాసము[6]:

హిందీ సాహిత్యము స్థూలముగా 1000 నుండి 1400 A D. వరకు, 1400 నుండి 1700 వరకు భక్తి వాఙ్మయ శాఖ పేరను, (ఇదియే స్వర్ణ యుగము) 1700-1900 A D వరకు రీతి వాఙ్మయ శాఖ పేరను ప్రవర్తిల్లుచున్నది.

ఈ కృష్ణ కావ్య వికాసము 14 వ శతాబ్ది నుండియే ప్రారంభమైనది. కాని ఈ శాఖ నాలుగు శాఖలుగా చెప్పబడినది: (1) మాధ్వ సంప్రదాయము (మధ్వాచార్య). (2) విష్ణు సంప్రదాయము (విష్ణుస్వామి దీనికి ప్రారంభకుల; మధ్వాచార్య మతానుయాయి) (3) నింబార్క సంప్రదాయము (నింబార్కుడు ప్రవక్త). (4) వల్లభ సంప్రదాయము (వల్లభుడు ప్రవక్త); ఈ వల్లభ సంప్రదాయమున ప్రేమమూలకమైన మధురభక్తి ప్రధాన లక్షణమైనది.

హిందీలో ప్రథమ కృష్ణభక్తి కవి విద్యాపతి- ఈయన 'పదావళి' వ్రాసి నాడు. ఈయన తరువాత 'అష్టఛాప్' అను పేరుతో నెనిమిది మంది కవులు విల సిల్లిరి. భక్తి, సంగీత కావ్య విలక్షణ సమ్మిశ్రణమే కృష్ణకావ్య విశేషము. పుష్టిమార్గము కృష్ణభక్తి ప్రతిపాదితమైన వల్లభ సంప్రదాయముగా పేర్కొన బడినది. అట్టి పుష్టి మార్గములో 'అష్టఛాప్' అను కవులు సుప్రసిద్ధులు. కృష్ణ భక్తి శాఖా కావ్యము అన్నియు దాదాపు ముక్తకములలోనే వ్రాయబడి యున్నవి.

ప్రధానముగా ఈ సంప్రదాయము మహాప్రభు వల్లభాచార్యుని (1585 - 1587) చే ప్రచారితమైనది. వల్లభాచార్యుని పిమ్మట, ఈయన పుత్రుడగు శ్రీ గోసాయి విఠల్‌దాస్‌జీ ప్రచారము చేసియున్నాడు. ఈయన తరువాత వచ్చినవారే 'అష్టచాప్' కవులు[7]. ఇందు మొదటి నలుగురు వల్లభాచార్య శిష్యులు గను, తదుపరి నల్వురు గోసాయి విఠల్‌దాస్‌జీ శిష్యులుగను తెలియబడు చున్నారు.

(1) సూరదాస్ - సూరసాగర్.
(2) కుంభనదాస్ - 500 పదములు.
(3) పరమానందదాస్ - పరమానంద సాగర్
(4) కృష్ణదాస్ - భ్రమరగీత, ప్రేమరసరాస్ జుగుల్మాన్ చరిత్ర, వైష్ణవవందన్ భక్తమాలటీక, భాగవత భాషాను వాద.
5. గోవిందస్వామి - అశ్లీలములేని భక్తి గల పదములు లభించినవి.
6. ఛీతస్వామి - — do —
7. చతుర్భుజదాస్ - — do —
8. నందదాస్ — 1. రాస పంచాధ్యాయి.
2. రూపమంజరి.
3. విరహమంజరి(భాగవతము 10వ స్కంధము).
4. భ్రమర గీత.
5. రసమంజరి.

ఈ కవుల తరువాత మీరాబాయి-పదములు, భజనలు వ్రాసిన-సుప్రసిద్ధ భక్తురాలు. ఈమె గీతములు సంగీత ప్రధానములు. విరహజనిత మధురవేదన

ఈమె భక్తిలో ప్రధాన గుణము. గోపికల ద్వారా తన హృదయగత విరహవేదన-అన్యాపదేశ, ఆత్మాశ్రయ కవిత్వముగా భావించనగును. సాహిత్యముగా కూడ మీరాబాయి భజనలకు ప్రాముఖ్య మున్నది. ఈమె భక్తి మధురభక్తి సిద్ధాంతమే యగుచున్నది.

ఇక రీతికాలములో ( 17-18 శతాబ్దులలో ) మహమ్మదీయ రాజ్య స్థాపనానంతరము హిందూరాజులు భోగలాలసులైరి. వారి నాశ్రయించిన కవులు కూడా రాజుల కనుగుణముగా రాధాకృష్ణులను గూడ సాధారణ కామప్రేరితులైన నాయికా నాయకులుగా కావ్యములలో చిత్రించిరి. ఆ కవుల దృష్టిలో రాధా కృష్ణులు శృంగారాధిదేవతలు ఆ కాలములో నేర్పడిన కళంకమును ఈ క్రింది యాధునిక కవులు రూపుమాపుటకు ప్రయత్న మొనర్చిరి.

అయోధ్యాసింహ ఉపాధ్యాయ (20 వ శతాబ్ది) ·

ఈయన ప్రియప్రవాస నను గ్రంథమును రచించియున్నాడు. ఈయన దృష్టిలో శ్రీకృష్ణుడు లోకసేవకుడు, నేత, పీడిత ప్రజల కష్టములను బోగొట్టు ఆదర్శమూర్తి.

ద్వారకాప్రసాద మిశ్ర: కృష్ణాయణమను గ్రంథమును వ్రాసియున్నాడు. ఈయన 20 వ శతాబ్దికి జెందినవాడు.

## వంగ సాహిత్యము[8]

వైష్ణవ కవులు భాగవత కథ ననుసరించి కృష్ణమంగళ, ముకుందమంగళ, గోకులమంగళ, రాధికామంగళ మున్నగు మంగళకావ్యములు వ్రాసి యున్నారు.

మాధవాచార్య, భాగవత దశమస్కంధము ననుసరించి 'శ్రీకృష్ణ మంగళ' మను ప్రాచీన కావ్యము వ్రాసినాడు. శ్రీకృష్ణమంగళ కావ్యాలలో నిది ప్రాచీనము. అట్లే కృష్ణదాసు కూడ శ్రీకృష్ణమంగళ కావ్యము వ్రాసి యున్నాడు. కలలో స్వామి కనబడి శ్రీకృష్ణమంగళ వ్రాయమని యాదేశించెను.

అభిరామదాసు (క్రీ.శ. 1700) 'గోవింద విజయ' మను కావ్యం వ్రాసి నాడు ఇది శ్రీకృష్ణమంగళ-లో చేర్చబడలేదు.

పరశురామదాసు శ్రీకృష్ణమంగళ వ్రాసినాడు. దుఃఖీ శ్యామదాసు (1700) గోవిందమంగళ వ్రాసినాడు. కవిచంద్ర శంకర చక్రవర్తి (1800) భాగవత గ్రంథమునకు భావానువాదము 'గోవిందమంగళ' కావ్యమును వ్రాసెను ఈతడే 'భాగవతామృత' 'రాధికామంగళ' (రాధాకృష్ణుల ప్రేమ లీల) అను కావ్యములు వ్రాసెను

ఉద్ధవానంద దాసు (1800) కూడ 'రాధికామంగళ'మును వ్రాసినాడు. కృష్ణరామదాసు 'రాధికామంగళ'మును వ్రాయగా, బృందావన దాసు 'రాధికా మంగళ'మును గురుశిష్య సంవాద రూపమున వ్రాసినాడు.

'చండీదాసు' (1417-77) : శ్రీకృష్ణ కీర్తన పదములు. బలరామదాసు (1587) కృష్ణలీలామృతమును, రామగోపాలదాసు శ్రీ రాధాకృష్ణ కల్పవల్లిని వ్రాసినారు. ఈ గ్రంథములన్నియు వైష్ణవ సాహిత్య శాఖలో చెప్పబడినవి.

కాశీరామదాసు (1700) మహాభారతము రచించగా, అన్నయైన కృష్ణదాసు 'శ్రీకృష్ణవిలాస'మును రచించినాడు.

బంకించంద్ర చటోపాధ్యాయ (1888-1898) అను మహనీయుడు 'కృష్ణ చరిత్రము' అను చక్కని విమర్శనా గ్రంథము రచించెను. భారత, భాగవత, హరివంశాది పురాణములు పరిశీలించి వ్రాసిన చక్కని విమర్శనా గ్రంథమిది. రచయిత పాండిత్యమున కిదొక మచ్చుతునక.

## ఓఢ్ర సాహిత్యము

జగన్నాథ దాసు - భాగవతము :

ఆంధ్ర వాఙ్మయములో అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర స్వామిని (సన్నిధిలో) గానము చేసినట్లే, ఈ కవి పూరీలోని జగన్నాథస్వామి యాలయ ప్రాంగణములో గానము చేసెను. ఈతని భాగవతము ప్రజలచే వ్యాసపీఠిక లపై నుంచి పూజింపబడుచుండెను.

ఈ మహాకవి కాలముననే నిర్మలదాసు, నందదాసు, యశోవంతదాసు, కృష్ణదాసు, రామదాసు అను పరమ భాగవతోత్తములవతరించి భాగవత గేయముల గానము చేసిరి.

సాలబేగు అను మహమ్మదీయుడు కూడ ఈ భాగవతమును గానముచేసి శ్రీవైష్ణవు డయ్యెను.

**ఓఢ్ర సాహిత్యము – మధ్యయుగము :**

ఈ యుగము నాంధ్ర వాఙ్మయములోని ప్రబంధ యుగముతో బోల్చవచ్చును.

ఈ యుగములోని చైతన్య, జయదేవుల ప్రభావము పెక్కురు సామాన్య ప్రజల నాకర్షించినది. వారు చైతన్యుని జేరి తమ్ము గోపికలుగను, చైతన్యుని శ్రీకృష్ణునిగను భావించి, పూజించి, నృత్య గానములలో మునిగి తేలసాగిరి.

ఈ చైతన్య మతము రాధాప్రేమగా రూపునంది, ఓఢ్రుల పౌరుష ప్రభావములను రూపుమాపి ఓఢ్రజాతిని నిర్వీర్యము జేసినట్లు స్వామి వివేకానందులు వచించిరి.

ఈ మత ప్రభావమున నష్టముతో బాటు లాభము కూడ చేకూరినది. 17 వ శతాబ్దిలోని దినకృష్ణదాసు కాలమునుండి 19 వ శతాబ్దిలోని గోపాలకృష్ణుని కాలము వరకు ప్రజలు రాధాకృష్ణ మతములో మున్గి తేలిరి కాని మూలతత్త్వము సరిగా గ్రహించలేదని పెక్కురుత్కళ పండితుల విశ్వాసము.

సూర్యబలదేవ రథొ, "కిషోరచంద్రానన చంపువు" అను నాటకమును, భక్త చరణదాసు "మధురమంగళ" కావ్యమును రచించిరి.

## పంజాబీ సాహిత్య చరిత్ర [10]

**గురు నానక్ (1469 - 1539) :**

గురు సాహిత్యములో నొక సహజ మార్గము గలదు. వేల యేండ్లకు ముందే శ్రీకృష్ణ భగవానుడు తన భగవద్గీతలో జ్ఞాన, కర్మ, ప్రేమ మార్గములను సమన్వయము చేసి సహజ మార్గమునకు బీజావాపము చేసెననుటలో సందే

హము లేదు. గురునానకు సహజమార్గమునకు- స్పష్టము, భిన్నము నయిన నొక రూపమిచ్చెను.

బులేశాహ (1680 - 1758) :

ఈ కవి ఇనాయత్‌షా తన 'దస్తూర్ అమల్' గ్రంథములో పరమహంస పదవినందుటకై సప్తమార్గములను వర్ణించినాడు బులేశాహ-ఇదానీ, సూఫీలు ప్రయోగించు బుల్‌బుల్, ఉద్యానము, గ్రాందీలను వదలి విశుద్ధ దేశీయ ఉపమానములగు కృష్ణుడు, మురళి, బృందావనము, గురువు- అను వానిని ప్రయోగించి, తనను పత్నిగా, భగవంతుని పతిగా భావించి ఈశ్వర దర్శనమునకై విరహతాపమునందును.

## కాశ్మీరు సాహిత్య చరిత్ర[11]

జహంగీరు చక్రవర్తి కాలములో జీవించిన సాహిబ్ కౌల్ (1642 మరణము) హైందవ పురాణముల ననుసరించి కృష్ణావతారము- జన్మచరిత్రము రచించెను

రసూల్ మీర్ యుగములో పరమానందుడు రాధాస్వయంవర, సుదామ చరితములను కథాత్మక కావ్యములను లీలావక్కిలో రచించెను. ఒక్కొక్క గేయమున నాలుగేసి చరణములుండగా, నాల్గవ చరణము పల్లవిగ నంతటను వచ్చును. కథాత్మక కావ్యము లన్నిటియందును మధ్యమధ్య సాధారణముగా లీలాగీతములుండును.

రాధాస్వయంవరములో సంగీతమాధురి అధికముగా కనుపించును.

సుదామ చరితము అల్పాక్షరముల ననల్పార్థ రచనయై విశిష్టమైన కావ్యముగా పరిగణింపబడుచున్నది. సుదాముడు జీవుడుగ, కృష్ణుడు పరమాత్మనిగ నిందు చిత్రింపబడినారు.

పరమానందుని శిష్యుడు లక్ష్మణ కౌలు బుల్ బుల్ (1812-1888): తన గురువు రచించిన రాధాస్వయంవరములోని ఉపాఖ్యానము గ్రహించి మోహినీ కావ్యమును కూడా ఈ కవి రచించెను. ఇందు శ్రీకృష్ణుడు దేశద్రిమ్మరియై స్త్రీ యలంకరణముల విక్రయించు వర్తకుడు. ఈ రూపమున నాతడు రాధను గలసికొనెను.

## దక్షిణ భారత భాషలు-కృష్ణభక్తి సాహిత్యము[12]

**తమిళము :** సూక్ష్మముగ పరిశీలించినచో సుబ్రహ్మణ్య భారతి రచనలలో ప్రధానముగా కానవచ్చునది భక్తి తత్త్వమని స్ఫురింపక పోదు. పరాశక్తిని గూర్చియు, కృష్ణుని (కణ్ణన్) గూర్చియు భారతి వెలయించిన మధుర గీతికా సముచ్చయ మిందులకు తార్కాణము. దేశభక్తితో బాటు, దైవభక్తియు నావశ్యకమని పలుతావులందు పేర్కొనెను.

### ప్రాచీన తమిళ సాహిత్యమున శ్రీకృష్ణ ప్రశంస :

తమిళ సాహిత్యమున వైష్ణవ మతాచార్యులకు "ఆళ్వారు"లని వ్యవహార నామము గలదు. తమిళ దేశమునందు వైష్ణవమతవ్యాప్తికి తోడ్పడిన వారు ఆళ్వారులే యనదగును. 'ఆళ్వారు'-అను మాటకు ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుడని యర్థము. వీరు తమిళమున పన్నిద్దరు గలరు.

(1) పొయ్‌గై ఆళ్వారు, (2) భూతత్తాళ్వారు, (3) పేయాళ్వారు, (4) తిరుమళిశై ఆళ్వారు (భక్తిసార), (5) తిరుప్పాణాళ్వారు (మునివాహన), (6) తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రిరేణు) లేక (విప్రనారాయణ), (7) తిరుమంగై ఆళ్వారు (నీల), (8) కులశేఖరాళ్వారు, (9) పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), (10) శ్రీ ఆండాళ్, (11) నమ్మాళ్వార్ (శఠకోప), (12) మధుర కవి.

భక్తిభావమున వారు వెన్నుని ప్రస్తుతించుచు పాడిన గీతములు నాలుగు వేలు గలవు. వీనిని సంకలన మొనర్చినవాడు నాథముని అను విష్ణుభక్తుడు. ఈ సంకలన కావ్యమునకు నాలాయిర దివ్య ప్రబంధమని పేరు. నేటికిని వైష్ణవాలయములందు ఈ పవిత్ర గ్రంథము పఠింపబడుచున్నది.

వైష్ణవ వాఙ్మయమునందు నాలాయిర దివ్య ప్రబంధము, శఠగోపరంతాది, రామానుజనూట్రంతాది మొదలగునవి పేర్కొనదగియుండి ప్రజాదరణను బొందినవి.

15 వ శతాబ్దిలో విల్లిపుత్తూరర్-అను కవి జీవించెనని తమిళ పండితుల యభిప్రాయము. ఈయన రచించిన భారతము బహుళవ్యాప్తిని బొందినది. ఇందు పది పర్వములు మాత్రమే కలవు.

## కన్నడ సాహిత్యము

ఈ సాహిత్యములో నేమిచంద్ర (1200 A.D) రచించిన హరివంశము నందు కృష్ణలీలలు, కంసవధ చక్కగా చిత్రింపబడి, నేమిచంద్రుని ప్రజ్ఞను వెల్లడించుచున్నవి

వీరబల్లాళుని యాస్థానకవియైన రుద్రభట్టు విష్ణుపురాణగాథ ననుసరించి జగన్నాథ విజయ కావ్యమును రచించెను కృష్ణజన్మము నుండి సాళ్వకథ వరకు గల కథ ఈ ప్రౌఢకావ్యములో చిత్రితమైనది ఇందు పారిజాతాపహరణ ఘట్టము మిక్కిలి సుందరమైనది.

లక్ష్మీశుడు జైమిని భారతమును మూల సంస్కృతానుసారియై రచించెను.

## మలయాళ సాహిత్యము

ప్రాచీన మలయాళ సాహిత్య ప్రపంచమున గల ప్రశస్త కావ్యములలో కృష్ణగాథ యొకటి. ఇది మంజరీ ఛందస్సున 15 వ శతాబ్దిలో వ్రాయబడెను. మలయాళము నందెన్నియో గాథలు వెలసెను. కాని వానిలో ఈ కృష్ణగాథయే ప్రశస్తమైనది. కృష్ణుని బాల్యము మొదలుకొని స్వర్గారోహణము వరకుగల కృష్ణకథాంశము లాకావ్యమున మనోజ్ఞముగ వర్ణించబడినవి 47 కథలతో విరాజిల్లుచున్న ఈ కావ్యము వెలుగులోనికి వచ్చి ఐదు వందల సంవత్సరము లైనను, దీనిని మించిన కావ్యము మరొకటి మలయాళమున లేదు. కాని దీని కర్తృత్వ విషయములో పెక్కు అభిప్రాయ భేదములు గలవు

### అట్టకథలు

ఇవి వ్రాసిన వారిలో కొట్టకార తంబురాన్ అను నతడు రచించిన రామనాట్టం - కృష్ణనాట్టం ననుసరించి - వ్రాయబడెననియు, ఈ కృష్ణనాట్టం గీతగోవిందము ననుసరించి వ్రాయబడెననియు కొందరు చెప్పుదురు.

## మహారాష్ట్రి సాహిత్యము

తక్కిన సాహిత్యములలో వలెనే మహారాష్ట్రి సాహిత్యములో కూడ కృష్ణ భక్తి గ్రంథములు గలవు దీనిని వారు మహానుభావపంథ యని పిలుచుచున్నారు. ఇది కొత్త సంప్రదాయము ఈ సంప్రదాయము మహాత్మా, అచ్యుత, జయ

కృష్ణపద - మార్గములను పేర్లచే పిలువబడు చున్నవి. భాస్కర (1278 A.D -శా. శ. 1196) ప్రణీతమైన శిశుపాలవధయును, నరేంద్రుడు (శా.శ. 12 8 - 1291 A.D) రచించిన రుక్మిణీ స్వయంవరమును కృష్ణభక్తి కావ్యములలో ప్రధానమైనవి.

విష్ణుదాసు అను కవి మహాభారతమును సుమారు 20 వేల ఓవీలలో వ్రాసెను. ఈ కవి ఏకనాథుని సమకాలీనుడు (1588 - 1599 A.D).

ఏకనాథుడు అను కవి శ్రీకృష్ణుని గూర్చి బ్రహ్మ యొనర్చిన స్తోత్రము నీ విధముగా వ్రాసియున్నాడు.

"చతుర్భుజ ఘనసాఁ వళా
మకరకుండలేఁ కౌస్తుభగళాఁ
వైజయంతి వక్షస్థళా
అపాద వనమాలా"

ఈతని రుక్మిణీ స్వయంవరము లోకప్రియమైన గ్రంథము. ఇందు 1711 ఓవీలు గలవు. రుక్మిణి వ్రాసిన లేఖ,కృష్ణవర్ణన ఘట్టములు ఉత్తమ కావ్య గుణములు గలిగి రసమును ప్రవహింపజేయుచుండును. (ఓవీ అనునది ఒక వృత్తము)

## తుకారాం (1608 - 1649)

మహారాష్ట్రమున తుకారాం మహాభక్తుడు. సంసార తాపశాంతికి భగవద్భక్తియే మార్గమని తలచెను. ఈతనిని విఠలేశ్వరుడు 'అభంగము' లలో కవితను వ్రాయుమని యాజ్ఞాపించెను. ఈ భక్తకవి కవిత మరాఠీ భాష కలౌకిక సౌందర్యము గలుగజేసినది. నామదేవుని యనంతరము విశదము, విస్తృతము, రసవంతమునైన "అభంగరచన" తుకారాముదే యని చెప్పవచ్చును. ఈతని యభంగములలో 'లౌకిక' పారమార్థిక జీవనమున ననుభవమునకు వచ్చిన విషయము లెన్నియో సుందరమైన శైలిలో వివరింపబడినవి. కరువు, కాటకములలో దుర్గతి, మనోదార్ఢ్యమును బరీక్షించు ఘట్టములు, నిరాశ మున్నగు వానిలో కలిగిన భావనాయుతములగు "అభంగములు", ఈ మహాకవి ప్రతి రచనలోనను తాండవించును ఆత్మ సాక్షాత్కారము నిమ్మట భగవత్ప్రాప్తికి సుఖోపాయముల జూపు కీర్తనలు వ్రాసెను. అవి చాటువులైనవి.

## సమర్థ రామదాసస్వామి (1608 - 1681)

ఈయన సనాతన ధర్మము, భక్తితోబాటు స్వీయకర్తవ్యము మున్నగు వానిని గూర్చి బోధించెను. స్వాతంత్ర్య మనుభవించు మహారాష్ట్రదేశము "ఆనంద భువన" మని గౌరవించి దేశభక్తిని ప్రజలలో పెల్లుబికింప జేసెను. "అధీ పంచ కర వానేదిక" (మొదట ప్రపంచమును చక్కదిద్ది తరువాత పరమార్థమును సాధింపవలెను); "అధీ అసావే బ్రహ్మచే అధిష్ఠాన మగకరావే రాజకరణ" (ప్రథమున బ్రహ్మాధిష్ఠానము పొంది తదనంతరము రాజకీయములలో ప్రవేశింపవలెను) - అని ఈతని ప్రబోధములు

రామదాస పంచాయగనములో జయ రామస్వామి వడగాంకర్ వ్రాసిన రుక్మిణీహరణము, కేశవస్వామి వ్రాసిన కృష్ణగీతలు పేర్కొనదగినవి

పండిత కవులలో వామన పండితుడు (608- 695 A. D.) తాను వ్రాసిన యథార్థ దీపిక (భగవద్గీతా వ్యాఖ్య) లో శ్రీ కృష్ణతత్త్వమును స్వీయముగా వ్యాఖ్యానరూపములో ప్రకటించెను వేణుసుధ, రాసక్రీడ మున్నగు కావ్యముల రచించెను

సామరాజు, రుక్మిణీహరణము అను మహాకావ్యలక్షణ లక్షితమైన గ్రంథమును రచించెను విఠల అనంతక్షీర సాగర్ అను మహాకవి రుక్మిణీ స్వయంవరము అను గ్రంథమునకు కర్తృత్వము వహించెను.

మోరోపంత్ (క్రీ శ. 1729-1794) అను కవి సంస్కృత, మహారాష్ట్ర భాషలలో గ్రంథములు వ్రాసి మహారాష్ట్ర కవి సార్వభౌమ అను నుతికెక్కెను. ఈ కవి లవకుశాఖ్యాన, సీతాగీతము, శ్రీ కృష్ణవిజయము, హరివంశము మున్నగు మహాకావ్యములను వ్రాసెను. మహాభారతమును అద్భుతశైలిలో ఆర్యావృత్త బద్ధముగా వ్రాసెను

శ్రీకృష్ణ కథాప్రారంభము విష్ణుపురాణము ననుసరించి ప్రవర్తించిన విధానము : [8]

(a) (1) శ్రీకృష్ణ లీలలు

(2) బృందావన గమనము.

(3) కాళియ మర్దనము.
(4) ప్రలంబాసుర వధ.
(5) గిరి యజ్ఞము.
(6) గోవర్ధనోద్ధరణము.
(7) రాస క్రీడాభి వర్ణనము
(b) ప్రద్యుమ్న జనన, శంబరాసురాది వృత్తాంతము.
(c) నరకాసుర వధ.
(d) పారిజాతాపహరణ వృత్తాంతము.
(e) ఉషా చరిత్ర.

శ్రీకృష్ణుడు-ఉత్తర హరివంశమునం దాతనికి గల స్థానము :[14]

కొందఱు విష్ణువే కృష్ణుడనియుఁ, గొందఱు విష్ణు రూపియైన కృష్ణుడు వేఱు, యాదవుడైన శ్రీకృష్ణుడు వేఱు అను అభిప్రాయములను గలిగి యున్నారు. కావున శ్రీకృష్ణుడు విష్ణువే యని సంభావించినపుడు ఋగ్వేదమునందు గానవచ్చు విష్ణు స్వరూప స్వభావాదు లెట్టివో యెఱిగి వానితో నీ కృష్ణునకు గల సామ్యము లను దెల్పుకొనవచ్చును.

1. ''శ్రీకృష్ణస్తు భగవాన్స్వయమ్'' "కృష్ణమేవ హరిః కిల'' ''గృహీత మూర్తిత్రయ ఈశ్వరేశ్వర'' అని శ్రీకృష్ణలీల యందును,
2. ''బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః'' అని నారాయణోపనిషత్తు నందును,
3. "యదోర్వంశం నరశ్శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే
యత్రావతీర్ణం కృష్ణాఖ్యం పరబ్రహ్మ నిరాకృతి"
అని విష్ణు పురాణమునందును గలదు.

శ్రీకృష్ణ చరిత్రము[15]

పురాణములలో కూడ శ్రీకృష్ణ చరిత్రము చెప్పబడినది.

1. బ్రహ్మ పురాణము.
2. పద్మ పురాణము.
3. విష్ణు పురాణము.
6)

4. వాయు పురాణము.
5. శ్రీమద్భాగవతము.
6. బ్రహ్మ వైవర్తము.
7. వామన పురాణము.
8. స్కాంద పురాణము.
9. కూర్మ పురాణము.

ఈ పురాణములే కాక యితిహాస రూపమైన భారత గ్రంథమునందును మఱియు నా భారతమున కంతటికిని శేఖర ప్రాయమనదగినద్దియును నగు భారత ఖిలభాగ హరివంశమునందునను శ్రీకృష్ణ చరిత్ర చెప్పబడి యున్నది.

## శ్రీకృష్ణ నామధారులు[16] :

ఋగ్వేదసంహిత యందు అష్టమ మండలమున 86 వ సూక్తమున నొక కృష్ణనాముడైన రాజు వృత్తాంతమున్నది.అదే మండలమున 85-86-87 సూక్తము లందును, 10 వ మండలమున 42-43-44 సూక్తములకును- శ్రీకృష్ణుడు ఋషియైనట్లు కానవచ్చును.

బౌద్ధ శాస్త్రములలోని సూత్రపిటకములలో కృష్ణు డసురుడుగా ప్రదర్శింప బడినాడు.

ఛాందోగ్యోపనిషత్తులో సూర్య పురోహితుడు, అంగీరసవంశీయుడైన 'ఘోర' యను నాతడు దేవకీపుత్త్రుడైన కృష్ణునకు బ్రహ్మవిద్యను బోధించెను.

ఘట జాతకములోని కృష్ణనామము పురాణనామమునకు భిన్నము.

శతపథ బ్రాహ్మణమునందు మానవుడే విష్ణురూపి యని చెప్పబడినది.

ఐతరేయ బ్రాహ్మణమునందు సయితము విష్ణువు వామనరూపియై భూమిని గైకొని దేవతల కిచ్చెనని పేర్కొనబడినది.

## తెలుగులో శ్రీ కృష్ణమాహాత్మ్యము వర్ణించిన గ్రంథములు :

ఆంధ్ర వాఙ్మయములో నీ సందర్భమున నరయవలసిన గ్రంథములు- భాగవతము, హరివంశము (పూర్వోత్తర భాగములు); ఉత్తర హరివంశము అను

గ్రంథములు.' భాగవతమును పోతన వ్రాయగా పూర్వోత్తర భాగములైన హరి వంశముల నెఱ్ఱనయు, నాచన సోమన ఉత్తర హరివంశమును రచించి యున్నారు

(1) హరివంశ, ఉత్తర హరివంశములలోని కథలు రెండును జనమే జయునకు వైశంపాయనుడు చెప్పినవి. కాని ఉత్తర హరివంశములో సూతుడు శౌనకాది మహామునులకు తెల్పుటయు, హరివంశములో సూతుడు(ఉగ్ర శ్రవసుడు) శౌనకాది మహామునులకును, భాగవతములో కూడ ఈ విధముగా సూతుడు శౌనకాది మహామునులకు జెప్పినట్లు ఈ మూడు గ్రంథములును తెలుపుచున్నవి.

(2) "హరివంశము భారత పరాంశమని యింపారగ బుధులు చెప్పెదరు" అనునది (1-1-40) హరివంశ పూర్వ భాగములో ప్రోలయ వేమారెడ్డి- ఎఱ్ఱాప్రెగడతో చెప్పిన విషయము. కావున హరివంశమును గూర్చి తెలియనిచో భారత మసంపూర్ణమను భావమును, హరివంశ ప్రాధాన్యమును తెలియుచున్నది.

(3) ఈ మూడు గ్రంథములందును బాణాసుర వృత్తాంతము గలదు. హరివంశములో శ్రీకృష్ణునితో శివుడు యుద్ధము సేయడు కాని, కుమారస్వామి చేయును. కాని ఉత్తర హరివంశములోని షష్ఠాశ్వాసమున శివ కేశవ యుద్ధము వర్ణితము.

(4) మహాభారతములో గల శ్రీకృష్ణమాహాత్మ్యము ఈ గ్రంథత్రయమున గలదు. శ్రీకృష్ణుడు శివస్తుతి చేయుననుట హరివంశ, ఉత్తర హరివంశములలో గలదు.

(5) హరిహర ప్రభావము మొత్తము మీద ధర్మసంస్థాపనార్థము ఉప యుక్తమైనది.

(6) శ్రీకృష్ణుడు ఈ మూడు గ్రంథములలో వర్ణించినట్లు పెక్కురు రాక్షసులను తుదముట్టించెను. ఇట్టి వారిలో నరక, బక, ధేనుక, కాళియ, వృషభ, కంస, దంతవక్త్ర, మధుకైటభ, పౌండ్రవాసుదేవ, శకట, పూతన, కాలనేములనువారు గలరు.

(7) శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహము చేసికొనుట యను వృత్తాంతము ఈ గ్రంథత్రయమున గలదు.

(8) తిక్కన కాలములో వలె శైవ, వైష్ణవ మతములు రెండును సమాన భావముతో చూడబడెడివి. ఈ యంశమునకు నీ గ్రంథములలో గల యభేదమే తార్కాణము.

(9) భాగవతమున – భగవంతుని (శ్రీమహావిష్ణుని) యవతారములు - లీలలు గలవు. దశావతార విషయములందు గలవు. కాని హరివంశ, ఉత్తర హరి వంశములలో శ్రీకృష్ణుని గూర్చి గాథలే గలవు. తక్కిన యవతారములు స్థాలీపులాకముగా హరివంశమునందు చెప్పబడినవి. ఆ గ్రంథ నామములు సార్థకములు. శ్రీకృష్ణునికి ప్రద్యుమ్నుడను కుమారుడున్నట్లును, అతనికి అని రుద్ధుడను కుమారుడు గల్గినట్లును (అనగా శ్రీకృష్ణునికి మనుమడు కల్గినట్లును) గలదు. శ్రీకృష్ణ బలరాము లిర్వురును వైకుంఠమునకు చనుదెంచినట్లు భాగవత ములో నున్నది. కాని ఉత్తర హరివంశమునందును, హరివంశము నందును ఈ విషయము చెప్పబడలేదు. అట్లే యాదవుల కలహమును, నాశమును లేవు. ఎఱ్ఱన హరివంశమునకును, సోమన ఉత్తర హరివంశమునకును కథా దృష్టిలో భేదము గలదని తెలుపబడినది.[17]

(10) ఈ గ్రంథములలో మరికొన్ని ఉపాఖ్యానములు కూడ గలవు. అట్టి వానిలో భారత కథయు, కుచేలోపాఖ్యానము, సోమాన్వయ క్రమము, అంధక వంశక్రమము, వామనావతార వృత్తాంతము, మార్కండేయ ఉపాఖ్యా నము, వరాహావతార ఘట్టము, నరసింహావతార ఘట్టము, ఋతువర్ణనాదిక ములు కూడ గలవు. ఈ యుపాఖ్యానములు పరోక్షముగా ప్రధాన కథయైన శ్రీకృష్ణ మాహాత్మ్యమునకు దోడ్పడినవి.

(11) శ్రీ మహాభాగవతమునందు శ్రీకృష్ణునకు బదునెనిమిది మంది పుత్రులు గలరు. వారు ప్రద్యుమ్న, అనిరుద్ధ,[18] దీప్తిమత్, భాను, సాంబ, మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రభాను, వరూధ, కవి, న్యగ్రోధులనువారు.

అంతేగాక మరి పెక్కురు గలరు. వారి విద్యావిశేషము లెరిగించు సందర్భమున వారి సంఖ్య కోట్లలో నున్నట్లు భాగవతమున చెప్పబడినది.

(వంశక్రమము) (మాధవుడు-రుక్మిణి)⟶ప్రద్యుమ్న⟶అనిరుద్ధ⟶ వజ్ర⟶ప్రతిబాహు⟶సుబాహు⟶ఉగ్రసేనుడు⟶శీతసేనుడు.

(12) తెలుగు భాగవతములో కూడ శ్రీకృష్ణ గోపికా రాసక్రీడలు, జల క్రీడలు వర్ణితమైనవి. ఇట్టిచోట గోపికా గీతలు, భ్రమర గీతలు చెప్పబడినవి. ఇదే మధురభక్తి యగుచున్నది.

ఇక జైమిని భారతము తరువాతి గ్రంథము. అందంతయు శ్రీకృష్ణ భక్తియే చిప్పిల్లినది. అందలి భక్తి తత్త్వము, పాత్రాదిక పరిశీలనమును గూర్చియు, దశావతారములలోని సంపూర్ణావతారమగు శ్రీరామ - లవకుశాది ఘట్టములను గూర్చియు తరువాత చర్చించనైనది.

1 ఆంధ్రమహాభాగవతోపన్యాసములు - సారస్వత పరిషత్.
(1969 - 1957 - 1968)
వాసుదేవ తత్త్వములు - అవతారములు - భాగవత వైష్ణవము - శ్రీ వేదాల తిరు వేంగళాచార్యులు.

2. భాగవత ప్రథమస్కంధము

3 భాగవతోపన్యాసములలో ఇందు గొన్ని శ్రీ వేదాల వారిచే పరిహరింపబడినవి వానికి బదులు మరియొదు తెలుపబడినవి.

4 కల్కి అవతార విషయము - భాగవతము (1-61)
''ఏకవింశతి తమంబైన బుద్ధనామధేయంబునం దేజరిల్లు యుగసంధిలో వసుంధ రాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికి కల్కియను పేర నుద్భవింప గలండని'' తెల్పబడినది. కావున 21వ అవతారము బుద్ధునిదే యని తేలును.

5. New approach to The Ramayana - N. R. Navlekar (P. 16-27)
6 ''హిందీ సాహిత్య ఔర్ ఉస్‌కీ ప్రముఖ్ ప్రవృత్తియాఁ''—గోవిందరామ శర్మా, ఢిల్లీ (1968)
7. ''హిందీ సాహిత్యకా సుబోధ ఇతిహాస"-బాబు గులాబ్‌రాయ్ (కృష్ణభక్తిశాఖా) ఆగస్టు 1967. 22 వ ముద్రణ
8. ఉత్తరభారత సాహిత్యములు (1965) - పురిపండ అప్పలస్వామి, ఎ. పి. సాహిత్య అకాడమి.
9 ఉత్తర భారత సాహిత్యములు-పెనుమెత్స సత్యనారాయణ రాజు.
10 ఉత్తర భారత సాహిత్యములు-శ్రీ గడియారం రామకృష్ణశర్మ
11. ఉత్తర భారత సాహిత్యములు-శ్రీ కె. గోపాలకృష్ణారావు
12. దక్షిణభారత సాహిత్యములు-చల్లా రాధాకృష్ణశర్మ (తమిళము),
గడియారం రామకృష్ణ శర్మ (కన్నడము),
మలయాళం (చల్లా రాధాకృష్ణశర్మ),
మరాఠీ సాహిత్యము (గుండేరావు హర్కారె)
18 ''తెలుగులో హరివంశములు'' - సిద్ధాంతవ్యాసము డాక్టర్ యశోదారెడ్డి - పుట-51
14. తెలుగులో హరివంశములు - పుట 506
15. తెలుగులో హరివంశములు - పుటలు 510, 511.
16 డాక్టర్ యశోదారెడ్డి సిద్ధాంతవ్యాసము - పుటలు 510-511.
17. హరివంశము - ఎఱ్ఱన (పీఠిక), వేలూరి శివరామశాస్త్రి, వావిళ్ళ ప్రతి - 1967
ఉత్తర హరివంశ పీఠిక - వేదం లక్ష్మీనారాయణశాస్త్రి (1967)
18. ఇచట శ్రీకృష్ణుని కుమారులలోగల అనిరుద్ధుడు-హరివంశములో గల శ్రీకృష్ణుని మనుమడు కానేరడు. (హరివంశము - ఉ. భా. 7-155)

కవిత్రయము వారు మహాభారతమునం దెట్లు శ్రీకృష్ణునికి మిక్కుటమైన ప్రాధాన్య మిచ్చిరో జైమిని భారతమునందు గూడ పినవీరభద్రకవి యట్లే యాతనిని మహాపురుషునిగ చిత్రించినాడు.

జైమిని భారతము పిల్లలమఱ్ఱి పినవీరభద్రునిచే వ్రాయబడిన యుద్గ్రంథము. ప్రబంధముల యావిర్భావము కాకపూర్వమే యీ గ్రంథరాజము పండిత మండలి దృష్టిలోని కెక్కినది. అనగా నీ గ్రంథము రచించబడక పూర్వము శ్రీకృష్ణకథామృతము నందించిన పెక్కు సంస్కృత గ్రంథములును, తెలుగు గ్రంథములును మనకు సాహిత్యములో గానవచ్చుచున్నవి. ఇట్టి గ్రంథములు సంస్కృత భాషలో వైదిక వాఙ్మయములోనను, లౌకిక వాఙ్మయములోనను గలవు. స్థూలముగా సంస్కృత వాఙ్మయములో ఋగ్వేదము, బ్రహ్మపురాణము, పద్మపురాణము, విష్ణుపురాణము, వాయుపురాణము, శ్రీమద్భాగవతము, బ్రహ్మవైవర్తము, వామనపురాణము, స్కాందపురాణము, కూర్మపురాణము, బౌద్ధ పిటకములు, ఛాందోగ్యోపనిషత్తు, జైనమత సిద్ధాంతములు, శతపథబ్రాహ్మణము, ఐతరేయ బ్రాహ్మణము మున్నగు గ్రంథములలో శ్రీకృష్ణుని ప్రస్తావన గలదు.[1]

ఇక తెలుగు గ్రంథములలో శ్రీకృష్ణుని లీలలను, కథలను, గాథలను ప్రస్తావించిన గ్రంథములలో మహాభారతము, హరివంశము (పూర్వోత్తర భాగములు), ఉత్తర హరివంశము, మహాభాగవతము కానవచ్చుచున్నవి. ఈ గ్రంథములన్నియు జైమిని భారతము తెలుగున వ్రాయబడక పూర్వమే రచించబడినవి. వ్యాసుని శిష్యులలో నొక్కడైన జైమిని వ్రాసిన సంస్కృత జైమిని భారతమును యథామాతృకమైనది. పిన వీరభద్రుడు మూల గ్రంథములోని కథా భాగములకే కడుంగడు ప్రాధాన్య మిచ్చినాడు. ఆకారణముగా శ్రీకృష్ణుడు పెక్కురు రాక్షసులను వధించుటయు, రాసక్రీడలను జరుపుటయు మొదలైన మహత్కార్యముల ప్రస్తావనకు జైమిని భారత గ్రంథమున స్థానము లేదు. అంతమాత్రమున జైమిని భారతము శ్రీకృష్ణ మహత్త్వ సంబంధియైన గ్రంథము కాదనుట సత్యదూరము కాగలదు.

"శ్రీకృష్ణ" నామధేయులు బెక్కురు మనకు సంస్కృత గ్రంథములలో కననగుచున్నారు. అందున నీ నామధేయు లొక్కరే కాదనుటయు, వైవిధ్యము

గలదనుటయు, పెక్కు వాదోపవాదములు మనకు గనబడుచున్నవి. అట్లే వేద కృష్ణునకును, నితిహాస కృష్ణునకును భేదము గలదను వారును గలరని తెలియు చున్నది.[2] అంతేగాక ప్రస్తుత మీ విషయమును గూర్చిన వాదోపవాదములను గూర్చి చర్చించుటకును, వానిని దగు నిర్ణయము చేయుటకు నిచట దగిన స్థానము లేదు. కారణమేమనగా జైమిని భారతములోని సంఘటనలకును, హరి వంశ భాగవతాది గ్రంథములలో నుటంకించిన శ్రీకృష్ణలీలలకును నెట్టి సంబంధము లేదు. 'జైమిని భారతము' గ్రంథనామములోననే యా గ్రంథము భారతమే యనుటయు స్పష్టమగుచున్నది. అదియును గాక మహాభారతములోని పాత్ర లలో వేరెన్నికగన్న పాత్రలైన ధర్మరాజు, భీమార్జున, నకుల, సహదేవులకు దోడైన ద్రౌపది పాత్రయు నిందు గననగుచున్నవి. జైమిని భారతము కథ యంతయు నశ్వమేధపర్వములోని దగుటచే కురుపాండవ యుద్ధము పూర్తియైన తరువాత జరిగిన ఘట్టముగా గుర్తించవలసియున్నది. ఈ కారణముచే కౌరవుల పాత్రలనిట వర్ణించుట కేమాత్రము నాస్కారము లేదు ప్రస్తావోచితముగ మాత్రము గౌరవుల ప్రశంస, ద్రౌపదికి జరిగిన యవమానాది విషయములు స్పృశింపబడినవి. ఆ కారణముగ నీ గ్రంథము మహాభారతమునకు 'ఛాయా గ్రంథ' మగుచున్నది.

జైమిని భారత మెనిమిది యాశ్వాసముల యుద్గ్రంథము. సంస్కృత జైమిని భారతము నవసరమును బట్టి తగ్గించియు, లేనిచో పెంచియు, గొలది ప్రదేశములలో స్వకపోలకల్పనము గావించియు పిల్లలమర్రి పినవీరభద్రు డీ గ్రంథ మును వెలయించి యున్నాడు. అట్లు తగ్గించుటలో నీ గ్రంథ మెనిమిది యాశ్వా సముల మేరకు దగ్గినది. ఏది యెట్లయినను సంగ్రహీకరణ మీ గ్రంథము వ్రాయునపు డీ కవి యవలంబించిన ప్రధాన పద్ధతియని విస్పష్టముగ జెప్ప గొనవచ్చును.

జైమిని భారతములోని ప్రధాన కథను బట్టియు, పెక్కు యుద్ధములను వానియందు సాధించిన విజయములను బట్టియు సర్వశత్రుంజయత్వ లక్షణము లును, దత్కీర్తియు ధర్మరాజునకే కల్గుచున్నవి. కాగా యుద్ధములు చేసినవా దర్జునుడును, జయశీలత కంతర్భూతమైన యదృశ్య హస్తము శ్రీకృష్ణుడును నగుచున్నారు. దీనికి దార్కాణముగా మనకు జైమిని భారతములో బభ్రువాహన

యుద్ధము, తామ్రధ్వజుని తోడి యుద్ధము మనకు అగుపడుచున్నవి. ఈ సందర్భములలో శ్రీకృష్ణుడు తన మాయోపాయముల నుపయోగించి, సమయానుకూలమగు చాకచక్యము నుపయోగించెను. ఈ సందర్భమున శ్రీకృష్ణుని పాత్ర ప్రాముఖ్య మీ గ్రంథమున నెంతవరకు గలదో లెక్కకట్టవలసి యున్నది.

అశ్వమేధాశ్వము వెంటనంటిన యర్జునుడు చతుర్థాశ్వాసములో నీలధ్వజునితో జేసిన యుద్ధముతో నీ గ్రంథమందలి యుద్ధము లారంభమగును. అట్టి యుద్ధముల నీ క్రింద బొందు పరచవలసిన యవసరమున్నది:

1. నీలధ్వజుని తోడి యుద్ధము.

2. హంసధ్వజుని తోడి యుద్ధము.

3. ప్రమీల యను రాణితో జేసిన యుద్ధము.

4. భీషణు డర్జునునితో యుద్ధము చేయుట.

5. బభ్రువాహనునితో నర్జునుని యుద్ధము.

6. అర్జునునితో తామ్రధ్వజుని యుద్ధము.

7. అర్జునునితో వీరవర్మ యుద్ధము.

పైన బేర్కొనబడిన యుద్ధములలో నర్జునుడు పరమ భాగవతులగు శ్రీకృష్ణభక్తులతో యుద్ధము గావించును. ఇట్టి యుద్ధములకు మనకు గొన్ని కారణములు స్పష్టపడుచున్నవి.

1. జైమిని భారతములోని యశ్వమేధపర్వము భారత యుద్ధము జరిగిన తదుపరి జరిగినట్టిది. శత్రుంజయత్వము, భూమండల చక్రవర్తిత్వమును స్థాపించవలెనన్న యాగము జేయవలెను. దానికి యుద్ధములను గావింపవలయును.

2. ఈ గ్రంథమునందలి యుద్ధము లన్నియు భక్తి, ధర్మములకు ప్రోద్బలకములే. కాని ప్రధాన రసము వీరమే.

8. హయమేధము జేయువా డీ గ్రంథమున ధర్మరాజు. కాని యుద్ధ విషయమున సహాయభూతులుగ భీమార్జునులే చదువరులకు గన్పట్టుచున్నారు. ధర్మరాజు యుద్ధములు చేయలేదు. భారత యుద్ధానంతరము జరిగిన పెక్కు పాప కార్యములను బాపుకొనుట యెట్లని ధర్మనందనుడు బాధపడినాడు.

ఆ. గురుఁడు కుంభజుండు సురనదీసూనుండు
జూడలేని రాజ్యసుఖము నాకుఁ
గన్నుదోయి లేని కాయంబు తోయంబు
గాని మిగుల సౌఖ్యకరము గాదు.

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దఁగ జూచిన వంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నా కిది యేల సత్వసం
పన్నిధి వాయునందనునిఁ బట్టము గట్టెద నేఁటితోన నే
నన్నియు మాని కానలకు నేఁగెద నిష్ఠఁ దపంబుఁ జేసెదన్.

క. ఏ తపముల నే జపముల
నే తీర్థవిలోకనముల నే క్రతువుల నీ
జ్ఞాతివధం బొనరించిన
పాతకము హరించు ననఁ దపస్వి యతనితోన్.

(జై.భా. ఆ. 1-58, 59, 60)

ఈ మాటలకు వ్యాసు డీతనిని హయమేధమునకుఁ బ్రేరేచును.

దానికియ్యకొనిన ధర్మజునితో, భీము డీ క్రింది విధముగ బల్కెను:

ఎవ్వని ప్రాపున గెలిచెన్
గవ్వఁడి నెవ్వఁడి విరోధిగణముల ననిలో
నవ్వనజాక్షుఁడు కృష్ణుఁడు
దవ్వుల నున్నాఁడు క్రటువు తరమే చేయన్. (1-81 జై.భా.)

కురుక్షేత్ర సంగ్రామమున గవ్వడి గెలుచుటకు శ్రీకృష్ణుని ప్రాపు కారణమని దెలియుచున్నది.

4. పంచపాండవులు గోరిన మీదటనే యాగ నిర్వహణకు బాధ్యతలను శ్రీకృష్ణుడు గైకొనెను. నరనారాయణులు యాగమునకు నుపనాయికులు.

5. హంసధ్వజుని తోడి యుద్ధము మొదటిది. సుధన్వుడు హంస ధ్వజుని కుమారుడు. అతడును శ్రీకృష్ణుని భక్తు డగుటయు విజయునిపై యుద్ధము ప్రకటించ లేదు. తండ్రియగు హంసధ్వజుడు, కుమారునిపై మండి పడి, ధర్మశాస్త్రికార్యులును, బురోహితులైన శంఖలిఖితుల నియమించి, కామాంధుడని, రాజాజ్ఞ మీరినవాడని నిందించి, శిక్షార్హుని గావించి, సుధన్వుని దప్తతైల కటాహమున బడవేయ నాత డెట్టి యాపదను బొందలేదు కారణ మెరుగక, వారు తైలమునందు నొక నారికేళఫలము వేయ నది పెటిలి పెంచిక లయ్యె. ఇది వారెల్లరకును 'శ్రీకృష్ణభక్తి' యనియే స్పష్టపరచినది.

ఈ సంఘటన జరిగిన పిమ్మట సుధన్వుడు వృషకేతుని తోడను, ప్రద్యుమ్నాదులతోడను, నర్జునునితోడను యుద్ధము చేసి యర్జునుని దృతీయ శరముచే ఖండింపబడినాడు. అతని హరిభక్తి తత్త్వమును కవి యొక్క పద్యమున వివరించినాడు.

శిరమటు దెగి హరినామ
స్మరణము చేయను దననముఖమునఁ బడన్
బరికించి చూచె దానవ
హరుఁ డత్తేజంబు గలసె నవ్వీరునందున్. (జై. భా. 5-44)

సుధన్వుని పిమ్మట సురథుడు విజయునితో గయ్యమునకు దలపడి వెలు గంద, శ్రీకృష్ణుడే ధైర్యము జెప్పి ప్రోత్సహించెను. సురథుని రథము ప్రయ్య లొనర్పబడినది. సవ్యసాచి యాతని దెగ వ్రేసినాడు. మరణించిన యా భక్తుని రుండము శివుని గళము నందలి రుండమాల యందుంచబడెను. శివుడీ విషయమును బార్వతితో, కంద పద్యమున బేర్కొనెను.

శూరులు, ధర్మచరిత్రు లు
దారులు విజితేంద్రియులు కృతజ్ఞులు జగదా
ధారు లని వారిశిరములు
హారంబులుగా ధరింతు ననవరతంబున్. (జై. భా. 5-88)

చతుర్థాశ్వాసాంత్యమున ప్రారంభమై, పంచమాశ్వాసార్ధము వరకును పరివ్యాప్తమైన నీ కథ యత్యంత భక్తి ప్రపూరితమై, సుధన్వ, సురథులను భక్త శ్రేష్ఠుల వర్ణించి, యుదాత్త భక్తి తత్త్వమును నెరపిన శ్రీకృష్ణ గాథామృతమై యలరారినది.

6. అర్జునుని శిక్కట్లు ప్రాప్తించిన యెల్లెడలను శ్రీకృష్ణు డవతరించి యర్జునుని, తద్వారా యాగమును సంరక్షించెను. బభ్రువాహనునితో గిరీటి గావించిన యుద్ధము మరొక్క ఘట్టము. ఈ యుద్ధమున గుమారుడగు బభ్రువాహనుడు, తండ్రియగు సవ్యసాచి నోడించి, మూర్ఛనొందించెను. నాగకుమారులాతని శిరము నపహరించిరి. కష్టసాధ్యమునై, పునఃప్రాణము బొందని, గిరీటిని శ్రీకృష్ణుడే పునరుజ్జీవితుని జేసెను.

7. మహాభక్తుడైన మయూరధ్వజుని పుత్రుడైన తామ్రధ్వజుడు తరువాతి యుద్ధములో సవ్యసాచిని, శ్రీకృష్ణుని జయించి, హయమును గొనిపోవుట జరుగును. తామ్రధ్వజుని తండ్రియైన మయూరధ్వజుని భక్తిని శ్రీకృష్ణు డర్జునకు జూపుటకై మణిపురమునకు దోడ్కొనిపోయి చూపును ఆ యూరిలో నెటజూచినను హరినామస్మరణమే.

తలఁపులు హరిచింతనములు
పలుకులు హరికీర్తనానుభవములు పని పా
టలు హరికృత్యంబులు భూ
తలవైకుంఠం బు పొగడఁదగు నిది యనుచున్. (జై. భా. 7-20)

మణిపురమంతయు మరొక వైకుంఠమే. శ్రీకృష్ణ, విజయు లిరువురు, మాయావిప్రులై నగరమున బ్రవేశింతురు. శ్రీకృష్ణుడు కల్పితమైన యొక గాథ నృష్టించెను. 'తన కుమారుని వివాహము జరుగవలెననిన మయూరధ్వజుని సగశరీరము గావలెననియు, నా సగశరీరము సమర్పించిననే గాని, తన కుమారుని బట్టుకొనిన సింహము వదలివేయ'దనియు రాజునకు దెల్పెను. ముందుగా 'కోరిన గోర్కెలెల్ల నొనగూర్తు' నని వాగ్దాన మొనర్చిన కారణముగా, గుమారుడైన సుచిత్రుని రాజ్యాభిషిక్తుని జేసి, దానములొనర్చి, తన భార్యను, గుమారుని

దనను సగముగా గోయ నాజ్ఞాపించెను. మాయా విప్రుని రూపమున నున్న శ్రీకృష్ణుడేదో మిషచే యల్గిపోవ నుంకించ, మయూరధ్వజు డా యలుకను దీర్చెను. శ్రీకృష్ణ దర్జునునితో నిజ స్వరూపముల బ్రత్యక్షమై, దివసత్రయంబట నుండెను.

మయూరధ్వజుడు సహజముగ భక్తిపరుడు. హయమేధ మాచరించి హయమునీతడు వదలగా, ధర్మరాజు వదలిన హయమునకు నెదురైన కారణమున యుద్ధము వాటిల్లినది.

> క్రోవ మయూరధ్వజ వసు
> ధావరు క్రతుహయముఁ బుత్రుఁ దామ్రధ్వజునిం
> గావలిగా నిడి విడిచిన
> దైవికముగ రెండు నెదురుతాఁకై నిలువన్. (జై.భా. 7-144)

ఈ పద్యమునందు జివరి పాదమున "దైవికముగ" ననునది చాల ముఖ్యమైన పదము. 'దైవికము'గ నెదురు వచ్చుటచే, శ్రీకృష్ణ దర్జునునకు, మయూరధ్వజుని భక్తివీరమును, శౌర్యవీరమును దెలియబరచుటకై యేర్పరిచిన సన్నివేశముగ గన్పట్టుచున్నది.

"అగ్గోవిందుండు గాండీవికి మయూరధ్వజుని భక్తిఁ దెలుపవలసి బల సమన్వితంబుగా దివసత్రయం బధివసించె" (7-287)

అని కవి పేర్కొనుటచే, గాండీవికి మయూరధ్వజుని భక్తివీరము జూపవలయు ననెడి కోరిక శ్రీకృష్ణునకు జనించినట్లు స్పష్టము. మయూరధ్వజుని పట్టణమైన మణిపురము నందలి జనుల వర్ణనలు జూచినను నదియే స్పష్టము. శ్రీకృష్ణ భక్తిని ద్యోతకమొనర్చు ఘట్టములలో నిది గ్రంథమునకు దలమానికమై యున్నది.

ఈ కథాభాగమున భక్తులను భగవంతుడు పరీక్షించిన విధమును, భక్తుడు నెగ్గిన రీతియు సువ్యక్తమగుచున్నవి. అట్టి పరీక్షకు మయూరధ్వజుని వృత్తాంతము ప్రత్యక్ష నిదర్శనము.

8. అష్టమాశ్వాసములోని వీరవర్మ వృత్తాంతము శ్రీకృష్ణ మాహాత్మ్య సంఘటనమునకు మరొక మచ్చు తునక. వీరవర్మ యముని మామ. మయూరధ్వజ, ధర్మజ సవనాశ్వముల నీతడు పట్టుకొనెను. పలువురు వీరులు (బభ్రు వాహనానుసాల్వ, కర్ణజ, ప్రద్యుమ్న, మయూర ధ్వజాదులు) వచ్చినను నాతడు సరకు గొనక సమ్మోహనంబున బడవేసి, శ్రీహరియైన శ్రీకృష్ణుని, భార్గుని దన బంకలయం దిరికించుకొని చలనరహితుల నొనర్చెను. మధుమథనుడైన శ్రీకృష్ణుడు పాదముచే వీరవర్మ తలను దన్నగా, విడివడిన యా శ్రీకృష్ణార్జునుల వీరవర్మ గొనియాడెను.

> ''కృష్ణునిపాదపంకేరుహంబు శిరంబుఁ
> జెందెఁ గావునఁ జిరంజీవినైతి'' (జై. భా. 8-28)

ఈ విధముగా వీరవర్మ పల్కుచు,

> ...''ముజ్జగములు మీ కెదురుగావు
> మిమ్ము గెలువంగ నే నెంత మేటి'' (జై. భా. 8-28)

అని కూడ వాక్రుచ్చినాడు. పిదప వారితో గలసి యాగాశ్వ రక్షణ కార్యభారమును నిర్వహించి, యాగమునకు గదలెను.

ఇదియును గృష్ణుడు తన భక్తుల శక్తియుక్తుల జూపట్టుట కేర్పరిచిన భాగమే యగుచున్నది.

వీరవర్మ మయూరధ్వజుని కన్నను బలవంతుడు. సామాన్యులకు గొంకు వడనివాడు. అఖండ ప్రజ్ఞాపాటవములే గాక, కృష్ణభక్తి పరత్వమును గలవాడు. శ్రీకృష్ణు డాతనిని గాలదన్నుటతోడనే కృష్ణార్జునుల వదలివేయుట యాతని భక్తి వీరమును వ్యక్త మొనర్చుచున్నది. అచట కవి వీరవర్మచే "కావునఁ జిరంజీవినైతి" నని జెప్పించుట మిగుల సమయోచితమును, యుక్తియుక్తమును నగుచున్నది అంతియేగాక, కిరీటితో నచ్యుతుండు "వీడు దుర్జయుండు సత్త్వసంపన్నుఁడు. అక్షయ దివ్య మార్గణ కృతహస్తు'' దని చెప్పి, "మయూరకేతు ముఖ్య యోధుల జయించె మద్భక్తియుక్తు" డనియు బేర్కొనుటచే, భక్తుడును, సత్త్వగుణ సంపన్నుడును నగు వేఱొక్క మేటియగు భక్తుని గిరీటికి జూపి తన సార్థక్యము నా మహానుభావుడు నిరూపించుకొనియున్నాడు.

9. జైమిని భారతమునందలి కథా ఘట్టములలో మరొక్క ప్రధాన మైన వృత్తాంతము చంద్రహాసునిది. నారదునిచే వివృతమైన ఈ ఘట్ట మర్జునునికి దెల్పబడినది.

కేరళాధీశ్వరుడైన నొక్కరాజు కుమారుడైన చంద్రహాసుకు (మూలా నక్షత్రమునందు జన్మించుటచే) మూడు సంవత్సరముల వయసునందే తలి దండ్రులం గోల్పోయెను. పౌర భామిను లాతని బెంచిరి ఆ కుమారు డొక్కనాడు దుష్టబుద్ధియను మంత్రి సదనమునకు వెళ్ళి, దైవజ్ఞులచే మన్ననలను బొంద, వా రాతనిని క్ష్మామండలమేలు యదృష్టరేఖగల వాడని వివరించిరి. దుష్టబుద్ధిచే దండింప నానతీయబడిన భటు లాతని నడవిలో వదలిరి. కాబరదేశ విభుడైన కుళిందకుని కాతడు వేటలో లభించెను. ఆ రాజాతని జూచి, మనమున నీవిధముగ దలచెను-

హరిభక్తుండ తండు నేనును
హరిపదసేవకుండ నయ్యు ననపత్యుండనై
హరిం బలుమఱు నొలయంగ శ్రీ
హరి నా కిటు కరుణ చేసె నర్భకుననుచున్ (జై భా 8-45)

స్వయంప్రాప్తుండైన చంద్రహాసుకు హరిభక్తుండను నిర్వివాదాంశము కుళింద కుడును, చంద్రహాసుడును హరిభక్తులు చంద్రహాసుడు స్వయంప్రాప్తుడు. దైవదత్తుడు. దుష్టబుద్ధి సార్థక నామధేయుడు ఈతడు చంద్రహాసుని బలు మార్లు జంప మాయోపాయములను బన్నినాడు శ్రీహరి కృపచే నీతడు కుళిందకుని గుమారు డగుటయే గాక, రాజ్యపు వారసత్వమును బొందెను పదియాతేండ్ల వయసున నాతడు రాజైనాడు. "ఆ చంద్రహాసవిభుండుర్వీచక్రము ప్రజలెల్ల శ్రీవైష్ణవమార్గాచరణ తత్పరులుగా ప్రోచె" (8-60)

చంద్రహాసుడు వైష్ణవభక్తి ప్రతిపాదకమైన విశిష్టాద్వైత మార్గమున దాను నడచి, ప్రజలను గూడ నడపించినాడు. ఈతడు తలిదండ్రుల యెడ మిగుల భక్తిగలవాడు ఆపదలెల్ల నాతని బాయుటయే గాక, దుష్టబుద్ధి కుమార్తె యగు విషయను, గుంతలరాజ కుమార్తె యగు జంపకమాలిని గూడ వివాహము

జేసికొనుటకు శ్రీహరి కృప తోడయ్యెను. దుష్టబుద్ధి కాళికా గృహమున చంద్ర హాసుని చంపుటకు దలారులను బంప, వారిచే తానే హతుడై, చంద్రహాసుని సత్త్వగుణగరిమచే బ్రతికింపబడెను. అపకారము గావించిన వారికి గూడ చంద్ర హాసు దుపకారము జేసిన మహానుభావుడు, భక్తుడు.

10. పంచపాండవులు శ్రీకృష్ణ భక్తులు, భారతమున గాని, జైమిని భారతమున గాని వారు చేసిన ఘనకార్యములకు శ్రీకృష్ణుని దోడు గలదు.

''మన సారథి, మన సచివుడు,
మన వియ్యము............'' అను

బంధుత్వ విషయము జైమిని భారతము సందెచ్చటను జెప్పబడలేదు. కాని శ్రీష్ణుడు వారికి సర్వస్వము. వారాతని భక్తులు. పై పద్య భావము దెలుపు పద్యమును నీ గ్రంథమున గానరావు. వారికాయన ''ఆర్తత్రాణపరాయణుడు. ఆపద్బాంధవుడు''—

11 జైమిని భారతము నందలి భక్తులలో నెవరి భక్తి మిన్న యనెడి విషయము కష్టసాధ్యము. వీరంద రొకరి కొకరు దీసిపోని భక్తులు. వీరొకరితో నొకరు పోటీపడి శ్రీకృష్ణభక్తిని వ్యక్తము గావించిరి. ఈ గ్రంథమున గల భక్తులు -సుధన్వుడు, సురథుడు, బభ్రువాహనుడు, తామ్రధ్వజుడు, వీరవర్మ, చంద్రహాసుడు.

శ్రీకృష్ణుడు, తాను ముందే హస్తిపురికేగి విజయుని విజయవృత్తాంతము ధర్మజునకు నెఱింగించెను. ఆ సమయమున కవి కృష్ణునిచే నొక సీసపద్యము జెప్పించెను. ఆ పద్యములోని చిట్టచివరి వాక్య మీ గ్రంథమునకు నాయువు పట్టుగా నున్నది. అదియును గృష్ణుని వాక్య మగుటలో దాల ప్రాముఖ్యమున్నది.

సీ. ఇతఁడు నీలధ్వజుం డీశౌర్యనిధిపుత్రి
స్వాహాకు మగఁడు వైశ్వానరుండు
బభ్రువాహుఁ డితండు పార్థుని బ్రతికించె
రణములో జీవదరత్నమునను

ఇంద్రహాసుండు విస్మయచరిత్రుం డితం
డలిగినఁ బంకింతు రమరులైన
బర్హికేతనుఁ డీ నృపాలుఁ డేఁడిగిన
సగమిచ్చెఁ దనువు నిశ్శంకఁ గోసి

తే. యితఁడు హంసధ్వజుఁడు వీనిసుతులశిరము
లాజి రుద్రుండు ధరియించె హారములుగ
వీరవర్మ జముని మామ "వీరియట్ల
యొకరికిని నొక రధికు లీయున్ననృపులు." (జై. భా. 8-172)

పై పద్యమున కట్టచివరి వాక్యములో-

"వీరి యట్ల యొకరికిని నొక రధికు లీయున్ననృపులు"- అనునది శ్రీకృష్ణుని దృష్టిలో భక్తి యందే వారు పోటీపడినారనుట నిర్వివాదము. వీరం దరును నృపులే కారు భక్తులును నృపుల రూపములోని భక్తులై రాజర్షులై యున్నారు వారి వ్యక్తిత్వము నర్జునునకు జూపుటలో శ్రీకృష్ణు డీ గ్రంథమున సూత్రధారి యైనాడు. శ్రీకృష్ణుడు తన మహత్త్వము జూపనిదే విజయుడు విజయము గాంచలేడు అశ్వమేధ యాగమైన పిమ్మట సగౌరవముగా యుధిష్ఠిరుని పూజలన్నియు నాతడు గైకొనినాడు. ఆతని ప్రాధాన్యమును జైమినియు, వీరభద్రుడును గ్రహించి యుక్తియుక్తముగ జిత్రించి యున్నారు. గ్రంథ మాసాంతము చదువనిదే శ్రీకృష్ణుని పాత్రను గ్రహింపనేరము ఈయన జైమిని భారతమున సర్వోత్కృష్టుడు. సంపూర్ణుడు. శ్రీకృష్ణుడు లేని జైమిని భారతము లేదు.

1 ఈ విషయము 'తెలుగులో హరివంశములు' అను సిద్ధాంత వ్యాసములో డాక్టర్ పి యశోదారెడ్డి గారు 11, 12, 13, 14 పుటలలో పేర్కొనియున్నారు

2 'తెలుగులో హరివంశములు' - ప్రమతి యశోదాంధ్ర ముద్రిత సిద్ధాంత వ్యాసము- పుటలు 523, 524

ఆంధ్ర వాఙ్మయములోని గ్రంథము లన్నియును పెక్కు శాఖలుగ విల సిల్లినవి. ఆదిగ్రంథమగు మహాభారత మిట్టి గ్రంథముల కెల్ల తలమానికము. మహాభారత రచయితలగు కవిత్రయములోని మూడవ కవి యగు నెఱ్ఱాప్రగ్గడ వ్రాసిన హరివంశమును, దదుపరి వచ్చిన నాచన సోమనాథుని యుత్తర హరి వంశమును, నా పిమ్మట పోతన రచించిన మహాభాగవతమును నుతి కెక్కినవి. శ్రీ కృష్ణభక్తి వాఙ్మయ శాఖయు, రామభక్తి వాఙ్మయ శాఖయు, నాంధ్రేతర వాఙ్మయములలోని హిందీభాషలో ముఖ్యముగ విలక్షణ శాఖలై గణుతికెక్కినవి. దానిని 'Radha Krishna Cult' అను పేర బిలుచుచున్నారు. సంస్కృతములోని గీతగోవిందాది మహాగ్రంథము లిట్టి వాఙ్మయమున నావిర్భవించిన మొదటి గ్రంథములలో గలవు. పిమ్మట వచ్చిన తెలుగు గ్రంథములలో కేవల శైవమత గ్రంథములును శివకవి యుగములో గలవు కాని కేవల కృష్ణభక్తి తత్త్వము నిరూపించు గ్రంథము భాగవతము తరువాత జైమినిభారత మనియే చెప్పవచ్చును. ఈ జైమిని భారతము సంస్కృత మూలానుసారి. వస్తు వశ్వమేధ పర్వములోనిది. పాత్రలు మహాభాగతములోనివే. వ్యాసాశ్వమేధమునకును, దీని కిని భేదమున్నది. అంగిరసము వీరము. అంగరసములు- అద్భుత, బీభత్స, కరుణాదులు. అంతర్గత భావము భక్తి ఇవన్నియు గ్రంథాదినుండి యంత్యము వఱకును నిరుపమాన ప్రతిభతో వెలయింపబడి, ధర్మ ప్రతిపాదనకై నిలచినవి. ఎన్ని యుద్ధములు వర్ణించినను దిక్కన తన హృదంతరాళమున ధర్మదృష్టి నెట్లు విడువలేదో, పీరభద్రుడు కూడ రచనలో నాద్యంతము దదేకదృష్టితో ధర్మమునే నెరపెను. సూక్ష్మముగ నాలోచించినచో జైమిని భారతములో పాండ వులకు శ్రీకృష్ణుని యందు గల భక్తి నవవిధములుగ స్ఫురించుచున్నది తమ మనోవాక్కాయములతో వారు శ్రీకృష్ణ దైవతము నారాధించిరి. వా రాచరించు ప్రతి కర్మయందును శ్రీకృష్ణ దర్శనమే వారికి రక్ష. వా రొనరించిన కార్యము లన్నిటికిని ప్రేరణము శ్రీకృష్ణునిదే. కాని ఫలము మాత్రము వారిది. ఆ విషయ మీ గ్రంథమున నిరూపితమైనది. వారికి గల భక్తిని వారు భాగవతమునందు నిర్దేశింపబడినట్టి రీతిలో చూపిరి. ఆ యుద్గ్రంథము నందలి శ్లోకమున 'నవవిధ భక్తు' లీ క్రింద పేర్కొనబడిన రీతిని వివరింపబడినవి-

శ్లో. శ్రవణం, కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణోభక్తిశ్చే న్నవలక్షణా
క్రియతే భగవత్య ద్ధితన్మన్యే ధీతముత్తమమ్.''

నవవిధ భక్తులు

1. అర్చన, 2 కీర్తన, 3. వందనము, 4 దాస్యము, 5. స్మరణము 6. పాదసేవనము, 7. శ్రవణము, 8. ఆత్మనివేదనము, 9 సఖ్యము.

జైమిని భారతమునందలి కథ (వస్తువు) పంచపాండవులకును, శ్రీకృష్ణునకును సంబంధించినది మహాభారతమునందును నీకథ వారికి సంబంధించినదే. కాని మధ్య మధ్య తెలుపబడిన యుపాఖ్యానము లీకథ కంతరాయములు గాక, కథలోని వైవిధ్యమును, పౌరాణిక వివరణమునే కాక, ప్రధానకథ కుపాఖ్యానములతోడి సంబంధమును గూడ తెలుపుచున్నవి.

"మన సారథి మన సచివుడు..."
పై పద్యమును బట్టి శ్రీకృష్ణుని యెడల పాండవులకు గల భక్తి యంతయును గ్రహింపనగును.

జైమిని భారతమునందలి కథ ప్రథమమున యుధిష్ఠిరుడు రాజ్యము నొల్లనని, కానసముల కేగుదు ననుటతో ప్రారంభమగుచున్నది. ఈ విషయము ధర్మజుడు వ్యాసునితో నాటించినది.

ఆ. గురుడు కుంభజుండు సురనదీసూనుండు
జూడలేని రాజ్యసుఖము నాకు
గన్నదోయి లేనికాయంబు లోయంబు
గాని మిగుల సౌఖ్యకరము గాదు.

ఉ. పిన్నటనాటనుండి నను బెద్దగ జూచిన వంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నా కిది యేల సత్త్వసం
పన్నిధి వాయునందను బట్టము గట్టెద నేటితోన నే
నన్నియు మాని కానలకు నేగెద నిష్ఠ దపంబు జేసెదన్.

(జై.భా. 1-58, 59)

ఈ పద్యములో రాజ్యము యెడల ధర్మరాజు చూపిన వికలమనస్కత, వైముఖ్యము వ్యక్తమగుచున్నవి. అంతియేకాక, ధర్మనందనుడు తనకు పాతకము లీ విధముగా తా నొనరించియు తత్పరిహారమగు నొక్క పుణ్యకార్యము చేయదలంచి నాననియు, దానిని వివరింపు మనియు నడిగెను. దానికి వ్యాసు డీ క్రింది విధముగా బల్కెను—

సీ. తలఁకకు ధర్మనందన నీకు గోత్రవ
ధం బొనర్చిన దురితంబు వాయ
నశ్వమేధంబు జేయ నుపక్రమింపుము
తొల్లి రాముఁడు జగం బెల్ల నెఱుఁగఁ
బౌలస్త్యుఁ జంపినపాతకంబు హరించె
హయమేధయాగత్రయం బొనర్చి
శౌరిశాసనమున సంగ్రామజయలబ్ధ
మైనరాజ్యంబు నీ కగునె విడువ

తే. సకలయాదవులును దైవసంబు నీకఁ
గాన నీకానితలఁపులు గట్టిపెట్టి
తురగమేధంబుఁ జేసి కౌతుకము తోడఁ
గురుకులంబున సత్కీర్తిఁ గుదురుకొల్పు. (1-61)

ఈ విధముగ వివరించుచు, వ్యాసు డశ్వమేధ విధానమును ధర్మరాజునకు దెల్పెను. పిమ్మట భీముడు శ్రీకృష్ణమాహాత్మ్యము నీ క్రింది విధముగ వర్ణించెను—

'ఎవ్వని ప్రాపున గెలిచెన్
గవ్వఁడి నెవ్వఁగ విరోధిగణముల ననిలో
నవనజాక్షుఁడు కృష్ణుఁడు
దవ్వల నున్నాడు క్రతువు తరమే చేయన్. (1-81)

అంతియగాక, 'బంధునాశనము వలన నే విధమైన పాపము కలుగదు. అదియు వాసుదేవుని శాసనమే. జన్నము సేయకున్నను వెన్నుడు నిన్ను ధన్యునిజేయు" నని భీముడు తన యన్నతో వాక్రుచ్చెను,

ఈ విధమున బల్కిన పల్కులు శ్రీకృష్ణమాహాత్మ్యమును ధర్మరాజునకు దెలుపుటకై భీముడు వినిపించెను. శ్రీకృష్ణమాహాత్మ్యము ధర్మరాజునకు వినూత్నమైనది కాదు. కాని తాత్కాలికముగ భీము డా విధముగ వివరింపదగిన సమయమది. నవవిధభక్తులలో 'శ్రవణమా' సమయమున శ్రీకృష్ణమాహాత్మ్య కథనమైనది.

ప్రథమాశ్వాసముననే భీముడు హయమేధ తురగమును గొని వత్తుననుచు శ్రీకృష్ణుని గీర్తించినాడు. ఈ కీర్తనయు నవవిధభక్తుల లోనిదే. భీమునిచే శ్రీకృష్ణుడు నుతింపబడిన రీతి-

తే. వాసుదేవుని కృప గలవారి కెందు
నరయ దుర్ఘటమైన కార్యమును గలదె. (1-85)

భీము డిట్లు శ్రీకృష్ణకృప గల వారెల్లరకును సాధింపరాని కార్యము లేదని పల్కుచు శపథములు చేసినాడు.

సర్వసాధారణముగ 'గీర్తనము' భగవంతుని గూర్చి భక్తులు చేయునది. ఇచట సర్వకార్యములకు బాండవులకు శ్రీకృష్ణుడు భగవద్రూపమున వెంటనంటి కార్యసాఫల్యమును గావించినాడు. కీర్తి యనునది వినబడు నదియే. దీనిని జూచుటకు వీలులేదు. అట్టి కీర్తి వ్యక్తిగతమైన యే విశేషము వలననైనను విశేషణ రూప మగుచున్నది. విశేషణ రూపమున దెలియనగు గీర్తి వినదగు నదియే. అట్టి దానిని జూచుటయు నసంభవ మగుచున్నది. వినదగిన యా కీర్తియే కీర్తనము. ఆ కీర్తనమే భగవంతునికై భక్తు లొనర్చు సంకీర్తన మగుచున్నది.

'కమలాక్షు నర్చించు కరములు కరములు'
అను భాగవత పద్యములో ప్రహ్లాదుడు నుతించినట్లు-

"విష్ణు నాకర్ణించు వీనులు వీనులు"
అను వాక్య మిట సార్థకమై నవవిధ భక్తులకు, భక్తి తాదాత్మ్యమునకును ప్రతీక యగుచున్నది.

గజేంద్రుని వలెనే పాండవులలోని భీముడు పల్కిన పల్కులు కూడ "నీవేతప్ప నితఃపరం బెరుగ.... రావే యీశ్వర కావవే వరద సంరక్షింతు భద్రాత్మకా'' యను భాగవత వాక్యములను స్మృతికి దెచ్చుచున్నది. 'అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ'' యను దానికిది యనుకృతియే.

జైమిని భారత కథాభాగపు ప్రారంభమున ధర్మజుని మానసికస్థితియు, భాగవతములోని ప్రహ్లాదుని భక్తి పారవశ్యమును, గజేంద్రుని నిస్సహాయస్థితిని బోలినదే భాగవతమున భక్తి పారవశ్యమున దన్మయులై యున్న భక్తుల మానసికదైన్య మిచటను ద్యోతమానమగు చున్నది. అట్టి రీతిలో ధర్మజుని మానసికస్థితి భీ´ ని వాక్యములలో ప్రతిబింబించుచున్నది. ఆ దైన్యమున తన్మయావస్థలో వారు శ్రీకృష్ణుని గీర్తించుటయు సహజావబోధకమే. జైమిని భారతము కూడ భాగవతము వంటి శ్రీకృష్ణమాహాత్మ్య వర్ణన మొనర్చిన పెక్కు గ్రంథములలో నొకటి యగుట దీనినిబట్టి స్పష్టపడుచున్నది. ఇట్టి వర్ణనము కథాప్రారంభము నుండియే కననగుటయు నిందలి విశేషమే. పై వాక్యము నిదియు బలపరచుచున్నది.

ప్రథమాశ్వాసములోని మరి మూడు పద్యములు కూడ ధర్మజుని మానసిక నైర్మల్యమును, నిస్సహాయత నభివర్ణించుచున్నవి.

సీ. మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని
యపరసంధ్యాక్రియ లాచరించి
యనుజులు గొల్వ సింహాసనంబున నుండి
క్రమ్మరఁ జింతాభరంబు దాల్చి
యంతరాయము లేక హయము వచ్చుట యెట్లు
సత్రక్రియ యాగంబు సాగుటెట్లు
దానదక్షిణలకు ధనము గల్గుట యెట్లు
మునిమాట కే నియ్యకొనుట యెట్లు

తే. చాల దుష్కరమైన యీ జన్నమునకుఁ
దోడు దొన యైన చుట్టంబు దొరకు టెట్లు
దేవకీసూతి త్రిభువనాధిపుఁడు తాన
యెఱిఁగి సాధింపకున్న నీడేఱు టెట్లు.

తే. హా సరోజాక్ష గోత్రభిదుద్భవమున
మునిఁగియున్నాఁడఁ జేయూఁతఁ గొనఁగ లేక
నీకృపాదృష్టి పేరోడ గాఁకయున్న
నెడలఁబడు బెట్లు మఱియు గావించు బెట్లు

క. కౌరవ సభలో లజ్జా
వారిధి దిగ నుద్ధరింపవా ద్రౌపది న
న్నారీతి నుద్ధరింపుము
నీరజదళనేత్ర కలుషనీరధివలనన్. (1-105, 106, 107)

ఈ పద్యత్రయములో ధర్మరాజు, ద్రౌపదితో దన్ను బోల్చుకొని యున్నాడు. అలనాటి కౌరవ సభలో మానమును గాపాడుటకై తా నామె నెట్లుద్ధరించెనో తన్నును నట్లే యుద్ధరింపుమని వేడ్కొనుటయు, ధర్మజుడు శ్రీకృష్ణుని "స్మరించి"నట్లు స్పష్టపరచుచున్నది.

ఈ విధమున యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని నుతింపగ జరిగిన సంఘటనను గవియు నొక్క వచనమున నొక్క పద్యమున వివరించెను.

వ. అని పెక్కుఁ దెఱంగుల న క్కమలోదరుం బేర్కొని దీనాతిదీనంబు లగు వాక్యంబులం బ్రస్తుతింప సమస్త భువనవ్యాపియు విశ్వరూపియు నగు గోపికారమణుండు దక్షణంబ వచ్చి వాకిట నిలచి ప్రతీహారిం గనుంగొని మదీయాగమనంబు ధర్మపుత్త్రున కెఱింగింపు మంతవారికేని మహీకాంతుని యవసరంబు దెలియక చనవు మెఱసి యంతఃపురంబునకుం జనుట యనుచితం బనిన వాఁడును గృతవందనుం డయి గోవిందున కి ట్లనియె.

సీ. దేవర యేవేళ నీవు వేంచేసిన
సమయంబ యని ధర్మసంభవుండు
నాతోడ మొదల నానతి యిచ్చె నవసరా
నవసరంబులు మీకు నరయఁగ వలదు

పరధనాపహారులును బరదోషనిరతులు
బరవధూరతులును బడయలేరు
నీదగు కరుణ గణింపఁగా నిట్టి దు
ర్గుణములు ధర్మపుత్త్రునకు లేవు

తే. భగ విలోకించి తద్వాంఛితంబు దీర్పఁ
దానుఁ దమ్ములు నీపదధ్యానపరత
నున్నవా రని పలితెంచి సన్నుతో క్తిఁ
గృష్ణుఁ దేతెంచె నగరి వాకిటికి ననిన. (జై. భా- 1-108, 109)

ఈ పద్య, గద్యముల వలన శ్రీ కృష్ణునికిని, పాండవులకును గల యాత్మీయత వెల్లడియగుచున్నది.

భగవంతునికి భక్తులును, భక్తులకు భగవంతుడును జూపెడు యాత్మీయతయే పై పద్యమున వ్యక్తమగుచున్నది. ఎల్లప్పుడు నంతఃపురమునందు ప్రవేశింపవచ్చునని ధర్మరాజాజ్ఞ యని ద్వారరక్షకుడు నుడివినను, శ్రీకృష్ణుడు వాకిటనే నిలచినాడని యాతడు లోనికి వెళ్లి చెప్పక తప్పలేదు. ఇది భక్తులను భగవంతుడు పరీక్షించు రీతి. తాను పాండవ పక్షపాతియైనను, వారు నుతింపదాను వచ్చినను, ప్రత్యక్షమగుటకు ముందు భగవంతు 'డాత్మనివేదనము' జేసికొననివారియెడల దాక్షిణ్యము వహింప దనుటయు స్పష్టమగుచున్నది ఇట్లే పెక్కురు భక్తులు పెక్కు గ్రంథముల యం దాత్మనివేదనము చేసికొను సమయమాసన్నమగు వఱకును బాధల యం దుండినట్లు స్పష్టము. అట్టివారిలో భాగవతము నందలి గజేంద్రుడు, ప్రహ్లాదుడు మున్నగు భక్తశిఖామణులు గలరు.

'ఆత్మనివేదన' మనగా భక్తుడు భక్తిపారవశ్యము నందు సర్వవిషయములను వీడి, తన్నుదా భగవంతునకి సమర్పించుకొనుట అనగా నరిషడ్వర్గాదులగు గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను వదలుట. అవియేగాక యాత్మసంబంధులగు నహంకార, మమకారముల నుజ్జగించుట. వీనిని దూరము చేసిన పిమ్మట స్వచ్ఛమైన యాత్మను భక్తి పారవశ్యముచే తాదాత్మ్య స్థితిని బొంది భగవంతుని ధ్యానించుట. భగవంతుడు సర్వోన్నతుడు సర్వశక్తి సంపన్నుడు (Omnipotent), సర్వవ్యాపి (Omnipresent), సర్వ

జ్ఞుడు (Omniscient) — అనియు నీ వేదాంత పారిభాషిక పదములలో సువ్యక్తమగును. ఈ స్థితిలోననే భక్తుఁడు భగవంతుని యారాధింప వలెను. ఈ యారాధన మాత్మగతమై యుండును. కరచరణాద్యవయవములచేత నీ యారాధనము జరుగదు. ఇది కేవలము మానసికమైన విషయము. దైనందినాదులగు నిత్యకృత్య విషయములు గాని, త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణేంద్రియ, శ్రవణేంద్రియ సంబంధులగు శబ్దరూప గంధాదులగు నైహిక విషయ వాంఛలకు గాని, తావు లేదు. ఐహికాముష్మికముల నేకదృష్టితో జూచెడు పరమహంసయే ధర్మరాజు. అట్టి దృష్టిగల శుకయోగితో ధర్మజుని బోల్పనగును. ఆత్మనివేదనము లేనిదే భగవంతుడు భక్తుల సమీపించ డనుట కిది ప్రబల ప్రత్యక్ష ప్రమాణ పూర్వక నిదర్శనము.

పంచపాండవులు శ్రీకృష్ణుని గాంచిన తోడనే,

ఉ. దిగ్గన లేచి యవ్వసుమతీపతి భీముఁడు సవ్యసాచియున్
దగ్గఱి కొల్వ నాననమునన్ దరహాసమనోజ్ఞ చంద్రికల్
నిగ్గులువాఱ మత్తగజలీల రయంబున నేఁగుదెంచెఁ దా
నగ్గరుడాంకుఁ జేరఁ బులకాంకురముల్ దనువెల్ల నిండఁగన్. (1-110)

పులకలెత్తినవి. ఈ పులకలు, భక్తితోడను, స్నేహము తోడను గల్గినవి. పంచపాండవులకు శ్రీకృష్ణుని యెడల భక్తి పూర్వకమైన స్నేహము గలదు. ధర్మకార్యములనే వీరాచరింతురు సర్వసాధారణముగ పులక (Horripilations) లెల్లెడల నాత్మీయుల దర్శించినను, స్పర్శించినను గలుగును సర్వవ్యాపి యగు శ్రీకృష్ణుడు పాండవులకే సమయమందైనను బిలచిన వెంటనే పలుకును. అట్టి "సఖ్యము" పురాణములయం దపూర్వము ఇది యాదర్శమైనది.

ఉ. "వచ్చినధర్మజుం గదిసి వారిజనాభుఁడు మ్రొక్కె మ్రొక్కినన్
గ్రుచ్చి కవుంగలించుకొనెఁ గూర్మియుభక్తియుఁ బొత్తుసేయఁగా
ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధము మూర్కొని లోచనంబులం
బిచ్చిలి రాలు బాష్పజలబిందుములు మౌళి నలంకరింపఁగన్." (1-111)

ఇచట ధర్మరాజు, శ్రీకృష్ణుని హత్తుకొనినాడు. వారి యా స్నేహమునందు ప్రేమయు, భక్తియు గలవు. ఈ రెండును దొత్తగుటయు, ముచ్చటవాయ మూర్ధమును మూర్కొని యుండగ, శ్రీకృష్ణుని లోచనములనుండి యానందామృత బాష్పజల బిందువులు ధర్మరాజు మౌళి నలంకరించినవి.

ఈ పద్యము వారి గాఢ స్నేహమును నిరూపించుచున్నది ఇచట ధర్మరాజునకు దనువెల్ల బులకలు నిండినట్లును వర్ణింపబడినది. శ్రీకృష్ణుడును, ధర్మరాజును బరస్పర మాత్మీయతాభావముతో 'సఖ్య'ముతో గ్రుచ్చి కౌగిలించుకొనిరి. సఖ్యము వలన గూరిమి యేర్పడును ఆ కూరిమికి భక్తియు దోడైనది. నవవిధ భక్తులలోని 'సఖ్య' మిట సార్థకమైనది. చాల కాలమునకు బరస్పర దర్శనము లభించినది. అదియును ధర్మరాజు తలచినతోడనే లభ్యమైనది. ఇది సర్వసాధారణముగ నెంతటి స్నేహితులైనను సాధింపరానిది. ఇది భగవద్భక్తులకును, భగవంతునకును సంబంధించినది.

''కలడందురు దీనులయెడ'' యనునట్లు నిండు మనమున దలచిన వెంటనే భక్తులకు భగవంతుని దర్శనమగును. శ్రీకృష్ణుడు కూడ తన భక్తులగు ధర్మరాజాదులకు నట్లే దర్శన మిచ్చినాడు.

క. గోవిందుని పాదములకుఁ
బావనియును నర్జునుండు బ్రణమిల్లిరి రా
జీవయుగళంబుపైఁ గ్రొ
త్తావులు గొను బ్రాలుతుమ్మెదల చందమునన్ (1-112)

ఇచట నవవిధభక్తులలో వందనము, పాదసేవనము, — రెండును నొక్కచోట మిళితమైనవి. గోవిందుని పాదములకు భీముడును, నర్జునుడును నమస్కరించిరి

అంతియేగాక, వారి క్రింది వచనమున వర్ణింపబడినట్లు శ్రీకృష్ణుని గౌరవించిరి—

''ఇత్తెఱంగునం బాండునందనులు వసుదేవ నందను సంభావించి యంతఃపురంబునకుం దోడ్కొనిపోయి యర్ఘ్యపాద్యాది విధులం బూజించి యర్హాస

నంబుల నాసీనులయి యున్న యెడల బాంచాలరాజనందన వినయంబున న చ్యుతుండునకు వందనం బొనర్చి మందస్మితవదనారవింద యగుచు నరవింద నాభురాకకు విస్మయం బందుచున్న యన్నరవరాగ్రజుం గనుంగొని యి ట్లనియె." (1-113)

ఈ వచనములో నర్ఘ్యపాద్యాది విధులం బూజించి, ద్రౌపదియు వందన మొనర్చినది.

భగవంతుని పెక్కు విధముల నుతించి, దర్శనము గాంచిన పాండవు లర్చనమును గూడ చేసిరి. సార్థకమైన వారి నుతి, భగవద్దర్శనానంతర స్పర్శయుతార్చనము, పతాక స్థాయిలోని వారి భక్తికి నపూర్వ నిదర్శనములు.

ఈ విధముగ విస్మయ పూర్వకమగు భక్తితత్వము గల ధర్మరాజుతో దాస్యభావ సమ్మిశితమైన భక్తి గల ద్రౌపది క్రింది విధమున నుతించియున్నది-

"దాసజనుం డెందు నే యుపద్రవముం జెందు
నందులకు వచ్చి రక్షించు నచ్యుతుండు"

ఉ. ఈవు మనంబునన్ మఱచితే సభలోఁదనచీర యొల్చుకోఁ
గా విడిపింప నందఱును గల్గియు నిర్దయులై కనుంగొనన్
హా వసుదేవపుత్త్రి యన నక్షయవస్త్రము లిచ్చి నన్ను ల
జ్జావనరాశిలో మునిగిఁ చావకయుండఁగ నుద్ధరించుటల్.

తే. మనము గాండీవి నంపుద మని తలంపఁ
దలపులోనన వచ్చెను దక్షణంబ
భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడె
దేవతారత్న మీవాసుదేవుఁ డనఘ (1-114, 115, 116)

పై పద్యములలో నచ్యుతుని భక్తురాలగు పాండవపత్ని ద్రౌపది భావము దాస్యము పూర్వము కౌరవ సభలో జరిగి ఉదంతము మొదట ధర్మరాజు చేతను, పిదప ద్రౌపది చేతను నుటంకింపబడినది. కాని ద్రౌపది చెప్పినట్లు 'దాసజను లే యుపద్రవమునం దున్నను నచ్యుతుండు వచ్చి రక్షించు' నను

వాక్య మిట సార్థకమైనది. శ్రీకృష్ణ దర్శనము కాకపూర్వము కౌరవ సభలో ద్రౌపదికి జరిగిన అవమానము ధర్మరాజుచే వివరింపబడినది. కృష్ణ దర్శనమైన పిమ్మట ద్రౌపది పై విషయమునే పునరావృత్తము గావింపుటయు పాండవుల యెడ శ్రీకృష్ణుని పక్షపాతదృష్టిని, ధర్మరక్షణకై యాతని చర్యలను వ్యక్తము చేయుచున్నది.

ఈ విధముగ జైమిని భారతము నందలి 'నవవిధ భక్తితత్త్వము' పాండవులకు శ్రీకృష్ణుని యందు గల భక్త్యుద్రేకము దెలుపుచున్నది

ఈ గ్రంథము నందలి నవవిధభక్తులు, పాండవులకు గల భక్తిని వ్యంగ్యదృష్టితో గాక వాచ్యముగనే తెలుపుచున్నవి. పైన పేర్కొనినట్టి తొమ్మిది రీతులును మనోవాక్కాయము లందు పాండవులు కృష్ణభక్తిని నెరపిన విధమును గ్రంథము నందలి ప్రథమాశ్వాసమునసనే స్పష్టపడుచున్నది. వా రాయనతో సమన్వయమును బొందిరి.

అశ్వమేధయాగమునకు దగిన హయమును గెలిచిన పిమ్మట నొక మాసముండి శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళినాడు పదునొకండు నెలలైన పిమ్మట ధర్మజుడు తిరిగి భీముని బంపి సమస్త కుటుంబ సుహృత్పౌర పురోహితాచార్య గురు బాంధవ మంత్రి పురస్సరముగ శ్రీకృష్ణుని యాహ్వానించెను. సరససల్లాపము లాది షడ్రసోపేతమైన భోజనాదులైన పిమ్మట, తండ్రి యాజ్ఞ గైకొని యాగనిర్విఘ్నమునకై శ్రీకృష్ణుడు ద్వారావతినుండి హస్తినావతికి గదలెను. యాగమునకు సర్వసన్నద్ధమైన సమయమున సనుసాల్వుడు పూర్వవైరముచే హయము నపహరించి, శ్రీకృష్ణుని మూర్ఛ నొందించెను. కర్ణసుతుడైన వృషకేతను డాతని మూర్ఛను దొలగించెను

ఇరువది దినములైన పిమ్మట యాగాశ్వము వెంట సద్యునుడు, యౌవనాశ్వుడు, సనుసాల్వుడు మొదలగు మహారథికవరులతో యాత్రకై బయలు దేరెను

8)

అట్లు వారు మొదట నీలధ్వజునితో యుద్ధము చేసి, తుట్టతుదకు గెల్చి, సౌభరి యాశ్రమము గాంచి, పిమ్మట హంసధ్వజమహారాజుతో యుద్ధము జేసిరి. మహాభక్తుడగు సుధన్వుని యుద్ధమునకు నర్జునుడు తట్టుకొనలేక శ్రీకృష్ణుని ధ్యానించగ నాతడు ప్రత్యక్షమయ్యెను.

సాధారణముగ జైమిని భారతము నందలి యశ్వమేధ పర్వమునం దర్జునునితో బోరిన వారెల్లరును శ్రీకృష్ణభక్తులే యగుట గమనార్హము. ఎల్లెడలను వా రర్జునునితో యుద్ధము చేయుటయు, శ్రీకృష్ణ సాహాయ్యమున వారందరు నర్జునునితో స్నేహమును బొందుటయు జరిగినది. అట్టిదే బభ్రువాహనునితోడి యుద్ధమునను, తామ్రధ్వజ, మయూరధ్వజ, వీరవర్మ, చంద్రహాసాదులతోడి యుద్ధములందును జరిగినది.

ఈ విధముగ యాత్రాంత్యము వరకును శ్రీకృష్ణు డర్జునుని వెంట నుండి యుద్ధముల యందు నిజ మాహాత్మ్యమును జూపుటయే గాక తన భక్తశిఖామణు లందరను మిత్రులుగ నొనర్చియున్నాడు

సైన్యమును, సకల రాజ సమూహమును హస్తిపుర బహిఃప్రదేశమున నిలిపి, శ్రీకృష్ణుడు ధర్మరాజును గలసి యాతని యనుజన్ముని ప్రతాపాగ్నిని వివరించి యాతనికి నమస్కరించెను. పిమ్మట ధర్మరాజు హయమేధమును సమస్తపరివార సమేతముగ నిర్వహించెను. వేదవ్యాస, బకదాల్భ్య, కణ్వాది మహర్షు లేతెంచిన యా తురగమేధయాగము సంపూర్ణమగు సమయము వరకును శ్రీకృష్ణు డచట నుండి, పిమ్మట ద్వారకాపురి కేగెను.

దీనినిబట్టి పంచపాండవులకును, శ్రీకృష్ణునకు గల పరస్పర బంధు మిత్రభావములు ద్యోతమానమగుచున్నవి. నిజముగ నర్జునుడును, శ్రీకృష్ణుడును నరనారాయణులే యనుమాట భారతమునందే కాక, వ్యాసశిష్యుడైన జైమిని వ్రాసిన భారతాశ్వమేధపర్వము నందును నిరూపితమైనది.

పై విషయమును నిరూపించుటకే జైమిని తన సంస్కృత జైమిని భారతమున నీ శ్లోకమును బ్రప్రథమముననే వ్రాసియున్నాడు.

'నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్'
(జై.భా. (సం) - ప్రథమోఽధ్యాయః - 1)

దీనినిబట్టి శ్రీకృష్ణార్జునులు నరనారాయణులనియు, జైమిని భారతము కూడ 'జయ' మని పిలువనగు ననియు నిరూపితమైనది.

కృష్ణార్జునుల సంబంధము విడదీయరానిది. వా రెల్లెడల నెల్లసమయము లందును గలసియే యుందురు. వారి నెవ్వరును విడదీయలేరు. వారి సంబంధము వాగర్థముల వంటిది. ఆత్మ - శరీరముల వంటిది. విడదీసినచో శరీరము మృతప్రాయ మగును. ఈ సంబంధము కేవలము కృష్ణార్జునులదే కానేరదు. పంచపాండవు లందరకును శ్రీకృష్ణునితోడి సంబంధ మట్టిది. గ్రంథమునందు "నవవిధభక్తులు" ప్రముఖమైన పాత్రను వహించుచున్నవి భక్తులతో భగవంతునికి గల సంబంధము స్పష్టాస్పష్టమగు వ్యంగ్యమార్గమునగాక స్పష్టమగు వాచ్యరీతిలో నిరూపితమైనది. ఉత్తరహరివంశ, హరివంశ, భాగవతాదుల వలెనే జైమిని భారతము కూడ భక్తిని జిప్పిల్లుచు, దానిని పతాకస్థాయిలో జూపుటకు వ్రాయబడిన యుత్తమ గ్రంథరాజముగ నతి కెక్కినదై యున్నది. పరమభాగవతులకు జైమిని భారతము నిలయము పరమ హంసలను బరమోత్కృష్టస్థితిలో వర్ణించిన నీ కవి భక్తకోటికి గ్రంథము నందలి యుత్తమ వృత్తాంతముల నెనలేని విధముల దెలిపి ధన్యుడైనాడు ఏ తద్రచనమును జదివి మనమును ధన్యులమై, యాభక్తితత్వమును గ్రోలితిమి

## భారతీయ భాషలలో జైమిని భారతములు

### : కన్నడము :

ఈ గ్రంథము కన్నడ భాషలో లక్ష్మీశ కవిచే వ్రాయబడినది ఇందలి కథావస్తువు పాండవాశ్వమేధము. ఇది 34 అధ్యాయములలో 'వార్ధిక షట్పద'లో వ్రాయబడినది 1906 షట్పదములు గలవు. శ్రీ కృష్ణ వంశావళియు గలదు. కృష్ణభక్తియే ప్రధానాంశము. వైశంపాయన మహర్షి శిష్యుడైన జైమిని మహర్షి జనమేజయునకు కుష్ఠురోగ నివారణార్థము ఈ కథను చెప్పినాడు. జైమిని భారతము ప్రసంగములలోనను, నాటకములలోనను ప్రదర్శించుటయే

దీని బహుళ ప్రాచుర్యమునకు దార్కాణము. ఇది హృదయంగమము, ఆహ్లాద కారి, ఆత్మోద్ధారకారి, పూజనీయము. "ఈ పవిత్ర గ్రంథము కన్నడ దేశ సంస్కృతియై, చాలక శక్తియై, ప్రేరకశక్తియై పరిణమించినది' — అని శ్రీ జవరె గౌడ తెలిపియున్నారు.[1]

కన్నడ జైమిని భారతమునకు 'భానుప్రభ' యను వ్యాఖ్య వ్రాయబడి నది. పండిత శ్రీకంఠయ్య సవరు, శంకర భట్ట రవరె కలసి ఈ వ్యాఖ్యను పూర్తి చేసినారు. మైసూరులో గల (ఓరియంటలు) తాళ పత్రాలయములో నైదు తాళపత్ర ప్రతులు గలవు. ఇందు భిన్న పాఠములు గలవు.

ఇందలి భాగములు కన్నడమున బెక్కు పర్యాయములు ప్రచురింపబడి యున్నవి.

1. జైమిని భారత కథాసంగ్రహ - రామారావు.
2. జైమిని భారత వెంణ మహాకావ్యవు — లక్ష్మీశ.
3. జైమిని భారత సంగ్రహ - జవరె గౌడ
4. చంద్రహాస విలాసయ సంధి
5. చంద్రహాస కథె (1954) — ఎన్. బసవనారాధ్య.

**అనువాదమునకు ఉదాహరణము :**

శ్రీ కృష్ణుడు పురజన సహితముగ మార్గము నందొక కాసార తీరమున విడిసి సంధ్యా సమయమగుటచే నా సరోవరము వర్ణింప గోరి రుక్మిణీ సమేతుడై మలయానిల సంచలితారవింద బృందముల వీక్షించుచు తన ప్రేయసితో నిట్లు సంభాషించెను:

**మూలము :**

'ఇమాం త్వం పశ్య సుభగే రవి భార్యామనిందతమ్
గజైర్గృహీతాం ముక్తాంచ మరాళై ర్విదళీకృతామ్' (49)
చంచరీక ద్వయవృతాం స్త్రీణాం చిత్తం తు చంచలమ్
నిజం నాథం వంచయిత్వా రమయంతి పరం జనమ్ (50)

న విలోక్య నిజం కాన్తం ధ్యాయంతి చ నిశాగమే
హృదయే కలుషం గృహ్య షట్పదం ప్రస్వపన్తి చ. (51)

ఇట్లు శ్రీకృష్ణుడు స్త్రీ శీలమును గూర్చి తెలుపగా, రుక్మిణి యిట్లు పల్కెను:

హరిం జానాతి నాథం వై పద్మినీ పద్మలోచనా
స్వ స్తుతానాగతాన్ మత్వా పుష్టాత్యేషా గృహాగతాన్.
పుత్ర పౌత్రాదికాన్ నాథ షట్పదాదీం జనార్దన. (58)

కన్నడమున లక్ష్మీశుని అనువాదము :

రాజముఖి నోడి సరోవర పద్మినిగె
రాజహంస క్రీడెపున్నాగ కేళి
భ్రాజితమధుపగోష్ఠి సందపు దురలిగె
తానరపి యారపళ దెంతో

శ్రీ జనకె సహజమిదు మేలె కర్దమజాతె
మాజువళెదె యొద్ధిర కృష్ణతెయె నిదుజగకె
సో జిగలె చంచలె యిలావతి యనెణె
సుఃళే పేళెం దొడితెందళు

దేవనీం పద్మినిగె పళివనాదో పిసువు
దావసంమత రాజహంస పున్నాగమధు
పావళియనో వలాగద మాతె మక్కళొడ
గూడి ర్దొదెం ధరయొళు

జీవెనం నిదుదాదు దుమంక మిల్లితా
నావిర్భవిసి దొడెం కృష్ణ హృదయ తెదోష
మాపుదాణ్కంగె నడనరుగి దొడె చంచలెయె
నావరియె విడనెందళు

పురుషనోర్వంగె నారి యిరుంట పంబలి
ధరయొళంగ నగె పతి యోర్వనేగతి యెంబ
పరివిడి యినరుహిసువడా పీర్వరిల్లదో
ర్వరు మిల్ల మిన్ను బరిదె

సవసి యొళగణ పద్మినియ దూషిసలుబేడ
పరమ పావనెయిందు శివను క్త మాంగ గి
ళ్దరిసిద నెనల్ప త్రివతె యల్లది మాళపే
ళెందు రుక్మిణి నుడిదళు —

ఈ విధముగ కన్నడమున జైమిని భారతము అతి మనోహరముగ వ్రాయబడినది దానిని తెలుగులో కంకంటి పాపరాజు ఉత్తర రామాయణముతో బోల్పవచ్చును. ఈ గ్రంథము ప్రౌఢ రసవత్కృతి. ఈ కవి యనవసరమైన సన్నివేశములను విడచివేసి, కొన్ని సంఘటనలు స్వతంత్రముగ మార్చి వ్రాసెను.

### వీరభద్రుని జైమిని భారతము

ప్ర.ఆ.

1. ధర్మజుని కడకు వ్యాసుడు వచ్చుట.
2. వ్యాసుడు ధర్మజున కశ్వమేధము చేయ ననుజ్ఞ యిచ్చుట.
8 అశ్వమేధ విధానము వ్యాసుడు ధర్మజునకు తెలుపుట.
4. భీము డశ్వముం దెచ్చెదనని ప్రతిజ్ఞ చేయుట.
5. ధర్మరాజు కడకు కృష్ణుడు వచ్చుట.
6. కృష్ణుడు భీముని గుణములు ధర్మజునికి తెలుపుట.
7. కృష్ణ భీమసేనుల సరసాలాపములు.
8. భీమాదులు భద్రావతి పురమున కరుగుట.

ద్వి. ఆ.

1. భీమాదులు యాగాశ్వమును చూచుట.
2. మేఘవర్ణుడు సేనల మార్కొనుట.

3. ఇంద్రుడు మేఘవర్ణుని కడకు దూతను పంపుట.
4. మేఘవర్ణుడు యౌవనాశ్వ సైన్యములతో పోరుట.
5 వృషకేతుడు సేనలం దునుముట.
6 యౌవనాశ్వుడు వృషకేతునితో పోరుట.
7. వృషకేతుడు మూర్ఛిల్లుట.
8 సువేగ భీమసేనుల ద్వంద్వ యుద్ధము.
9. యౌవనాశ్వుని వృషకేతుడు ఉద్ధరించుట.
10. యౌవనాశ్వుడు భీమాదులతో బురంబున కరుగుట.

తృ.ఆ

1. భీముడు అన్నకు తమ విజయము నెరిగించుట.
2. యౌవనాశ్వుడు సైన్యముతో హస్తిపురమునకు వచ్చుట.
3. వ్యాసుడు ధర్మజునకు ధర్మములు, దారస్త్రీ లక్షణములు చెప్పుట
4. వ్యాసుడు ధర్మరాజునకు స్థిరలక్ష్మీ యోగవిధానము చెప్పుట
5. ధర్మరాజు భీముని ద్వారకకు పంపుట
6. శ్రీకృష్ణుడు భీముని వెంట హస్తిపురంబునకు వచ్చుట.
7. శ్రీకృష్ణుడు సైన్యముతో సరోవర తీరమున విడియుట.
8. శ్రీకృష్ణుని సన్నిధికి గోపికలు వచ్చుట.
9. కృష్ణుడు హస్తిపురము ప్రవేశించుట
10. అనుసాళ్వుడు మఖాశ్వము నపహరించుట.
11. అనుసాళ్వుడు కృష్ణుని మూర్ఛనొందించుట.
12 అర్జునుడు యాగాశ్వము వెంట వెళ్ళుట

చతు ఆ.

1. నీలధ్వజునితో అర్జునుని యుద్ధము.
2. అగ్నిదేవుడు అర్జునుని సైన్యము కాల్చుట.
3. నీలధ్వజునకు అగ్నిదేవుడు అల్లుడైన విధము.
4. నీలధ్వజార్జునుల ద్వంద్వ యుద్ధము.
5. అర్జునుని గంగ శపించుట
6. అర్జునుడు సౌబరి ఆశ్రమమునకు పోవుట.

7. సౌభరి మహాముని యర్జునకు నుద్దాలకముని చరిత్రము చెప్పుట.
8. హంసధ్వజ మహారాజు యుద్ధము.
9. సుధన్వుడు యుద్ధమునకు రాక తడయుట.
10. సుధన్వుడు తప్తతైల కటాహమున బడి బ్రదుకుట

పం.అ.

1. వృషకేతుడు సుధన్వుతో యుద్ధ మొనర్చుట.
2. ప్రద్యుమ్నాదులు సుధన్వునితో యుద్ధము చేయుట.
3. అర్జునుడు సుధన్వుతో బోరుట
4. అర్జునుడు సుధన్వుని తృతీయ శరంబుచే ఖండించుట.
5. సురథుడర్జునునితో యుద్ధము చేసి చచ్చుట.
6. శ్రీకృష్ణుడు గరుత్మంతుని రప్పించుట.
7. హంసధ్వజునితో అర్జునుడు స్నేహము చేయుట.
8. యాగాశ్వము గోడిగయై వ్యాఘ్రరూపము దాల్చుట.
9. స్త్రీ మండల వృత్తాంతము.
10. ప్రమీల అర్జునునితో యుద్ధము చేయుట.
11. వృష్ణిదేశ వృత్తాంతము.
12. భీషణుండర్జునునితో యుద్ధము చేయుట
13. భీషణుని మృతి.
14. అర్జునుడు బభ్రువాహనుని తిరస్కరించుట.
15. బభ్రువాహనుడు అర్జునుని సైన్యముల దైన్యమొనర్చుట.

షష్ఠ. అ.

1. శ్రీరాముడు దుస్స్వప్నములు కనుట.
2. రాముడు చారులచే పౌరుల వృత్తాంతంబు దెలియుట.
3. రాముడు సోదరునితో జానకి నరణ్యమునకు పంపగోరుట.
4. లక్ష్మణుడట్లు గావించుట.
5. జానకికి గల్గు దుశ్శకునములు.
6. వాల్మీకి ఆశ్రమమున సీత కుశలవుల గనుట.
7. శ్రీరాముడశ్వమేధము చేయుట.

8. లవుడు యాగాశ్వము బంధించుట.
9. లవకుశులు శత్రుఘ్న, భరత, లక్ష్మణ, శ్రీరాములతో పోరి వారిని మూర్ఛితుల గావించుట.
10. వాల్మీకి శ్రీరాముని స్తోత్రము చేయుట.
11. శ్రీరాముడు సోదర, భార్యా, పుత్ర సైన్య సమేతముగ అయోధ్యకు వెళ్లుట.

స. అ.

1. అర్జునుడు తనకు తోచిన దుర్నిమిత్తములు వృషకేతునితో చెప్పుట
2. అర్జునుడు వృషకేతుని మరణమునకై శోకించుట.
3. బభ్రువాహనుడు అర్జునుని చంపుట.
4. చిత్రాంగదాదులు ఏడ్చుట.
5. సంజీవనికై పుండరీకుడు పాతాళమునకు పంపబడుట.
6. బభ్రువాహనుడు యుద్ధము చేసి జీవన్మణి తెచ్చుట.
7. అర్జునుని తల కనబడని కారణమున శ్రీకృష్ణుడు వచ్చి, చిత్రాంగదాదుల నోదార్చి అర్జునుని బ్రతికించుట.
8. నకులధ్వజుడు పాండవహయంబు పట్టుట.
9. కృష్ణార్జునులు తామ్రధ్వజునితో పోరుట.
10. తామ్రధ్వజుడు వారి నోడించి హయము గొనిపోవుట.
11. మాయావిప్రవేషధారులై కృష్ణార్జునులు మణిపురము ప్రవేశించుట.
12. (రాజు) తామ్రధ్వజుడు విప్రకార్యార్థమై తన శరీరము నిచ్చుట.
13. కృష్ణార్జునులు నిజస్వరూపముల తెలుపుట.

అ. అ.

1. వీరవర్మ పాండవ హయంబు పట్టుట.
2. యముని వృత్తాంతము కృష్ణుడు విజయునకు చెప్పుట.
3. వీరవర్మ కృష్ణుని తన పురమునకు తోడ్కొని పోవుట.
4. నారదుడు చంద్రహాసుని వృత్తాంతము తెలుపుట.
5. చంద్రహాసుడు రాజ్యము చేయుట.
6. కుంతలేశుని కూతురు వనవిహారమునకు వచ్చుట

7. దుష్టబుద్ధి చంద్రహాసుని కాళికాలయమునకు పంపుట.
8. కుంతలుడు చంపకమాలినిని చంద్రహాసుని కిచ్చి వివాహము చేయుట.
9. చంద్రహాసుడు దుష్టబుద్ధిని బ్రతికించుట.
10. కృష్ణుడు కరిపురమునకు తానొక్కడు వెళ్లుట.
11. ధర్మజు డశ్వమేధము చేయుట.

లక్ష్మీశుని జైమిని భారతము (కన్నడము)

1. అశ్వమేధ పర్వద కథారంభవు.
2. యుధిష్ఠిర ఆశ్వికెయ వివర.
3. యుధిష్ఠిరన బళిగె బాదరాయణు బందద్దు.
4. బాదరాయను ధర్మజనిగె అశ్వమేధ యాగవన్ను మాడలు బోధిసిద్దు.
5. కృష్ణస్వామియు ధర్మరాయన బళిగె బందద్దు.
6. శ్రీకృష్ణ వంశావళియు.
7. వాయుసుత మురరర వాగ్వాదవు.
8. భీమను వృషకేతువు మేఘనాదను యజ్ఞాశ్వక్కాగె యౌవనాశ్వన రాజధానియన్ను ప్రవేశిసువుదు.
9. యౌవనాశ్వన రాజధానియన్ను వర్ణిసురువుదు.
10. ధర్మజన వంశ వివరణెయు
11. యౌవనాశ్వ నొందిగె కాది జయవాద బళిక భీమాదిగళు యౌవనాశ్వనొడగూడి యాగాశ్వ దొందిగె హస్తినావతిగె బందద్దు.
12. శ్రీకృష్ణమూర్తియు తన్న రాజధానియన్ను ప్రవేశమాడిద్దు.
13. మరుత్తరాయన కథావివరవు.
14. బాదరాయణను ధర్మజనిగె ధర్మసూక్ష్మగళన్ను హేళువుదు.
15. భీమను ద్వారకా నగరక్కె హోదద్దు.
16. కృష్ణస్వామియు, సకలయాదవరిం దొడగూడి గజపురవన్ను సేరిద్దు.
17. సాల్వానుజనింద యాగద తురగవు మాయవాదద్దు.
18. నీలధ్వజ మహారాయన రాజధానిగె యాగాశ్వవు బందద్దు.
19. యజ్ఞేశ్వరనిగె నీలధ్వజన మగళన్ను కొట్టుమదువె మాడిద్దు.

20. గంగెయు ధనంజయనిగె శాపవన్ను కొట్టిద్దు.

21. చండియ శాపవిమోచనయ వివర.

22. యాగాశ్వవు చంపక నగరియన్ను ప్రవేశమాడిద్దు.

23. కాద కొప్పరిగెయల్లి హొల్పట్టి సుధన్వను బదుకువుదు.

24 సుధన్వన యుద్ధవు.

25. శ్రీకృష్ణన సారథ్యదింద సుధన్వను పార్థను సంహరిసిద్దు.

26. సుధన్వన శిరస్సన్ను పరమేశ్వరను తన్న రుండమాలె యొళగె హాకి కొళ్లువికె.

27. సురథన శిరవు ఈశ్వరన రుండమాలిగె సేరిద్దు.

28. యజ్ఞాశ్వవు హెణ్ణు కుదిరెయాగె హోద కథ.

29. పూర్వరూపవం తాళిద యాగాశ్వవు స్త్రీరాజ్యవం ప్రవేశిసిద్దు.

30. ప్రమీళెయన్ను పార్థను ఒప్పిసిద్దు.

31. భీషణ నగరక్కె యాగాశ్వవు హోగి సేరిద్దు.

32. పార్థను రక్కసరనెల్లా పరాజితరన్నాగె మాడి అశ్వవన్ను బిడుగెడె మాడిద్దు.

33. కుదురెయు మణిపురవం ప్రవేశిసిద్దు.

34. బభ్రువాహనను యాగాశ్వవన్ను కట్టిద కథె.

35. కుశలవరిగాద యుద్ధద కథెయు.

36. వాల్మీకి మునియు జానకియన్ను తన్నతెమనెయల్లి కాపాడుత్తిద్దద్దు.

37. లవను శ్రీరామన యాగెద కుదురెయన్ను బందిసిద్దు.

38. శ్రీరామను కుశలవరొందిగె కాళగెమాడి మూర్ఛితనాదద్దు.

39. వాల్మీకి మునియు శ్రీరామనన్ను సమాధానమాడి రామనొందిగె కుశలవరన్ను, జానకియన్ను కళుహిసి యజ్ఞవన్ను పూర్తిమాడిద్దు.

40. అర్జున బభ్రువాహనర కాళగెవు.

41. వృషకేతువన్ను అర్జునియు కొందద్దు.

42. బభ్రువాహనను పార్థనతలెయన్ను కత్తరిసిద్దు.

43. సంజీవిని మణి మత్తు కృష్ణానుగ్రహదింద పార్థనూ వృషధ్వజను, మత్తె జీవనన్ను పడెదద్దు.

44. శిఖికేతువు ఫల్గుణన యాగద కుదురెయన్ను మయూర ధ్వజనిగె ఒప్పిసువుదు.

45. మయూరధ్వజన బళిగె నరనారాయణరు హోగి సేరిద్దు.

46. అల్లిన స్త్రీయరన్ను వరిసువుదు.

47. బ్రాహ్మణవేషధారి యాద శ్రీకృష్ణను మయూరధ్వజ మహారాయన దేహార్ధవను యాచిసిద్దు.

48. మయూరధ్వజ స్థిరచిత్తదింద శ్రీకృష్ణమూరితియు నిజస్వరూపవన్ను తోరిద్దు.

49. వీరవర్మన మగళన్ను యమనిగె మదువె మాడుద కథెయు.

50. కృష్ణానుగ్రహదింద వీరవర్మను సౌమ్యగుణవన్నైదిద్దు.

51. దేవమునియు పార్థనిగె ఇందు హాస కథెయన్ను వివరసిద్దు.

52. ఇందుహాసను కుదురెగళన్ను కృష్ణార్జునరి గొప్పిసిద్దు.

53. ఇందుహాసదిగెళింద కూడిద పార్థనిగె బకదాల్భ్యమునియ దర్శన లాభ వాదద్దు.

54. అనేక బ్రహ్మర కథెయన్ను బకదాల్భ్యమునియింద పార్థను తిళిదద్దు.

55. శ్రీకృష్ణస్వామియన్ను దుశ్శళెయు మొరెహోగుదువు.

56. అర్జునను తాను గళిసికొండు హోగిద్ద పదార్థ గళన్నెల్లా ధర్మజునిగె ఒప్పిసిద్దు.

57. ధర్మరాయను యథాశాస్త్రదింద గెరుడ వేదికయన్ను నిర్మిసిద్దు.

58. ధర్మజను హయమేధవన్ను ఆరంభిసిద్దు.

59. కృష్ణానుగ్రహదింద కుదురెయ దేహవు కర్పూరవాదద్దు.

60. యుధిష్ఠిరను అశ్వమేధవన్ను పూర్యైసిద్దు.

61. కృష్ణాది గళెల్లరు ధర్మరాయన మన్ననెయం కైకొండు తమ్మ తమ్మ నగరక్కె హోగి సేరిద్దు.

62. ధర్మరాయన రాజ్యభారవు.

34 సంధులు.

1902 పద్యములు.

## తిమ్మణ్ణ భారతము (కన్నడము)

1. యుద్ధరంగదల్లి మడిద బంధుజాలవన్ను కురితు వ్యసనాక్రాంతనాద ధర్మరాయ నన్ను సమాధాన పడి సులికె.
2. వ్యాసమహర్షియు ధర్మరాయనిగె మరుత్తరాయన చరిత్రయన్ను తిళిసులికె, ఇంద్ర గీవ్పతి సంపాదవు మత్తునారద సంవాద.
3. మరుత్తరాయను సంవర్తకన్ను యాగోపద్రష్ట నన్నాగె ఆహ్వాన సువికె.
4. సంవర్తను మరుత్తరాయన యాగోపద్రష్టనన్నాగె ఆహ్వానిసువికె.
5. యజ్ఞేశ్వరను ఇంద్రసందేశవను మరుత్తరాయని గొప్పిసువకె
6. మరుత్తరాయన హవిర్భాగగళిగె ఇంద్రాదిగళు బరువికె.
7. శ్రీకృష్ణను తత్వోపదేశదిరద ధర్మరాయన కోపవన్ను అడగిసులికె.
8. వ్యాసనారాదాని మహర్షిగళు ధర్మరాయన కోపవన్ను అడగుసులికె.
9. వ్యాసనారదాది మహర్షిగళు ధర్మరాయనన్ను బీళ్కొండు స్వస్థాన తెరళులికె.
10. శ్రీకృష్ణను అర్జుననిగె తత్వజ్ఞానవన్ను స్థిరపడిసువికె
11. శ్లేష్మాదిరోగ నిరూపణె.
12. తత్వజ్ఞాన విశేష నిరూపణె.
13. అంతర్యాగద ప్రకార నిరూపణె
13. అంతర్యాగద ప్రకార నిరూపణె.
14. ఇంద్రియమనః పరస్పర సంవాదవు.
15. జీవాత్మ స్వరూప నిరూపణ.
16. బ్రాహ్మణ రూపధారి యాదయమనిగు జనకనిగు నడెద సంవాద.
17. శ్రీకృష్ణను అర్జుననిగె గురుశిష్య సంవాదవన్ను తిళిసువికె.
18. మనోబుద్ధ్యహంకారాది తత్త్వనిరూపణె.
19. అవ్యక్తనామ తత్త్వ నిరూపణె.
20. సత్యవన్ను అత్యావశ్యవాగి అనుష్ఠిస బేకెసువికె.
21. కృష్ణార్జునరు ఇంద్రప్రస్థ నగరదింద హస్తినాపురక్కె బరువికె.
22. శ్రీకృష్ణను ఉదంకమహామునియొడనె మాతాడువికె
23. శ్రీకృష్ణను ఉదంకనిగె విశ్వరూపవన్ను తోరువి.

24. జనమేజయనిగె వ్యాసమహర్షియు నుడియువ ఉదంకన చరిత్రెయు
25. ఉదంకను మదయంతియింద కర్ణకుండల గళన్ను పడెయువికె
26. ఉదంకను కుండలగళన్ను కొట్టు అహల్యాదేవియన్ను సంతోషపడిసువికె.
27. వ్యాసమహర్షియు ధర్మరాయాది గళన్ను అశ్వమేధ యాగోన్ముఖరన్నాగిసువికె.
28. సత్తుహుట్టిద పరిక్షితనిగె శ్రీకృష్ణను ప్రాణదాన మాడివికె.
29. శ్రీకృష్ణ సమేతరాద పాండవర బళిగె వ్యాసర ఆగమన.
30. ధర్మరాయను యాగాశ్వరక్షణిగె అర్జునన్ను నేమిసువికె
31. అర్జునను త్రిగర్త దేశాధీశ రొందిగె యుద్ధమాడువికె.
32. సింధు దేశాధీశ రొందిగె అర్జునను యుద్ధమాడువికె బభ్రువాహనన పితృభక్తి వ్రజదత్త యుద్ధ దుశ్శళెయ ప్రార్థన
33. బభ్రువాహనను అర్జుననొడనె యుద్ధమాడు.
34. అర్జునను బభ్రువాహనింద సాయులికె ఉలూపి, చిత్రాంగదె బభ్రువాహనర పశ్చాత్తాప.
35. సంజీవకమణి శ్రీకృష్ణ ప్రభువడింద అర్జునను బదుకువికె. యుద్ధరంగదల్లి పతిపత్నియర సంభాషణె.
36. అర్జునను జరాసంధ పౌత్ర నొడనె యుద్ధమాడి సోలిసువికె. వింధ్యాటవియ వర్ణనె
37. గాంధారదేశాధిప నొడనె యుద్ధమాడి జైసియాగోపకరణగళన్ను అణిమాడువికె.
38. శ్రీకృష్ణను ధర్మరాయ నొడనె అర్జున సందేశవన్ను తిళిసువికె.
39. అర్జునను యజ్ఞాశ్వసమేత నాగి హస్తినా పట్టణక్కె బరువికె.
40. ధర్మరాయను విధివత్తాగి అశ్వమేధ యాగవన్ను మాడువికె.
41. వ్యాసమహర్షిగె యాగదక్షిణె యాగి తన్న రాజ్యసర్వస్వవన్ను సమర్పిసువికె.
42. యజ్ఞాక్కెబంద అరసరెల్లరన్ను సత్కరిసి కళహిసు.
43. సక్తుప్రస్థాఖ్యానవు
44. యమను సక్తుప్రస్థన బళిగె అతిథి యాగె బరువికె.

46. యమను సక్తుప్రస్థనన్ను బ్రహ్మలోక్కకె హోగహేళువికె.
46. కుటుంబ నమేతనాగి సక్తుప్రస్థను బ్రహ్మలోకక్కె హోగువికె.
47. అగస్త్య మహర్షియ ద్వాదశ వార్షిక యాగె మహిమయు.
48. పిత్రుదేవతెగళ శాపదింద జమదగ్ని మహర్షియ ముంగిసి యాదుదు.

964 పద్యములు
(తొమ్మిది సంధులు).

మరాఠీ జైమిని భారతములు :

1. జైమిని అశ్వమేధ - విష్ణుశాస్త్రి బాపర్ (1918)
2. జైమిని అశ్వమేధ - శ్రీధర్.

ఇందు 68 అధ్యాయములు గలవు. ఇదియు సంస్కృతానువాదమే. ఇది వచనమున గలదు. ఇది చాతుర్వర్ణ్యముల వారికి ముఖ్యమగు గ్రంథము. ఒక్క అశ్వమేధ పర్వ పఠనముననే భారత పఠన ఫలము లభించును. ఇది సరళ భాషలో ననువదింపబడినది వివిధ రోగములు, వాని నివారణోపాయములు తెలుపబడినవి. అట్లే ఉంఛవృత్తి వర్ణనము, తీర్థయాత్రా వర్ణనము, కర్మ విపాక వర్ణన మూలమున కధికముగ గలవు.

బెంగాలీలోని జైమిని భారతానువాదములు.[2]

| | | |
|---|---|---|
| (1) | అశ్వమేధ పర్వము — | శ్రీకరణనంది. |
| (2) | —Do— | ద్విజ అభిరామ |
| (3) | —Do— | ఆనంద మిశ్ర |
| (4) | —Do— | ద్విజ రామచంద్రఖాన్ |
| (5) | —Do— | ద్విజ కృష్ణరామ్ |
| (6) | —Do— | ద్విజ రఘునాథ |
| (7) | —Do— | ద్విజ రామకృష్ణ |
| (8) | —Do— | భారత పండిత |

ఈ యెనిమిది అనువాదముల వలన ఈ గ్రంథము వంగభాషలో మిగుల ప్రాచుర్యము గల్గినటుల తెలియుచున్నది.

హిందీ జైమిని భారతము — తాళపత్ర రూపము .

హిందీ జైమిని భారతమున 67 అధ్యాయములు గలవు. ఇది వచనమున నున్నది. ఈ గ్రంథకర్త పేరు కానవచ్చుట లేదు. అతి కష్టమున గొన్ని వివరములు మాత్రము వెలికి దీయవచ్చును శైలి నేటి శైలియే గాని వ్రాత మాత్రము కొంత భేదముగా గలదు.

ఇది నూట తొమ్మిది పుటలలో నొక ప్రక్క మాత్రము గలదు. ఈ గ్రంథమున మొదట "శ్రీ గణేశాయ నమః" అని గలదు. తరువాత నున్న రెండు శ్లోకములలో మొదటిది —

"అథ జైమిని కథా — — — జైతి పరాసరా
సత్యవతీహ — — — వ్యాసః — — కమలగలిత
వాఙ్మయా మమృత — — — తిధివోతి" — అని గలదు.

ఇక రెండవ శ్లోకము సంస్కృత జైమిని భారతములోగల రెండవ శ్లోకమే
"కథం యుధిష్ఠిరః ప్రీతో మమ పూర్వ పితామహః।
హయమేధం క్రతువరం చక్రే బంధుభిరన్వితః॥

దీని తరువాత కథ వచనమున సాగినది. శైలి చాలవరకు స్పష్టమైనది. ఇది యే శతాబ్దిలో వ్రాయబడినదో తెలియరాదు. ఇందు చంద్రహాసుని కథ కూడ గలదు. దీనినిబట్టి, చాల వరకు సంగ్రహించి వ్రాయబడినట్లు తెలియనగును. పై శ్లోకమును బట్టి చూచిన ఈ రచన సంస్కృత మూలానుసారియే యని రూఢి యగుచున్నది. చివరి యధ్యాయ మసంపూర్ణము. ఇందు 'జైముని' యని వ్రాయబడుట విశేషము. కాని సంస్కృతమున "జైమిని" యనియే గలదు. ఇది కొంత యాశ్చర్యజనకము. ఇందు మూలానుగతమైన మార్పు లున్నట్లు తోచుట లేదు. దీనిని కాల వైపరీత్యమున నెవ్వరో దేశాంతరగతము గావించి నట్లు కన్పట్టుచున్నది. ఇది పరిష్కరించి, పరిశోధించి, ప్రకటించినచో హిందీ వాఙ్మయ హారమునకు మరొక్క పుష్పము వినూత్నమై చేర్చబడి విలసిల్లు ననుట నిస్సందేహము. భావి పరిశోధకుల కిది యెంతయు నుపయుక్తమగును.

జర్మనీ ఆంగ్ల అనువాదములు :

(జైమిని భారతము)

ఈ గ్రంథము డా॥ మాగ్లింగ్ వలనజర్మనీ భాషలో 1870 లో ప్రకటితమై ప్రచారము పొందినది. 1852 లో కె. డేనియల్ శాండర్సన్ ఆంగ్లములోని కనువదించినాడు. ఈ రెండింటికిని లక్ష్మీశుని కన్నడ జైమిని భారతము మూల మని తెలియవచ్చుచున్నది. జైమిని భారతము (వ్యావహారికము) గ్రంథములో ఈ విషయము పేర్కొనబడినది.[3]

1. జైమిని భారత సంగ్రహ - పీఠిక-సంపాదక-జవరగౌడ-సంస్థానద వయస్కర శిక్షణ సమితి మైసూరు - 1959.

2. History of Bengali Language and Litrature by D. C. Sen. 1911. Calcutta University. P. 207; Ch. IV.

3 ముందు చదవలసిన ముఖ్య విషయాలు వ్యవహారిక భాషలో వ్రాయబడిన "జైమిని భారతము"—"అనంతం"

# జైమిని భారతము

## భాషాంతరీకరణము

## సంస్కృత మూలముతో
## సమగ్ర పరిశీలన

## పినవీరభద్రుని యాంధ్రానువాదము

జైమిని సంస్కృత జైమిని భారతమును 5179 శ్లోకములను వ్రాసి, 68 అధ్యాయములలో విభజించెను. దీనిని పినవీరభద్రకవి 1479 గద్యపద్యము లలో, 8 ఆశ్వాసములలోని కనువదించి యున్నాడు. స్థూలపరిశీలనము గావించిన మూడు శ్లోకముల కొక పద్యము వంతున యాంధ్రీకృతమైనట్లు స్ఫురించుచున్నది. దీనినిబట్టి మనకు గ్రంథమంతయు సంగ్రహించి, కుదించి వ్రాయబడినట్లును, సమయోచితములైన మార్పుల నొనరించినట్లును, స్వయం కల్పితములగు విషయముల సమాలోచనము గావించుచు, తద్విషయములను జొనిపినట్లును ద్యోతమగుచున్నది.

పినవీరభద్రుడు తన భాషాంతరీకరణము నెట్లు సాగించెనో గ్రహించుటకు మన మీ క్రింది విధమున నా పద్ధతిని విభజించి సవివరముగ నొక్కొక్క యంశమును బరిశీలింపవలసియున్నది.

1. మూల కథానుసరణము
2. మూల భాగముల సంగ్రహించుట
3. కొన్ని విషయములను బూర్తిగా విడచివేయుట
4. దేనియందైనను గ్రమమును బాటించు విధానము
5. సంస్కృత మూలమునందు గల యుపమానముల యథాతథముగ గైకొనుట.
6. సూక్తులు యథాతథముగ గైకొనుట
7. సందర్భోచితముగ మూలమును మార్చి వ్రాయు పద్ధతి
8. స్వయంకల్పిత విషయ వివరణము.

### 1. మూల కథానుసరణము

ఆదినుండి యంత్యము వఱకును జైమిని భారతము, మూలమును విడువ లేదు. మూలానువర్తిగనే నడచినది ఏయే ఘట్టములందు మూలము ననువాద మనుసరించినదో క్రింది విషయములను జూచిన మనకు స్పష్టమగును

(a) ధర్మజ - వ్యాస సంభాషణము.
(b) భీముడు భద్రావతికి వెళ్లి యాగాశ్వమును గొనివచ్చుట.
(c) భద్రావతిలో యౌవనాశ్వునితోడి యుద్ధము.
(d) యౌవనాశ్వుని దోడ్కొని యశ్వముతో భీముడు హస్తిపురమునకు వచ్చుట.
(e) యాగాశ్వము ననుసాల్వు డపహరించుట.
(f) అశ్వము లోకయాత్రకు విడువబడుట.
(g) నీలధ్వజార్జునుల యుద్ధము.
(h) గంగాదేవి శాపము.
(i) సౌభరి యాశ్రమ వృత్తాంతము.
(j) హంసధ్వజ మహారాజుతోడి యుద్ధము.
(k) యాగాశ్వము గోడిగ యగుట.
(l) స్త్రీ మండలమున ప్రమీలతో విజయుడు చేసిన యుద్ధము.
(m) వృకదేశమున భీషణునితో సవ్యసాచి కావించిన యుద్ధము.
(n) బభ్రువాహనార్జునుల యుద్ధము.
(o) శ్రీరామోపాఖ్యానము.
(p) తామ్రధ్వజునునితో గిరీటి యుద్ధము.
(q) వీరవర్మతో విజయుని యుద్ధ ఘట్టము.
(r) చంద్రహాసోదంతము.

ఈ యన్ని ఘట్టములును సంస్కృతాంధ్ర గ్రంథములందున్నవి. ఏ యంశమును బినవీరన వదలలేదు. ఇది ప్రధానమైనది

సూక్ష్మములైన విషయములను గూడ మూలము నుండియే గ్రహించుటకు గొన్ని యుదాహరణముల నిట జూపుచున్నాను

1. ప్రథమాధ్యాయములో సంస్కృతమున - వ్యాసుడు 'యదృచ్ఛయా' ధర్మరాజు కడకు వచ్చినట్లుండగా, తెలుగనువాదమున 'యదృచ్ఛన్' వచ్చినట్లు వ్రాయబడినది. మూల పదముల విడలేదనుట కిది యొక యుదాహరణము.

2. వ్యాసునిచే 'రాముడు రావణాసుర సంహారము గావించిన పిమ్మట, తత్పాప పరిహారణార్థము హయమేధమునే ముమ్మారు జేసి'నట్లు,సంస్కృతమున దెలుపబడగా, వీరభద్రుడు దానినే చెప్పినాడు. (1-61)

3. మూల భావమునే గ్రహించుట మరియొకచోట చూడనగును: 'కులము నెల్ల ద్రుంచి, బ్రాహ్మణ ధనము గైకొని యాగ మొనర్చుట తనకు దగని పని' యని ధర్మరాజు పల్కెను.

మూలము : (సంస్కృతము)

"ఏకా త్రపా మే మహతీ యన్మయా సంగరే హతాః
కురవో గురవశ్చైవ సుహృత్సంబంధి బాంధవాః
సమ్మార్జయితుమేకాం హి న సమర్థోఽస్మి తాం త్రపామ్
ద్వితీయైషా మహాభాగ విప్రద్రవ్యాన్ భవిష్యతి."

అనువాదము : (తెలుగు)

క. మొదలఁ గులమెల్లఁ ద్రుంచుట
యదయత గురులయెడఁ గల్లలాడుట యదిగా
కిదియును జేయఁ దలంచినఁ
గొదలే దీవేళ దొంతి కొల సిద్ధించున్. (1-69)

4 అశ్వమేధ హయము చైత్ర పూర్ణిమనాడు విడువ వలయునని తెలుగు, సంస్కృత గ్రంథములలో గలదు. కాని హిందీ యనువాదములో "చైత్ర" మాసములోని యమవస నాడశ్వమును లోకయాత్రకు విడువ వలయునని వ్రాయబడినది. సంస్కృత మూలమును గూడ (పీఠి) త్రోసిపుచ్చి హిందీ ప్రతిలో నమవస రోజున యశ్వమును లోకయాత్రకు విడువవలెనని వ్రాయుట వింత గొల్పుచున్నది. ఇది పరిగ్రాహ్యము గాదు. కన్నడమున 'పౌర్ణిమ' లేక 'అమవస' తెలుపబడలేదు. కాన తెలుగున పిశవీరన మూల సంస్కృతము ననుసరించె ననుట కిది యొక గొప్ప యుదాహరణము.

5. వ్యాసుడు బేర్కొనిన 'యశ్వమేధ విధానము' సంస్కృతములో నున్నట్లే యాంధ్రమునను గలదు. (ఋత్విజుల సంఖ్య, బ్రాహ్మణుల గుణ గణములు, బ్రాహ్మణుల దానము, అశ్వవర్ణన కూడ నదే రీతి నున్నవి.)

(స్థాలీపులాక న్యాయమున) బ్రాహ్మణ గుణగణములు :

మూలము :

"కులీనాః సమ్మతాః ప్రాజ్ఞా వేద శాస్త్రార్థ పారగాః"
"అఖిల వేద శాస్త్ర పురాణేతిహాస కథా సుధాను
భవులును, నంచితాన్వయ సంభవులును" (అనువాదము).

యాగ సందర్భమునందలి దానము :

సువర్ణ భూషితాశ్వము, రథము, గజము, వేయిగోవులు, సువర్ణ సహిత రత్నములు,-మూలానువాదములలో నొకే రీతి గలవు

అసిపత్ర వ్రతము : భార్యతో నుండియు నసిపత్ర వ్రత మూని బ్రహ్మచర్య ముండవలయు. ఇది మూలానువాదములలో గలదు.

6. విషయ గ్రహణ మొనర్చుటలో వీరభద్రుడు మూల గ్రంథాను క్రమమును దాటించె ననుట యొప్పను

ధర్మరాజుచే దెలుపబడిన వాక్యములు .

భీమాదయోఽపి చ మయా క్లేశితా బహవో రణే
కర్ణస్య పుత్రో బలవాన్ వృషకేతు రుదారధీః
బాలః షోడశ వర్షీయో ధర్మశ స్త్రం న యోజయే
ఘటోత్కచసుతం చైకం మేఘవర్ణమ్ నయోజయే (1-59, 60)

అనువాదము :

అనవిని ధర్మసూనుఁ డనఘా బవరంబుల డస్సినారు నా
యనుజులు కర్ణసూనుఁడు మహాబలుఁడీ వృషకేతు దర్పకుం
డనుపఁగఁ బాల నాతని మదర్థహతుండు ఘటోత్కచుండు త
త్తనయుఁడు మేఘవర్ణుని నధర్మము సంపుట బాలఁ బోరితిన్. (1-60)

కర్ణసుతుడు 'బలవంతుడ'న విశేషణము మూలము నందును, తదను వాదము నందును గన్పట్టును.

7. యౌవనాశ్వుని సైన్యము :

''యౌవనాశ్వోఽపి బలవాన్ బలస్తస్య సైనికాః (మూలము)

''బలియుం డుగ్రుడు యౌవనాశ్వ ధరణీ పాలుండు, దత్సైన్యు లా,
జుల ముక్కాఁకం నారితేలిన మహాశూరుల్. (1-87)(అను.)

8. ధర్మరాజు శ్రీకృష్ణుని వేడుకొనుట :

యథా లజ్జార్ణవే మగ్నా ద్రౌపదీ తారితా త్వయా
తథా తారయ మామస్మాద్ వృజినాన్మధుసూదన. (2-44)

(అనువాదము)

'కౌరవ సభలో లజ్జా
వారిధి దిగ నుద్ధరింపవా ద్రౌపది న
న్నారీతి నుద్ధరింపుము
నీరజదళనేత్ర కలుషనీరధి వలనన్. (1-107)

9 యౌవనాశ్వ యుద్ధానంతరము యౌవనాశ్వుని భార్య ప్రభావతి వృషకేతునికి దెలుపు వాక్కులు :

యేన మే కంఠసూత్రం హి సుశ్లథం పరిరక్షితమ్
కర్ణజేనాద్య తస్యాథ కీర్తిః స్థూలా భవిష్యతి.
(మూలము.) (6-16)

(అనువాదము) :

చం.

............ .... .........

............అసిలోఁ దనమంగళ సూత్రమూడఁగా
ననువున నిల్పి నేసదయుఁ డాతనికిన్ జయమంగళం బనెన్. (2-98)

**10. మంత్రి చేయదగని వాని గుణములు :**

మూలము : (2-75, 76)
వ్యంగాంగహీనా బధిరాః కుయోనిసు రతాశ్చ యే
తేషాం మన్త్రోహ్యసుభదః ప్రోక్తః కవిభిరేవ చ
కాముకానాం జడానాం చ స్త్రీ జితానాం తథైవ చ.

అను : (1-121)
అంగవిహీను నిల్లటపుకుల్లునిఁ బ్రల్లదు నీచభామినీ
సంగతు వామనున్ బధిరు సాధ్వసమానసు మూఢుఁ గాముకున్
వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధి బ్రమత్తు మంత్రిఁజే
యం గొఱగామి కెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్.

11. రచనా సందర్భమున గొన్ని మారుమూలల నున్న విషయములును, వీరభద్రునిచే యథాతథముగా గైకొనబడినవి. శ్రీకృష్ణుడు భోజనము చేయుటంగరు పళ్లెమున కరువది నాలుగు గిన్నెలు గలవను సంఖ్యా విషయము కూడ మూలమునందును, దెనుగునను గలదు

''చతుః షష్టిన్యస్తే సుఘటితే హరిః'' (9-34)
''చతుష్షష్టి శాకచోంల వెరచితంబైన'' (3-49)

12. అర్జునుడు 'దూర్వా చంపక దామకము' ధరించి, పిమ్మట యాగాశ్వము వెంట వెళ్లెననుట తెలుగులోనను, 'దూర్వా చంపక నిర్మితాం మాలాం కంఠే ప్రోథయిత్వా' అని మూలమునను గలదు

13. సుధన్వుని నోట, 'మధుచ్ఛందుదు' హంసధ్వజుని వంశమునకు (తన వంశమునకు) మూల పురుషుడని (6-9 తెలుగు జై. భా) మూలముననను, తదనువాదములోనను జెప్పించబడినది.

14. మూలానుసరణమునకు మరొక్క యుదాహరణము : సురథుని మరణానంతరము శివుడు, తన రుండమాలలో నాతని కంఠము నుంచికొనుచు బల్కిన వాక్కులు.

మూలము- (21-20)

ధర్మిష్ఠానాం వదాన్యానాం కృతజ్ఞానాం సదామయా
శూరాణాం జితకామానాం శిరసాం మండనం మహత్
ధ్రియతే శిల వామోరు నేతరేషాం కదాచన.

అనువాదము : (ఆ-88)

శూరులు, ధర్మచరిత్రులు, ఉ
దారులు, విజితేంద్రియులు, కృతజ్ఞులు, జగదా
ధారు లని వారి శిరములు
హారంబులుగా ధరింతు ననవరతంబున్.

15. స్త్రీమండలములోని స్త్రీల మహిమలు, మూలానువాదములతో నాకీ రీతిగా గలవు.
(21-85,86,92)

యస్త్వాసాం సంగతిం కుర్యాద్ రూపలావణ్యమోహితః
ముఖవాసేన రమ్యేణ నయనాంచలతాడితః
గీతేనాథ చ నృత్యేన హాస్యేన మృదుభాషితైః
మాసమాత్రం స్త్రియం ప్రాప్య పశ్చాత్ ప్రాప్నోతి వైశసమ్.
.....................
కాచిజ్జీవతి సా గర్భం ధత్తే కన్యాం ప్రసూయతే

(అనువాదము- 5-107,108,109)
సరసాలాప విలాసవిభ్రమ కళా సౌభాగ్యరేఖామనో
హరకేళీ పరిరంభణక్రియల నాహ్లాదంబు పుట్టించి ని
ర్భరపుం బ్రేమ వశీకరింపుదురు తద్భామాజనుల్ పాంథులన్
సురతప్రౌఢివిహార వైభవములన్ జొక్కించి చిక్కించుచున్.

క. ఈసరణిం గామతంత్రా
భ్యాసపరిశ్రాంతి మిగులం బరవశమైనన్
నాశిలి ధాతుక్షయ మై
మాసములోపలన వాఁడు మరణము నొందున్.

తే. తోరగతి చేయుదురు వానితో రమించు
కాంత లందఱు సందోర్థు గర్భమైన
నిలుచు నమ్మానవతికి జన్మించె నేని
కొడుకు గానేరఁడెపు డాఁడుఁబడుచ కాని.

16. కుకలవోపాఖ్యానము- మూలానుసరణము-
మూలము (38-60)
శ్రుత్వా ద్విదముపాఖ్యానం శ్రావ్యమన్యన్నరోచతే
పుంస్కోకిలరుతం శ్రుత్వా రూక్షా ధ్వాంక్షస్య వాగివ.

అను : (6-270)
వెంయఁగ నీకథ విను ధ
న్యులు తక్కినకథలు వినగఁ నొల్లరు మదిఁ గా
కులరొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్.

17. కలియుగ లక్షణములు, మూలమునందును, వీరభద్రుని యను
వాదము నందును సమముగ గలవు.

18. మరొక్క చక్కని యుదాహరణము -
మూలము (28-58)
"చిత్రాంగదా ప్రసూతం త్వాం వైశ్యాన్మన్యే న పాండవాత్".
అను : (5-171)
"...ఓరి మా వంగడ మౌట
బొంకు మును వైశ్యునకుం గనెఁ బోలు నిన్నుఁ జిత్రాంగద"
భావము : బభ్రువాహనుని యర్జునుడు 'వైశ్యునకు జన్మియించితి' వని
దూషించుట ఈ భావము మూలానువాదములందు గలదు.

19. సాలగ్రామశిలా వృత్తాంతము యథాతథమై యనువదితమైనది.

20. ఈ క్రింద నుదహరింపబడిన యశ్వమేధ యాగాధ్వర్యులైన
ఋత్విజులు మూలానువాదములందు గలరు,

మూలానువాద గ్రంథములలో సుదాహృతులైన మహర్షుల నామములు:

వసిష్ఠ, వామదేవ, రోమశ, సుమంత, గాలవ, కపిల, సౌభరి, భరద్వాజ, భాగురి, రైభ్య, జమదగ్ని, జతుకర్ణ, కౌండిన్య, గౌతములు.

ఈ విధముగ స్థాలీపులాక న్యాయముననే పలు సందర్భములందు జైమిని మహర్షి వ్రాసిన మూల జైమిని భారతము (సంస్కృతము)నే, పినవీరభద్రు డనుసరించెనని తేటతెల్లమగుచున్నది. అంతమాత్రమున భాషాంతరీకరణ మంధానుకరణము గానేరదు. కథా సందర్భావసరము లెల్లెడల మూలము ననుసరించినను, నీ యాంధ్రకవి స్వకపోల కల్పనము గావించిన తెలుగులును లేకపోలేదు. ఆ విషయమును గూర్చిన ప్రస్తావన వచ్చినపుడు దానిని జూచుట యుచితము. ప్రస్తుత మీ భాగమును విస్తరమగునను భీతిచే ముగింతును.

## 2. మూల భాగములను సంగ్రహించుట

మూలము సంగ్రహింపబడెననుట కెన్నియో యుదాహరణములు మన మీ రెండు గ్రంథము లందును జూడవచ్చును. సూక్ష్మముగ నాలోచించిన 'సంగ్రహీకరణ' కవి రచనా గుణములలో నొక్కటి యని విస్పష్టముగ, నిర్ద్వంద్వముగ నుటంకింప వచ్చును. మొట్టమొదట సంస్కృత జైమిని భారతములోని యొక్కొక్క యుదంతమెన్ని శ్లోకములలో వర్ణింపబడినదో, తెలుగున నెన్ని పద్యములలో సంగ్రహీకరింపబడినదో చూడవలసి యున్నది.

(a) అనుసాల్వుని వృత్తాంతము
సంస్కృతము : 150 శ్లోకములు.
తెలుగు : 29 గద్య పద్యములు.

(b) ఉద్దాలకముని చరిత్రము .
మూలము 50 శ్లోకములు.
తెలుగు 18 గద్య పద్యములు.

(c) హంసధ్వజుని వృత్తాంతము :
మూలము 565 శ్లోకములు.
అనువాదము 124 పద్య గద్యములు.

(d) ప్రమీలార్జునీయ ఘట్టము :
మూలము 44 శ్లోకములు.
అనువాదము 19 గద్య పద్యములు.

(e) శ్రీరామచరిత్రము (కుశలవోపాఖ్యానము)
సంస్కృతము : 709 శ్లోకములు
తెలుగు : 270 గద్య పద్యములు.

(f) బభ్రువాహన వృత్తాంతము :
మూలము : 688 శ్లోకములు.
అనువాదము : 185 గద్యపద్యములు.

(g) తామ్రధ్వజుని వృత్తాంతము :
మూలము : 312 శ్లోకములు.
అనువాదము : 91 గద్య పద్యములు.

(h) వీరవర్మ వృత్తాంతము :
మూలము · 186 శ్లోకములు
తెలుగు : 82 గద్య పద్యములు.

(i) చంద్రహాసోపాఖ్యానము :
మూలము : 672 శ్లోకములు
తెలుగు · 186 గద్య పద్యములు

ఇట్లు విదమర్చిన పిమ్మట నీ క్రింద 'మూల సంగ్రహీకరణము'న కుదాహరణమైన 'యొక ఘట్టము' మాత్రమే చూపుచున్నాను. వ్యాసుడు ధర్మరాజునకు ధర్మములు తెలుపుట జార స్త్రీ లక్షణములు పేర్కొనుట, చాల వఱకు సంగ్రహీకరింపబడినది. ముప్పది యైదు శ్లోకములలో వర్ణింపబడిన ఘట్టము పది పదునొకండు పద్యముల లోనికి దెశుగన వాదమై విరాజిల్లు చున్నది.

తరువాత సంగ్రహింపబడిన కొన్ని ప్రధానమైన ఘట్టములను స్థూలముగ జూపగలను.

సంగ్రహీకరణము : సంస్కృతమూలము. (8 అ.)

''శ్రుత్వా వ్యాసముఖాద్ ధర్మాన ధర్మరాజో యుధిష్ఠిరః
ప్రపచ్ఛ చాపరాన్ ధర్మాన్ సర్వలోకహితావహాన్. 1

భగవన్ కిం నరైః కార్యం సంసారభయభీరుభిః
కథమత్ర భవేత్ కీర్తిః పరత్ర చ కథం సుఖమ్, 2

వాసుదేవః కథం తుష్యేత్ తత్ తద్ బ్రూహి యథాతథమ్
బ్రాహ్మణో ధర్మశాస్త్రాణి సమ్యగ్ జ్ఞాత్వా న కుత్సితమ్. 3

ప్రకరోతి శుభం కర్మ చేహ కీర్తిం సుఖం పరే
పరాపవాదాద్ భీతశ్చ పరద్రవ్యమ్ పరస్త్రియమ్. 4

న కామయేన్న గృహ్ణాతి న శృణోతి హి తద్వచః
క్షత్రియః సర్వధర్మజ్ఞో దాతా యుద్ధపరాయణః. 5

ఆత్మవిత్ సంగరే ప్రాణాన్ సమ్ముఖస్త్యజతే యది
సంప్రాప్నోత్యమలాం కీర్తిమిహ లోకే పరత్ర చ. 6

వైశ్యో ధనసమృద్ధస్తు సత్యవాది ప్రియాతిథిః
శుశ్రూషణం గవాం కుర్యాత్ తత్పరః ప్రాణినాం హితమ్. 7

ప్రాప్నోతి విమలాం కీర్తిం గతిం కృష్ణనిషేవణాత్
శూద్రస్తు సేవతే విప్రాన్ శ్రద్ధయా నావమన్యతే. 8

యశః పరమవాప్నోతి ధ్యాత్వా నారాయణం విభుమ్
విధవా యా భవేన్నారీ కామాసక్తా సుభోగినీ. 9

గురువాదకరీ దుష్టా హృష్టా పరనరం ప్రతి
ధనయుక్తా రాగపరా సర్పిణీవ సపక్షిణీ. 10

ఆత్మానం పాతయేదాశు పత్యా సహ మహీపతే
తాం యః కామయతే మన్దో దుష్టాత్మా స నరాధమః. 11

సోఽపి వై నారకీం యోనిం ప్రాప్నోతీహ న సంశయః
సా రండా దుర్గతిం యాతి శరీరస్య చ విక్రయాత్. 12

శుద్ధస్నానం చ తాంబూలం చందనం వాసనాని చ
ఇచ్ఛాభోజ్యం తథా పేయం పత్యురిచ్ఛావిహారిణీ. 13

నిత్యం ధర్మపరా యా తు గృహకార్యకరీ తథా
శ్వసాశ్వశురయోశ్చైవ పాదవన్దనతత్పరా. 14

జ్యేష్ఠదేవరయోశ్చాపి హ్యనువృత్తిపరాయణా
ప్రాప్నోతి సద్గతిం కీర్తిమిహ లోకే పరత్ర చ 15

ప్రాక్కర్మ యోగజం చిహ్నం బిభ్రతీ లక్షణం త్వీదమ్
కృష్ణవర్ణాం తాలుజిహ్వాం స్వాంగుల్యా స్పృశతే ధ్రువమ్. 16

ఏతైశ్చ లక్షణైర్యుక్తా భర్తృసంబంధఘాతినీ
సర్వకర్మవశస్తే తు తస్యా వై సంగతిం గతాః. 17

తయా స్థేయం పితుర్గేహే న పరేషాం గృహం వ్రజేత్
జటిలా పంకజహలా భోజనే లుబ్ధమానసా. 18

అనాదారవతీ యా తు సా సుఖం నైవ విన్దతి
బాలత్వే రక్షతి పితా యౌవనత్వే నిజః పతిః. 19

వార్ధకే రక్షతే పుత్రో న స్వతంత్రా హి యోషితః
స్వతంత్రా యోషితాం హి న శుభాయోపకల్పతే. 20

కృచ్ఛ్రాతికృచ్ఛ్రపారాకైః పరం శోషయతే తనుమ్
విధవా సా సుఖం జీవేత్ పరలోకే చ మోదతే. 21

న వ్రజేత్ తీర్థయాత్రాం హి న కదాచిచ్ఛుభవ్రతమ్
కరోతి విధవా నారీ సా గచ్ఛేన్నరకం ధ్రువమ్. 22

కర్తవ్యం తు తయా రాజంచ్ఛరీరపరిశోషణమ్
ఉపవాసాదిభిర్నిత్యం శమః కార్యో న సంశయః. 23

శీలభంగేతు నారీణాం దోషాస్తు బహవో నృప
స్త్రీణాం నైవ తు విశ్వాసః కర్తవ్యస్తు కదాచన. 24

అన్యాశ్రితాన్యచిత్తానాం విశ్వాసో న సుఖప్రదః
బహుధా హసతే యా తు బాలం చ పరిచుంబతి. 25

దృష్ట్వా పుమాంసంత్వరితా ప్రస్థలన్త్యనుధావతి
గాయంతీ సుస్వరం హృష్టా కర్ణం కండూయతే కటిమ్. 26

అచైలం మస్తకం స్వం తు హాసం చ కురుతే వృథా
ఈదృశీ యా భవేన్నారీ విజ్ఞేయా బంధకీ నరైః 27

వృథా పరగృహం యాతి వృథా పశ్యతి తం జనమ్
దూతికాం జననీం వేత్తి తత్సంగేఽతీవ లాలసా. 28

మాలాకారీ నాపితీ చ నటీ ప్రవ్రాజికా తథా
వణిగ్వ్రతతిపత్రాణి విక్రీణాతి తు యా భువి. 29

సైరంధ్రీ చాపి దాసీ చ తథా పతివివర్జితా
సూతికా ధవహీనా చ తథా కాపాలికీ తు యా
ఈదృశీనాం సంగమేన యాస్యాన్నుష్యతి మానసమ్. 30

స్వైరిణీనాం తు సా రాజ్ఞీ విజ్ఞేయా ధర్మనందన
తస్మాద్ రక్షేత్ స్త్రియం పార్థ దుష్టసంగాద్ విశేషతః. 31

అసూయకోఽథ పిశునో నాస్తికో ధూర్తకో నరః
సమీపే సంస్థితో రాజ్ఞాం ప్రజానాం దుర్లభమ్ సుఖమ్. 32

ప్రజాః పాలయ భద్రం తే తాసు నష్టాసు నశ్యతి
నాచరన్తి తు యే ధర్మాన్ నృపతే బ్రాహ్మణాదయః 33

న చింతయంతి దేవేశం దేవకీనందనం హరిమ్
నాస్తికాస్తే నరా జ్ఞేయాః సర్వధర్మబహిష్కృతాః. 34

ఏతైః సహాసనం స్పర్శం మనసాపీహ నాచరేత్
ఆరాధయన్తి దేవేశం ప్రాణినాం ముక్తిదం హరిమ్
దేవతుల్యాశ్చ తే జ్ఞేయాశ్చాణ్డాలోఽపి హరేః ప్రియః. 35

ఈ శ్లోకములు రెండున్నర పంక్తులు తగ్గింపబడినవి. పై శ్లోకములకు తెనుగనువాద మీ క్రింద చూపుచున్నాను.

తెలుగు అనువాదము (3-27-38 గద్య పద్యములు)

సీ. ధర్మశాస్త్రముల యర్థరహస్యము లెఱింగి
 జరుపు బ్రాహ్మణుఁడు మోక్షంబు గాంచు
న్యాయ మార్గంబు నొకింతయును దప్పక ధాత్రిఁ
 బాలించు జనపతి పడయు ముక్తి
క్రయవిక్రయములఁ బొందక సర్వసముఁ డైన
 వైశ్యుండు పొందుఁ గైవల్యపదము
నారాయణ స్మరణయు విప్రపూజయుఁ
 గావించు శూద్రుండు గనుఁ బరంబు

తే. నాల్గువర్ణంబులును నిట్లు నడచి పొందు
ముమ్మరంబుగ నైహికాముష్మికములు
స్త్రీలవర్తన లేర్పరించెదను గాన
ధానమతితోడ వినుమింక ధర్మతనయ. (27)

ఉ. అపరిఁ గన్నఁగూడఁ జను నూరక సన్నలు వాఱ నాడుఁ ద
త్తఱపడు రోడఁ జిత్ర్పదువిధంబున నొత్తిలిపల్కు నవ్వుఁ బ
ల్మఱుఁ బొరుగిండ్ల కేఁగు నొకమట్టున నిల్వదు చంటిమీఁద ముం
జెఱఁ గెడలించు వైశికపు సిగ్గు నటించుచు జార దారుణిన్. (28)

పరులఁ గన్నఁ జంకపాపని ముద్దాడు
గోడ నిక్కి చూచుఁ గొప్పు దీర్చు
మాఱుమలయు నత్తమామలతో లేని
కిటుకు వెట్టి జంధకివదూటి. (29)

మాలకరి దాసి సైరంధ్రి మాఱుఁదల్లి
మగఁడు విడిచిన సతి దూతి మంత్రసాని
జోగురా లాఁకు లమ్మెడిజోటి విధవఁ
గలసి వర్తించునది జారగా నెఱుంగు. (30)

పీరలలోపల మిక్కిలి
జారకు దూతియును దాది సాహసపారా
వారముతీరముఁ జేరుపఁ
బేరోదలు పాయరాని పెనఁకువకతనన్. (31)

ఎచ్చోట విలాసినులకు
మచ్చికఁ జనవిచ్చినం బ్రమాదము పతికిన్
వచ్చునవశ్యము కాంతలు
చచ్చినపుడు విశ్వసింపఁ జన నెవ్వరికిన్. (32)

అత్తయు మామయు మగఁడును
గత్తులలోను లయి బిఱుసు గావలె నెపుడున్
మత్తచకోరాక్షులకును
చిత్తము పరపురుషభోగశీలం బగుటన్. 83

సీ. ఉపవాసములఁ దద్దయును గృశింపక మేను
దిండిచేఁ బోషించుచుండెనేని
మస్తకాంబరముల మాలిన్యభావంబు
నందక వన్నె బెట్టయ్యెనేని
దానధర్మముల నర్థంబు వెచ్చింపక
కట్టఁడియై గూడఁబెట్టెనేని
తన పుట్టినింట వంచనతోడ నిల్వక
పొరుగిండ్లపాలయి తిరిగెనేని
సంతతంబును శ్రీహరిస్మరణ లేక
కలుకుఁదనమున దుర్భాష లఱచెనేని
విధవ పెనిమిటితోఁ గూడ వివిధనరక
కూపబాధలఁ బడు గడు గుఱుతులేక. 84

నాలుకయును దాలువులును
నీలరుచిం గలిగెనేని నెఱి చరణంబుల్
నేల సరిమోపవేనియు
వాలాయము పతి వహించు వైధవ్యంబున్ 85

కంతు సుఖకేళిఁ దేలు వి
తంతువుతో నెవ్వఁడే నతఁడు దన పుణ్యం
బంతయుఁ గోల్పడి కూలు ని
రంతరము రౌరవాదులగు నరకములన్ 86

బాల్యమునఁ దల్లిదండ్రులు ప్రాయమున ధ
వుఁడు వార్ధకమున నందనుండుఁ జెప్పి
నట్లు చేయంగఁ దగుఁ గాని యరసి చూడఁ
దెఱవలకు నెందుఁ దమయిచ్ఛఁ దిరుగఁ జనదు. 87

ఇది నీ వడిగిన యర్థంబునకు నుత్తరంబు నీవు నాసిత్తద్యోతకార పిశునా సూయకుల దాయనీక నిజోపలాలనంబునఁ బ్రజాపాలనంబు సేయుము ప్రజాను రాగంబున ధనంబును ధనంబున ధర్మంబును ధర్మంబునఁ గీర్తియుం జేకురుఁ గావున భూవల్లభునకుఁ బ్రజాపాలనం బవశ్యకర్తవ్యంబు మర్త్యులెయ్యెడం గీర్త నీయంబు గాని వర్తనంబునఁ బ్రవర్తిల్లక నారాయణధ్యానపరాయణులై యుండ వలయుఁ బుండరీకాక్షభక్తివిరహితుం డగు బ్రాహ్మణుండును జండాలుండు చండా లుండును విష్ణుభక్తుం డయ్యెనేని సకలలోకపూజ్యుం డగును గావున నీవు వాసుదేవ చరణ స్మరణాయత్తచిత్తుండవగు మనిన నిత్తపోధనసత్తముం గనుంగొని యుధిష్ఠిరుం డి ట్లనియె.'' 88

ఇది సంగ్రహీకరణమునకు స్థాలీపులాకన్యాయమున నొక్క యుదాహరణము.

**జైమిని భారతమునందు సంగ్రహించి వ్రాయబడిన మరికొన్ని ఘట్టములు:**

1. శ్రీకృష్ణభీమసేనుల సరసాలాపములు-సంస్కృతమున 19 శ్లోకము లును, తెలుగున 8 పద్యములును గలవు

2. భద్రావతి పురవర్ణనము - సంస్కృతమున 17 శ్లోకములు, తెలుగులో నైదు పద్యములు గలవు.

3. భద్రావతి నగరములో వృషకేతుడు భీమునితో బల్కిన మాటలు- మూలమున 26 శ్లోకములుండ, దానిని గవి కేవల మూరు పద్యములలో మాత్రము వ్రాసియున్నాడు

4. జార స్త్రీ లక్షణములు-సంస్కృతమున 16 శ్లోకములు, తెలుగులో పది పద్యములు.

5. ద్వారకలో శ్రీకృష్ణుని భోజనము-మూలమున ముప్పది శ్లోకములు, తెలుగులో రెండు పద్యములు.

6. శ్రీకృష్ణ భీమసేనుల సరసాలాపములు (ద్వారకలో) - సంస్కృత మున 27 శ్లోకములు, తెలుగులో 2 పద్యములు.

7. ప్రభావతీ' సుధన్వుల సంభాషణము - సంస్కృతమున 47 శ్లోక ములు, తెలుగులో 8 పద్యములు.

8. చంద్రహాసుని వివాహము-మూలమున 50 శ్లోకములు, తెలుగులో నొక పద్యము.

9. శ్రీరామాశ్వమేధము, లవకుశులతో శ్రీరాముడు, దమనుజులు గావించిన యుద్ధము-సంస్కృతమున 885 శ్లోకములు, తెలుగున 120 పద్యములు.

10. మూలమున-"కర్ణుని యింట వేదధ్వని నిరంతరము గలదు. కాని నే డాతని మరణమున శూన్యమై యిల్లు శోకతప్తమైనది."

ఈ భావము సంస్కృతమున నైదు శ్లోకము లందును, ననువాదమున నొక్క పద్యము వలనను వ్యక్తమైనది.

11 చిట్టచివరి మూడధ్యాయములు-మూలమున 128 శ్లోకము లుండగా తెలుగున కేవల మైదు పద్యములు గలవు. ఈ యాఖ్యానములలోని సకులోపాఖ్యాన మాంధ్రగ్రంథమున బరిహరింపబడినది. సకుటుంబ బ్రాహ్మణ స్వర్గ ప్రాప్తి, యాగకథాశ్రవణ ఫలము మాత్ర మైదు పద్యములలో నున్నవి.

ఈ విధముగా సమయాసమయములను దృష్టియందుంచుకొని వీరభద్రుడు తన గ్రంథమును గడు మెలకువతో రచించినాడు

(3) కొన్ని విషయములను బూర్తిగా విడచివేయుట

1. మూల జైమినిభారత గ్రంథములోని ప్రారంభము తెనుగున లేదు.

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్

హరివంశము చివరలో నెఱ్ఱనయు, భాగవతమున బోతనయు దీనినను వదించిరి.

2. మూలమున ద్వితీయాధ్యాయములో, దుర్యోధనుడు దూర్వాసుడు పంపినప్పటి సంఘటనయు, నా సందర్భమున శ్రీకృష్ణుడు పాండవులకు గావించిన సాహాయ్యమును దెలుపబడినవి అది తెలుగున లేదు

3. యౌవనాశ్వుని సైన్యవర్ణనము సంస్కృతములో నున్నది. ఆ శ్లోకము లెనిమిదియు దెనుగున వదలివేయబడినవి.

4. పంచమాధ్యాయములో గల 'జీవనం భాను కిరణాః పిబన్తి తరసా యథా' అను నుపమానమనువాదమున వదలివేయబడినది.

5. మూలమున యౌవనాశ్వ వృత్తాంతములో జరధ్ధవ - సుదేవుల విష యము 25 శ్లోకములలో తెలుపబడ, తదనువాదమున ని విషయము బరిత్య క్తము.

6. విధవాస్త్రీల కర్తవ్యములు మూలములో మాత్రమే వివరింపబడినవి.

7. స్థిరలక్ష్మీ యోగము తరువాత ధర్మరాజునకు 'భగవంతుడు ప్రసన్న మగు విధానము' మూలమున దెలుపబడినది. ఆంధ్రమున లేదు

8. ద్వారకాపురీ వర్ణనము మూలమున నేడు శ్లోకములలో నున్నది. అనువాదమున లేదు.

9. ద్వారకాపురీ వర్ణనము పిమ్మట శ్రీకృష్ణాగమనమునకు బూర్వమున మాలిన, తేలిన యాగమనమును వీరభద్రుడు వదలినాడు

10. కర్ణపుత్రుడగు వృషకేతునితో ననుసాల్వుడు పల్కిన పల్కులలో గొన్ని తెలుగున లేవు (14 అ)

"ప్రభూణాం హి ప్రభావేణ సంగితా సంగతం సమమ్
దృశ్యతే శంకరే వీర విషం చైవామృతం సదా."

అనునదొక యుదాహరణము

11. కుంతి, భద్రావతులు (వృషకేతుని భార్య భద్రావతి) అర్జున, వృష కేతనులతో వారు యాగాశ్వము వెంట వెళ్ళునపుడు వాక్రుచ్చిన మాటలు మూల మున 16 శ్లోకములలో నుండగా తెలుగున లేవు.

12. స్వాహాదేవి యగ్నిని వరించు సమయమున "స్త్రీణాం చిత్తం కురుపే హి యాతి మన్దజనే తథా' - అనుచు బేర్కొనబడిన వాక్యము తెలు గున లేదు. ఈ సందర్భముననే నీలధ్వజునే యగ్ని పరీక్షించిన విషయము సంగ్రహీకరింపబడియున్నది

13. మూలమున సుధన్వునితో దల్లి పల్కిన పల్కులు తెలుగున లేవు. ఇవి సంస్కృతమున 12 శ్లోకములలో వర్ణితములైనవి.

14. హంసధ్వజ వృత్తాంతములో సుధన్వుడు, ప్రభావతి-వీరి సంగమమున ప్రభావతి గర్భిణియైనట్లు దెనుగున లేదు.

15. మణిపురమునకు వచ్చిన యర్జునుని గిరీటాగ్ర భాగమున మృత్యు సంకేతమగు నొక గృధ్రము వచ్చినది. అపశకునముగ భావింపబడిన నీ విషయము తెలుగున త్యక్తమైనది.

16 చిత్రాంగదా నందను డగు బభ్రువాహనుడు తన తల్లి శాపవృత్తాంతము మంత్రి యగు సుబుద్ధితో జెప్పుట సంస్కృతగ్రంథములోననే యున్నది.

17. సంస్కృత మూలములోని యేకాదశోఽధ్యాయమున శ్రీకృష్ణునికి వసుదేవుని యుపదేశము, వసుదేవుని వాక్యములు భీమునిచే ఖండింపబడుట, రుక్మిణి యెదుట శ్రీకృష్ణుడు సఖీవ్యాజమున స్త్రీలను విమర్శించుటయు, రుక్మిణి తగిన సమాధాన మిచ్చుటయు, శ్రీకృష్ణుడు-దేవకి, యశోద, రుక్మిణి, ప్రద్యుమ్నాదుల విధులను దెలుపుటయు, యాజ్ఞిక, బ్రాహ్మణ, సన్యాసి, శంభలసంబంధి మాగధులతో శ్రీకృష్ణుని యాలోచనము- అను విషయములు 164 శ్లోకములలో వివృతములగుట కానగును తెలుగున లేవు

అట్లే పండ్రెండవ యధ్యాయములో స్మార్తుల వర్ణన, సత్యా - ద్రౌపదీ సంవాదము, ఉమాదేవిని గుంతీ ద్రౌపదులు సన్మానించుటయు, సత్యభామకు యాగాశ్వము జూడ సిచ్చగల్గుట స్త్రీలకు యాగాశ్వము జూపబడుట- అనునవి తెలుగున లేవు

18 సౌభరి యాశ్రమమునకు నర్జునుడు వెళ్లిన పిమ్మట సౌభరి, విజయునకు దొమ్మిది శ్లోకములలో గర్భజ్ఞాన బోధ చేయుట తెలుగున లేదు.

19 హంసధ్వజ వృత్తాంతములో గల సుదర స్త్రీల సంభాషణ సంస్కృతములో మాత్రమే పన్నెండు శ్లోకములలో గలదు

20 సంస్కృతములో 28 శ్లోకములలో గల హంసధ్వజ - సుధన్వ సంభాషణము తెలుగున లేదు.

21. 75 శ్లోకములలో - వివిధ రోగ వివరణము, కర్మవిపాక వర్ణనమున, మూలమున మాత్రమే గలదు.

22. చంద్రహాసోపాఖ్యానములో-దుష్టబుద్ధి కుమార్తె విషయ-పార్వతీ దేవిని జంద్రహాసుడు భర్త యగుటకై ప్రార్థించును. ఇది తెలుగున లేదు.

23. దుష్టబుద్ధి కుంతలరాజ్యమునకు వచ్చుచుండ, దారిలోని యుప శకునములు, కుళిందరాజు నాతడు బందీ చేయుటయు, నతని యత్యాచారములు, మూల జైమిని భారతములో మాత్రమున్నవి. కాని తెలుగున లేవు.

24. చిట్టచివరి నకులోపాఖ్యానము తెలుగు జైమిని భారతమున లేదు. విడచిపుచ్చబడినది.

(4) దేనియందైనను క్రమమును పాటించుట :

వీరభద్రుడు మూలమున గల కథాక్రమమునే పాటించెను. ప్రథమా శ్వాసము నుండి యష్టమాశ్వాసము వఱకు గల (కథలు) యుపాఖ్యానము లన్నియు నొకే క్రమమున నడచినవి. అట్లే యశ్వమేధ విధానము, కథల యందలి పాత్రల భావములు. శ్లోకానువాదము, నారస్త్రీల లక్షణములు, ఉపమలు, సూక్తులు, లోకోక్తులు, మున్నగు వాని యన్నింటను మూల క్రమ మునే యనుసరించెనని మనకు స్పష్టమగుచున్నది.

(5) సంస్కృత మూలమున గల యుపమల యథాతథముగ గైకొనుట:

1. మూలము : (8-19-20)

పంకే మగ్నాం హి గాం త్రాతుం ప్రాప్తో నాథః సుహర్షితా
ధేనుర్భవతి గోవింద స చ తాం చేన్నివ జ్జయేత్॥
తయా కస్యైయ పురతః కథనీయం జనార్దన
అస్మాకమపి సావస్థా త్వామాశ్రిత్యాత్ర దృశ్యతే॥

అను : 1-180

పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరిచు గోపకునిమాడ్కి
ముదము దైవార నుద్ధరింపుదువుగాక
పంకనిర్మగ్ను నన్ను గోపాలతిలక

2. మూలము :

'శిలా రామపదం ప్రాప్య కిం స పూతా పురా భవత్' (2-28)

అను : (1-99)

అహల్య రామచంద్రుని చరణాబ్జరేణువునఁ దొంది శిలాకృతి వీడుకొన్న లాగున,

3 మూలము : (5-6)
పూర్వజాః కూటసాక్ష్యం హి బ్రువతో యాన్త్యధో యథా
అను : (2-68)
కూటసాక్షు లత్యంత కఠోర ఘోర నిరయంబులు
దూఱఁగఁ బోవుకైవడిన్.
4. మూలము : (19-45)
తరసా బభ్రామ ఘటచక్రవత్.
అను : (5-35)
కుమ్మరిసారె గుడి దిరుగుకొనెడు విధమునన్.
5 మూలము . (27-2)
లోకాపవాదభీతేన త్యజ్యతే జానకీ మయా
సంసార భయ భీతేన యోగినా మమతా యథా॥
అను · (8-35)
సాధ్వియగు సీత విడిచెద జననభీతి
యోగవరుడుమందు మమకార ముడిగినట్లు
6 మూలము : (56-45)
యథా వ్యాఘ్రం బాలమృగో విలోక్య
తథా దాముం నాభ్యనందద్ గిరాపి.
అను (7-32)
బాల హరిణములఁ జూచిన
క్రోలు పులిగతిన్ మనంబు గుబ్బతిలంగ
ధ్యా లాలనములు సేయుచు
7. మూలము : (4- 30, 31, 32, 33)
''అపుత్రాణాం యథా లోకా భవన్తి న సుఖప్రదాః''
''బంధూనాం చ యథా సంగో జితస్త్రీణాం విలోక్యతే''
'నృపతీనా మమంత్రాణాం చిరం రాజ్యం న సుస్థిరమ్'
'న మోక్షో భక్తిహీనానాం విష్ణోరమిత తేజసః'
''వైభవం హి యథా నృణామనారాధ్య చ శంకరమ్''

అను . (2-18)
పుత్త్రహీనం డైన పురుషునకుఁ బరలో
కసుఖము పొందు గల్గని విధమున
నంగనాజితుఁ డై నయట్టి పాలసునకు
బంధు సంఘంబు చొప్పడ నికరణి
మంత్రినిస్పృహుఁ డైన మనుజనాథునకును
స్థిరరాజ్యగరిమ సిద్ధింపనట్లు
శ్రీవిష్ణుపద భక్తి చిత్తంబులో లేని
వానికి శుభములు లేనిపగిది
శంకరునిఁ బూజ సేయని పంకమతికి
గురుతరైశ్వర్య మొదవని సరణి మనము.''

**(6) సూక్తులు యథాతథముగ గైకొనుట :**

సంస్కృత మూలమున గల సూక్తులే యథాతథముగ బినవీరనచే వాడబడినవి.

(i) మూలము : (20-31)
యథా కశ్చిచ్ఛిశుః కృష్ణ మౌక్తికాని ప్రయచ్ఛతి గృహ్ణాతి బదరాణ్యేవ'
అను : (6-59)
రేగుఁ బండ్లకొఱకు ముత్తియంబులు వెలవోయు మలఁచ కలఁడె.

(ii) మూలము : (37-47)
మిత్రార్థే యస్త్యజేత్ ప్రాణాన్ గవార్థే చ ద్విజన్మనామ్ ।
స్వామికార్యే చ సమరే తస్య లోకాః సనాతనాః
జాయన్తే నాత్ర సందేహః కైవల్యమపి చింతితమ్.
అను : (7-16)
స్వామి సఖి గో మహీసురవ్యప్రయోజ
నార్థమై మేను దొఱఁగు ధన్యాత్ముఁ డెవ్వఁ
డతఁడు కైవల్యసౌఖ్యంబు లనుభవించు
ననుచుఁ జెప్పుదు రఖిలధర్మార్థవిదులు.

(iii) మూలము : (45-18)
అపుత్రస్య పరో లోకో నాస్తి వేదేన భాషితమ్.
అను : (7-211)
బాలక విహీనులకు మానవులకు నౌర్ధ్వ దైహికంబులు లేవు.
(iv) మూలము : (46-29)
యో వై పితా స పుత్రోహి శ్రుతిరేషా సనాతనీ.
అను (7-234)
యోవై పితానపుత్ర.
(v) మూలము : (18-57)
స్వల్పీకరవర్షేణ యద్ రజః పరిణామ్యతి.
అను : (5-7)
పుడిసెఁడు నీటిచే నడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘముల్ దొరదునె.

7. సందర్భోచితముగ మూలమును మార్చి వ్రాయుట :
ఈ క్రింది స్థలములలో వీరభద్రకవి మూలమును మార్చి వ్రాయుట చూపట్టుచున్నది.
(1) యదా యదా సతాం గ్లానిర్జాయతే భువి భారత॥
తదా తదా స్వయం కృష్ణస్త్రాతా భవతి సంస్కృతః॥ (2-67)
ఈ శ్లోకము భగవద్గీతలో మరొక రూపమున గననగుచున్నది.
యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.
ఈ శ్లోకముల భావమే తెనుగున మార్చబడినది.
దాసజనుఁ డెఁదు నేయుపద్రవముఁ జెందు
నందులకు వచ్చి రక్షించు నచ్యుతుండు (1-114)
(2) ఉద్దాలకుడు పైతృక తిథికి వాడబోవు కూరలు కొంత మార్చి వ్రాయబడినవి.
(మూలము)
చణకానాహరిష్యామి కోద్రవాన్ వర్తులానపి
మసూరాన్ రాజమాషాంశ్చ కులిత్థానాఢకీః పునః ।

యావనాలాంశ్చ నిష్పావాన్ వరటాన్ మర్కటానపి
ఖర్జూరకాంశ్చైత్ర పత్రాంద్రాద్ధే శాకం చ కుత్సితమ్।
వృన్తాకం గృంజనం చైవ చిల్లీం కోశాతకీవలమ్
కూష్మాండకం కలింగంచ పిండీం పిండాలుకం తథా। (16-74.75,76)
(తెలుగు)

ఉలవలు, చామలు కోద్రవ
ములు కంములు రాజమాషములు నిష్పావం
బులు చణకంబులు దల్వం
దలు జొన్నలుఁ గాని గూర్పఁ దగు ధాన్యంబుల్.

ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొరకాయ
పిండికూర నేతిబీరకాయ
దిత్తిమేకికాయ చెంచలి వంకాయ
గాని మంచికూరగాయఁ దేను. (4-95,96)

(3) చండీ వృత్తాంత మంతయు జెప్పబడిన పిమ్మట జంకి శాపవిమోచన మొందెననియు, నుద్దాలకుడు శాపురము చేసినట్లును మూలములో గలదు. కాని యనువాదమున, 'తరుణి వెనుక చేసిన రోతల దలంచి' గార్హస్థ్యము బూనక మహర్షి సన్న్యసించెననియు పీరభద్రకవి మార్చియున్నాడు.

(4) హంసధ్వజుని సోదరులు (మూలము) చంద్రసేన, చంద్రకేతు, చంద్రదేవ, ధనబల, ధర్మవాహ - అనబడువారు. వీరు తెలుగున లేరు.

హంసధ్వజుని కుమారులు :

ధనబల, సురథ, సుధన్వ. సుబల, ధర్మబాహు (తెలుగు). పైన తెలిపిన వారిలో ధర్మవాహ, ధనబలులను హంసధ్వజుని గుమారులుగ యాంధ్రకృతిలో పీరభద్రుడు మార్చుటకు గారణము ఎనరాదు

(5) ప్రభావతి - సుధన్వుని గౌగిట నుండగా, సంస్కృత జైమిని భారత మూలకర్త కొక రూపమునను, పీరభద్రునికి (యాంధ్రమున) మఱొక రూపము నను గన్పట్టినది.

మూలము .

తం కంఠే ధారయామాస సాలం వల్లీవ కాననే

అను

గందపుమ్రాఁకు తావిగొనఁగా బెనఁగొన్న భుజంగి కైవడిన్.

(6) శ్రీరాముడు - సీతను గంగాతీరమున వదల నిశ్చయించిన విషయము విని సీత మూర్ఛిల్లినది. ఇది మూలకర్తకును, ననువాదకారునికిని రెండు విధములుగ గన్పట్టినది.

'తస్యవచః శృత్వా పపాత ధరణీ తలే
మూర్ఛితా జానకీ తస్మిన్నంబరాద్ రోహిణీ యథా
ఛిన్నమూలా యథా వల్లీ గృష్టిః కూలాభిపీడితా
కుమారీ సర్వదష్టేవ తద్వద్ సా భూతలేఽపతత్.

అను

ధరిత్రీతలము మీఁద ఝంఝూవాతాహతిఁ బడిన పుష్పవల్లికఁ బోలెన్.

(7) శ్రీరాముని మంత్రి కుమారులలో మూలమునను, ననువాదమునను భేదమున్నట్లు దోచుచున్నది.

మూలము ·

జితత్రమ, ధార్మిక, సుకేతు, శత్రుసూదన, చంద్ర, మద, శల, కాల, మల్ల, సింహ - అనువారు.

అనువాదము

సింహ, చంద్ర, కాల, ధార్మిక, మదన, శత్రుసూదన, జితత్రమ, అమల, శరన్నద, సుకేతు.

(8) అర్జునుని మరణమును గూర్చిన తేదీలలో భేదమున్నది.

మూలము :

కార్తీకమాసము - ఏకాదశి-
సాయంకాలము - బుధవారము-
ఉత్తరాభద్ర నక్షత్రము.

అనువాదము

కార్తీక శుద్ధ ఏకాదశి

ఆదివారము - సాయంకాలము.

ఈ భేదము మూలమున పూర్చి చూపెననుటకు ఒక్కని యుదాహరణము

(8) స్వయం కల్పిత విషయములు :

i. భీముడును నర్జునుడును గలసి శ్రీకృష్ణునికి నమస్కరించినపు డిట్లున్నారు.

''రాజీవ యుగళంబుపై క్రౌంచావులు గొన
వ్రాలు తుమ్మెదల చందమునన్.''

ఇది స్వకపోల కల్పనము. మూలమున లేదు.

ii వృషకేతుడు, యుద్ధమున యౌవనాశ్వుని గొడుగు, చామరయుగంబు విరుగ గొట్టినప్పుడు కవి యుపమించిన రీతి మూలమున లేదు "సగుణ ధర్మ రహితులైనట్టి కుటిల వర్తనుల గూడ సజ్జనుని ప్రీతి గుణములు సమసినట్లు-"

iii. నీ ధ్వజుడు 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అని భార్యను దూషించిన రీతి మూలమున లేని నూత్న కల్పన యగుచున్నది.

iv. శ్రీరామ చరిత్రమున రజకుడు తన మామను జూచి 'అనలములోన నెయ్యి ఱిచినట్లు మండినాడు'- ఇది స్వయంకల్పనము.

v. లక్ష్మణుడు సీతాదేవిని యడవిలో విడచిపోవు సమయమున, మన యాంధ్రకవికి దోచిన రీతి సంస్కృతమున లేదు

సీతాదేవి 'పశుపాలకుల దుద్ధతి గొంచుబోవ వెన్దలుగున జిక్కి వాపోవు గవి తర్ణకముం బోరిఁజూచు కైవడిన్' గలదు.

vi. వాల్మీకి యాగమనమున సీతాదేవి స్థితి 'నిదాఘ తప్త కేకిని కబ్ద శబ్ద'మును బోలియున్నదట. - ఇదియు స్వతంత్ర పోకడయే.

vii. వృషకేతుని మరణము జూచి యర్జునడు దుఃఖముతో బల్కిన రీతి సంస్కృత జైమిని భారతమున గానరాదు, ఇది స్వకపోల కల్పనయే యగును.

అంబుజాపుకు లేని నళంబు దివియ
లేని గేహంబు లింగంబు లేని పీఠ
మప్రయోజనమైన యట్లనఘ నాకు
నీవు లేని జయం బది నిష్ఫలంబు.

VIII. జీవన్మణి గొని రాబడిన పిమ్మట, వృషకేతనార్జునులు బునర్జీవితులగుటను గవి యుపమించిన రీతి- 'ఆదికై తచ్చిరము లయస్కాంత మినుముఁ జెందిన మాడ్కిన్' - స్వతంత్ర పోకడయే ఇది మిగుల మనోహర మగు నుపమానము.

IX 'మర్త్యకోటికి దేహము లస్థిరము లగుటఁ దెలియఁగ నిక్కంబు'- ఇది వినూత్న విషయమే

X ఒక్క సమాసము నే, యొక్క కందపద్యముననే దశావతారస్తుతి గావించుట మరొక యపూర్వ కల్పనము, మిగుల మనోహరమును, వినూత్న దృక్పథమును నగుచున్నది ఇది మూలమున లేదు

కం శరధిచర కమఠ కిటి నర
హరి వామన భృగుజ రామ హలభృ జ్జిన క
ల్కి రుచిర రూపాయ జగ
ద్భరణాయ నమోనమోస్తు భవతే యనుచున్. (7-286 - జై. భా.)

ఈ విధముగ మూలము ననుసరించియు, పెంచియు, త్రుంచియు, నుపమించియు, మార్చియు, స్వకపోల కల్పన గావించియు, పీరభద్రుడు జైమిని భారతము ననిదంపూర్వమై, యద్భుతమై, సరసమై, సాంగోపాంగమైన మహా గ్రంథముగ మలచి, తన శక్తి నంతయు నిమిడ్చి వాఙ్మయమున నొక్క మకుటాయమానమగు గ్రంథముగ దీనిని దిద్దిదిద్ది తన స్థానమును నిలబెట్టి కొనినాడు

ప్రాచీనాంధ్రకవులు పాటించిన భాషాంతరీకరణ విధానములు ప్రధానముగా మూడు కలవు.

(1) కథానుసరణము

(2) భావానుసరణము

(3) శబ్దానుసరణము

(1) కథానుసరణ మనగా మూలమునందలి కథను మాత్రమే గ్రహించి దాని పరమార్థము చెడకుండ సంతరించు విధము.

(2) మూలమునందలి కొన్ని శ్లోకముల నొక్కొక్క ప్రమాణముగా గ్రహించి యౌచిత్యము పాటించి, పెంచియో, తగ్గించియో, మార్చియో రచించుపద్ధతి భావానుసరణము.

(3) మూలమునందలి ప్రతి శబ్దమున కనువాదము కూర్చుట శబ్దానుసరణము.

ఇందు కవిత్రయము వారిది కథానుసరణ పద్ధతి. శ్రీనాథాదులది భావానుసరణ పద్ధతి శాస్త్ర గ్రంథకర్తలది శబ్దానుసరణ పద్ధతి.

సంస్కృత జైమిని భారతము ననుసరించిన పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని దిది భావానుసరణ పద్ధతి. పదునెనిమిదవ శతాబ్దిలో విజయరంగ చొక్కనాథుని యాస్థానమున నుండిన సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు కూడ దీనిని భావానుసరణ కావ్యముగా రచించెను

"వేంకటకృష్ణప్ప నాయకుడు తిరుమల నాయకుని మనుమని మనుమడగు విజయరంగ చొక్కనాథుని యాస్థానమునందుండెను. విజయరంగ చొక్కనాథుడు క్రీ శ. 1704 వ సంవత్సరము మొదలు 1781 వ సం. వరకు రాజ్యమేలెను."[1]

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు వ్రాసిన జైమినిభారత వచన కావ్యప్రతులు నేటికి రెండు లభించినవి. అందొకటి మ రా తిరుమల వీరాస్వామి (పుదుకోట్టై) పంతులు గారివలనను, మఱియొక్కటి మ రా వత్తలకూండు టి ఎస్ కృష్ణయ్య (బండ్లగుండు గ్రామము, మధురై తాలూకా) వారి వలనను

లభించినవి. ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) పుస్తక భాండాగారమున మొదటిది 142 సంఖ్య, రెండవది 880 వ సంఖ్యగలది. మూడవ ప్రతి యెక్కడను నున్నట్లు కనబడదు.[2]

సముఖము కవి వ్రాసిన ఈ గ్రంథపు పీఠికలో కవివంశము, కాలము, అనువాదాది విషయములను గూర్చి శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి పన్నెండు పుటలలో వివరించెను.

సముఖము కవి వచన జైమిని భారతమునం దాశ్వాసాంతములలో

"ఇతి శ్రీ మత్పాంద్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికాప్రముఖ సకలసంపత్పారంపరీ సమేధమాన సముఖ మీనాక్షీనాయక తనూభవ మీనాక్షీదేవి కటాక్ష లబ్ధకవితా సాంప్రదాయ వేంకటకృష్ణప్ప నాయక ప్రణీతం బైన జైమిని భారతంబున నశ్వమేధపర్వ మ్మను వచన కావ్యంబు నందు"

అని యొక గద్య వ్రాయబడి యున్నది.

శ్రీ జయంతి రామయ్యగారి భూమిక తెలుగులోనను, నాంగ్లమునందును, మూడు ప్రతుల వంతున వ్రాయబడియున్నది. అందు సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని వంశచరిత్రము, తాత్కాలిక చారిత్రిక విశేషములు, తలిదండ్రుల వివరములును వివరింపబడియున్నవి

పిన వీరభద్రుడు గాని, సముఖము కవి గాని జైమిని భారత పద్యవచనములలో నశ్వమేధపర్వము దక్క మరి యే పర్వమును గలదని తెలుప లేదు. సంస్కృత జైమిని భారతములో కూడ నొక్క పర్వమే (అశ్వమేధము) కానవచ్చుచున్నది.

సముఖము కవి వచన జైమిని భారత రచన తెలియక ముందు సుప్రసిద్ధ వచన రచయితయైన చిన్నయసూరియే ప్రథమ వచనగ్రంథము రచించినట్లు పండితు లూహించియున్నారు. కాని సముఖము వారి రచనను గాంచిన వెనుక యీ వచన జైమిని భారతమే యాది వచన గ్రంథమని తెలియుచున్నది.[3]

వచన జైమిని భారతమునందు మంగళాచరణాది కృత్యాదిపద్యములు పరిషత్పుస్తకములు రెండింటిలోనను లేవు

దాక్షిణాత్య యుగమున ననేక వచన కావ్యములు వచ్చినట్లు "ఆంధ్ర వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు" అను గ్రంథమున డాక్టర్ కుల శేఖరరావుగారు పేర్కొనియున్నారు అందు దిఙ్మాత్రముగా గొన్నిందిని జూపు చున్నాను.

**కల్పితములు** (పుట 634 నుండి 648 వరకు)

1. సారంగధర చరిత్ర (సముఖము కవి)
2. గోవ్యాఘ్ర చరిత్ర (రచయిత పేరు కానరాదు)
3. విక్రమార్క చరిత్రము.
4. పంచతంత్ర కథ

**మత సంబంధకములు** (పుట 621 - 633 వరకు)

1. సకల రహస్య సర్వార్థసార సంగ్రహము
2. Summary of old Testament.
3. అజ్ఞానధ్వాంత చండ భాస్కరము (కంభంపాటి అమరేశ్వరశాస్త్రి)
4 వివేక చింతామణి (దత్తాత్రేయ యోగి శిష్యుడు)

**పురాణములు** (పుట 557 - 620)

1. సుందరకాండము - తుపాకుల అనంత భూపాలుడు
2 విష్ణు పురాణము -do-
3 మార్కండేయ కథ (అముద్రిత తాళపత్రము)
4 శ్యామరాయకవి - రామాయణము.
5. భారతము - కరువె పీరరాజు.

**పరిమాణ దృష్టి**

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమిని భారతములో మొత్తము 1474 గద్య పద్యములు, 8 ఆశ్వాసములు గలవు వచన (సముఖము కవి) జైమిని భారతమున నైదాశ్వాసములలో కథయంతయు భావానువాద రూపమున ననువదితమైనది.

ఈ రెండు గ్రంథములలోనను గథలో భేద మగుపడుటలేదు. స్థూలముగా సముఖము కవి చేసిన వచన విన్యాసము క్రింది విధములుగా విభజింపవచ్చును.

(1) పద్యములను వచనముగా మార్చుట.

(2) ఉపమలను యథాతథముగా గైకొనుట.

(3) సూక్తులను, లోకోక్తులను మూలమునుండి గ్రహించుట.

(4) సూక్ష్మములైన విషయములను గూడ గైకొనుట.

(5) నూతన సమాసములను గల్పించుట

(6) స్వతంత్ర కల్పనములు - మూలమును సంగ్రహించుట

ఈ రచన నీ కవి పై విధమున రచించి, ప్రత్యేక పథకము సిద్ధపరచు కొని దాని నాధారముగాగొని, ప్రణాళికను దిగ్విజయముగా సాధించి, తన యను వాదమును నెరపెను

(1) పద్యములను వచనముగా మార్చుట .

ఉదా: 1.

పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకుని మాడ్కి
ముదము దైవాఱ నుద్ధరింపుదువు గాక
పంకనిర్మగ్న నన్ను గోపాలతిలక (1-180) వీరభద్రుడు.

పంకనిర్మగ్నంబైన ధేనువును గోపాలకుఁ డుద్ధరించు శోకమగ్నల మైన మమ్ము నీ వుద్ధరింపుము (ప్ర అ పు 17) సముఖము కవి.

ఉదా: 2

పుడిసెఁడు నీటిచే నడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘముల్
దొడరునె తెప్పవేయఁ జెడు దోమఁ మీఁద సుపర్ణుఁ డెత్తిపో
గడఁగునె యీసుధన్వరథికప్రభుఁ డెన్నఁగ మీకు నీడుగాఁ
డుడుగుడు సంభ్రమం బితని నోర్చెదఁ దెచ్చెద నధ్వరాశ్వమున్. (5.7)

పుడిసెడు నీళ్లు చల్లిన నడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘంబులు వర్షింప వలెనే? తెప్పవేసినం బడిపోవు దోమలమీద గరుత్మంతుం డెత్తి రావలయునె? ఈ రాజు మీకు సమానుండు గాఁడు. మీ రితనిమీఁదఁ జేయిచేసికొనం బనిలేదు నేనే యీతనిం గెల్చి యధ్వరాశ్వంబుఁ దెచ్చెద (అ. పుట 102)

ఉదా : 3.

మాలకరి దాసి సైరంధ్రి మాఱుదల్లి
మగఁడు విడిచినసతి దూతి మంత్రసాని
జోగురా లాఁకులమ్మెడిబోటి విధవఁ
గలసి వర్తించునది జారగా నెఱుంగు. (3-30)

పువ్వులమ్ము పువ్వుఁబోఁడితోడ, దాసీ జనులతోడ, సైరంధ్రులతోడ, దాదులతోడ, మగలు విడిచిన సతులతోడ, మంత్రసానులతోడ, దూతికలతోడ, జోగురాలితోడ, నాకులమ్మెడి యంగనతోడ, విధంతువులతోడం, గూడి చెలిమి చేయు దానిం గులటయని యెఱుఁగవలయు (ప్ర ఆ పుట 52)

ఉదా: 4.

(సవనాశ్వము ముఖమున నున్న పట్టిక రెండు గ్రంథములలోనను, నీ విధమున వర్ణింపబడినది.)

దుర్జయరాజమండల విధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సృష్టిత మైన యీహయవతంసము త్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేఁగుదెంచె నిటలాక్షుని గెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్. (4-7)

రాజాధిరాజ రాజపరమేశ్వర సకల సామంతరాజ భయంకర వీర ప్రతాప మూర్తియైన యుధిష్ఠిర మహారాజేంద్రుం డధ్వరము సేయం బూని విహరింపం బంపిన యీ యశ్వరాజంబు నీశ్వరునిం బోరిలో గెలిచిన నెఱయోధు దుర్జన దండధరుండైన యర్జునుండు రక్షింపం బూని వచ్చె ధారుణీతలంబున వీరుండు శూరుండునుం గలిగెనేని పట్టి కట్టుండు. (ద్వి. ఆ 77 పుట)

ఉదా : 5.

శూరులు, ధర్మచరిత్రులు
దారులు, విజితేంద్రియులు కృతజ్ఞులు జగదా
ధారులని వారిశిరములు
హారంబులుగా ధరించు ననవరతంబున్. (5-88)

దానశూరులు, దయాపరులు, సత్యవ్రతపరాయణులు, జితేంద్రియులు, జితక్రోధులు, మాతాపితృభక్తులునైన వారల శిరఃకపాలంబులు నేను హారంబుగా ధరియింతు. (ఆ.2- పుట 184

ఈ విధముగా, వచనమంతయు యథామాతృకముగా నడచుచు, రచన గావింపబడినది. పద్యమే వచనరూపమున వ్రాసినట్లు కనబడును.

(2) ఉపమలను యథాతథముగా గైకొనుట.

ఉపమానములను పీరభద్రుడు దసంఖ్యాకముగా జైమిని భారతమున నుపయోగించెను. సముఖము కవి కూడ వానినే యథాతథముగా గైకొని తన వచనమున నిమిడ్చియున్నాడు. అచట నచట కొన్నింటిని పూర్తిగా విడచివేసెను. అట్లు విడచివేసినవి సంఖ్యకు చాలవగకు తక్కువగా నున్నవి. ఈ క్రింది యుదాహరణలు చూచిన వచనగ్రంథరచయిత మూలము నందలి యుపమానముల నెట్లు గ్రహించెనో గ్రాహ్యమగుచున్నది.

ఉదా:- 1. అహల్య రామచంద్రుని చరణాబ్జరేణువునం దొంటి శిలాకృతి వీడుకొన్న లాగున (1-98)

శ్రీ రామభద్రుని పాదారవింద రేణువులచే పాషాణంబు పావనంబైన తెఱంగున (ఆ. 1-పుట 10)

ఉదా:- 2. అనలములోన నెయ్యొలికినట్టుల మండుచు (6-28)

నెయ్యి వోసిన యగ్ని చందంబున భగ్గున మండుచు (ఆ 3-పుట 170)

ఉదా 3. పశుపాలకుం డుద్ధతి గొంచుబోవ పెన్దలుగునం జిక్కి హోమగవి తర్ణకముం దొరిజూచు కైవడిన్. (6-76)

వత్సంబు విడువ నోపని ధేనువు తెఱంగున (ఆ-3- పుట 179)

ఈ యుపమానంబున కేవలము భావము మాత్రమే గైకొనబడినది

ఉదా:- 4. నిదాఘ తప్తకేకిని కబ్దశబ్దమును బోలె (6-79)

వేసవి యెండం గొట్టువడిన మయూరి మేఘ గర్జితంబునకుం బలె

(ఆ-3-180 పుట)

ఉదా:- 5. రామవుని మీరు గెలుచుట జింకపిల్లలు సింహము జయించు తెఱంగు (6-286)

రఘువీరుని మీరలు జయించుట జింకపిల్లలు సింహంబును జయించిన తెఱంగు. (ఆ 4- పుట 210)

ఉదా:- 6. క్రేపుం బాసి గొడ్డావులెడు పగిది. (6-265)

వత్సంబు నెడం బాసిన ధేనువు కరణి. (ఆ-4-పుట 215)

ఉదా : 7.

నిప్పు ద్రొక్కిన పోలికం ద్రొక్కి పడియు. (8-111)

నిప్పులు ద్రొక్కినగతిం ద్రొక్కిపడి. (అ-5-పుట 308)

ఉదా : 8

ఝంఝూవాతాహతిం బడిన పుష్పవల్లికం బోలెన్. (6-65)

సురగాలిచేత వాలిన కుసుమవల్లియుం బోలె. (తృ. అ-పుట 176)

ఉదా : 9.

సాధ్వియగు సీత విడిచెద - యోగపురుషుండు మమకార ముడిగినట్లు (6-85)

యోగి పురుషుండు మాయనంబలె పరమసాధ్వియైన సీతను బరిత్య జించెద. (తృ అ. 171 పుట.)

ఉదా : 10

క్రొమ్మదుగున కేంగు భద్రకరిమాడ్కి (4-138)

మదగజంబు సరోవరంబు సొచ్చు చందంబున (ద్వి.అ- 106 పుట.)

ఉదా : 11.

కాళిందీనదము లోని కమలను భంగిన్. (4-184)

యమునాజలంబునం గనుపట్టు కమలంబు కరణి. (ద్వి.అ. 106 పుట)

ఉదా : 12.

గందపు ద్రమ్మంకుతావి గొనంగా బెనంగొన్న భుజంగి క్రైవడిన్ (4-120)

గందపుంజెట్టుం జుట్టిన చిలువచెలువ చందంబున (ద్వి. అ పుట 109)

ఉదా : 13

రెంటికిని జెడ్డరేవని రీతి (4-87)

రెంటికిం జెడ్డ రేవండై (ద్వి. అ. పుట 96)

ఉదా : 14.

"పుత్త్రహీనుండైన పురుషునకుం బరలోక సుఖముపొందు గల్గని విధమున, నంగనాజితుండైన యట్టి పాలసునకు బంధుసంఘంబు చొప్పడని కరణి, మంత్రినిస్పృహుండైన మనుజనాథునకును స్థిరరాజ్యగరిమ సిద్ధింప నట్లు, శ్రీవిష్ణు పదభక్తి చిత్తంబులో లేనివానికి శుభములు లేని పగిది, శంకరుని బూజ సేయని పంకమతికి గురుతరైశ్వర్య మొదవని సరణి మనము" (2-16)

"పుత్త్రులు లేనివానికిం గతి గలుగనేరదని వితంబున, నంగనావహుండైన యజ్ఞానికి బంధు మర్యాదలు మాలిన కరణిఁ, గార్యాలోచనము సేయని మనుజనాథునకు రాజ్యంబు సిద్ధింపని తెఱంగున, శ్రీవిష్ణుదేవుని చరణకమలంబులం దలంపని వానికి శుభంబులు లభింపని చందంబున, శంకరునిం బూజింపని వంకరకట్టెకు సంపదలు సంభవింపని కైవడి'' (ఆ 1-28 పుట)

(8) సూక్తులను లోకోక్తులను మూలము నుండి గ్రహించుట.

ఉపమ లే విధముగా యథామూలములైనవో, సూక్తులు - లోకోక్తులు గూడ నట్లే మూలానుసారులైనవి. ఆ విధము నీ క్రింద గ్రహించనగును.

(i) ధైర్యధనుల కరయంగ లే వసాధ్యంబులు (1-119)
శౌర్యవంతులకుఁ జేయంగూడని కార్యంబు లేదు. (ఆ 1-పుట 14)

(ii) స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః (4-57)
స్త్రీ బుద్ధిః ప్రళయాంతక (ఆ 2-పుట 69)

(iii) మదేభమున్ విడిచి కేసరి యొండు మృగంబుఁ జీరికిం గొనునె. (8-107)
కంఠీరవంబు మదగజంబు విడిచి మఱియొక్క క్షుద్ర మృగంబునకుఁ బోవునే. (ఆ 2-పుట 72)

(iv) వేము వెగ్గలము పెరుగగలదె మాధుర్యంబును తిక్తంబు కాక. (4-86)
వేఁపచెట్టునకుం బాలుపోసి చక్కెర యెరువు వేసి పెంచిన నేనియుఁ జేఁదుగాక మాధుర్యంబు గలుగనేర్చునే (ఆ 2-పుట 95)

(v) వనజగర్భునకు నైన ననుభవింపక చనవు శుభాశుభములు. (6-288)
బ్రహ్మాదులకేనియు శుభాశుభంబు లనుభవింపక తీరదు. (ఆ-4-పుట 210)

(vi) అభ్యాగతస్స్వయం విష్ణువు. (7-208)
అభ్యాగతస్స్వయం విష్ణుః (ఆ 4-పుట 268)

(vii) దుర్బలస్య బలం రాజా (7-314)
దుర్బలస్య బలం రాజా (ఆ 4-పుట 265)

(viii) బాలక విహీనులకు మానవులకు నౌర్ధ్వ దైహికంబులు లేవు-
(7-211)

పుత్రహీనుల కూర్ధ్వగతి లేదు (ఆ 4-పుట 264)

(ix) యోవై పితా స పుత్ర. (7-224)

తన యాత్మయె పుత్రుండై జనియించు (ఆ 4-పుట 267)

(x) శ్రీ విష్ణుభక్తులకున్ రెండు దలంచు ద్రోహులకు యుక్తుల్ గొల్పునే.
(అ-8- ప 112)

శ్రీ విష్ణుభక్తులకు ద్రోహంబు దలంచిన పాపాత్ముల యత్నంబులు
ఫలించునె (ఆ 5-పుట 808)

(xi) ఆయు వల్పంబు గృహ మేమి సేయు. (8- 41)

క్షణభంగురం బైన శరీరంబు నీటిబుగ్గ చందంబున నెప్పు డెవ్వేళ నశి
పోవునో తెలియదు సంగంబులు దుఃఖప్రదంబులు, గృహారామక్షేత్రంబులు
నశ్వరంబులు (ఆ 5-పుట 810)

(4) సూక్ష్మములైన విషయములను గ్రహించుట :

సంస్కృతానువాదమైన పీశభద్రుని జైమిని భారతము నాధారముగా గై కొ
నిన సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు తన వచన జైమిని భారతమున
సూక్ష్మ విషయములను గూడ గ్రహించి తన గ్రంథమును వెలయించినాడు.
ఆధారముగా గైకొనిన వర్ణనలు, విపులీకృత విషయములు యథాతథముల.
సర్వ సాధారణ విషయములనైనను వచనకర్త వదలి వేయలేదు ఇట్టివి పెక్కు
ఉదాహరణములు

శ్రీకృష్ణుడు హస్తినాపురములోని పాండవులచే స్తోత్రము చేయబడిన
వాడై, తత్ప్రదేశమునకు నేతెంచి, యాగాశ్వమున, భీమాదులు జయించి తిరిగి
వచ్చిన పిమ్మట తాను ద్వారావతికి తిరిగి వెడలిపోవుదునని తెల్పును. ఆ
సందర్భముగా నానాటికి సరిగా పదునొకండవనెల చైత్రపౌర్ణమాసినాడు యాగ
ప్రారంభమునకై తిరిగి వత్తునని పల్కుటయు రెండు గ్రంథములలోనను
పేర్కొనబడినది.

అర్జునుడు యాగాశ్వము వెంట తిరుగుచు నీలధ్వజుడను రాజుతో యుద్ధము గావించి గెలిచి యాతని భార్య జ్వాలాదేవి కోపమునకు గురియై గంగాదేవిచే శప్తుడైన సమయమున నధ్వరాశ్వము సమీపమునందలి యొక శిల కంటుకొనును. దానినుండి యాశ్వము విడివరచు నద్దేశ్వనుతో వెంటనున్న రక్షకులు సమీపమునందున్న సౌబరి యాశ్రమమునకు నేతెంతురు. నాటి యాశ్రమ మందలి వృక్షవర్ణనలోని వృక్షములన్నియు నీ గ్రంథమున సమానములై యున్నవి

చ. అట మఱి సైంధవంబును జవాతిశయంబున వింధ్యభూమిభృ
త్కటక సమీప నీప తిలక క్రముకార్జున దాడిమీ శమీ
కుటజ కురంటకామలక గుగ్గులు సాల రసాల పాటలీ
వట లవలీ లవంగ ఘనవాటిక లుద్ధతి జొచ్చి పోవుచున్ (4- 5)

"అంత నా సైంధవంబు జవంబున ననేక దేశంబులు దాటి వింధ్య పర్వత సమీపంబునకు వచ్చి యచ్చటం దిలకంబులు క్రముకంబులు కదంబంబులు కరవీరంబులు నర్జునంబులు నామ్రంబులు కుటజంబులు కురంటకంబు లామలకంబు లగురులు సాలంబులు రసాలంబులు పాటలంబులు వటంబులు లవంగంబులు నారంగంబులు నీపంబులు ధూపవృక్షంబులు మొదలగు తరువులచే జటాలంబులైన గహనంబులు సొచ్చి పోవునెడ. (ఆ-4-పుట 98)

ఇక సౌబరి మహర్షి యాశ్రమమున సౌబరి మహాముని యర్జునున కుద్దాలక మహర్షి చరిత్రము వివరించును. ఆ సమయమున నుద్దాలకుడు తన గురువగు కౌండిన్య మహర్షి చెప్పిన రీతి పైతృక మాచరించుననుచు, నీ క్రింది వానిని భార్యతో వివరించెను.

కం. ఉలవలు దామలు, కోద్రవ
ములు, కందులు, రాజమాషములు, నిష్పావం
బులు, చణకంబులు, దవిలిం
దలు, జొన్నలు, గాని గూర్పఁ దగు ధాన్యంబుల్.

ఆ. ఉల్లి, పుచ్చకాయ, ముల్లంగి, సొరకాయ,
పిండికూర, నేతిబీరకాయ,
చిట్టిమేడికాయ, చెంచలి, వంకాయ
గాని మంచికూరగాయఁ దేకు. (ఆ-4-ప 96-97)

''పైతృకంబు సేసితినేని యులవలు, చామలు, నారుగలు, కందులు, నలసందెలు న[illegible]లు, సెనగలు, తమిదలు, జొన్నలు, కంబుకల్లి పుచ్చకాయ, ముల్లంగి, సొరకాయ, పిండికూర, నేతిబీరకాయ, చిట్టికూర, మేడికాయ, చెంచలి కూర మొదలైన యతక్ష్యద్రవ్యంబులు దెచ్చివడ్డింతు'' (ఆ-2-పుట 97)

ఈ పైన పేర్కొనిన వస్తువులు మూలానుసరణములలో నొకే రీతిని గలవు. సూక్ష్మములైన విషయములను గూడ గ్రహించెననుట కిది దిఙ్మాత్రపు టుదాహరణము

### (5) నూతన సమాసములను ప్రవేశపెట్టుట

సప్తమాశ్వాసములో అశ్వత్థామ మాయారూపమున పరీక్షించిన పిమ్మట శ్రీ కృష్ణార్జునులాతనికి నిజస్వరూపములో దర్శన మిత్తురు. ఆ సమయమున కవి యగు పినవీరభద్రుడు ఒనూత్నమైన పోకడతో కంద పద్యమున దశావతార వర్ణన మొనర్చెను దానిని సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు పెక్కు నూత్న సమాసములతో వివరించి వర్ణించెను. ఇట్టివి మనకు పోతన రచనములోనను, కృష్ణమాచార్య లాదుల రచనలలోనను గన్పట్టును ఈ విధముగా వారు ఈ సముఖము కవికి మార్గదర్శకు లగుచున్నారు ఇట్టి పెక్కు ఉదాహరణములను మనము, డాక్టర్ కులశేఖరరావు గారి సిద్ధాంత గ్రంథమున గాంచగలము.

క. శరధిచర కమఠ కిటి నర
హరి వామన భృగుజ రామహలభృజ్జినక
ల్కి రుచిరరూపాయ జగ
ద్భరణాయ నమోనమోఽస్తు భవతే యనుచున్
(7-286) వీరభద్రుడు.

''ప్రళయ సాగరంబున శ్రుతిచోరకుఁ డగు దైత్యుని సంహరించుటకు మీన రూపంబువైన నీకుఁ బ్రణామంబు కూర్మరూపధరుండవై జలధి మథనంబుఁ గావించి సురల కమృతంబు నొసంగిన నీకు వందనంబు. లీలా వరాహమూర్తి వై భూమినుద్ధరించిన నీకు నమస్కారంబు. స్తంభంబునఁ బుట్టి ప్రహ్లాదుఁ గాచిన నరసింహా! నీకు దండంబు. వామనమూర్తివై మూఁ డడుగుల ముల్లోకం

బుల నాక్రమించిన త్రివిక్రమా! నీకుఁ బ్రణుతి నొనర్చెద. క్షత్రియ కుల ధూమ కేతువైన భృగురామా! నీకు మ్రొక్కెద. దశకంఠకంఠకర నారాచ ధారాచకిత రక్షస్స్తోమా! రఘురామా! నీకు నమోవాకంబు. ప్రలంబదానవశైల వజ్రాయుధా! హలాయుధా! నీకు జోహారు. త్రిపుర సంహార హేతుబౌద్ధా! యనిరుద్ధా! నీకుఁ గేలు మోడ్చెద. మ్లేచ్ఛనికర విచ్ఛేదన ప్రచండమండలాగ్రధారా సంపాదితకీర్తీ! కలికిమూర్తీ! నీ పదాబ్జంబులకు నమ్రుండనైతిని."

(అ 4-270-271 పుటలు)

ఈ సందర్భమున స్వతంత్రస్తుతి వచనములు, వచన కావ్యమున వ్రాయుటలో సముఖము వేంకటకృష్ణప్ప నాయకు రాద్యుఁడు. ఈ కవి తన వైష్ణవ మతాభినివేశము నీ వచనములలో చక్కఁగా ప్రదర్శించినాఁడు శబ్దాలంకారములలో యమకానుప్రాసము లీ దశావతారస్తుతి యందున్నట్లును జెప్పవచ్చును. ఇట్టి ప్రౌఢసమాసాన్వితమైన వచనము నీ కవి రసౌచితి కొఱకు వ్రాసియుండవచ్చును. సహజముగా నీతని శైలి సరళమైనది [4]

: కృష్ణమాచార్యుల వచనములు :

దేవా! శ్రీమన్నారాయణా! పరబ్రహ్మస్వరూప! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా! వేదవేదాంత వేద్యా! పురాణపురుషోత్తమా, పురందర వంద్యా, దేవా, కపటనాటక సూత్రధారీ, మాయావినోదా, అగణిత మహిమావతారా, ఆశ్రితజనమందారా, సకల కల్యాణగుణోన్నత! సకల జగదంతర్యామీ! శ్రీమదయోధ్యాపుర వరాధీశ్వరా! దశరథరాజనందనా! కౌసల్యా గర్భశుక్తి ముక్తాఫలా, భరతాగ్రజా, సౌమిత్రిమిత్రా, శత్రుఘ్నశీకరా, శరణాగతవజ్రపంజరా, కారుణ్య వారాన్నిధీ, భక్తిముక్తి ఫలప్రదాయకా, శంఖచక్రగదాధరా, కోదండ దీక్షాగురూ, భక్తపరాధీనా, ఇక్ష్వాకుకులతిలకా, రాక్షసకుల సంహారకా, పక్షీంద్ర వాహనా, దేవాదిదేవా, తాటక ప్రాణాపహరా, విశ్వామిత్ర యజ్ఞపాలకా, యజ్ఞరక్షకా, యజ్ఞస్వరూపా, యజ్ఞభోక్తా, సర్వవ్యాపకా, సురనికర సేవితా, అహల్యాశాపవిమోచకా, పురహరచాపఖండనా, సీతాపతీ, పరశురామ బాహుబల పరాక్రమాపహరణా, పితృవాక్య సత్యప్రతిపాలకా, మారీచ మృగవేటకారా, చిత్రకూటాద్రినిలయా, కాకాసుర విదళనా, విరాధదైత్యహరణా, సుగ్రీవానుగ్రహా, వాలి నిగ్రహా, మాల్యవంత ప్రవేశా, లవణాబ్ధి గర్వహల్లకల్లోలా,

విభీషణ స్థాపనాచార్యా, దక్షిణసింధుబాణబంధనా, దీనరక్షకా, ధూమ్రాక్ష విరూపాక్షాతికాయమహాకాయ, రావణకుంభకర్ణాది రాక్షసకుల సంహారకా, ఇంద్రజిత్తు తలగుండుగండా! రావణగిరి వజ్రాయుధా, పంక్తి కంధరశిరఃసంక్రందన! విభీషణ స్థాపనాచార్య, జానకీ ప్రియా, పుష్పకారూఢా, అనుజసేవితా, మైథిలీ సమేత, ఆనందమయి, జయ జయ రాఘవేశ్వరా, మాయతి రామానుజముని పరందాతారు సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ.

### (6) స్వతంత్ర కల్పనములు :

సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు వచన జైమిని భారత గ్రంథ సంతరణ సమయము - వచనరచనలో పదములు, వాక్యములు, సమాసములు, కొన్నింటిని నూతనముగా ప్రవేశపెట్టెను. విషయము వ్రాయునపుడు కూడ కొన్ని స్వతంత్ర పోకడలను జూపెను. అధ్యాయక్రమమునందలి గద్యల తీరును బట్టి చూచిన యెడల సంస్కృతాశ్వమేధమును సహితము చూచినట్లు గ్రహింపవచ్చును. సర్వసాధారణముగా వీరభద్రుని పద్యకావ్యమునే వచన శైలిలో వ్రాసెనని చెప్పవచ్చును. అయినను స్వీయ కల్పనములను పెంగు సమయము లందెల్లెడల విరజిమ్మినాడు. ఇచటి పద్య - వచన గ్రంథములలోని పద్య సంఖ్యను, పుటల సంఖ్యను సమీక్షించి చూపవలసి యున్నది "సంగ్రహ కిరణము" - ఈ వచన రచయితలోని ప్రధాన తత్త్వమును తెలియుచున్నది.

ఈ రెండు గ్రంథములలో గల వివిధోపాఖ్యాన సహితమైన నీ కథలో నొక్కొక్క వృత్తాంతమును పీరభద్రుడెన్ని పద్యములలో వివరించినదియు, దానిని సముఖము కవి వచనమున నెన్ని పుటలలో వ్రాసినదియు నీ క్రింద వివరింపబడినది.

| | విషయము | పీరభద్రుడు గద్యపద్యములు | సముఖముకవి పుటలు |
|---|---|---|---|
| 1. | అశ్వమేధవిధానము | 6 | 2 |
| 2. | కృష్ణభీమసేనుల సరసాలాపములు | 18 | 4 |
| 3. | యౌవనాశ్వునితోడి యుద్ధము | 70 | 25 |
| 4. | అనుసాళ్వుని యుద్ధము | 26 | 6 |
| 5. | నీలధ్వజునితోడి యుద్ధము | 10 | 14 |
| 6. | సౌబరి యాశ్రమ వృత్తాంతము (ఉద్దాలక మహర్షి చరిత్ర) | 16 | 7 |
| 7. | హంసధ్వజుని యుద్ధము | 125 | 34 |
| 8. | యాగాశ్వము గోడిగయగుట | 9 | 8 |
| 9. | స్త్రీ మండల వృత్తాంతము | 19 | 10 |
| 10. | వృషదేశ వృత్తాంతము | 28 | 5 |
| 11 | శ్రీరామ చరితము (కుశలవోపాఖ్యానము) | 270 | 40 |
| 12. | బభ్రువాహనునితోడి యుద్ధము | 192 | 40 |
| 13. | తామ్రధ్వజునితోడి యుద్ధము | 90 | 20 |
| 14. | వీరవర్మ వృత్తాంతము | 28 | 10 |
| 15. | చంద్రహాస కథ | 100 | 25 |
| 16. | బకదాల్భ్య వృత్తాంతము | 18 | 6 |
| 17. | ధర్మజుని అశ్వమేధ యాగము | 25 | 8 |

సంస్కృత జై. భా. లో జైమిని వ్రాసిన శ్లోకములను, సముఖము కవి గ్రహించిన రీతి.

| | విషయము | జైమిని వ్రాసిన శ్లోకములు | సముఖము కవి పుటలు |
|---|---|---|---|
| 1. | అశ్వమేధ విధానము. | 17 | 2 |
| 2. | శ్రీకృష్ణ, భీమసేనుల సరసాలాపములు | 18 | 4 |
| 3. | యౌవనాశ్వునితోడి యుద్ధము. | 50 | 25 |
| 4. | అనుసాల్వుని వృత్తాంతము | 150 | 6 |
| 5. | నీలధ్వజుని యుద్ధము. | 110 | 14 |
| 6. | సౌభరి ఆశ్రమవృత్తాంతము (ఉద్దాలకుని చరిత్రము) | 50 | 7 |
| 7. | హంసధ్వజుని యుద్ధము | 565 | 34 |
| 8. | యాగాశ్వము గోడిగ యగుట | 20 | 8 |
| 9. | ప్రమీలార్జునీయము | 44 | 10 |
| 10. | వృషకేతు వృత్తాంతము | 58 | 5 |
| 11. | శ్రీరామచరిత్రము లేక కుశలవో పాఖ్యానము | 709 | 40 |
| 12. | బభ్రువాహనునితోడి యుద్ధము | 688 | 40 |
| 13. | తామ్రధ్వజుని వృత్తాంతము | 312 | 20 |
| 14. | వీరవర్మ వృత్తాంతము. | 186 | 10 |
| 15. | చంద్రహాసుని కథ | 672 | 25 |
| 16. | బకదాల్భ్య మహర్షి వృత్తాంతము | 54 | 6 |
| 17. | ధర్మజు డశ్వమేధము గావించుట | 112 | 8 |

భోజన వర్ణనము : పెంచి వ్రాసిన రీతి.

1. పినవీరన రచించిన గ్రంథములోని భోజన వర్ణనమును వచనకవి వదలి వేయక పెంచి వ్రాసినాడు ఈ పద్యమున నది వ్యక్తము.

సీ. మెత్తనై మింమిం మెదలు రాజాన్నంబు
    నొలపుఁ బప్పులును సద్యోఘృతంబు
నప్పడంబులు వడియములుఁ దాలింపులుఁ
    బలుచని నులివెచ్చ పడిదములును
బులుసుఁ గూరలును బజ్జులుఁ దియ్యబేరులుఁ
    బంచదారలు నానవాలు జున్నుఁ
బులగంబు బహువిధంబుల పిండివంటలుఁ
    బాయసంబు వడపప్పుఁ దేనె
తే. పానకంబులు సిగరులు ఫలరసాయ
నములుఁ బచ్చళ్ల గలవంటకములుఁ బెరుఁగు
నూరుఁగాయలు మొదలుగా నుచితవృత్తి
నారగింపఁ జతుర్విధాహారములను. (8-50)

"తమ్మిపూవుల చందమునఁ దెల్లనగు రాజాన్నంబులును సువర్ణచ్ఛాయా రూపంబులగు సూపంబులును సద్యోఘృతంబులును నప్పడంబులు వడియంబులుఁ దాలింపులు సంభార పరిమళ గంభీరములై నులివెచ్చనగు పడిదెంబులుఁ గల వంటకంబులుఁ దియ్యబేరులు మోరుఁ జేరులుఁ బంచదారలు పానకంబు లానవాలుఁ జెక్కెరల పొంగలి దధ్యోదనంబు పులియోర యెళ్లోగిరంబు నతిరసంబులు వడలు సప్పంబులు దోసె లిడ్డెనలు లడ్డుకంబులుఁ బేణీలు సుకియలుఁ గుడుములు మణుంగుబూలు సాదెసత్తులు మనోహరంబులు నటిసెలు సమృతఫలంబులు మండెఁగలు మొదలగు భక్ష్యవిశేషంబులును పాయసంబులు శిఖరిణిలు ఫల రసాయనంబులుఁ బచ్చళ్లుఁ బెరుఁగు లూరఁగాయలు వరుగులు నాదియౌ భక్ష్య భోజ్యలేహ్యచోష్య పానీయంబులును" (ఆ 1-పుట 57) స.వేం.కృ నా.

ఆహ్లాదకారియగు నీ భోజన వర్ణనలో పదార్థములను స్వయముగా బెంచి వ్రాసియున్నాడు ఇది వర్ణనను బెంచుటకు దగిన సమయము. ఇట్టి సూక్ష్మము లగు విషయములందును మూలము నతిక్రమించినాడు ఇది స్వకపోల కల్పన మగుటలో నెట్టి యతిశయోక్తియు గానవచ్చుట లేదు.

ఇట్టి వర్ణనమును జైమిని సంస్కృతమున నిరువది యైదు శ్లోకములలో చాల విపులముగ వర్ణించియున్నారు. ఆ శ్లోకములొక్క సీస పద్యమ సనే వ్రాయ బడినవి. అతి విస్తరమగునను గారణమున నీ శ్లోకముల నిట వ్రాయుటలేదు. అతి విపులమైన నీ భోజన వర్ణనమున విచిత్రమైన విషయ మేమనగా సంస్కృత జైమిని భారతము నందలి శ్రీకృష్ణ భోజనమునగల పదార్థములలో మాంసము లేదు. కాని తెలుగులో పీరభద్రుని గ్రంథములోనను, సముఖము కవి వచనము లోనను ఈ మాంస ప్రస్తావన విపులముగా నున్నది.

11. పీరభద్రుని భోజన వర్ణనము - మాంసము .

ఏ కారణముచేతనో పీరభద్రుడు, శ్రీకృష్ణుడు 'మాంసాహారి' యైనట్లు చిత్రించెను. ఇది యాతని (కవి) స్వకపోలకల్పనము ఒక్క తేటగీతిలో నిది పూర్తి చేయబడినది. సముఖము కవి దీనిని మరింత విపులముగా వ్రాయుట కడుంగడు విచిత్రముగా దోచుచున్నది పద్య-వచన జైమిని భారతములలోని మాంసవర్ణన మిట జూడవచ్చును.

తే మఱియు భూచర జలచరాంబరచరముల
పేరుకల మాంసములు నంజి ప్రియముతోద
రుక్మిణీసత్యభామ లిరువురుఁ గదిసి
తాళవృంతంబు లిడుచుఁ ద్రస్తరులు సేయ. (8-51)

"కుందేలు, ఉడుము, ఆకువ, లేడి, యడవిపంది మొదలైన భూచరంబు లును, గుండెవాలుగ జెల్లములుగు కొఱ్ఱ మారువాయి బొమ్మిడాయ యిసుకదొందు ఉలచ తిఱికి చేప తాఁబేలు మొదలగు జలచరంబులును, గౌఁజు పూరేడు పొట్టిపిట్ట పొన్నంగి, వెలిచె, బెడిచె, లావుక, కేరజము, బెళవ పొండబెళవ పచ్చబెళవ కాటిగాఁడు ఉల్లంకి చింతవంకలు లకుముకి వంగపండు మొదలగు ఖేచరంబు లునుం దెచ్చి లవణామ్ల మరీచికా జీర కర్పూర మృగమదాది పరిమళ సంభార సంభృతంబులుగాఁ బాకం బొనర్చి బంగారు గిన్నెలఁ బదికంపు దొన్నెల నుంచి యమర్చియుండ రుక్మిణీసత్యభామ లిరుకెలంకులఁ గంకణ ఝుణఝుణాత్కారం బులు తోరంబులుగా సురటులు వీవ'' స.వేం.కృ.నా. (ఆ 1 - పుటలు 57-58)

12)

ఈ వర్ణన నుద్దేశ్యపూర్వకముగా నీ కవి వచనమున వ్రాసినట్లు కనబడు చున్నది. ఇది స్వతంత్రమగు గల్పనకు జక్కని యుదాహరణము. అట్టి కల్పనమే మరొక్కటి చూడనగును.

111. శౌరి బలము - పరమభాగవత ప్రస్తావన :

వీరభద్రుని స్వకపోలం కల్పనమైన పరమ భాగవత ప్రస్తావన తృతీయాశ్వాసమున గలదు. అదియే వచన రచయితచే పెంచి వ్రాయబడినది. దాని నిట జూడవచ్చును.

క. శుక దాల్భ్య విభీషణ శౌ
నక రుక్మాంగద వసిష్ఠ నారద బలి వా
యుకుమారకులం వలె నతఁ
డొకరికి లోఁబడఁడు తెలిసియుండుడు మదిలోన్. (3-95)

పై పద్యమును వచన రచయిత పెంచిన రీతి నీక్రింది విధమున నరయ నగును.

"ప్రహ్లాదుండు నారదుండు పరాశరుండు పుండరీకుండు వ్యాసుండు నంబరీషుండు శుకుఁడు శౌనకుండు భీష్ముండు దాల్భ్యుండు రుక్మాంగదుండు నర్జునుండు వసిష్ఠుండు విభీషణుండు వాయునందనుండు బలియుండు మొదలగు వారలు కొందఱు భక్తివశంబున దేవకీనందనుని దమ కైవసంబు చేసికొని యుందురు" (ఆ. 2 పుట 70) స.మే.కృ.నా.

సంస్కృతమునందున్న "ప్రసన్న నిత్యాన సంధానము"లో "పాండవ గీత" యను విభాగమున నొక శ్లోకము గలదు. లక్ష్మీనృసింహకరావలంబన స్తోత్రములో నిందలి రెండు పాదములున్నవి. ఇది స్తోత్రమంజరిలోనను గలదు.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి."

ఈ శ్లోకమునందు "వాయునందనుడు, బలియుండు"- అను వారి పస్తావన లేదు. తెలుగువచన జైమిని భారతములో పై పేర్లు పదునారు గలవు.

ఈ శ్లోకములో పదునాల్గు గలవు. తెలుగు పద్యమున తొమ్మిది పేర్లు మాత్రమే గలవు. సంస్కృతమునందలి పై శ్లోకమే వీనికి మూలమనుటది చెప్పకయే చెప్పుచున్నది.

IV. వీరభద్రుడు పందొమ్మిది పద్యములలో వర్ణించిన స్త్రీమండల వృత్తాంతము నీ కవి పందొమ్మిది పుటలలో వర్ణించెను. అర్జునుడు ప్రమీలతో గ్రీడించిన విశేషవర్ణనములును గలవు.[6] ఇది విస్తరణమే యగుచున్నది.

V. స్తుతి వచనమునకు మరొక్క స్వతంత్ర కల్పన -

పంచమాశ్వాసమున నర్జునుడు, సుధన్వునితో యుద్ధము చేయలేక కృష్ణుని ప్రార్థించెను

"ఒందు విధంబు గానక పయోరుహనేత్రు సమస్త వేదవేద్యుండగు శ్రీకృష్ణునిం దలంచె" (5-31) పద్యము.

"ఆపదుద్ధారకా! ఆదిదేవా! అనంతా! అనంతశయనా! అంబుజనాభా! అచ్యుతా! హరీ! శ్రీకృష్ణా! నిన్ను నమ్మినవారల. లక్కయింటం జిక్కువడ కుండ గౌరవ సభా స్థలంబున ద్రౌపదికి మానభంగంబు గాకుండ నడవుల నిడుమలం బడునపు డాపదలం బొరయకుండ భీష్మద్రోణ కృపాశ్వత్థామకర్ణాది యోధవీరుల యస్త్రాగ్ని జ్వాలలం గ్రాగకుండ సైంధవ వధంబునఁ బ్రతిజ్ఞా భంగంబు గాకుండ రక్షించి సకల సంకటంబులు నెడఁబాపితివి, త్రిలోకాధ్యక్షా పంకజాక్షా! యిప్పుడీ సంకటంబు తొలంగించి రక్షింపవే రక్షింపవే "

(వచన జై భా ద్వి-ఆ- పుట 116, 117) స వేం.కృ.నా.

ఈ విధమైన స్తుతివచన మీతనికి చాల యభిమానమున్నట్లు గన్పట్టు చున్నది. అందుననే విపులముగా వర్ణించుట జరిగినది.

VI పంచమాశ్వాసమున సుధన్వుడు మరణించగా, నాతని శిరంబు స్తుతించిన రీతి వీరభద్రుని గ్రంథమున, "హరినామస్మరణము చేయను దన సమక్షమునఁ బడన్" (6-44) అనబడుచున్నది కాని సముఖము కవి దీనిని విపులీకృతము గావించినాడు.

''గజేంద్రవరదా! గరుడవాహనా! నీరజాక్షా! నిఖిల లోకాధ్యక్షా! దేవకీ నందనా! దీనజనావినందనా! నారాయణా! భక్త త్రాణ పరాయణా! నమోనమో''
(ద్వి. ఆ పుట-128) స.వేం.కృ నా.

VII. ''సుధన్వుని పాటున కెంతయు వెఱఁగంది
సురథుఁ డెకపకని సుత భ్రాంతిఁ బలవించు
జనకుని సంతాపం బుడుప'' (౬-47) పద్య. జై.భా.

ఈ భాగమున హంసధ్వజుడు తన కుమారునికై దుఃఖించిన రీతిని గరుణ రస నిర్భరముగా వచనకవియైన సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు సంబోధనలచే గావించినాడు.

''హా కుమారకా ! హా కులోద్ధారకా ! మహా గుణ భూషణా ! మాతాపితృ సంతోషణా ! మేరునగ ధీరా ! వీరాధి వీరా ! హా సుకుమార శరీరా ! సుజనా ధారా! బుధ విధేయా! దాన రాధేయా! నంద నందన చరణార విందవందనా! దీనజనావి వందనా ! అయ్యయ్యో ! నన్ను ను మీ తల్లి నగరి కులం జేసి వాసు దేవుని సాయుజ్యంబు నెందితివే ! నీ వుత్తమోత్తమంబైన దివ్యపదంబున కేగితివి గావున నీకు వగవం బనిలేదు. నన్నుఁగన్న తండ్రీ ! పరాక్రమోపార్జనుండగు నర్జునుని నిర్జించి వత్తువని నీ రాక కెదురు చూచుచు నుండు మీ తల్లితో నేమనం గలవాఁడ. నీ రాణి యగు ప్రభావతి ముఖం బేమని చూడం గలవాఁడ''
(ద్వి.ఆ. పుట 128-'24)

దీనిని బట్టి తీవ్రమైన భావ సంచలనము కొఱకును, నట్టి సమయంబున పాత్రల మనస్తత్వము బరితల కెరిగించుటకును, నేదేని విషయమును రస నిష్యందముగా వర్ణించుటకును, నీ కవి సంబోధనములను గావించుట — ప్రత్యేక విశేషముగా భావించునని తెలియవచ్చుచున్నది.

VIII. ''కుమారుడు శౌరి నెమ్మదిన్ గట్టిగ నిల్ప'' – (౮-41)
''వరద ! వాసుదేవ ! వైకుంఠవాస ! వనమాలికాభరణ ! వారణాపదు ద్ధరణ ! వారిజాక్షా ! యని దివ్య నామ సంకీర్తనంబు సేయుచు''
(పం. ఆ. పుట 28౬) స.వేం.కృ. నా.

ix. చంద్రహాసుని బాధ :

"కుమారుఁడంఘ్రివికలాంగుఁ భేదముఖాబ్జజాల
సంకుచితము ఖాబ్జురై" (8-48)

కమలాక్షా! దీనరక్షా విచక్షణా! లక్ష్మీపతీ! క్షమాపతీ! అపన్న
శరణ్యా! అనాథనాథా! అంబుజోదరా!

ఆదినారాయణా! (పం ఆ పుట 288) సం వేం కృ.నా.

ఈతని వచనశైలిని గూర్చి వ్రాయుచు, శ్రీ మల్లాది సూర్యనారాయణ
శాస్త్రి పేర్కొనిన రీతి

"చక్కఁగ బరిశీలించినచోఁ జిన్నయసూరి నీతిచంద్రిక శైలి వంటి
ప్రౌఢశైలి యప్పుడు నిప్పుడుఁ గూడ నెందును గానరాదు"

ఈ కవి రచనలో శ్రీ మల్లాదివారు పేర్కొన్న మరికొన్ని విశేషములు:-

(1) పాత్రల నామములనే తఱచుగా నుపయోగించుచు, వాని స్థానము
లోని సర్వనామములను బరిహరించుట

(2) యమకవృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములకై కథా ప్రసక్తి
కత్యంతరముగా విశేషణ బాహుళ్యమును గల్పించుట.

(3) గ్రంథ మామూలాగ్రముగా నెఱసున్నలనే వినియోగించుచు నర
సున్న నుపయోగించకుండుట.[7]

(4) 'నే' ననదగిన చోట 'దా' ననుట, 'చెప్పె' ననదగిన చోట 'బలుక
రించె' ననుట, "వానితోడ" ననుటకు "వానితోడుగూడ"
ననుటయు నీ కావ్యంబున సర్వత్ర కనుపట్టును.[8]
'నేను' అనుటకు బదులుగా 'తాను' ప్రయోగ మా కాలమున
బుట్టిన వచన గ్రంథములలో దఱచు కనబడును [9]

పై విషయములను సమీక్షించి చూచినచో మొత్తము మీద సముఖము
వేంకట కృష్ణప్పనాయకుడు వ్రాసిన జైమిని భారతము, సంస్కృత జైమిని
భారతమునకు కథానువాదముగను, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు రచించిన పద్య

జైమిని భారతమునకు శబ్దానువాదముగను గన్పట్టును. కాని, వివిధ విషయము లను ప్రవేశపెట్టుటయు, వర్ణనలను పెంచుటయు, సంస్కృత గ్రంథములోని వానిని త్రుంచుటయు నీతని భావానువాద వైఖరినే వ్యక్తమొనర్చుచున్నవి. పీన పీరస వాడినట్టి కొన్ని ఉపమానముల నీతడు గ్రహించలేదు. అదియు నీతని స్వతంత్ర భావానువాద సిద్ధాంతమునే బయలుపరచుచున్నది

పదునెనిమిదవ శతాబ్దిలోని వాడగు సముఖము వేంకట కృష్ణప్ప నాయకునిపై ప్రముఖ ఆంధ్ర భావానువాదకులలో (కవులలో) నొకడగు శ్రీనాథుని ప్రభావము కనబడుచున్నది సమాస ప్రయోగమునందును, వర్ణనా వైశిష్ట్యము నందును, విషయ ప్రమాణములో నొనర్చిన మార్పులను బట్టియు, నిది స్పష్టమగుచున్నది. ఈ వచనకవి తన గ్రంథమునందు ప్రథమ, తృతీయ, చతుర్థాశ్వాసములందు గద్యలకు ముందు మూడు పద్యముల వంతున వ్రాసియున్నాడు. తక్కిన వానిని గద్యల తోడను ముగించి యున్నాడు. పద్యకావ్య కర్తలు (ప్రాచీనులు) పద్యములతో నాశ్వాసాంతము జేయుటను మన మాముక్తమాల్యదాది గ్రంథములలో గాంచవచ్చును

i. ఇది పాత్రప్రహరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్త దివిస్పృక్పటు యంత్రకొండపలి హృద్భాహసి కద్రూబడీ
వ్యదుదారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగన్.
(3-98)

ii. ఇది యంధ్రోక్తి యథార్థనామయవనాసృక్పూర్ణ కెంబావివా
ఠిద పద్ధత్యవరోధి వప్రవలయ శ్రేణీవిమాత క్రియా
స్పద సేనాగ్రద కృష్ణరాయ మహీభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్.
(5-161)

ఇట్లాశ్వాసాంత్యముల యందు ప్రాచీన తెలుగు కవుల సంప్రదాయము నీతడనుసరించుట గమనార్హమైన విషయము. ఈ పద్యము లీ కవి విజయరంగ

చొక్కనాథుని స్తుతించుటకై వ్రాసియున్నాడు. ఇట్టి సంప్రదాయ రచయిత కేవలము వారినే యనుసరింపక స్వకపోల కల్పనమున వచన జైమిని భారతము వ్రాయుటలో నా గ్రంథముపై నీ కవికి కల మిక్కుటమైన మక్కువ లోకమునకు వెల్లడి యగుచున్నది పిన వీరభద్రుని జైమిని భారత మీతని రచనముచేత శాశ్వత కీర్తి నందుచున్నది.

---

1 సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని వచన జైమిని భారతము - ప్రథమ ముద్రణ-భూమిక-శ్రీ జయంతి రామయ్య గారు - పీఠిక - పుట V శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

2 భూమిక - శ్రీ జయంతి రామయ్యగారు

3. Preface - J. Ramayya (English) Page 2. (Prose) Jaimini Bharata by Samukham Kavi.

4 ఆంధ్ర వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు (Thesis) పుటలు, 567, 570, 571 (Dr. M. కులశేఖరరావు)

5 పుటలు 449 - ఆంధ్ర వచన వాఙ్మయ వికాసము

6. "ఆ భాగ మిప్పటి లోకమునకు రుచింపదని యిందు ముద్రించుట మానివేసినారము. ఇది గారి పరిషత్తునకు వచ్చిన రెండు ప్రతులలో నొక్క ప్రతియందు మాత్రమే యట్టి విశేష వర్ణనము కనంబడుచున్నది.''
పీఠిక - పుట 10-శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

7. నేను చూచిన ప్రతిలో పలు తావులందు అరసున్నలు గలవు శ్రీ శాస్త్రిగారు మరొక్క ప్రతిని జూచినారేమో యనిపించుచున్నది

8. ఈ సందర్భమున "వచన వాఙ్మయము"లో డాక్టర్ కులశేఖరరావు గారు తమ యమూల్యాభిప్రాయములను వెలువరచిరి. ''ముద్రణమున నన్నియు సవరింప బడుటచేత ముద్రిత గ్రంథమున నీ ప్రయోగ విశేషములు కాన్పించుటలేదు. ''పలుకరించు'' అను ప్రయోగము రెండు తావులందు కాన్పించుచున్నది.''

(i) "ఇవ్విధంబున భీమసేన పౌత్రుండు మాయాబలంబున యాతురంగంబు నపహ రించికొని పోయిన తెఱంగు హత శేషులయిన భట్టులు పలుకరించుటయు.''
పుట 25 - జై. భా., స. వేం. కృ. నా.

(ii) "సువేగుడు యౌవనాశ్వ భీమసేనులకు నాయమ్మ పల్కు పల్కరించి కొంత తరవు నవ్వించి'' - స. వేం. కృ. నా.

'పలుకరించు' అను మాట "చెప్పుట" అను నర్థమున ప్రయుక్తము. ఇద్ది యర్థము మాండలికము. దీనిని దోషముగా గ్రహించక ప్రయోగ విశేషముగానే గ్రహించుట లెస్స"- (పుట 578) ఆంధ్రవచన వాఙ్మయము

ఈ క్రింది మరికొన్ని విషయములను కూడ డాక్టర్ కులశేఖరరావు గారు తమ సిద్ధాంతవ్యాసమున పేర్కొనిరి.

(1) ''సంస్కృతమున జైమిని భారతమని ప్రఖ్యాతి నందిన యశ్వమేధ పర్వము ననుసరించియు, నాంధ్రమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు రచించిన జైమిని భారతమును దృష్టి యందుంచుకొనియు, వేంకట కృష్ణప్ప నాయకుడు దీనిని రచించెను

(2) ఈయనకు సందర్భానుసారముగా శృంగార, వీర, భయానక రసములనే కాక హాస్యమును కూడ పోషించు నేర్పు కలదు.

(3) ప్రధాన కథ చెప్పుట యందీ రచయితకు నెంతటి నేర్పు కలదో యుపాఖ్యాన రచనము నందు గూడ నంతటి ఉత్తమ పరిజ్ఞానము కలదు.

(4) నిశ్చలనములు, చలనములనబడు రెండు విధముల వర్ణనల నీతడు వ్రాసి వర్ణించుట యందు తనకుగల ప్రాభవమును ప్రదర్శించుకొనెను

(5) ఈత డుపయోగించిన యలంకారములందుపమారూపకములు హెచ్చుగను నతిశయోక్త్యుత్ప్రేక్ష మున్నగునవి తక్కువగను నుండును.

(6) ఆంధ్రేతర ప్రాంత నివాసియైనను, నీతనికి తెలుగు భాషలో సహజత్వము, లోతుపాతులు చాల చక్కగా తెలియును."

జైమిని భారతమును తెనుగులోనికి అనువదించిన మహాకవి పిలలమర్రి వీరభద్రుడు గ్రంథపీఠికలో నీపద్యము నుదహరించియున్నాడు.

ఉ. అల్లన విచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వంచుసౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్తచన్నుఁగవ పయ్యెద జీఱఁగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చుఁ గబ్బముల్. (పీఠిక-25)

గ్రంథారంభమునందలి ఈ పద్యములో తాను చెప్పదలచుకొనిన కావ్య మే విధముగా నుండవలయునో, తా నెట్లు ప్రాశస్త్యసిద్ధమైనారో వివరించినారు

అప్పుడప్పుడే విచ్చుకొనుచున్న కలువల యందలి కర్పూరమను రజము మీద నుండి వచ్చు మందమారుతములు చక్కని సుహాసనలతో గుబాళించు చున్నవి పల్లవముల వలె మృదువైన హస్తములు గల్గిన స్త్రీల స్తనములను వారి కొక లెంత సురక్షిత మొనర్చినను, కొక స్పృష్టాస్పృష్ట మెట్లగునో అట్లే తన సువాసనభరిత "భావ" ములను గనరగుచున్నవని జెప్పికొనియున్నాడు.

భావ మనగా నేమి?

ఈ ప్రశ్నకు సమాధానముగా 'భూ' - ధాతువు నుండి ఈ పదము జన్మించినను, దీని యర్థము మనోవికారముగా చెప్పబడినదనియు, భావము తాను కదలక, పరవస్తువుకు ప్రోత్సాహకమగుచున్నదనియు, నితరములూ తెలిసికొన బడునట్లు చేయుచున్నదనియు, భావము నిత్యమనియు, నూహచేత స్థిరమగుచున్న దనియు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తెలిపియున్నారు[1] ఇదియే 'వికారో మానసో భావః' అనికూడ చెప్పబడును,

భావ లక్షణమును గూర్చి భరతుడు నాట్యశాస్త్రమున పేర్కొనిన విధమిది-
యో ఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠ మివాగ్నినా"
(నాట్యశాస్త్రము 7 అ- శ్లో 7)

హృదయ సంవాది యగు నర్థభావనమే రసోద్భవహేతువు. ఆస్వాద యోగ్యమగు తదర్థమే శుష్కమైన కాష్ఠమందు అగ్నివలె శరీరము నంతటను వ్యాపించును.

దశరూపక కర్త-

''సుఖదుఃఖాదికై ర్భావై ర్భావ స్తద్భావ భావనమ్''

సుఖదుఃఖాత్మకములగు కావ్యార్థభావములను గ్రహించి, వివేచనాత్మక జ్ఞానవృత్తిలో సుఖనిర్వేదరూపముగా సామాజికుడు హృదయమునందు భావించును.

కవిగతములైన రాగాదులను సామాజికగతములుగా చేయు చిత్తవృత్తి విశేషమని భావము [2]

అట్లే మరికొందరు లాక్షణికులు భావము నీక్రింది విధముగా పేర్కొని యున్నారు [3]

1. రసానుకూలో వికారః భావః' (రసతరంగిణి కర్త)

2. ''భావయన్తి స్వాత్మానం లౌకికదశాయాం అనాస్వాద్యమపి ఆస్వాద్యం కుర్వన్తి యద్వాభావయన్తి వ్యాప్నువంతి సామాజికానాం మనః ఇతిభావాః''
(కావ్యానుశాసనకర్త)

3. 'బాహ్యార్థాలంబనో యస్తు వికారో మానసోభవేత్
స భావః కథ్యతే సిద్ధిః తస్యోత్కర్షో రసః స్మృతః'
(భావప్రకాశకర్త)

మరికొన్ని లాక్షణిక గ్రంథముల నుండి నేనును ఉదాహరణములను జూపుచున్నాను

1. 'బహిరర్థాలంబనమై
విహరించు మనోవికార విలసితము సుమీ
విహిత మగు భావ మన నది
మహి విజ్ఞానంబు నా సుమతులం బరగున్.'
- కావ్యాలంకార చూడామణి (ప్ర ఉ. ప. 18)

2. 'నిర్వికారాత్మకమయిన చిత్తమందు ప్రథమ వికారము భావ మనంబడును'
(ఆంధ్ర సాహిత్య దర్పణము) (తృ.ప- 127)

3. 'రసాభిజ్ఞానయోగ్యత్వం భావ ఇత్యభిధీయతే'
(రత్నాపణసహితే ప్రతాపరుద్రీయే రసప్రకరణమ్- పుట 220)

రసమును గ్రహించుటకు యోగ్యమైన విషయమే భావమని పిలువబడు చున్నది.

4. ప్రముఖమైన శబ్దకోశకర్తయైన ఆప్టే - 'భావము' ను గూర్చి ఈ విధమున ప్రకటించియున్నారు.

State of mind, meaning, Purpose or intention, mind, Soul, movement, gesture, thing or substance, advice, instruction. 'భూ'-అను ధాతువునకు గల యర్థము - to be born or produced, to be, to mix, to think, to obtain.

భావన- Mental perception, recollection, imagination.

ఈ విధముగా పలువురు చెప్పిన పలువిషయ సమ్యగాలోచనము గావించిన 'భావము' స్పష్టమైనది నిర్వికారాత్మక చిత్తమందు గలిగిన ప్రథమ వికారము. రసానుకూలమైనట్టియు, అనాస్వాద్యమైనను నాస్వాదింపగల్గినట్టిదియు, సామాజికులలో వ్యాపించునదియు, సుఖదుఃఖాది లౌకిక విషయ సంఘటనలకు నాలవాలమైనట్టియు, నూహచే స్థిరమైనట్టిదియునైన భావముగా గోచరించుచున్నది. ఈ భావము వ్యాప్తమై మానసమున వాసనా రూపమున నిలిచి 'సంస్కార'మగుచున్నది.

రసముద్బుద్ధమగుటకు భరతుడు నాట్యశాస్త్రమున పేర్కొనిన విధమిది.
'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః'

విభావానుభావ వ్యభిచారి భావ సంయోగము వలన రసము నిష్పన్నమగునని తెలియుచున్నది. సాహిత్యశాస్త్రమునందు బహుళప్రచారమునంది, వివిధాలంకారికుల మధ్య చర్చాత్మక వివాదములకుఁ దావిచ్చిన ప్రసిద్ధ రసనిష్పత్తి సూత్రమును భరతుడు పైవిధముగా పేర్కొనినాడు. అంతియేకాక యాస్వాదింపబడుచున్నది కాన రసమని పేర్కొనినాడు. ఈ రసనిష్పత్తి రసాస్వాదన క్రమమును జూచిన 1. విభావ 2. అనుభావ 3. వ్యభిచారి భావములను సంయోగపరచిన రసము సిద్ధమగునని దెలియుచున్నది. ప్రతాపరుద్రీయకర్త విద్యానాథుడు, వీనికి సాత్త్విక భావములను గూడ చేర్చియున్నాడు.

'విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయిభావో రసస్స్మృతః'

## విభావము

విభావములు లోకమందు కార్యకారణసంచారి రూపములయినను రసో ద్బోధమందు కారణములు. (సాహిత్య దర్పణము-తృ.ప.) పుట 81.

విభావమునకు - గారణము నిమిత్తము, హేతువు అనునవి పర్యాయ పదములు.

'చిత్త వృత్త్యుద్భవహేతుః విషయః
విభావ శబ్దస్యార్థః ఇతి జ్ఞాతమ్'
(అభినవభారతి వ్యాఖ్య)
విభావము చిత్తవృత్త్యుద్భవ హేతుకమైన విషయము.

వాచికాంగిక సాత్త్వికాదినయాశ్రయములగు పెక్కు అర్థములు విభావ్యము లగునని భరతుడు నాట్యశాస్త్రమున బేర్కొనియున్నాడు.[4]

శ్రవ్యకావ్యమునందు విభావానుభావరూప వర్ణనాత్మకమైన శబ్దార్థములు కూర్చబడియుండును శ్రవ్యకావ్యగ్రహీత దృగింద్రియ చక్షురింద్రియ కారణ మున కవిభావితములైన యర్థవిశేషములను గ్రహించి చూడగలుగుచున్నాడు. ఆ యర్థములతో తాదాత్మ్యమును బొందుచున్నాడు

ఈ విధముగా భావము స్థిరమగుటకు విభావము పలువిధములుగ తోడ్పడు చున్నది.

## అనుభావము

''అనుభావము లభిప్రాయసూచనాత్మకములగు కార్యములు విభావము కారణముగా జనించినవి గనుక అనుభావము కార్యమైనది (Its effect). ఇది శ్రవ్యకావ్యమున వర్ణనాత్మకము''[5]

లోకమున నెల్ల చేష్టలకును గారణములై, దీప్తిని గల్గించు పనులే యను భావములగుచున్నవి.

''కార్యభూతోఽనుభావస్స్యాత్ కటాక్షాదిశ్శరీరజః''[6]

''చేష్టా సముద్భూతంబై యనుభూతమై రసము సొంపున్ జెందుటన్ జేసి విఖ్యాతంబై యనుభావమొప్పు.''[7]

సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథుడు కూడ, విభావములచేత నుద్బుద్ధమైన మనోగత భావములను గార్యరూపములుగా తెలుపుటయే అనుభావములని పేర్కొనినాడు.

''ఉద్బుద్ధం కారణం స్వైస్వైర్బహిర్భావ ప్రకాశయన్
లోకే యః కార్యరూప స్సోఽనుభావః కావ్యనాట్యయోః''

ఈ విధముగా పలువురు మహామహులచేత అనుభావములు నిర్వచింపబడినవి.

ఈ సందర్భమున దేలిన దేమనగా, దృశ్య శ్రవ్య కావ్యముల యందు నటులుగాని, మరి యే పాత్రలు గాని, మానసికములును, శరీరజములునునైన యే చర్యలచేతనైన ననుభావములను సామాజికులకు దోచునట్లు చేయుదురు ఆ కారణముగా సహృదయుడు, సామాజికుడు నగు వ్యక్తి జ్ఞానేంద్రియమగు తన దృష్టితో, విభావానుభావముల వలన భావమును దర్శించుచున్నాడని తెలియు చున్నది.

వ్యభిచారి లేక సంచారి భావములు

ఇవి ముప్పదిమూడు గలవని భరతుడు పేర్కొనెను.

'వి అభి ఇత్యేతా ఉపసర్గౌ చరగతౌ ధాతుః వివిధ మాభిముఖ్యేన రసేషు చరంతీతి వ్యభిచారిణః" (నాట్యశాస్త్రము)

'విభావాను భావ సాత్త్వికభావములకన్న నతిశయించి రసానుగుణముగ చరించునవి వ్యభిచారు' లని కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యాత పేర్కొనినారు.[8]

విభావానుభావముల కలయికచే వెల్వడిన వ్యభిచారి భావములు నిర్వికారమైన మనస్సునందలి స్థాయి భావములను జాగృత మొనర్చి, వాని యందు తమ ధర్మములను నిబిడీకృత మొనర్చి, అంతర్హితములగుచు, మరల జాగృతము చేయుచు, రస్యమానము చేయునట్టివి యని రసార్ణవసుధాకరకర్త యభిప్రాయము.[9]

ఇవి మానవ హృదయమును బట్టి 33 మాత్రమే కానక్కరలేదనియు, తక్కువయు నెక్కువయు కావచ్చుననియు. ప్రతిరసమునందును తటస్థించవనియు, సందర్భమునుబట్టి సరిపోవచ్చుననియు శ్రీ పింగళి వారియభిప్రాయము.[10]

ఈ కారణమున వ్యభిచారిభావములుగా నామాంతరితములైన సంచారి భావము లేదో యుక రసమున కుపయుక్తమై, యస్తిత్వమును నిలుపుకొని, వ్యర్థము కాక, తమ పాత్ర నేదేని రససిద్ధికై నిలుపుననియు దేలినది.

## సాత్త్విక భావములు

మనః ప్రభవము సత్త్వము - అని భరతుడు వివరించినాడు. (సత్త్వం నామ మనః ప్రభవమ్- నా. శా 7-147) సమాధ్యవస్థ యందున్న మనస్సు నుండి నిష్పన్నమైనది సత్వము. సత్త్వము నుండి జనించిన భావములు సాత్త్విక భావము లగుచు కార్యరూపమును దాల్చుచున్నవి అనుభావములు శరీరజములు; సాత్త్విక భావములు సత్త్వజములు. శరీరజములు బుద్ధిపూర్వకముగా నుత్పాద్య మానములగు ననియు, సత్త్వజములు స్వతఃప్రవర్తమానము లగునని కొందరు లాక్షణికులు తెలిపినట్లు డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యము గారు తెలిపినారు.[11]

ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు కూడ తమ యభిప్రాయముల నీ క్రింది విధమున దెలిపిరి.

"కటాక్షాదులైన అనుభావములు శరీరజములే అయ్యు సత్త్వమున పుట్టినవి కావు. అప్పట్ల మనస్సునకు పరవశత్వము లేదు. వ్యక్తి యుక్క యుద్దేశపూర్వకముగానే కడగంటి చూపులు, మందహాసములు వెలువడును. గాద్గద్యము, రోమాంచము మొదలైన శరీరజములు సత్త్వోద్రేకముచే అనుకార్యవ్యక్తి అవశుడై యున్నపుడు తమంత పుట్టునవి గనుక ఇవి వానికంటె భిన్నమైనవి."[12]

ఈ విధమున పరిశీలించిన అనుభావములు, సాత్త్విక భావములు భేదించుచున్నవి. అనుభావములు బుద్ధిపూర్వకములు సాత్త్వికభావము లట్టివి కావు. తమంతట తామే జన్మించునవి

భరతర్షి ప్రోక్తమగు సాత్త్విక భావములనే పలువురు సంస్కృత లాక్షణికులను పేర్కొనియున్నారు.

## రసము

విభావానుభావ వ్యభిచారి భావములు సమ్మిళితమై స్థాయిభావములను సామాజికుని కాస్వాదయోగ్యముగా నొనర్చును. కావుననే ధనంజయాదులు,

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః"

అని పేర్కొనుచు స్థాయిభావమే రససంజ్ఞ యని వా రొప్పుకొనుచు, నాట్యశాస్త్రము ననుసరించినట్లు "వీర రసము" పేర్కొనినది.

రసము, స్థాయిభావము తీవ్రమైన రూప మందిన పిమ్మట సిద్ధమైనట్టిది. అట్టి యుత్కృట రూపముననున్న స్థాయిభావము భావతాదాత్మ్యమునకు దారి తీయుట విధి యగుట మాత్రమే కాక, రసమను నామమున నభివ్యక్తమగుచున్నది. ఈ రస మేది యైనను, తత్తద్భావములను సామాజికుల హృదయములందు నింపి, వారిని మైమరపించు స్థితిని బొందింప జేయుచున్నది.

ఇట్టి రస మలౌకికము అనిర్వచనీయమైన రసము, లేని రూపు నూహించి కల్పించునట్టిది. జాగ్రదవస్థలో మానవునికి వ్యావహారిక విషయములే గాని యలౌకికములైన విషయములను గూర్చిన యూహరాదు. ఆ కారణముగా మానవుని హృదయము నిరంతరము రసాన్వేషణములోననే గవేషణము జేసి, దానిని బొందిన తోడనే తన్మయుడగుచున్నాడు సర్వసాధారణముగా నిట్టి తన్మయస్థితి సామాజికుని యందే కలుగును.

రసము కావ్యములం దొక్కటియే కాక, యొకటి ప్రధానమును, తదితరము లంగ రసములుగను వ్యవహరించి, ప్రధాన రసమునకు పుష్టిని జేకూర్చుచుండును. ప్రధాన రసము కావ్యము నందంతటను వ్యాపించుచు, స్థాయిరసమని పిలువబడుచుండగా, తదితరములు సంచారి రసము లగుచున్నవి

## జైమిని భారతము - యుద్ధముల యావశ్యకము .

ఈ గ్రంథము నందుగల 'నవవిధ భక్తితత్త్వము' లోగడ పర్యాలోకనము గావించితిమి. ఇపు డిందలి యుద్ధముల యావశ్యమును గూర్చి విదారించుదము. దీనికి గారణముల నీ క్రింది విధములుగా నూహించవచ్చును. ఈ గ్రంథము నందలి సంఘటనలు, భావములు, పాత్రలు, ఇతివృత్తము జూచిననే గాని రసవిమర్శనము సమగ్రము కానేరదు.

(1) ఈ గ్రంథములో నాయకుడు ధర్మరాజు శ్రీ కృష్ణార్జున, భీమాదు లనునాయకులు. ధర్మరాజు శాంతమూర్తి యయ్యును, యుద్ధ ప్రధాన వస్తువైన గ్రంథమగు జైమిని భారతము నందును మహాభారతము నందును, నాయకు డగుచు, హయమేధ యాగమును నిర్వహించి, వీరుడై, వీరులకు నన్నయై, యాగఫలము ననుభావుకులైన తమ్ముల ద్వారా పొందినాడు.

(2) ధర్మరాజు జైమినిభారతమునందు స్వయముగా యుద్ధములను చేయ లేదు. కాని యుద్ధములన్నిటికిని కారణభూతుడైనాడు. కాని హయమేధమును తానే చేసినాడు షష్ఠాశ్వాసమున తమ్ములందరును మడిసిన పిమ్మట శ్రీరాముడు తానే యుద్ధము చేయవలసి వచ్చినది.

(3) జైమిని భారతములోని వారందరును భక్తాగ్రగణ్యులే. కాని వారం దరును వీరులు.

(4) ఈ గ్రంథమందలి వీరు లర్జును నెరుగక, యుద్ధము చేసిరి.

(5) యుద్ధము లుప్పతిల్లిన సమయమున- కొన్ని సమయములలో శ్రీకృష్ణ మాహాత్మ్య ప్రదర్శనము జరిగినది. ఫలితముగా నర్జునుడు గెలిచినాడు. కాని యుద్ధములు మాత్రము తప్పలేదు. ఇది భక్తి ప్రభావమే.

(6) మహాభారతములో నర్జును డస్త్రసన్యాసము చేసి, బంధువులను, మిత్రులను వధింపనని తెలియజేసిన మనస్తత్వ మీ గ్రంథమునం దర్జునునకు లేదు. శ్రీకృష్ణుని యాజ్ఞను, ధర్మజునానతిని పాలించిన వినయసంపన్నుడీతడు.

(7) భగవద్గీతలోని నాటకీయత పాఠకునికి వ్యాస ధర్మజుల మధ్య వ్యక్తమగుచున్నది. జైమిని భారతములో వ్యాసుడు, భగవద్గీతలోని శ్రీకృష్ణ పాత్రను బుణికిపుచ్చుకొనినయట్లు స్పష్టపడును. వ్యాసుని వాక్యముల ఫలిత ముగా ధర్మజుడు హయమేధ మొనర్చినాడు. ఆ కారణముగా యుద్ధములు జరుగుటయు కనబడును. అట్లు వ్యాసుడు, శ్రీకృష్ణపాత్రలో దాదాపు పది పద్యముల మేరకు ప్రథమాశ్వాసమున గనబడుచున్నాడు. కాని శ్రీ కృష్ణుని (భగవద్గీత) బోధకును, వ్యాసబోధకును భేదము గలదు. శ్రీకృష్ణబోధ గోత్ర వధకు పూర్వము జరిగినట్టిది. వ్యాసబోధ గోత్రవధకు దరువాత జరిగినట్టిది.

సవనము- యుద్ధములు- గోత్రవధానంతరపాపము హరించుట కేర్పరుపబడినవి. యుద్ధ విముఖుడగుటకు విజయుని కెట్టి స్వాతంత్ర్యమును లేదు.

(8) భీముడును, అర్జునుడును చేసిన యుద్ధములు ధర్మకార్య నిర్వహణముగ కేర్పరుపబడినవి. ఆ యుద్ధమున కుపసంస్కారములైన వ్యక్తులు ప్రత్యక్షముగా శ్రీకృష్ణుడును, పరోక్షముగా ధర్మజుడును, వ్యాసుడును కనబడుచున్నారు. కావుననే యుద్ధము లీ గ్రంథమున నత్యావశ్యకములై వీరరసప్రోద్బలకములై యున్నవి.

**జైమిని భారతమునందు వీరరసము ఉద్బుద్ధమగుటకు కలిగిన భావములు :**

ధర్మరాజు తక్కిన తన నల్వురు తమ్ములతోబాటు కురుక్షేత్ర సంగ్రామము పూర్తిచేసినాడు. ఇక్కథాకాలము నాటికొక ఘట్టము సంపూర్ణమైనది. ఆ కథాభాగము నేడు మనకగుపడు 'జైమిని భారత' సంస్కృతాంధ్ర గ్రంథములలో గన్పట్టుటలేదు. తిక్కన కూడ యుద్ధపంచకము దాటిన పిమ్మట శాంతి సప్తకమున యుద్ధవర్ణన మొక్క యశ్వమేధపర్వముననే చేసినాడు.

కురుక్షేత్రసంగ్రామము జరిగిన పిమ్మట ధర్మజుని దృక్పథమున మార్పు వచ్చినది. అంతులేని వధాఘట్టములను జూచిన పిమ్మట మనస్సు వైకల్యము చెందినది. ఫలితముగా శాంతి యవసరమైనది. అట్టి శాంతిని నొసగూర్చుటలో వ్యాసుడు శ్రీకృష్ణుడు, నారదుడును బాలు పంచుకొనిరి. కాని నారదుని వృత్తాంతము జైమిని భారతారంభమున లేదు. తరువాత గలదు. తిక్కన వ్రాసిన భారతములో నశ్వమేధము చేయవలెనని శ్రీకృష్ణాదులు బోధించిన ఘట్టము తృతీయాశ్వాసమున నారంభమై, చతుర్థాశ్వాసమున సమాప్తమైనది. తిక్కన అశ్వమేధ పర్వములో నర్జునుడు యుద్ధము చేసిన వీరులు - త్రిగర్త దేశాధిపతులు, సింధుదేశాధిపతులు, బభ్రువాహనుడు, శిశుపాల తనయుడు శరభుడు, గాంధారదేశాధిపతులు. తిక్కన ఈ యుద్ధములను 280 పద్యములలో వర్ణించగా జైమిని భారతమున నివి యారాశ్వాసములు (1200 పద్యములు) గలవు. ఇవి వీరరస ప్రధానమై, శ్రీకృష్ణ భక్తమాహాత్మ్యపూతమై యలరారినవి.

## స్థూలముగా ధర్మరాజు, అర్జునుల పాత్రలలో గల భేదము

అర్జునునకు గురుక్షేత్రసంగ్రామమునకు పూర్వము "గీతాప్రవచనము"- యుద్ధోన్ముఖుని జేయుట భారతమున నెంతయావశ్యకమో, యుద్ధమైన పిమ్మట ధర్మజగతమైన పాపహార మీ జైమినిభారతమున నంతే యావశ్యకమైనది. మనస్తాపోపశమనమును ముఖ్యము. ఈ రెండును నత్యంత ప్రాముఖ్యము వహించు ఘట్టములు భారతమున సవ్యసాచియైన విజయుడు యుద్ధవిముఖత్వము బొందినాడు. కాని జైమిని భారతమున నెట్టి విముఖత్వము జూపక (తిక్కన భాగమున నాడు, ఎఱ్ఱప్రెగడ వ్రాసిన భాగమున నాడు) యుద్ధములను జేసినాడు. భారతమున శ్రీకృష్ణుని మాట యుద్ధరంగమున శాసనము. జైమిని భారతమున వ్యాసశ్రీకృష్ణాదుల యానతిని ధర్మజుడనుసరించినాడు కాని తదాజ్ఞ కార్య రూపము నొనరించిన దర్జును డగుచున్నాడు పరోక్షముగ శ్రీకృష్ణుని యానతి నాతడు తలదాల్చిన వాడగుచున్నాడు. అత్యవసరమైన పట్ల శ్రీకృష్ణుడు తానే నిలచి యుద్ధము నిర్వహింప జేసినాడు

యుధిష్ఠిరుని మానసిక బాధ మాసిపోవలయుననిన యుద్ధములు తప్పవు- ఈ విషయమును భారతకర్త వ్యాసుడును, జైమిని భారతకర్త జైమినియు గ్రహించినారు "ఇహలోకమునందు పాపకార్యములు (యుద్ధాదులు) చేసిన వారికి పరిహార మీ లోకమందే జరుగవలె" ననుసత్యమును జైమిని భారతము చెప్పకయే చెప్పుచున్నది ఈ యాగ ప్రబోధ మందులకే జరిగినది

నాయకుడు . ధర్మజుడు ధీరోదాత్తుడగు నాయకుడు. ధైర్య గుణము ఈ వీరుని ధర్మము. ఈ గుణముతో బాటుదాత్తత కూడ గలదు. ఈ యుదాత్తత జాతిగతమైనది కాదు [14] ఇది నియతధర్మము కానేరదు. కావుననే క్షత్రియు డైనను నుదాత్త గుణము లున్నవి.

సాహిత్య దర్పణము నందలి శ్లోకము నుదాహరించుచు, కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యాత[15] "ఆత్మశ్లాఘ లేనివాడు (అవికత్థనుడు), సహనము గల వాడు (క్లేశ సహిష్ణువు). గంభీరుడు, మహాసత్త్వుడు, గూఢమానము (కోపము) గలవాడు, దృఢవ్రతుడు, ధీరోదాత్తు డగుచున్నాడు. ఈతడు శృంగార, వీర రసములందు నాయకుడు"- అని పేర్కొనినాడు.

భారత, జైమిని భారత గాథల నాయకుడగు యుధిష్ఠిరునిలో ఈ గుణము లన్నియు నున్నవి. కురుక్షేత్ర సంగ్రామమున నీతడు గెల్వగనే విజ్జువీగలేదు. తత్పాపోపశమనమునకై వ్యాసుని, శ్రీకృష్ణుని ప్రార్థించెను వ్యాసుని య మనమున-

"హెచ్చిన శోకము మదిలో
నచ్చనలాడంగ ననియె నమ్మునితోడన్. (జై. భా. 1-56)

అను విషయమును బట్టి, యుధిష్ఠిరుని మదిలో మాత్రమే శోకము వ్యక్తము. కాని యా విభావము కార్యరూపము దాల్చిన యనుభావమై, పాపహారమున కే గో క్రతువులు చేయవలెనని వ్యాసుని యాత దడుగుటకు హేతువైనది (1-59, 60). ఇది క్లేశ సహిష్ణుత్వ గుణమును వ్యక్తము గావించినది పాప పరిహారత్వ మున నీతనికి గల గూఢమానము (కోపము) కూడ విదితమైనది. అర్జునుడు రాజులను జయించుట, ధర్మజుని దృఢవ్రత గుణమును విదితము చేయుచున్నది.

## సమన్వయము

ఈ ధీరోదాత్త నాయకమణికి ధర్మదృష్టియేగాని వేఱొండు దృష్టి లేదు. శ్రీకృష్ణసందేశమునకై నిరంతర మాకాంక్షించు శీలము గలవాడు. జైమినీయ గ్రంథమున నీతడు ప్రధాననాయకుడేయైనను, ప్రథమ, తృతీయాష్టమాశ్వాసముల యందు మాత్రమే ఈ నాయకుని పాత్రయు, ప్రస్తావనయు గోచరించుచున్నవి. ఇక కథాప్రవృత్తి- ధర్మోద్ధరణ, పాపఫలనివృత్తియు నగును. శ్రీహరిస్వరూపు డగు వాసుదేవుడు సర్వదా పాండవులకు గల్పవృక్షము, కామధేనువు వ్యాసర్షి ప్రోక్తమైన జాత్యశ్వలక్షణములు, స్థిరలక్ష్మీయోగవిధానము గ్రహించుట తోడనే యుధిష్ఠిరుడు, భీముని ద్వారకకు బంపి, వాసుదేవుని రావించి, యాగమారంభించినాడు. ఈ సందర్భమున ననునాయకుడైన శ్రీకృష్ణుడు- సర్వబలసంపన్నుడు (Omnipotent), సర్వవ్యాపి (Omnipresent), సర్వజ్ఞుడు (Omniscient) ఆయన తాను యాగనిర్విఘ్నమొనర్చి, యాగఫలమును ధర్మజునకు బొందింపజేసి, తానును బొందినాడు ఈ విధమున వాసుదేవుడు పాండవులతో గహనమైన సంబంధము గల్గి యద్వైతస్థితిని బొందినాడు.

## పాత్రల పోషణలలో ఔచిత్యము

ఇందలి ప్రధానములైన పాత్రలు- శ్రీకృష్ణుడు ధర్మజుడు, భీముడు, అర్జునుడు.

తాత్కాలికములైన ప్రయోజనములను సాధించుటలో తోడ్పడినపాత్రలు- అనుసాల్వుడు, నీలధ్వజుడు, సుధన్వ సురథులు, బభ్రువాహనుడు, లవ కుశులు, సీత, శ్రీరామాదసోదరులు, తామ్రధ్వజుడు, హంసధ్వజుడు ప్రమీల, వీరవర్మ, చంద్రహాసుడు, దుష్టబుద్ధి మున్నగువారు

మొదటి నాలుగుపాత్రలు ప్రధానకథను నిర్వహించుట కుపయుక్తమైనవి. ఇందు భీముడు ధీరోద్ధతుడు. వాచంయమిత్వము లేనివాడు తక్కినవారితో బాటు భీముడు కూడ యాగము కొరకు తన పాత్రను నిర్వహించినట్టివాడు. శ్రీ కృష్ణ భీమార్జును లనునాయకులు. అర్జునుడు శక్త్యావేశమున నెవ్వరికిని దీసి పోనివాడు. యుధిష్ఠిరుడు యుద్ధమునందు మాత్రమే స్థిరమైన గుణము గలవాడు కాడు. సర్వకార్యనిర్వహణ మందునూ నాతనికి స్థిరత్వము గలదు

ఇక శ్రీకృష్ణార్జునులలో శ్రీకృష్ణుడు పరమాత్మ అర్జునుడు జీవాత్మ. ఈ నరనారాయణ విషయము సంస్కృత జైమిని భారతమున మొదటి శ్లోకమున దెలుపబడినది.

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్

(ప్రథమోఽధ్యాయః - 1)

ఈ గీతాసారము తెలుగు జైమిని భారతమున లేదు. కాని శ్రీకృష్ణార్జున సంబంధములగు గొన్ని పద్యములు గలవు. అట్టివానిలో నొకటి-

కృష్ణసారథ్యమున మున్ను గెలుపు లొదవెఁ
గాక యి ట్లొంటి వచ్చినఁ గలదె జయము[16] (జై.భా. 5-25)

ఈ విధముగ శ్రీకృష్ణార్జున సమ్మేళనము లోక కళ్యాణ విషయమై, యాగ నిర్వహణమైనది. ధర్మమునకే పీ రంకితమైనారు.

అప్రాధాన్యమైనవిగా గన్పట్టు మరికొన్ని పాత్రలు శక్తితత్త్వమును నిరూపించుట కేర్పడి, ప్రధాన కథను సప్రమాణముగా నిరూపించుచు, పాత్ర

చిత్రణ ప్రాధాన్య దృష్టిని గనబరచుచున్నవి కాన నివి పరోక్షమైన ప్రాధాన్యము వహించుచున్నవి.

### విభావ - అనుభావ - వ్యభిచారి భావములు :

భరతుడు నాట్యశాస్త్రమున పేర్కొనిన
"విభావానుభావ వ్యభిచారి భావసంయోగాద్రస నిష్పత్తిః"
అను విషయము బహుళ ప్రచారము నందినది.

ఈ గ్రంథము నందలి యితివృత్తము స్పష్టమైనది. కురుక్షేత్ర రణము జరిగిన పిమ్మట ధర్మజుని మనఃపరిశీలనము గావించిన, పూర్వము జరిగిన తీవ్రమైన యుద్ధము లాతని మనమున నిరంతరము సాక్షాత్కారము బొందు చున్నట్లు గోచరించును. అయన మనమున నుద్భూతమైన ప్రథమ భావము 'పాపనివృత్తి' ఈ భావమే క్రమక్రమమున వీరరస ముద్భూత మగుటకు దారి తీసినది. ఇది ప్రథమ వికారము. అప్పై మొదట తెలిపిన యాంగ్లేయార్థములన్నియు నీ సందర్భమున సరిపోలుచున్నవి.

ఈ సందర్భమున పాపభీతి నివృత్తిని ధర్మజుడు కోరుచు, వ్యాసునితో బల్కిన పల్కులు ధర్మజ సంబంధమైన విభావము లగుచున్నవి. నాయకుడు వీరు డగుటచేత, గ్రంథమంతయు నాతనికి సంబంధించిన 'ఇతివృత్తమే' యగుట చేతను, నాతనికి గల్గిన మనః ప్రవృత్తి, పరిపాకములను గ్రహించి ప్రధానముగా రసనిర్ణయము జరగవలసి యున్నది

నాట్యశాస్త్రమున భరతుడు పేర్కొనినట్లు వాచికాంగిక, సాత్త్వికాది నయాశ్రయమే విభావము. వ్యాసుని వాచికముగ కోరిన కోర్కె యే యే క్రతు వుల నాచరింపవలయు ననునది.

"ఏ తపముల నే జపముల
నే తీర్థవిలోకనముల నే క్రతువుల నీ
జ్ఞాతివధం బొనరించిన
పాతకము హరించు" జై. భా. (1-60)
ఈ విధమున పేర్కొనబడినది.

లోగడ ధర్మజుని మనస్సున గల్గిన పలు భావసంచయ మీ విధముగ పై పద్యము నందు స్థిరమైనది.

విభావమును గూర్చి

"చిత్త వృత్త్యుద్భవహేతుః విషయః
విభావ శబ్దస్యార్థః ఇతి జ్ఞాతమ్"

అని యభినవ భారతి వ్యాఖ్య.

(చిత్తవృత్త్యుద్భవ హేతుకమైన విషయమే విభావము).

ఈ రీతిలోననే పై పద్యమున నాయకుడగు యుధిష్ఠిరుని కోర్కె వ్యక్తమైనది.

సాహిత్య దర్పణకారుడగు విశ్వనాథుడు పేర్కొనినట్లు-

"విభావములు లోకమందు కార్యకారణ సంచారి రూపములయినను రసోద్బోధమందు కారణములు."

(సాహిత్య దర్పణము-తృ.ప. పుట. 81)

ఈ కార్యకారణ సంచారియే విభావమైనది. ఇచట కార్యము క్రతువు నిర్వహించుట. హేతువు, లేక కారణము జ్ఞాతి వధాసందర్భము నందలి పాతకము. కావుననే ఈ కార్యకారణ సంబంధమైన ధర్మజు మనఃప్రవృత్తి విభావస్థాయిని పొందినది.

వ్యాసుడు బోధించిన రీతులలో ధర్మజుడు యాగ ప్రయత్నములను సాగించినాడు.

సారథి, సచివుడు, వియ్యము, బంధువునైన శ్రీకృష్ణుని ప్రార్థించినాడు. (1-81-82-106)

"ఎవ్వని ప్రాపున గెలిచెన్
గవ్వడి నెవ్వాడి విరోధిగణముల ననిలో
నవ్వనజాక్షుడు కృష్ణుడు
దవ్వుల నున్నాడు క్రతువు తరమే చేయన్"

"............ విష్ణుడు నికటంబున లేడన నేటికి మన
మునఁ దలచిన దురిత మడఁగి పుణ్యము దొరకున్."

"హా సరోజాక్ష గోత్రదుఃఖార్ణవమున
మునిఁగి యున్నాఁడఁ జేయూఁతకొనఁగ లేక
నీ కృపాదృష్టి పేరోడ గాకయున్న
వెడలఁబడు టెట్లు సుఖము గావించు టెట్లు?"

కమలగర్భుడు ప్రస్తుతించగనే ప్రత్యక్షమైనారు. శ్రీకృష్ణాగమనమును, భీమ, వృషకేతులు- యౌవనాశ్వునితో పోరు సలిపి యాగాశ్వమును గొనివచ్చుటయు, విభావము లగుచున్నవి. కార్యకారణ సంబంధమైనదగు విభావ మీ విధముగ వ్యక్తమగుచున్నది

జైమిని భారతములో యాగాశ్వము గైకొని రాబడిన పిమ్మట శ్రీకృష్ణ నేతృత్వమున యాగమారంభమైనది. ధర్మజుని మనోగతములైన భావములకును, గోత్రవధానంతర కార్యమునకును, పాపపరిహారమునకును దగిన కార్యరూప మేర్పడినది ఈ యాగసంఘటన వలన ధర్మజుని కీర్తి దిగ్దిగంతముల వరకును వ్యాపించగలదు. సర్వ భరతఖండమునకును యుధిష్ఠిరుడే నేత యను భావము ఈ సంఘటనచే స్పష్టము యాగము, యాగాశ్వము- వీనికి రక్ష శ్రీకృష్ణుడే

ఇచ్చట ధర్మజ మనోగతములై యుద్బుద్ధములైన విభావము లనుభావము లైనవి. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి యందును, విశ్వనాథుడు సాహిత్యదర్పణమునందును బేరొ్కనిన పిమ్మట (?) ను బట్టి మనుభావములు, శరీరగతమైన యే చర్యలైనను, సామాజికులకు హృదయగతముగునట్లు చేయుటయే యని గ్రహింపనగుచున్నది. విభావము కారణముగా జనించునది యను భావము (Its effect) అనుసాల్వునిచేత యజ్ఞాశ్వ మపహరింపబడినది (శృ. అ) గోవిందుడు సరిగా హస్తిపురము ప్రవేశించుటతోడనే యాగాశ్వ మపహరించుటలో కొంత యౌచిత్యమున్నది పాండవులకు రక్ష శ్రీ కృష్ణుడే. శ్రీకృష్ణుడు లేనిదే యాగము సాగదు ఆయన యాశీర్వచనము, కృప లేకున్న యాగాశ్వము ముందునకు సాగదు. అంతియేకాక, వాసుదేవునకును ననుసాల్వునకును బూర్వ వైరమున్నది. ఆ కారణమున ధర్మజాహూతుడై వచ్చుచున్న కృష్ణమూర్తిని మూర్ఛ నొందింపజేసినాడు. కాని కర్ణజుడైన వృషకేతుడు, పూర్వవైరిని బట్టి తెచ్చి శౌరి ముందట నిల్పి క్షమాపణ వేడునట్లు గావించెను. ఇతిహాసములో నిది యౌచిత్యమునకు దావిచ్చుచున్నది శౌరి

చేసిన యద్భుతము లిట కొత్త పుంతను త్రొక్కినవి. జైమిని చూపిన కొత్త మలుపిది సామాజికుల కిది యొక క్రొత్త భావముగ, భావ విశేషముగ గన్పట్టును. ఆ పిమ్మట యాగ మారంభమగుటయు క్రీడి రక్షణార్థమై బయల్వెడలినాడు. ఇవన్నియు ననుభావములుగ నీ గ్రంథమున గ్రహింపవచ్చును.

క్రీడి గావించిన యుద్ధములన్నియు ధర్మజుని యుద్ధములుగనే గ్రహింపవలయును. యజ్వయు, సత్ప్రవృత్త సంవిధాన నాయకుడును పాండవాగ్రజుడే ఆయన యాజ్ఞను భారతమ లోగాని, జైమిని భారతములో గాని, తమ్ములు జవదాటలేదు.

శా. ఉర్వీజానియు సవ్యసాచిగమనోద్యోగంబు వీక్షించి య
జ్ఞార్వం బీతడు గావ నర్హుండని యాజ్ఞాపించి తత్కంధరన్
దూర్వాచంపకదామకం బిడ నతండున్ భక్తితో మ్రొక్కి నా
శీర్వాదం బొనరించి గెల్వుమని చేర్చెం దమ్మునిన్ గౌఁగిటన్.

మ. అతఁడున్ శౌరి పదాబ్జముల్ గదియ సాష్టాంగంబుగా మ్రొక్క నూ
ర్జిత సౌహార్దము గానరా బిగియ నాశ్లేషించి ప్రద్యుమ్న క
ర్ణతనూజాతులు తోడుగా నరుగుమన్నన్ దలికిన్ దేవకీ
సతికిన్ వందన మాచరించి కదలెన్ జంద్రధామాధిపుడై
(జై. భా. 3-123-128)

యుద్ధములు ప్రారంభమగుటకు పూర్వము జరిగిన ఈ సంఘటనలు తత్సంబంధములైన నాయకానునాయకుల మనోభావము లిట వ్యభిచారి భావములైనవి. ఇవి వీరరసమును రసస్యమానము జేయుచున్నవి. ఉత్సాహము వీరరసమునకు స్థాయిభావము. ఆ యుత్సాహము లేనిదే యాగము ప్రారంభము కాదు. యుద్ధములలో ధర్మజుడు గాని, అర్జునుడు గాని గెలువజాలరు. ఈ విధముగా స్థాయి యగు నుత్సాహము పరిఢవిల్లినది.

ఈ యుత్సాహము నాయకగతమే కాక, అనునాయక గతముగ కూడ కనుపించినది. ఇది హంసధ్వజ, ప్రమీల, భీషణ, బభ్రువాహన, తామ్రధ్వజ, వీరవర్మ - మొదలగు వారితో జేసిన యుద్ధములం దర్జునునిలో గోచరించును. స్వయముగ గొన్ని యుద్ధములలో వాసుదేవుడే తదుత్సాహము బొంది, యుద్ధములను నిర్వహింప నాతని సమర్థుని గావించియున్నాడు. ఆ విధమైన ఉత్సాహము వీరరసమునకు స్థాయియై, గ్రంథాంశము వరకును నాయక రసమై, స్థాయి

రసమై యలరారుచున్నది. వీరరస మభివ్యక్తమై పఠితలను (సామాజికులను) మైమరపించి, పరవశత్వమును బొందింపజేయు వర్ణన లీ గ్రంథమున నెన్నియో గలవు.

కళాప్రపూర్ణ డా॥ విశ్వనాథ సత్యనారాయణ "కావ్యానంద" మను గ్రంథములో కవి తాను ప్రధానమైన యే రసమును ప్రతిపాదించబోవునో యట్టి రస విషయమున కడు జాగ్రత్త వహించవలెననియు నిది యా కావ్యకథానిర్మాణమున నొక భాగమనియు వాక్రుచ్చినారు (పుట 262). ఈ దృష్టితో నాలోచించినను, వీరభద్రుడు సార్థకనామధేయుడై (వీర రసమును బరిపుష్టముగ వర్ణించి) ఈ గ్రంథమున గడు జాగ్రత్త వహించి, రసపోషణ సంవిధానమునందును, కావ్యకథా నిర్మాణమునందును నప్రతిమానమైన శక్తిసంపదలను వెల్లడించినాడు. ఈ వీర రస వర్ణనా భూయిష్టమైన ఘట్టములు దాదాపు ఐదాశ్వాసముల పర్యంతము వ్యాపించినవి ఇట్లు జైమిని భారత గ్రంథమున భావము, రసము, పరస్పరాశ్రితములై, పాత్రలు రసస్ఫూర్తి ద్యోతకములై, యెట్టి పరిస్థితియందును రస వర్జితములు కాక, నిర్వికల్పములై యలరారుచున్నవి.

సాహిత్యశిల్ప సమీక్ష యందు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు పేర్కొనినట్లు,

"నభావహీనోఽస్తి రసః నభావో రసవర్జితః
పరస్పర కృతాసిద్ధి రసయో రసభావయోః" (పుట 119)

"భావములేని రసము లేదు. రస వర్జితమైన భావము లేదు. ఈ రెండును నన్యోన్యాశ్రయములై సిద్ధి పొందును". అను వాక్కు జైమిని భారతమునందు సార్థకమగుచున్నది

అంతియేగాక, సామాజికునకు ఈ గ్రంథరచనా శిల్పమున "మూర్తి సాక్షాత్కారము" (Personality) కలిగి, రసవంతమగుచున్నట్లును మనకు ద్యోతమానమై, విస్పష్టపడుచున్నది. "కావ్యానందము" న శ్రీ సత్యనారాయణ గారు పేర్కొనినట్లు, నాయకగతమైన భావస్పర్శయే గాని, వ్యక్తిస్పర్శకు ఈ గ్రంథమున తావులేదు. వ్యక్తిస్పర్శ వచ్చినంతనే రసవిశ్లథీకరణము జరుగును. కావున వీరరసము కేవలము యుధిష్ఠిరునకు సంబంధించినదే కాదు. కార్యనిర్వ

హణభారము నాయక, అనునాయకులకు సమపాళ్ళలో బంచబడినది అనగా శ్రీకృష్ణ నేతృత్వము, సవ్యసాచి చేసిన యుద్ధములు, ధర్మజునిచే నారంభింప బడిన యాగము- అనునవి సమాహారముగ "వీరరస" ముద్బుద్ధమగుటకు గారణ మైనవి. ఇవి వ్యక్తిగతములు గావు ఈ కారణమున రసవిశ్లేషీకరణము జరుగ లేదు. కావున "జైమిని భారతము" వీరరసప్లావితమై, సామాజికుని హృదయ మున దగు స్థాయివి బొందుటయు, రసము ప్రత్యక్ష మగుటయు ఫలితమైనది.

---

1. 'భావ స్వరూపము' - కావ్యానందము (మార్చి 1978) శ్రీ విశ్వనాథ సత్య నారాయణ
2. నాట్య శాస్త్రము-Dr. P.S.R. అప్పారావు. పుట 288-284
3. ఈ నిర్వచనములు డా. జి వి సుబ్రహ్మణ్యం గారి "వీరరసము" లో నుదహ రింపబడినవి
4. విభావః కరణం నిమిత్తం హేతురితి పర్యాయాః విభావ్యతేఽనేన వాగంగ సత్త్వా భినయ ఇతి విభావః. (-76- 6 శ్లో )
5. సాహిత్య శిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం గారు (1966)
6. ప్రతాపరుద్రీయము - పుట 186 (రసప్రకరణమ్)
7. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన. ప్రథమోల్లాసము - (ప. 28)
8. కావ్యాలంకార సంగ్రహము-శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి. పుట 888.
9. ఉన్మజ్జన్తో నిమజ్జనః స్థాయిన్యంబునిధావివ ఊర్మి వద్వర్ధ న్త్యేనం యాన్తి తద్రూ పతాంచ తే. (అ. 2- శ్లో. 8)
10. సాహిత్య శిల్ప సమీక్ష - పుట 188
11. వీరరసము - రసావతారము - పుట 2౦.
12. సాహిత్య శిల్ప సమీక్ష - రసస్వరూపము - పుట. 189
13. కావ్యాలంకార సంగ్రహము పుట 61 (ద్వి. ఆ.) స. సూ. శాస్త్రి.
14. పుట 45 కావ్యాలంకార సంగ్రహము (ద్వి. ఆ.) స. సూ. శాస్త్రి.
15. నరనారాయణుల సంబంధములను గూర్చిన తక్కిన విషయములు 'నవవిధ భక్తి తత్త్వము'న పేర్కొనబడినవి.

ప్రాచీన కవులందరి వలెనే వీరభద్రుడు కూడ జైమిని భారతములో గ్రంథాది పద్యమును 'శ్రీ' తోడను, మ గణము తోడను నారంభించినాడు. నాటకములలో వలెనే, కావ్యములలోనను, నితిహాసములలోనను గూడ మొదటి పద్యమీ విధమైన శ్రీకారముతోడను, మూడు గురువులు గల మగణముతోడను నారంభించుట శుభప్రదమను నొక సంప్రదాయ సిద్ధమైన సమ్మకమును వీరభద్రు డనుసరించినాడు.

శ్రీలావణ్య పయోనిధి త్రివళివీచీమధ్య రోమావళీ
వ్యాళానల్ప సుఖైకతల్పుడు జగద్వ్యాపార లీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుండై సాళ్వగుండక్షమా
పాలాగ్రేసర నారసింహుని సదగ్ర శ్రీయుతుం జేయుతన్.
(జై.భా. పీఠిక - 1-1)

శ్రీమహావిష్ణు స్వరూపుడైన శౌరి, సాళ్వనరసింహరాయలను, కృతిపతిని యాశీర్వదించు గాతమని యిచటి భావము. జైమిని భారతమున నాయకుడు ధర్మరాజైనను, ననునాయకుడు శ్రీకృష్ణుడు, ఇక కృతికర్త విజయనగర రాజులలోని సాళ్వ వంశమునకు జెందిన నరసింహరాయలు.

ఈ విధముగా మొదట శ్రీహరిని, పిమ్మట మృడుని, బలుకుం దొయ్యలి యగు శారదానాథుడగు బ్రహ్మను లంబోదరుని వాగ్దేవిని నుతించి పిమ్మట సుకవి స్తుత్యాదుల నొనరించినాడు. ఇదియు సంప్రదాయ సిద్ధమగు రచనయే

జైమిని భారతములో వాడబడిన వృత్తములు :

జైమిని భారతము ననువదించిన సమయమున వీరభద్రుడు వివిధములగు వృత్తములను రచనా ప్రణాళిక కనుగుణముగా రచించినాడు. పట్టిక ననుసరించి మొత్త మీ గ్రంథమున 1482 గద్య పద్యములు సమీకృతములైనవి. ఇందెనిమిది యాశ్వాసములు గలవు.

| వృత్తము పేరు | — | పద్యముల సంఖ్య |
|---|---|---|
| కందములు | | 689 |
| తేటగీతి | | 158 |
| ఉత్పలమాల | | 155 |

| | |
|---|---|
| చంపకమాల | 146 |
| సీసము | 144 |
| మత్తేభము | 114 |
| శార్దూలము | 65 |
| ఆటవెలది | 88 |
| లయగ్రాహి | 2 |
| భుజంగప్రయాతము | 1 |
| మాలిని | 1 |
| మత్తకోకిల | 1 |
| పృథ్వి | 1 |
| మానిని | 1 |
| ఉత్సాహ | 1 |
| తోటకము | 1 |
| స్రగ్విణి | 1 |
| వచనములు | 98 |
| వెరసి | 1482 |

పైన పేర్కొనబడిన వృత్తములలో గొన్ని సామాన్య వృత్తములును గొన్ని విశేష వృత్తములును గలవు.

## సామాన్య వృత్తములు

కందము, తేటగీతి, ఉత్పలమాల, చంపకమాల, సీసము, మత్తేభము, శార్దూలము, ఆటవెలది;

## విశేష వృత్తములు

లయగ్రాహి, భుజంగ ప్రయాతము, మాలిని, మత్తకోకిలం, పృథ్వి, మానిని, ఉత్సాహ, తోటక, స్రగ్విణి.

## ఛందశ్శిల్పము

ఒకానొక గ్రంథమునకు ఛందస్సు ప్రధానమా, కాదా యను విషయమును గూర్చియు, కావ్యపురాణముల యందు ఛందస్సునకు గల పాత్రను నిర్వచించుటలోను పలువురు పలువిధములైన యభిప్రాయములను ప్రకటించిరి.

భరతుని నాట్యశాస్త్రములో-

"ఛందోహీనో న శబ్దోఽస్తి
న ఛ్ఛంద శ్శబ్దవర్జితమ్" (14 అ - 44 శ్లో)

అని పేర్కొనబడినది.

"శరీరమునకును, హృదయ చైతన్యమునకును మూలశక్తి యాత్మ యనియు, నట్లే శబ్దార్థములకును, ఛందమునకును మూలశక్తి రస" మనియు డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యము గారు పేర్కొనిరి.[1]

కొందరు ఛందోనామములు బట్టి వాని స్వభావము వ్యంజించుననియు, కొన్ని కొన్ని రసములందు మాత్రమే కొన్ని కొన్ని వృత్తములు ప్రయోగింపబడు ననియు పేర్కొనగా, రసభావ ప్రకటనమునకును ఛందో ప్రయోగమునకును నంతగా సంబంధము లేదని కొందర మతము

డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు (తమ సిద్ధాంత వ్యాసములో) "మహాభారతమునందలి ఛందశ్శిల్పము"లో వివిధ భాషలలో గల ఛందస్సిద్ధాంతములను, శరీర జీవ మనస్తత్వశాస్త్ర సిద్ధాంతములను సమన్వయించి ఛందో రస సిద్ధాంతమును నిరూపించిరి

వారి దృష్టిలో-

"ఛందఃకర్మయందు కవి చేయు శిల్పమంతయు శ్రవ్యతాసిద్ధి కొఱకు గాదు. కావ్యచైతన్యవర్తనము వ్యంజించుట కొరకు వాక్యార్థాభినయము ఛందము యొక్క కర్తవ్యము. కావ్యార్థభావనాపరతంత్రుడైన కవి ఛందములు శిల్పించును కవి యన్వయుడో అతని ఛందములు తన్మయములు కనుక వాక్యచ్ఛందమున దర్శింపవలసిన పరమార్థము వక్త్రచ్ఛందము. బహుముఖ ప్రయోజనమైన ఛందనును కవి యథారుచి, యథాశక్తి యథౌచిత్యము, కావ్యమున బ్రయోగించును." (పుట 29-30)

14)

"రసవ్యవహార మింత క్లిష్టమైనపుడు ఈ రసమునకు ఈ వృత్తము అని నిర్దేశించుట యసాధ్యము. కనుక ఛందముల యొక్క వస్తురస భావాది వ్యంజకతా సామర్థ్యము వృత్తనామేతరమైన ఛందోధర్మము నాశ్రయించి యుండునకుట యుచితము. ఆ ధర్మము ఛందోవృత్తి యనియు, నానావిధములైన ఛందో వృత్తులు నానావిధములైన ఛందోగుణములచే సంక్రాంతములై నానారసభావ వ్యంజనా సమర్థము లగుననియు భావించుట సమంజసము"[2]

"నానారసభావముల నానావస్థాంతరముల సుష్ఠుగా వ్యంజించుటకుఁ దగిన యంగప్రత్యంగ నిర్మాణ సౌష్ఠవము ఛందములకు సమకూర్చుటకు కవి ఛందోఽంగ పరిజ్ఞానసౌష్ఠవము గలిగి యుండవలయును. అంగ ప్రత్యంగ సముచిత సన్నివేశముచే స్వధర్మ నిర్వహణ దక్షము లగునట్లు ఛందములను నిర్మించుటయే కవి యొక్క ఛందశ్శిల్పము."[3]

"డాక్టర్ మాధవశర్మ గారు పైన సిద్ధాంతీకరించిన విషయములు బహు గ్రంథములను విపులముగ బరిశీలించి, తత్తద్విషయ విచక్షణములో తమ నేర్పును, నైపుణ్యమును బ్రదర్శించి వానిని బ్రదర్శించిరి. ఇది యొక విశిష్టమైన మార్గమే గాక దీనివలన గొన్ని ప్రాచీన పద్ధతులకు స్వస్తి వాచకము పలుకు టయు, కేవలము లెక్కలు గట్టుచు, విమర్శించు స్థూలపద్ధతులకు స్వస్తి చెప్పు టయు జరిగినదని డాక్టర్ సుబ్రహ్మణ్యము గారు వాక్రుచ్చియున్నారు."[4]

తెనుగున గన్పట్టుచున్న జైమిని భారతమను నితిహాసము సంస్కృత జైమిని భారత గ్రంథమున కనువాదమేయైనను, ఛందశ్శిల్పదృష్ట్యా రస, భావ ముల వీరభద్రు డెట్లు ప్రత్యక్షీకరించియున్నాడో గ్రహించుట ప్రస్తుత కర్తవ్యము.

కవిత్రయ కవులను, తదితర మహాకవులైన మారన, శ్రీనాథాదులను వాడిన రీతిలో వీరభద్రుడు జైమిని భారతమున స్తుతిపరమగు సందర్భములలో దండకముల నేలనో వ్రాయలేదు. భీముడు సవనాశ్వమును దెత్తునని బ్రతిజ్ఞ చేయు సందర్భమునగాని, ద్రౌపదియు దక్కిన పాండవ వీరులును శ్రీకృష్ణుని స్తుతించు సందర్భమునగాని,దశావతార వర్ణనమందు గాని వీరభద్రకవి దండకమును రచించ లేదు. అట్లాతనికి దండకము రుచింపక కందపద్యములలోననే స్తుతిని సాగించుటకు గవికి కందపద్యముపై గల మమకారమే కారణముగ గోచరించుచున్నది. ఇంతే

గాక మరికొన్ని ప్రధానమగు నైన ఘట్టములయందును నీ మహాకవి కందపద్య రచననే సాగించినాడు.

## 1. లయగ్రాహి (విశేష వృత్తములు) :

జైమిని భారతమునందీ వృత్తములు రెండు గలవు. ఇది యుద్ధురమాలావృత్తము పాదమునకు ముప్పది యక్షరములు

గణములు - భ జ స న భ జ స న భయ; 8, 16, 24 అక్షరముల మీద ప్రాసయతులు. షష్ఠాశ్వాసమున శ్రీరాముడు, సౌమిత్రిని లవకుశుల పైకి యుద్ధమునకు బంపిన సమయమున మహాకవి యగు వీరభద్రుడు సూర్యస్తుతిని లవునిచే జెప్పించినాడు. ఈ వృత్తము భావలయాస్వీత మగుటచేత చిత్తైకాగ్రత నావాదింప జేయుచు దేవతా స్తుతులయందు మిక్కిలి యుచితమగుననుటకు నిది యొక చక్కని యుదాహరణము. పూర్వకవియు, నాదికవియు నగు నన్నయ కూడ సూర్యస్తుతి సందర్భముననే లయగ్రాహి వృత్తమును రచించినట్లు మహాభారతము విదితమొనర్చుచున్నది. నన్నయ మూడు. తిక్కన నాలుగు, ఎఱ్ఱన యొక్కటి- లయగ్రాహి వృత్తముల రచించినారు. కాని స్తుతి రూపమున నన్నయయే దీనిని వ్రాయుటను బట్టి పినవీరన, నన్నయను పై సందర్భమున ననుసరించినట్లును, నీ సందర్భమున నన్నయ మనోగతభావాభివ్యక్తి ననుగమించినట్లును ద్యోతకము. అట్లే ఎఱ్ఱన యుద్ధ సందర్భముననను నీ వృత్తమును వాడినట్లును, లవకుశులు సౌమిత్రితోడ గావించిన యుద్ధ సందర్భముననను నిది వాడబడుటలో వీరభద్రుడు దీనిని రౌద్రరసస్ఫూర్తి కొరకును వాడినట్లును గమ్యమాన మగుచున్నది

ఈ విధముగ వీరభద్రుడు రెండు లయగ్రాహి వృత్తములను రచించినాడు. ప్రత్యక్ష దైవతమైన సూర్యుని స్తుతించి, సాక్షాత్తు ఆదిశేషుని యవతారమైన లక్ష్మణుని యుద్ధమున నోడించుటకు, గురువగు వాల్మీకి మునీంద్రుడొసగిన "సౌరమంత్ర" జపమే లవకుశులకు శ్రీరామరక్ష యైనది. అదియును గాక వారిది సూర్యవంశమగుటయు మరొక్క కారణమగుటచే, సౌరమంత్రము వారి కబ్బుట తగునని వాల్మీకి భావించెను. ఆ భావనకు దగినట్లుగానే వీరభద్రుడు కూడ లయగ్రాహి వృత్తమును బొంపు పరచెను ఇది సమయోచితమే యగుచున్నది

## భాస్కర స్తుతి - లయగ్రాహి : (6-160)

భాస్కర భవామయతిరస్కర నమజ్జన య<br>
శస్కర సహస్రకరమస్కర ధరిత్రీ<br>
యస్కర నభోమణి యహస్కర చరచ్ఛరదు<br>
పస్కర సదారుణపురస్కర సదేశా<br>
పస్కర తమఃపటలతస్కర కిరీటగశి<br>
రస్కర గృహీశ సుమనస్కర సహిరో<br>
ణస్కర జనీపనవయస్కర విసర్జగ<br>
దాస్కర భజే యని నమస్కరణుడైనన్

మయూరుడు సంస్కృతములో సూర్యశతకము వ్రాసియున్నాడు. వీర భద్రుడా గ్రంథమును దృష్టిలో నుంచుకొని లయగ్రాహిని వ్రాసినట్లు తెలియును

ఆ శ్లోకమిట చూడనగును .

''యజ్జ్యోయా బీజం అహ్నాం అపహర తిమిరమ్ చక్షుషాం అంజనమ్ యద్<br>
ద్వారం యన్ ముక్తిభాజాం యద్ అఖిలభువన జ్యోతిషాం ఏకమోకః<br>
యద్ వృష్ట్యంభోసధానామ్ ధరణిరససుధాపానపాత్రం మహద్ యద్<br>
దివ్యద్ ఈశాస్య భాసాం తద్ అవికలం అలం మంగలం మండలం వః<br>
(మయూర 'సూర్యశతకము'- శ్లో 78)

ఈ లయగ్రాహి వృత్తమే సప్తమాశ్వాసమున దామ్రధ్వజుని శ్రీకృష్ణార్జునులు పరీక్షించు సందర్భమున గూడ, మయూరధ్వజుని భార్యయైన కుముద్వతి దేవి తన కుమారుడగు సుచిత్రుని సహాయమున దన భర్తయైన మయూరధ్వజుని సగముగా గోయు సమయమున వాడబడినది. ఇది మయూరధ్వజుని భక్తివీరమునకు చక్కని యుదాహరణము. వీర రసమునకు స్థాయిభావ ముత్సాహము. ఇట్టి యుత్సాహము శరీరార్ధత్యాగ మొనర్చు మయూరధ్వజుని యందును, నాతనికి సహాయభూతులైన కుముద్వతి, సుచిత్రులయందును గన్పట్టును కావున లయగ్రాహి నిట కవి యుపయోగించుట యసందర్భము గానేరదు (7-227).

## 2. భుజంగ ప్రయాతము (ఆశ్వాసాంత్యము)

య య య య - గణములు.

7 అక్షరముల మీద యతి. పాదమునకు పన్నెండక్షరములు.

ఏకగణ చతురావృత్తిచే నిర్మింపబడిన ఈ వృత్తము తాళలయాన్వితమై నట్టిది.

మహాభారతమున నీ వృత్తము తిక్కనచే రెండు సందర్భములలో స్త్రీ పర్వముననే వాడబడినది. తక్కిన కవిత్రయకవులు వాడలేదు.

భుజంగ ప్రయాతమారోహణగతి గలది. దైన్యసంతాపముల మిశ్రణ మున హృదయగతి విలంబితారోహణము గావచ్చునని దీనిని వివక్షించు సంద ర్భమున డాక్టర్ మాధవశర్మగారు పేర్కొనినారు.[6]

వీరభద్రుడు జైమినిభారతమునందలి యాశ్వాసాంత్య పద్యముగా దీనిని వ్యవహరించినాడు పూర్వకవులందరును దమ గ్రంథములలో నాశ్వాసాంత్యమున దా మే రాజునకు గ్రంథ మంకితమిత్తురో తద్రాజసంబంధమైన గుణ ప్రకటనము నకును, ఉత్కీర్తన కొఱకును గొన్ని పద్యములను వ్రాయుట సంప్రదాయముగ నొనర్చిరి. కొందరు కవులు గ్రంథాదిలో పద్యరూపమున తమకును, రాజుల కును గల సంబంధమును వ్యక్తపరచిరి. ఇచట కూడ విజయనగర రాజైన సాళ్వగుండ నరసింహరాయలను, నాతని గుణ కీర్తనము జేయుటకును పై వృత్తము (భుజంగ ప్రయాతము) వాడబడినది. సత్త్వగుణ ప్రధానమైన జైమిని భారతమునం దీ భాగమున వీరభద్రుడు మనోవాక్కాయ కర్మలతో నరసింహ రాయల నుతించుచున్నాడు.

సప్తమాశ్వాసాంత పర్యంతము గ్రంథరచనము జేయ సమర్థుడైన నీ కవి గ్రంథస్వీకర్త గుణగణముల నారోహణగతియందు వివృత మొనర్చినాడు. కుటిలగతియందు నడచు భుజంగప్రయాతము వాడుట కొక్క ప్రధానమైన కార ణము గన్పించుచున్నది. శత్రునిర్వాపణ మీ వృత్తమున వివర్ణింపబడినది. అర్థి శత్రువుల నిర్జించుట కితని గుణసామర్థ్యములు కుటిలగతిలో నడచుననుట గమ్యము. ఇది కుటిలగతి వృత్తము. ఈ రాజు 'కుటిలులకు గుటిలు' డనియు, సన్మార్గులతో వ్యవహరించునపుడు సన్మార్గుడే యనియు, చక్కని రాజనీతివేత్త

యనియు జెప్పకయే చెప్పుచున్నది. భుజంగము తనకు హాని చేయనివారికి హాని చేయదు. ధ్వనిపూర్వకముగ గుణకీర్తన మొనర్చుటకు నొక్క భుజంగ ప్రయాతమే వాడినను. ఛందశ్శిల్ప సమృద్ధిని సమధికము జేసిన మహాకవిగా పిరభద్రుడు భాసించుచున్నాడు.

ఆ వృత్త మీ క్రింద జూడనగును :

స్థిరశ్రీమనోహారి శృంగారగేహా
గిరిశప్రభాహాసికీర్తిప్రవాహా
నిరూఢారిబాహాసి నిర్వాపదేహా
రిరింసోగ్రవాహా ధరిత్రీవరాహా. (జై భా. 7-240)

3. మాలిని

న న మ య య - గణములచే వర్తింపబడినదియు, పాదచతుష్టయము గల్గినదియు, ఐదునైదక్షరములు గలదియు, నెనిమిదక్షరముల మీద యతి గల్గినదియు మాలిని వృత్తము.

కవిత్రయకవులు మొత్త మేబదినాలుగు మాలిని వృత్తములను వాడిరి. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన్నలు- మాలిని ఛందము నాశ్వాసాంత్యమున నొక్కొక్కటి వంతుననే వాడిరి.

క్షేమేంద్రుండు సర్గాంతమున నీ వృత్తము వాడనగునని జెప్పెను.

"కుర్యాత్ సర్గస్య పర్యంతే మాలినీం ద్రుతతాలవత్"

(సువృత్త తిలకము - III-19)

ఈ లక్షణమే కవిత్రయము వారి కనుసరణీయమైనది.

కృతిపతి గుణకీర్తనములగు విశేషణాపూరిత వాక్యములకన్న గృతి కర్తకు మరొక్కటి రచనాప్రీతిని గాంచదు.

కావున కృతీశ్వరుని హృదయరంజనమే ప్రధానమగుటచే, కవిత్రయము వారును, మారనయు నాశ్వాసాంత్యములగా మాలిని వృత్తములను రచించిరి.

పిరభద్రుడును, తన గ్రంథమునందలి ప్రథమాశ్వాసాదిలో కవిత్రయమును నుతించెను.

"మా నన్నయభట్టుఁ దిక్కకవి నేఱ్ఱపెగ్గడన్ సోమునిన్" అని పేర్కొనుటలోనను, నదే ప్రథమాశ్వాసాంత్యమున గృతీశ్వరుని హృదయరంజన కై మాలిని వృత్త ప్రయోగము చేయుటయందును, నాతనికి కవిత్రయవిషయకమైన భక్తి వ్యంజితము.

మాలిని : (1-142)

జనిత మహితసంధా దారుసాహిత్య గంధా
వినతయనయ విలాసా విద్వదంతర్నివాసా
ఘనతరమదగర్వ గ్రంథిభారానమద్దు
ర్జనహృదయభల్లా రాయచౌహత్తమల్లా.

పైన పేర్కొనబడిన మాలిని వృత్తము పూర్వాపర ఖండసమఖండాంతమైన యనుప్రాసకు జక్కని యుదాహరణమై, పూర్వేలక్షణ సమన్వయ దృష్టి విలసితమై, కృతికర్తృ హృదయ సంవేద్యమానమై, నిజహృదయ వర్తిత భావోపలక్ష్యమానమై యలరారుచున్నది.

4 మత్తకోకిల :

పాదమునకు బదునెనిమిది యక్షరములు.

గణములు : ర స జ జ భ ర. 10 అక్షరముల మీద యతి. ఇది మిశ్రగతిని నడచునట్టిది.

"స్తవనము, ఉపదేశము, కథనము, వర్ణనము, సంభాషణమున బెక్కు తెలుగుల నీ వృత్తముపయుక్తము" (పుట 845)[6] అని శర్మగారు పేర్కొనిరి.

కవిత్రయము వారు - 47 మత్తకోకిలలను, మారన రెండిందిని, జైమిని భారత కర్త గ్రంథము చివరమాత్రమే కృతిభర్తను స్తుతించు సందర్భమున ఒకదానిని వ్రాసిరి. ఈ మత్తకోకిల గ్రంథమునందలి చివరి వృత్తము.

స్తవనము, వర్ణనము - మున్నగువానికై దీనిని వ్రాయవచ్చును కాన, నీ కవి నరసింహరాయల నుతించుటకై రచించి శిల్పమర్యాదను బాటించెను.

గ్రంథము సంపూర్ణముగా వ్రాసిన పిమ్మట మధురభావావేశమున పీరభద్రుని హృదయము త్వరితగతిని దానిని భర్తకు ( రాయలకు ) సమర్పించ నున్నట్లి విశేషవృత్తము తెలియపరచుచున్నది.

వీరరసప్రధానమైన ఈ ఇతిహాసము నందలి చివరి వృత్తముగా దీనిని వ్రాయుటలో వీరభద్రుడు పూర్వపు కవుల శిల్పమర్యాద ననుసరించుటయును, విశేషవృత్తములను వ్రాయుటలో నేర్పును, నౌచిత్యమును, బాదించెననియు గ్రహింప వీలగుచున్నది.

స్తుతి ప్రీతిని గల్గించును. ఇట్టి స్తుతిని వీరవరుడైన సాళ్వ నరసింహ రాయలకు గృతి కర్తృత్వ మొసరించుటలో నెన్ని విశేషణములను వాడవలెనో, నన్నియును నుపయోగించియున్నాడు. ఇది సంబోధనా బహుళ మగుటయు సమాస బహుళమగుటయు, రూపకాద్యలంకార సహితమగుటయు, నుచితరీతిని రాయల గుణౌచిత్యమును గ్రంథాంతమున సరసముగ వర్ణించుటకు హేతువైనది.

ఆ మత్తకోకిల నీ క్రింద గ్రహింపవచ్చును

శర్వరీశకులావతంసయశః ప్రతాపవిభూషణా
గర్వితాహితరాజ మీసరగండ భీకరవిక్రమా
పూర్వవిశ్వవసుంధరాభృదపూర్వ దిక్తటహారకా
నిర్విశేషవిషానుబంధుర నిత్యసర్వగుణోదయా. (8-222)

5. పృథ్వి :

17 అక్షరములు. - జ-స-జ-స-య-లగ- గణములు. 12 వ అక్షరము యతి.

దీనిని సంస్కృతాంధ్రకవు లెల్లరును 'పృథ్వీ' యనియే వ్యవహరించిరి ఈ వృత్తము హ్రస్వముతో నారంభింపబడినను, యతిస్థానము మాత్రము దీర్ఘమై యుండును.

"దీని స్పందన మత్యుత్కటోత్సాహము బొందిన హృదయమువలె నెగిరి గంతు వైచినట్లుండు"నని డాక్టర్ మాధవశర్మగారు పేర్కొనిరి.[7]

ఎనిమిదాశ్వాసములు గల జైమిని భారతములో రెండాశ్వాసములు పూర్తి యైన పిమ్మట పృథ్వి వృత్తము రచించబడినది. అదియును గ్రంథస్వీకర్తయగు నరసింహరాయల నుద్దేశించియే. ఇట్లు కృతిస్వీకర్త నుద్దేశించి పై వృత్తము వ్రాయుటలో పినవీరన నన్నయ ననుసరించినట్లు ద్యోతకము. భారతము నందున్న ఐదు పృథ్వి వృత్తములను గవిత్రయాద్యుడైన నన్నయయే వ్రాసి

నాడు. అట్టి వానిలో నొకటి యరణ్యపర్వ ద్వితీయాశ్వాసాంత్య భాగమున రాజ రాజును స్తుతించినట్టిది. వీరభద్రుడు జైమిని భారతములో మొదట "మా నన్నయభట్టు" (1-6) అని పేర్కొనుటలో నిదియు నొక్క తార్కాణమని దిఙ్మాత్రముగ నూహించవచ్చును. అంతియేగాక, సంస్కృతకవుల వలెను, ఎఱ్ఱన రచన వలెను, నీతడు 9-వ అక్షరమును యతిగా వేసినాడు.

"సమస్త మహిమాశ్రయా జనిత సారలోకాశ్రయా"
ఎఱ్ఱన...... (ఆ.న.పు ౬-164)

పృథ్వి :

బుధావన పురూరవా భుజగజిద్భుజాభైరవా
విధావితమదాహిత ద్విపదమూప కి.రీరవా
సుధాకర నిధానరాట్సుర మహీజ దానప్రథా
విధాయి గుణగౌరవా బిరుద ప చ ఘంటారవా (1-117)

సవనాశ్వ గ్రహణము. యౌవనాశ్వాదుల జయించుట వంటి భాగములు పూర్తియైన పిమ్మట యాగారంభము జరిగినది. ఇట్టి భాగములు పూర్తియగుటకు గారణమైన నరసింహరాయల నుద్దేశించి పై వృత్తము రచించుటలో వీరభద్రుని హృదయమున నుత్సాహము వ్యక్తమైనది.

## 6. మానిని :

పాదమునకు 22 అక్షరములు.

గణములు . భ - భ - భ - భ - భ - భ - భ - గ

12 అక్షరముల మీద యతి.

6-12-18 అక్షరముల మీద యతులు

(భ గ ణ సప్తకముపై నొక్క గురువు - మానిని)

జైమిని భారతమందు ఈ వృత్తము వీరభద్రునిచే నొక్కమారే వాడబడెను. అదియు నాశ్వాసాంత్యముననే ప్రయోగింపబడినది

కవిత్రయములో నన్నయ - రెండు మార్లును, తిక్కన - మూడు మార్లను వాడిరి. కాని వారు దీని నాశ్వాసాంత్యమున బ్రయోగించలేదు.

వీరభద్రుడు దీనిని వ్రాసి 6, 12, 18, అక్షరముల మీద యతులను వేసెను. యతిత్రయ సహితమై, షణ్ణవసుగతమైన యథార్థత కొరకే ఈ వృత్తముపలక్షించబడినది. నరసింహరాయలు వీరత్వము, శత్రుంజయత్వ గుణము, లక్ష్మీవైభవము, మన్మథ విలాసము గల్గి భూదేవిని లాలించినట్లును దీని భావము. కవి ఈ సందర్భమున స్వతంత్రుడగుటయు, చిత్రవిచిత్ర గుణ సముపేతత్వము (కృతిభర్త యందు) నపేక్షించుటయు నిర్దిష్ట మానిని వృత్తము వాడుటకు గారణము. "లాలిత భాస్వదిళా మహిళా" యని సంబోధించుటయు - లాలితమై, ప్రకాశించు భూదేవి యను స్త్రీ - మానిని వృత్తమున వర్ణింపబడుట నామసార్థక్యమునకు గారణము, వృత్త నామౌచిత్యమునకు నాశ్రయమును నగుచున్నది.

మానిని : 4-146 జై. భా.

> మీసరగండ సమీహితవైరి సమీక జయాతి సమిద్ధయశో
> వాసితవాసవవహ్ని యమాసురవార్ధిపసన్నరవాహభవా
> వాసవిలాసనివారిత మన్మథ వారిజభూనిభ వాగ్విభవో
> ల్లాస వికాస కళామృగలాంఛన లాలిత భాస్వదిళామహిళా.

7. ఉత్సాహ : జాతివృత్తము

> ఏడు సూర్య గణములపై నొక్క గురువు
> 5 - వ గణము మొదటి యక్షరము వళి.

ఆంధ్ర మహాభారతమున నన్నయ సభాపర్వ ద్వితీయాశ్వాసాంత్యమునను, అరణ్య పర్వములోని ప్రథమాశ్వాసాంత్యమునను రాజరాజస్తుతికై ఈ వృత్తమును వ్రాసెను. తిక్కన వ్రాసిన యేడు వృత్తములలో 'గల - న' గణముల సమ్మేళనము గలదు.

వీరభద్రుడు వ్రాసిన ఉత్సాహ వృత్తము నీ క్రింద చూడనగును :

ఉత్సాహ : (8-129)

> మానినీమనోజ వర్ధమానమానుషక్రియా
> నూనలబ్ధజయరమావినోద నిత్యవైభవా
> దీనసర్వశాస్త్ర విత్సుధీనిధాన పంచమం
> టానినాదబిరుద రిపుకటారిపక్షిసాళువా,

ఎల్లప్పుడును లభించిన జయలక్ష్మిని గూర్చి వినోదించును, నిత్యవైభవయుతుడై, సర్వశాస్త్రముల నెరిగిన విజ్ఞుడై 'పంచఘంటానినాద' బిరుదవహుడై శత్రువులకు సాళువమని వర్ణించబడిన పై యుత్సాహ వృత్తమున మూడు న-గణములు మాత్రమే వాడబడి, పద్యము మందగతియున్నది. ఇందు రెండవ పాదమున నొకటియు, నాలుగవ పాదమున రెండు నగణములు గలవు. తక్కిన వన్నియు గలగ్గు సూర్యగణములే

యుద్ధమునందు దెల్లెడల జయలక్ష్మిని వినోదింపజేసినవా డనుటలో సాళ్వ నృసింహుని బలవీరము, యుద్ధవీరము, ద్యోతకములు నిత్యవైభవా- అనుటలో ఐశ్వర్యవీరము, సంపద్వీరము, స్త్రీలకు మన్మథుడనుటలో రూపవీరము, 'సర్వశాస్త్రవిత్సుధీవిధాన- యనుటలో విద్యావీరము, లేక పాండిత్యవీరము మఱియు జ్ఞానవీరము, ''పంచఘంటానినాద బిరుద'' యనుటలో యశోవీరము, 'రిపు కటారి పక్షిసాళువా' యనుటలో బలవీరము- వ్యక్తమగుచున్నవి. వీరరసవ్యంజకమైన ఈ యుద్ధగ్రంథమునకు గ్రంథస్వీకర్తృత్వము వహించిన నరసింహరాయనికి గల గుణములను ప్రవర్తింపజేయుటయే గాక, కవి నిజచిత్తస్థిత యుత్సాహము నీ యుత్సాహవృత్తముచే ప్రస్రవణ మొనర్చెను, వృత్తసార్థక్యమును సాధించెను.

ఈ పద్యము మధ్యగతియందు సాగుటలో ప్రసాద, మాధుర్య గుణములట వ్యంజింపబడుచు మృదుమధురమగు కవిచిత్తవృత్తిని దెలుపుచున్నవి. వీరరస స్థాయిభావమైన యుత్సాహము పద్యమునందలి- గల- బాహుళ్యముచే ద్వారాన్వితమైన కవి చిత్తవృత్తిని వ్యంజించుట కుపయుక్తమై, యుత్సాహమైనది. ఈ పద్యమునందలి చివరి సంబోధన రూపకాలంకార ప్రోక్తమై, సాలంకృతమై, సమవేగముతో సాగినది. బహువిధ గుణ గరిష్ఠుడైన కృతికర్తను వర్ణించుటలో కవి యుత్సహించిన తీరు ఈ యుత్సాహ వృత్తముచే దేట తెల్లమై సార్థకస్థితిని బొందుట ఈ వృత్తరచన యందలి విశేషము.

నన్నయ రాజరాజును వర్ణించినట్లే, ఈ కవియు నుత్సాహ వృత్తమునందే కృతికర్తను గీర్తించుట మరియొక విశేషము.

### 8. తోటకము :

పన్నెండక్షరములు.
గణములు : స-స-స-స-
8 అక్షరము౯ మీద యతి

సగణము ఉత్సాహవ్యంజకము పటుభావములను వ్యంజించు నొక భావ సంచలనమును సృష్టించుగతిలో నడచు వృత్తము.

ఆంధ్రమహాభారతమున మూడు తోటక వృత్తములు గలవు. ఇందు నన్నయ రాజరాజును సంబోధించుచు నొక్కటి వ్రాసినాడు. ఆదిపర్వ ప్రథమాశ్వాసాంత్యమున నిది గలదు. నన్నయ మార్గానుసారియగు వీరభద్రుడును దీనిని నరసింహరాయల సంబోధించుటకే వ్రాసెను.

జలధిద్వితవామణిభాలలితాం
చల సంకుల కీలిత శత్రుకుల్య
త్కులహృద్వని తర్కవిదాయి ఝుశం
ఝుశనాశపదాంగద సన్మపదా.

(6-278)

ఈ వృత్తమున నాలుగు పాదములును సమముగ నడచుచున్నవి ఇది తాల లయాన్వితమైనది. సమగతిలో నడచు నీ వృత్తము, నరసింహరాయల శత్రుంజయత్వ గుణమును, పాలనను సమమైన రీతిలో నెరపెడి వా డనుటకు దృష్టాంతమై యున్నది వృత్తౌచిత్య శిల్ప ప్రదర్శనమున నీ కవి పూర్వుఁడైన నన్నయ ననుసరించెనుట విశేషము.

### 9. స్రగ్విణి :

అక్షరములు ప్రతి పాదమునకు పన్నెండు.
గణములు : ర - ర - ర - ర
యతి : ఆరక్షరముల మీద నుండును

"ఉద్విగ్న చిత్తమును మందీకరించి ప్రసన్నమొనర్చును సమగతియైన వాక్య శ్రవణము శ్రోతచిత్తమున సమతను ప్రతిష్ఠింప సమర్థమగును." అని ఛందఃశిల్పకర్త యభిప్రాయము

భారతమునగల రెండు స్రగ్విణీ వృత్తములలో నొకటి యారణ్య పర్వ పంచమాశ్వాసాంత్యమున రాజరాజును నుతించుచు నెత్తన వ్రాసినట్టిది. పినవీరన కూడ ప్రబంధపరమేశ్వరునే యనుసరించి పంచమాశ్వాసము చివర నరసింహ రాయల నీ వృత్తమునందే నుతించినాడు ఈ యనుసంధానము మిగుల నుచితము.

స్రగ్విణి : (5-206) :
రాజవంశాగ్రణీ రాజచూడామణీ
యాజిలక్ష్మీ కరోదద్విలాప క్రియా
వీజనాకార పృథ్వీ వరాహాంకభృ
ద్వైజయంత్యంశుకోద్వృత్తితారాంశుకా

పంచమాశ్వాసాంతమున వీరభద్రుని గంటమున నొక యుద్వేగ ఘట్టము ప్రవర్తిల్లినది అదియే స్రగ్విణీ వృత్తమైనది షష్ఠాశ్వాసమున శ్రీరామ చరితము వర్ణింపబడవలయును అందు లవకుశులు రామునితో యుద్ధమొనర్చు ఘట్టమున్నది. పంచమాశ్వాసమున నర్జున, బభ్రువాహన యుద్ధ ఘట్టమున్నది ఈ రెండు జంటలలోని వీరుల యుద్ధగతి సామ్యమిట వీరభద్రుని హృదయమున నుత్సహించి స్రగ్విణీ వృత్తరూపము బొందినది ఈ రెండు వృత్తాంతముల కును పంచమాశ్వాసాంత్యము సంధిస్థితి యగుచున్నది ఇట్టి సంధికాలములో స్రగ్విణి వృత్తము వాడి, సమగతి వాక్య శ్రవణమున నరసింహరాయల ప్రతాపమును శోధించినాడు ఈ వృత్తమునకు ముందున్న పద్యములలో యుద్ధములు బహుళముగ వర్ణితమైనవి ఆ యుద్వేగము నీ వృత్తము మందగించుచు, శ్రోతలను, పఠితలను వారి చిత్తస్థితమైన ఉద్వేగము నుండి పరాఙ్ముఖులను గావించుచున్నది. ఈ పద్యమును రచించిన వీరభద్రుడు ఛందౌచితిని పాటించెననుట కిది వేరొక్క తార్కాణ మగుచున్నది

### సామాన్య వృత్తములు - జైమిని భారతము :

విశేషాంశ సందర్భములందు విశేషవృత్తములను వాడినట్లే, కథాకథన సందర్భమునను, సంభాషణల యందు, వర్ణనాదులయందును జైమిని భారత కర్తయైన వీరభద్రుడు కొన్ని సామాన్య వృత్తములను గూడ వ్రాసియున్నాడు.

ఈ సందర్భమున శార్దూల విక్రీడితము, ఉత్పలమాల, చంపకమాల, ఆట వెలది, తేటగీతి, సీసము, కందము వ్రాయబడినవి. ఈ వృత్త ప్రయోగము, వాని యౌచిత్య మిట పరామర్శింపబడినవి

1. శార్దూల విక్రీడితము :

ఆరోహణాత్మక విలంబనము శార్దూల వృత్త లక్షణము.

వీరభద్రు డీ వృత్తమును 66 మార్లు ప్రయోగించెను.

ప్రప్రథమమున నిది యిష్టదేవతాస్తుతికై గ్రంథారంభ పద్యముగ వాడబడెను. 'మ' గణముతో ప్రారంభమైన ఈ పద్యము శుభసూచకము, శుభార్థము, శుభావహమునై వ్రాయబడినది. (ప్ర. ఆ. పీఠిక - 1)

అట్లే తా నీ కావ్యమును చంపూ కావ్యముగ నొనర్చెదనని చెప్పుకొను పట్ల పీఠికలో కూడ వ్రాసెను. (ప్ర.ఆ. పీఠిక - 10)

కృతిపతియైన సాళ్వనరసింహరాయల వంశవర్ణనా సందర్భమునను రెండు పద్యములు రచించినాడు (1-29), (1-89); అట్లే ప్రథమ, తృతీయ, సప్తమ, అష్టమాశ్వాసాంత పద్యములుగ సాళ్వనరసింహరాయల శౌర్య పరాక్రమాది గుణ వర్ణనకై వీరభద్రుడీ వృత్తము నుపయోగించుకొనెను.

(1-140) (8-127) (7-288) (8-220)

(1) వ్యాసభక్తి .

ఈ కవికి వ్యాసుని యెడల గల భక్తి బహుళమైనది.

శా. చేదోయిన్ ముకుళించి పీడుకొనె నక్షీణప్రమోదంబునన్
వేదవ్యాసుఁ బ్రసాదభాసురవచోవిన్యాసు నంహస్సము
త్సాదాధ్యాసు సుధీవిలాసు నుతవిద్యావ్యాసుఁ బ్రజ్ఞాకళా
సాదజ్ఞానసముల్ల సచ్చిదమృతాస్వాదోదితోల్లాసునిన్. (1-104)

ఈ పద్యము గుర్వక్షర బహుళమునై, దీర్ఘ సమాసములతో నోజోదీప్తి గాంచినది.

ఈ వృత్తము నుపయోగించుటలో కవికి ఫలాపేక్ష గలదు. 1. స్వకీయమైన మనోరంజనము. 2. చిత్తభేదము గల్గిన యుధిష్ఠిరుడు, వ్యాసగతమైన భక్తి నీ వృత్తమున చెప్పుట కవి దృష్టిలో ధర్మజునకు చేతోశాంతి గల్గునను భావము.

(ii) నగర వర్ణన :

రెండవ యాశ్వాసములో శ్రీమవృషకేతులు యౌవనాశ్వుని భద్రావతీపుర మును జేరిన సమయ సందర్భములందు వారా నగరమును గాంచిన తోడనే వారి హృదయములు రంజిల్లినవి. ఆ నగర భోగమును కవి వర్ణించిన రీతి దీర్ఘసమాస బహుళమై యోజోగుణ దీప్తిని గల్గించుచు, చిత్తకాంతిని వారికే గాక, ఎట్టివారి కైనను బొందించుననుట యతిశయోక్తి గానేరదు.

నానాపక్వ ఫలాతినమ్రతరుసంతానంబులన్ విస్ఫుర
న్నానాపుష్పలతాప్రతానములు నానాపక్షిరావంబులన్
నానావర్ణమృగప్రచారముల నానా కేళికుంజంబులన్
నానాభంగి నుతింప నొప్పుఁబురి నానాభోగసంపన్నతన్.

(ఆ 2 - ప. 6.)

(iii) ద్వంద్వయుద్ధ వర్ణన :

దంద్వయుద్ధవర్ణమున వీరభద్రుడు తనకు దానే సాటియని నిరూపించు కొనుటకు నీ క్రింది పద్యము నుదాహరణముగా గ్రహింపవచ్చును.

ఈహం బూఁచి పెనంగఁ జొచ్చి రపుడయ్యేకాంగవీరుల్ జయో
త్సాహంబుల్ వదనంబులం బొదల మాద్యచ్చండ గర్వోద్ధత
వ్యాహారధ్వను లుద్భవిభ్రమములన్ వారింప నొక్కుమ్మడిన్
బాహాబాహిఁ గదాకదిం దొడరి ప్రాబల్యంబు తుల్యంబుగన్ (2-84)

సువేగభీమసేనుల ద్వంద్వయుద్ధమిట బరాకాష్ఠనందుకొనుటకు నిరూపణ ముగా రెండు సంస్కృత సమాసములను వాడుటయే గాక వారి యుద్ధ ప్రాబల్యము తుల్యంబుగా నున్నదని వాచ్యముగా పేర్కొనబడినది. ఇద్దరు వీరులును జయముతో గూడిన ఉత్సాహమును బొంది, చూపరుల కౌతేయంగమా యను సందేహమును గల్గించు రీతిని రణతుల్యతను బ్రదర్శించినారు ఈ సందర్భమున స్వరయతి వాడ బడినది. వీరరస స్థాయిభావమైన యుత్సాహ మిట తారస్థాయి నందుకొనినది.

(iv) యుద్ధ వర్ణన :

యుద్ధమును స్పష్టముగా గన్నులతో జూచినట్లు వీరభద్రుడు వర్ణించు టను మరొక్కమారు శార్దూల వృత్తమునందే మనము దర్శింపవచ్చును. ప్రద్యుమ్ను నకును, నర్తన సూతియైన బభ్రువాహనునకును జరిగిన రణవర్ణన మీ ఘట్టము :

తత్సేనానివహంబు నుద్ధతబలోత్సాహంబునం బూతనా
జిత్సూనుండు కఠోర సాయకములం జెండాడ నాపుంఖవి
ద్ధోత్సేధోగ్రకబంధ కంఠబిలనిష్ఠ్యూతాస్రధారామిళ
న్మృత్సాకర్దమదుర్దినం బగుచుఁ గాన్పించెన్ రణంబయ్యెడన్. (6-191)

ఇచట 'పూతనాజిత్సూనుండు'- అను మాట సార్థకంబుగా ప్రయోగింపబడి, శ్రీకృష్ణ కుమారుడైన ప్రద్యుమ్నుడనుటకు బర్యాయ పదముగా గాక, వ్యంగ్య ధ్వనిని జూపుట కుపయుక్తమైనది. 'కాన్పించెన్' అను పదమును కవి వాడి, తన యభిప్రాయ మితరులకును దెలియపరచినాడు.

(V) వాల్మీకి నుతమైన శ్రీరాముని వర్ణనము:-

షష్ఠాశ్వాసమున లవకుశులతో శ్రీరామాదులు యుద్ధమును చేయుటను వీరభద్రుడు వీరరస వ్యంజన కొక యగ్నిపరీక్షగా భావించినాడు. బలవీర (యత్నవీర), యుద్ధవీరములను సద్యస్ఫూర్తి నొనరించినాడు మూర్ఛిల్లిన రామవిభుడు తేరుకొనిన పిమ్మట వాల్మీకి రాముని వర్ణించిన సందర్భమునందలి సమాసములును, ప్రయుక్తమైన యలంకారమును రాముని గొప్పతనమును వర్ణించుటకు రచించనైనవి

మృద్వైగుణ్యము కుంభకారఘటనోన్మేషంబునం బోలెఁ ద
త్తద్వేళం దిలకించు నీభువనసందర్భంబు నీచేత రా
గద్వేషాదులు నిన్నుఁ బొంది నిజంబుగా నేర్పునే నీవు సా
క్షాద్విష్ణుండవు సీత లక్ష్మి నిగిమోక్తంబుల్ భవత్కృత్యముల్.
(6-249)

సంయుక్తయతి విరమణమున సీతారాములు సంయుక్తులనియు, రామగత మైన మూర్ఛ తాత్కాలికమనియు, సంయుక్తులగు సీతారాములు వియుక్తు లౌ కారనియు గ్రహింపబడుటయే సంయుక్త విరామము ప్రయుక్తమగుటలో స్పష్టము. యతి నామసార్థక్య మిట వర్ణింపబడి కవితాఛందశ్శిల్ప పారమ్యము నకు నిది యొక మచ్చుతునకగా భాసింపజేయబడినది.

(vi) కరుణరస స్పందనము :

కరుణరస మొలుకుటకును తత్సంబంధమైన చిత్త స్పందనముకును, నట్టి స్పందనకు గారణమై స్థాయిభావరూపమునకున్న శోకమును బ్రత్యక్షీకరించుటకును శార్దూలవృత్తము ప్రయోగౌచిత్యమును వహించుననెడి సత్యమును నిరూపించుటకు కవి సప్తమాశ్వాసమున బభ్రువాహనుడు సవ్యసాచితో రణమొనర్చి యాతనిని మూర్ఛనొందించిన కారణముగా నులూచీ చిత్రాంగదలు విలపించిన ఘట్టమున శార్దూల విక్రీడితమున వర్ణించుట శోకము నుద్దీపించుచున్నది

నేఁడ్ గాలినహారవల్లికలు ఖండీభూత పాటీర దూ
ర్వాలాజాక్షత హేమపాత్రికలుఁ బ్రభ్రష్టార్ఘ్య నీరాజన
జ్వాలాకోరకితాంగణంబులు ననిశ్వాసంబునన్ భూవిభుం
డాలోకింపుచు పన్న కన్గొనియె శోకాక్రాంతలం దల్లులన్. (7-63)

నిత్యసమాసయతి చివరి పాదమున నుపయుక్తమై, భార్యాభర్తల సంబంధమును దెల్పుచు, భర్తృమరణము భార్యకు శోకముద్దీపకమను సత్యము నిత్యమనుటకును, ప్రయోగవైచిత్రికిని గారణమైనది. ఈ విధముగ వీరభద్రుని రచన ఛందశ్శిల్ప మర్యాదను, నామసార్థక్యమును వెలార్చుచున్నది. అట్లే రసానుకూలమైన ఛందము లెట్లెట్ల ప్రయుక్తములగుటకును నిది నిదర్శనము.

"గుర్వక్షరములై 'ఆ'కారరూపములైన నృపాదుల శౌర్యస్తవములందు ప్రయోగింపనర్హము''లను క్షేమేంద్రుని యాశయమునుగూడ వీరభద్రుడు సార్థకము గావించి యాశ్వాసాంత్యముల వీనిని వాడెను.

వీరభద్రుని రచనలో శార్దూల విక్రీడిత వృత్తములు సమయస్ఫూర్తితో, రసవ్యంజకములై, పాత్రౌచిత్యమునుబట్టియు, కరుణ, స్తుతి, యుద్ధ, ద్వంద్వయుద్ధాదుల కౌలకును వాయువకు తేజోమయమైన శిల్పఛందము ప్రదర్శింపబడినది.

**2. మత్తేభవిక్రీడితము :**

ఈ వృత్తము నీ కవి 114 మార్లు వాడినాడు. శార్దూల విక్రీడిత వృత్తమున కీవృత్తము రెండింతలుగ వ్రాయబడినది.

(1) ఇష్టదేవతాస్తుతి - లంబోదర వర్ణనము :

తొలుమ్రొక్కుల్ గొనువేల్పు, గొల్తు శశభృత్కోటీరు, గోటీరట
త్కలధౌతాంకితగాత్రు గా త్రమరసంఘస్తోత్రవేళా నిర
ర్గళ ధారాళ కట ప్రదానతటినీ రంగ ద్విరేఫాళితా
కలికాలోలవిహారు జారుహరిభృ త్కాంబు లంబోదరున్. (పీఠిక-4)

గంభీరద్రవ్యగుణ క్రియావర్ణనమునందు దీనిని వాడవచ్చును. అమర సంఘముచే స్తోత్రము చేయబడినాడనియు, కాంతివంతములైన భూషణములచే నలంకృతమైన వాడనియును, దానధారలకై చుట్టుముట్టిన తుమ్మెదలు గల్గిన యేనుగు తుండము గలవాడనియు, గవి లంబోదరుని వర్ణించుచుండ నాతని గాంభీర్య గుణమును నందును నాతని దానధారలకు గల ప్రత్యేకత చూపబడినది. వరముల నొసగువాడు, విఘ్నముల దొలగజేయువాడు నగు విఘ్నేశ్వరుడు దేవతలకు గూడ పూజనీయుడు. ధార యనగా పరంపర. దానపరంపరల నొసగుచున్న వాడను వ్యంగ్యభావార్థమిట స్ఫోరకము. ఇట ప్రాసమైత్రి ప్రాస ప్రయుక్తమై భగవంతునికి, భక్తులతో గల సంబంధ మిట ద్యోతకమగుచున్నది. ల-ళ లకు గల పరస్పర ప్రాసమైత్రియే జీవాత్మ - పరమాత్మలకు గల సంబంధము. ఇచట లంబోదరుడు పరమాత్ముడు. కవి జీవాత్మ. మొదటి మ్రొక్కు లాయనకే యను గంభీరోదాత్త భావవర్ణన మిట వివృతము. అట్టి భావము ఛందశ్శిల్ప సంబంధియైన యౌచిత్యమును దెల్పుచున్నది.

(11) రౌద్రరస మున్నిద్రస్థితియందు జూపుట : 2-56.

తనపై వచ్చు విరోధిసైన్యముల నుద్యద్బాణజాలంబులన్
దనువుల్ సించియు నశ్వసంతతులగాత్రంబుల్ విభేదించియున్
ఘనదంతావళ కుంభకూటముల ముక్తాశ్రేణులన్ రాల్చియున్
దిననాథాత్మజసూతి రౌద్రరస మున్నిద్రస్థితిన్ జూపుచున్.

ఇందలి మూడవపాదము దీర్ఘసమాసావృతము యౌవనాశ్వుని సైన్యముల వృషకేతుండు ముక్కలు ముక్కలుగ ఖండించి మడియజేయుట యిందలి వస్తువు. దినవాథాత్మజుడు కర్ణుడు. వృషకేతు డాతని సూతి. లోకమునకు దినకరుని కిరణజాలము సహింప వీలుకానిది. ఆ సూర్యభగవానుని రౌద్రస్థితమైన వీర్య శక్తియే కర్ణుని బరమ శక్తిమంతునిగ భారతమున నిల్పినది కాని జైమిని భారతము నందు గర్ణుని వీర్యశక్తి వృషకేతునిలో గలదు. రౌద్ర రసాధిదేవత రుద్రుడు స్థాయిభావము క్రోధము అట్టి క్రోధముచేత వృషకేతుడు యుద్ధము నందు ప్రళయకాల రుద్రునిఁ బోలె. దినవాథాత్మజసూతియై నేఁడి యౌవనాశ్వుని దీకొనినాడు. ఆతని యుద్ధమున దినవాథుని రౌద్రస్థితి సువ్యక్తమైనది. అతః పూర్వము పఱకును నిద్రాణమైయున్న రౌద్రమున్నిద్రమైనది సూర్యశక్తియే వృషకేతునియందు నిబిడీకృతమై యవసరకాలమున వ్యక్తమైనదర్శనమిచ్చినది.

వర్గయతిలో యతిమైత్రిని సాధించిన కవి, వృషకేతుడు సూర్యకుటుంబము లోనివాడనియు, నదే వర్గములో సంజాతుడనియు దెల్పుటకే ఈ వర్గయతి నుపయోగించినట్లు గ్రాహ్యము.

(111) ఒకే సమాసముతో గరుత్మంతుని వర్ణించుట

( గాంభీర్యగుణ కథనము )

ఈ పద్యములో సుదీర్ఘమైన యొకే యొక సమాసము వ్రాయబడి, సంయుక్తాక్షరయుతమై, ద్విత్వాక్షరయుతమై విరాజిల్లినది

అరుదెంచెన్ వినతాతనూజుడు సముద్యత్ప్రావృడారంభని
ర్భరజీమూత ఘటాంతరాళ విచలద్రాఘిష్ఠ విద్యుల్లతా
పరిపంథి ప్రథమానదీధితినటత్పక్షానిలాఘాత జ
ర్జరితోడ్డీనకులక్షమాధర దృషజ్జుంపాకళాసంపదన్ (5-79)

మహాప్రాణాక్షర సంస్థితమైన ఈ వృత్తమున శ్రీకృష్ణుడు తన వాహన మైన గరుత్మంతుని యూహించుటయు, ప్రబలశక్తియుతుడైన యా వినతా తనూజుడు తన స్వామియైన శ్రీకృష్ణుని యొద్దకు వాయువేగ మనోవేగములతో వచ్చెననుట కవి యూహించిన యుత్ప్రేక్ష. వాయువు మహాబలుడు, గరుత్మంతు డును మహాబలుడే. ఒక్కమారుగ వచ్చిన మేఘముల కదలికలో ప్రవర్తిల్లిన

మెఱుపు కాంతిచే గరుత్మంతునికి, ఆయన పక్షముం వీచనచే విరాజమానమైన వాయువు పర్వతములను సైతము కదల్పునట్టిది ఈ సుదీర్ఘసమాసము, మహా ప్రాణాక్షర సువ్యవస్థితమై యాతని బలసంపన్నతను ప్రకటించినది. ఓజోగుణ మిట వ్యంజింపబడి, కైశికీవృత్తిని సాధించినది ఇచట వక్త కవియే. మత్తేభము వలె నీ పద్యములోని మహాప్రాణాక్షరములు విజృంభించినవి. గరుత్మంతుడును శ్రీకృష్ణుని యొద్దకు విజృంభించి వచ్చుటకే మత్తేభవృత్తము సార్థకప్రయోగ మైనది. ఎంత విజృంభణ మొనర్చినను, గరుత్మంతుడు తాత్కాలికమైన యావేశమును బాపుకొని శ్రీకృష్ణుని వాక్యముం మూదల దాల్చుకొని యాచ రించుటలో, మత్తేభమునకు సరియైన శ్రీకృష్ణుని ఎంటి మావటీడు కావలయునను భావము నూహించుటకే కవి ఈ వృత్తౌచిత్యమును జూపి గంభీరగుణప్రియా వర్ణన మొనర్చినాడు

(IV) ఆశ్వాసాంత పద్యములలో కృతికర్తను గీర్తించుట .

కరుణాపూరితనేత్ర దారుణరణక్ష్మానిర్భరక్షాత్ర బం
ధురసాంద్రదుమచైత్ర నిర్దళితశత్రుక్షేత్ర రామాతిరూ
వరచారిత్ర నిరంతరోత్సవరణద్వాదిత్ర రామాసము
త్కరసమ్మోహనగాత్ర విశ్వజగదేకచ్ఛత్ర భాగ్యోన్నతా. (5-204)

ఈ పద్యము నాతిదీర్ఘ సమాస సహితము, బహుళములైన తకార, రకార సమ్మేళనము, విపులములైన సంయుక్తాక్షర ప్రదీపనము, గ్రంథ స్వీకర్తృ గతమైన యుదాత్తతను, విలంబితగతిని వ్యక్తము చేయుచున్నది. ఈ విధమున మధురగుణ కీర్తనమునకు నిది చక్కగా నుపయోగపడి, యక్షరాశ్రిత శిల్పము నుద్బోధించుచున్నది.

(V) ఆశ్వాసాంత పద్యములలో నొక్క చమత్కారము :

ప్రమదాస్వాంత నిశాంత కాంతనవ శౌర్య ప్రౌఢిమాభోగభో
గమరుద్రాజసమాన మానకలనా కౌరవ్య రవ్యగ్రజ
న్మమనోజ్ఞ స్మృతిమార్గ మార్గణ కుటుంబ స్థైర్య సంకల్ప క
ల్పమహీజ ప్రతిమానదాన సుషమా భాస్వత్కరాంభోరుహా. (2-115)

ద్వితీయాశ్వాసాంతమునందలి పై పద్యమున గొన్ని సంయుక్తాక్షర యుత సమాసములు ప్రకటితములు. ఒక సమాస మే పదముతో నంత్యమగుచున్నదో, దాని వెంటవచ్చు మరియొక సమాసము, పూర్వపు సమాసము నందలి చివరి పదముతో నారంభమైనది. ఇది విచిత్రము. చివరిది సుదీర్ఘమైన సమాసము. ఈ గ్రంథములోని యాశ్వాసాంత్య పద్యములన్నింటను నిదియే వైచిత్రిని ప్రదర్శించునది. ఇది సంబోధనాత్మకము. ఈ వృత్తము వీర, రౌద్రములంతే కాక పలు విధములుగ విక్రీడించు ననుట కిది చక్కని యుదాహరణము.

(vi) వీరభద్రుడు చేసిన భోజన వర్ణనము : 6-92

కలమాన్నంబును నొల్పుఁ బప్పు ఘృతమున్ గజ్జంబులుం బిండివం
టలుఁ బాసెంబులు నానవాలు ఫలముల్ నానావిధవ్యంజనా
వలులున్ రాజత పాత్రలన్ మునిసతుల్ వడ్డింప వాల్మీకి బం
తులు సాగింపఁగ నారగించిరి మునీంద్రుల్ షడ్రసోపేతముల్.

మునీంద్రులతో గలసి వాల్మీకి చేసిన భోజనమిద్ది. రౌద్ర, వీర రసాది వర్ణన మాత్రమే గాక భోజన వర్ణనము కూడ మత్తేభమున రచించబడినది. ఈ వృత్తమున లకార-నకారములు బహుళమై యక్షరార్పనకు దావిచ్చినవి.

(vii) ఉదాత్తకవి వర్ణనమున నీ కవి సంస్కృతము నందలి-వాల్మీకి, వ్యాస, కాళిదాస, బిల్హణ, బాణ, మయూర, శుక, భవభూతి, శివభద్ర, మల్హణ మంటామాఘ, చోర, భారవి-కవులను, తెలుగులోని నన్నయ, తిక్కన, ఎఱ్ఱా ప్రెగడ, నాచన సోమన - కవులను మత్తేభవృత్తమున నుతించెను. (పీఠిక-6)

ఇట్లీకవి సంతరించిన మత్తేభవృత్తములన్నియును వివిధ విషయస్ఫోరకములై వర్ధిల్లినవి

యోగశాస్త్ర విషయము (8-116)

బ్రహ్మాండ వర్ణనము (8-149, 150)

యుద్ధ వర్ణన - (6-212) (6-216) (6-167) (7-157) (7-98) (7-21) (6-119) (6-167) (6-218) (6-226)

శ్రీరాముడు లక్ష్మణునికై విలపించుట (6-201)

(3) చంపకమాల :

సంస్కృతాంధ్ర సాహిత్యములందీ వృత్తమునకు మిక్కిలి ప్రాచుర్యము గలదు. ఇది జగణ మయము సర్వసాధారణముగ నిది వీర, రౌద్రాదుల కుప యోగపడును. కొన్నిపట్ల శృంగార రస వ్యంజకత్వమునకు దీని నుదాహరణ ముగ చూపనగును.

ఈ వృత్తము లీ గ్రంథమున 148 గలవు పరిమాణమున నివి గ్రంథ మున పదవ వంతున నున్నవి.

(i) మృడుని వర్ణన (ఇష్టదేవతా వర్ణన) : హాస్యరస వర్ణన :

జడముడి జాహ్నవీతటనిశాకరపోతముఁ జూచి యెవ్వ రీ
కొడిమెలు గట్టె పెండ్లికొడుకుం గడియారము మోవఁ జేసిరం
చడుగ వివాహవేదిపయి నంబిక నెచ్చెలిఁ జూచి నవ్వు నా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్జయముల్ దయసేయుఁ గావుతన్.

(పీఠిక - 2)

ఇందలి పదములు సామాన్యములు. మొదటి పాదమునందు సరసయతి వాడబడినది. వివాహవేదిక పయినున్న మృడుడు, చూపరుం పల్కులకు బార్వతీ దేవి నెచ్చెలిని జూచి నవ్వినాడని వ్యక్తము. సహజముగ మృడుడు- జడత్వము గల్గినవాడు. అతనికి గూడ నవ్వు గల్గుట యాశ్చర్యకరము. సరసమైన యా హాసమును జూపట్టుటకు సరసయతి నీ కవి సార్థకముగ వాడినాడు (జ-శ అను యతి). హాసము, హాస్యరసమునకు స్థాయి భావము. హాస్య రసాధి దేవతలు ప్రమథులు. ఈ ప్రమథులు మృడుని యధీనులు. ఆ కారణమున హాస్య మీ సందర్భమున రసస్థితిని బొందినది. హాసము సితవర్ణాత్మకము దీనిని రస స్థాయిలో చూపుటకు సరసయతి మిగుల రమణీయముగా, సరసముగా, సార్థక మైనది.

(ii) శ్రీకృష్ణ భీమసేనుల సరసాలాపము: 1-128.

(వ్యంగ్య మర్యాద)

ఇది యొకదొడ్డగాఁ దలఁప నేటికి నాహృదయంబులోన నీ
పదయుగళంబు నిల్పి కులపర్వతముల్ పెకలించి వైతునో

గదగొని ధారుణిం దుమురుగా వడిఁ దంతునొ దిగ్గజంబులన్
రదనము లూడఁ దన్నుదనొ రాలుతునో గ్రహతారకంబులన్.

ధర్మరాజుతో భీముడు హయమేధాశ్వము దెత్తునని పలుక, శ్రీకృష్ణుడు- 'పూర్వము రామేశ్వరుడు మారుతిని బంపి హయమేధాశ్వము సురథుడను మహా వీరుని యొద్దనుండి తెప్పించుకొనలేక, స్వయముగా వెళ్ళి గ్రహించవలసిన స్థితి వచ్చెననియు, బావనికి దోడుగ నర్జునుని బంప నత్యావశ్యకమని' తర్జనిచే నాతని జూపగా భీముడు పల్కిన పల్కులివి ఈ పద్యము మూలమున శ్రీకృష్ణ భీమ సేనుల మధ్య ప్రవర్తిల్లిన సాహస పూరిత సరసాలాపములు వ్యక్తమొనగు చున్నవి. ఆదివిష్ణువైన శ్రీ కృష్ణమూర్తి చూపిన లీలలు భీమునిచేత హాస్యమున కాలవాలములుగ చిత్రించబడినవి సహజముగ భీము డావేశపరుడు. ఈ సంద ర్భమున నాతడు హృదయపు టుత్స్రుతి నణచికొని, శ్రీకృష్ణుని సగౌరవముగ విమర్శించినాడు ఆ కారణమున నీతడు సంయమియైనాడు. ఇచట వ్యంగ్య శిల్పము, ఛందశ్శిల్ప రూపమున స్పష్టపడుచున్నది. స్వరయతి, స్వరప్రధానమైన వ్యంగ్యమైనది. చంపకమాలా వృత్తము సున్నితపు హాస్యమును ప్రదర్శించుట కుపయుక్తమగునను సత్యం మీకవి గంటమున వెలువడినది.

(111) వృషకేతుని రౌద్ర వర్ణనము : 2-86
వదలినద్రిండు తొంటిగతి వాటముగా బిగియించి మోమునన్
బెదరిన ఘర్మవారిఁ గొనచేలమునన్ దొలఁగించి వీఁపునన్
బొదులమరించి మించి బిఱుముష్టి శరాసనమున్ ధరించి క
ట్టైదుర విరోధిఁ గాంచి యెద నించినకోపము సందడింపగన్.

యౌవనాశ్వుని తోడి యుద్ధమున వృషకేతనుడు విజృంభించినట్టి రీతి నీ పద్యము సువ్యక్తము గావించుచున్నది. క్రోధము, రౌద్రరసమునకు స్థాయి భావము. ఆ వీరుడు హృదయమున నిండిన కోపముచే రౌద్రుడైనాడు. కోపము స్థాయిభావ మనుట కారణముగా వృషకేతుని హృదయము రక్తవర్ణమైనది. 'కోపము'- అను పదము వాచ్యమే. కాని రౌద్రము వ్యంజింపబడినది.

కవిత్రయము వారు వాడిన రీతిలో వీరభద్రుడును చిత్తస్పందన త్వర తను వ్యంజించుటకు దరచు చంపకమాలా వృత్తమును ప్రయోగించినట్లు

గ్రహించవచ్చును. జైమిని భారతము వీరరస ప్రధానమైన గ్రంథమగుటచే, పోషకమైన రౌద్రము నముసంధించుటలో నీ కవి రస శిల్పదర్శనమున గూడ నద్వితీయుడనుట రూపొందినది

(iv) కరుణరస సంఘట్టనము : 6-69

మఱఁదలలోన నెన్నఁగల మాన్యుఁడ వావనదంత కోర్చిఁ బ
ల్దిఱఁగుఱఁ బర్ణశాలలను దియ్యని పండుల నేర్చి పెట్టుటల్
మఱచిదాననే యకట లక్ష్మణ యీయెడ నప్రసిద్ధికిన్
ఁబలుకులు గాని భానుజ విభీషణు లుండగ నీకు నర్హమే.

శ్రీరాముని యాజ్ఞను దలదాల్చిన లక్ష్మణుడు సీత నడవికి గొంపోవుచు నడవిలోన నామెతో పల్కిన పల్కులకు సీత ఈ సమాధానము నిచ్చినది. సీత తన దురవస్థను లక్ష్మణునితో జెప్పి శోకించుట నీ కవి మిగుల రసవత్తరమైన ఘట్టముగ చిత్రించినాడు. వనవాస ఘట్టముల నామె హృదయము మరచిపోలేదు. ఇందు 'ఱ'గణ ప్రయోగము- లక్ష్మణుని వ్యంగ్యముగ విమర్శించుట కుపయుక్తమైనది. మఱచు, పిలుకులు, (పిలికి + లు) అను పదములలోని వ్యంగ్యగుణము'న' గణ ప్రయోగమున ప్రకటితమైనది. తియ్యని పండ్ల నేర్చి "పెట్టుట" యనుచోట పరుషాక్షర ప్రయోగము. సీతాదేవి హృదయగత పారుష్యముననుగమించినది. ఆమె హృదయగత కరుణము, తద్రస స్థాయిభావమైన శోకమున నుప్పొంగినది. రాముని యాజ్ఞ యామెకు కరుణ రసాధిదైవతమైన యముని యాజ్ఞవలె భాసిల్లినది. అనగా యమపాశమువలె నున్నది.

మరొక్క పద్యములో (6-76, "సీత వంచిన మోమున బాష్ప పూరములు" కనబడుటయు, జాహ్నవీనది తటమున జానకీదేవి, మఱియూపదారు హారబార్థమేగిన శిష్యులకు నొంటిగ నుండి "శోకపరీత"యైనట్లును గన్పించినది. (6-258)

ఇట్లు కరుణరస హృదయ స్పందనమునకును, తద్హృదయ గతి స్ఫూర్తికిని వీరభద్రుడు చంపకమాలా వృత్తమును వాడి రసౌచితికి దగిన ఛందౌచితిని జూపినాడు.

(v) యుద్ధమును వర్ణించిన రీతుల నెన్నియో సమయములందు చంపక మాలా వృత్తములు మనకీ గ్రంథమునందు గన్పట్టును.

(7-7) (7-29) (7-32) (7-89) (7-174) (7-181) (6-189) (6-169) (6-144) (6-120) (5-197) (5-194) (5-179) (5-141) (5-71) (5-10) (4-54) (4-58) (4-16) (3-107) (3-102)

## (4) ఉత్పలమాల :

తెలుగు వాఙ్మయమున నీ వృత్తము బహుళ వ్యాప్తిని గాంచినది. ప్రసాద మాధుర్య వ్యంజనమునకును, వీర రౌద్ర రసముల నిర్వాహణమునకును నిది సాధ్యము.

జైమిని భారతములో నీ వృత్తములు 155 వాడబడినవి. ఈ గ్రంథమున మొట్టమొదటి వృత్తము పీఠికలో కృతికర్తను గూర్చినట్టిది (1-18). ఇందు దీర్ఘప్రాస ముపయుక్తము.

రెండవ యుత్పలమాలలో కవి తాను గ్రంథము నెట్లు వ్రాసినాడో పేర్కొనినాడు.

i. ధర్మజుని దుఃఖము : 1-59

పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నా కిది యేల సత్త్వసం
పన్నిధి వాయునందనునిఁ బట్టము గట్టెద నేఁటితోన నే
నన్నియు మాని కానలకు నేఁగెద నిష్ఠఁ దపంబుజేసెదన్.

'న' కారము పలుమారావృత్తి బెందుట గమనీయము. పాపపంకిలమైన మేదిని పట్ల ధర్మజునికి గల లఘుదృష్టి వ్యక్తమగుచున్నది. అనునాసికాక్షర బహుళ ప్రయోగము దుఃఖ సమయములలో వాడుటకు వీలగునని తెలియుచున్నది.

ii. యుద్ధము - 2-40

ఈ క్రింది పద్యమున ర వర్ణ, ట వర్ణముల పునరావృత్తిచే వృషకేతనుడు, యౌవనాశ్వుని సైన్యముల దున్మట భఠింపబడినది,

హాటక శైలధన్వి త్రిపురాసురవీరుల సంహరించు న
ప్పాటునఁ గార్ముకాంబుధరబంధురమార్గణవృష్టి ముంచినన్
ఘోటకశేఖవీరభటకోటులు రూపఱిపోవ వీటికిన్
జేటెఱిఁగించఁ గంతగతజీవుఁ డొకండఱిగెన్ రయంబునన్.

ఈ పద్యము సమాస బహుళము కాకున్నను వీరరస స్థాయి భావమైన ఉత్సాహమును వ్యక్తీకరించుచున్నది పరమేశ్వర తత్త్వము, వృషకేతనుని హృదయమున నిండి శివలాస్యమాతని మార్గణ ప్రయోగమున నవరోహణమైనది. సరసయతి నిబద్ధమై, ఈ పద్యము సరసముగ నున్నది.

iii. దుఃఖవర్ణనము : (6-82)

ఎన్నఁడు లేమి నేఁ డినకులేశ్వరుఁ డేమికతంబొ బాష్పసం
ఛన్న ముఖాబ్జుఁడై ఘనవిషాదముఁ బొందుచునున్నవాఁడు వి
ద్యోన్నతశీలుఁ డెంతదురవస్థకుఁ దావల మయ్యెనంచుఁ దా
రన్న పదాబ్జముల్ గదిసి యందఱు సాఁగిలి మ్రొక్కి లోఁగుచున్.

ఇచట "విద్యోన్నత శీలుడు" అను పదము కవిచే సాభిప్రాయముగా ప్రయోగింపబడినది. అంతటి రాజసత్తమునకు గూడ దుఃఖనిర్మగ్నమైన నీ స్థితి గల్గినను వ్యంగ్యభావమిట కవి ఈ పద్యమున నిబిడీకృత మొనర్చినాడు. శోకము నానావిధము. ఇట ధీరోదాత్త నాయకుడగు రామునికి గూడ రజకుని పల్కులు విభావములైనవి. 'ఇనకులేశ్వరుడు' అను పద ముపయోగించుటలో - సూర్య వంశపు రాజైన వానికి గూడ బాష్పములు గల్గెననుటయు; వంశగౌరవ ప్రతిష్ఠలే యాతనికి ముఖ్యమను భావమును గూఢముగా వ్యంజించుచున్నది

పూర్వకవి సంప్రదాయముల ననుసరించిన వీరభద్రుడు కవిత్రయము వలెనే నానావిధములైన యర్థముల నమర్పించుటయ శిల్పముగ భావించి యుత్పలమాలలను నానారసావతార సందర్భములందును వాడియున్నాడు

iv. సీతాదేవి మనంబునందలి యుత్ప్రేక్ష : 6-82

సంకట వంశదంశకఝుంకృతులున్ నిబిడీసఝిల్లికా
ఝంకృతులుం బ్రచండమదసింధుర ఘీంకృతులున్ మృగద్విష
ద్ధ్వాంకృతులున్ ఖనద్రుతి పదంబులు వ్రక్కలుసేయ వేల్లితా
తంకనివేశధీన చకితంబుగ లక్ష్మణుతోడ నిట్లనున్.

ఈ దీన వాక్యములను కవి సీతాదేవిచే జెప్పించినాడు సమానబాహుళ్యము మహాప్రాణాక్షర బాహుళ్యము, శ్రుతికి గటువుగా నున్నట్లు ధ్వనించుచు, భ- గణముల బునరావృత్తి గావించుచు, బిందుపూర్వకములగు నక్షర సమామ్నాయముతో గూడి సీతాదేవి మనసులోని యుత్సృతిని బ్రతిబింబించుచున్నవి. కవి యిచట నుల్లేఖాలంకార ప్రయోగము చేయుచు, జనశ్రుతిపదంబులు ఎన్నెన్ని రీతుల శక్తివంతములై యామె హృదయమును గలవరపరచుచున్నవో దృశ్యమానము చేయుట- మిక్కిలి రసవంతమై మహాప్రాణాక్షరములు- మహాప్రాణవంతములైన పలుకులై సీతాదేవి హృదయమును వ్యంజించుచు, ఛందశ్శిల్పమును వ్యక్తము చేయుచున్నవి

(5) కందము :

కంద పద్యములు జైమిని భారతములో 589 వాడఁబడినవి. ఈ పద్యములు గతిని బట్టి భిన్న రస భావములను వ్యంజించుచుండును

1. చతుష్ప్రాసతో కందమును వ్రాయుట· 1-141

ధరణీ వరాహ వార్జిత
ధరణీ వరణా పరావతార మురారీ
ధరణీ వరాహ రక్షిత
ధరణీవరబృంద మహితదాన ముకుందా.
రణీవరా - రణీవర - రణీవరా - రణీవర
(చతుష్ప్రాస)
ఇది ప్రథమాశ్వాసాంత్యమై, కృతిభర్తృవర్ణనయై భాసిల్లుచున్నది.

ii. దశావతార వర్ణనము: 7-286.

శరధిచర కమఠ కిటి నర
హరి వామన భృగుజ రామ హలభృజ్జిన క
ల్కి రుచిరరూపాయ జగ
ద్భరణాయ నమోనమోఽస్తు భవతే యనుచున్.

దశావతార భక్తిని పీరభద్రుడు కందపద్యమున నిబద్ధించుట యొక విశేషము.

iii. గ్రమ్మన నెత్తురుదేఱలు

గ్రమ్మ నఖండ ప్రచండకాలానల కీ
లమ్ములఁ దెగడు మెఱుఁగువా
లమ్మల నక్షౌహిణీత్రయము మడియించెన్. (7-161)

ఈ పద్యమునందలి ద్విప్రాసము పూర్వోత్తర పాదద్వయములన్నమై యున్నది.

iv. ప్రాసమైత్రిప్రాస (ల - ళ - లకు ప్రాస) 7-168

అలరు విలుకాని కొడుకవు
బలివారఁడె నాఁడె పట్టి బాఱఁ దుషామం
గళసూత్రవైభవము నీ
తల గాచెం గాక నాకు దయలే దనినన్.

ఇట్టి ప్రాసమైత్రి ప్రాసలు పలుప్రదేశములలో నుపయుక్తములు. (8-1) (8-16) (1-11) (4-24) (4-57) (4-1x4)

v. సంధి గత ప్రాసము : (4-65)

ఈ యాపదలకు మూలం
బాయింద్రతనూజుఁ డతని నాహవభూమిం
జేయారఁ జంపి నామదిఁ
బాయనివగ పాపు మన నృపాలుఁ డలంతోన్.

6. సీసములు.

ఈ సీసపద్యములు 1. వర్ణనాత్మకములు. 2. కథనాత్మకములు - అని రెండు విధములు.

మొదటి తరగతికి జెందిన వర్ణనాత్మక సీసములు : i. కవి కృతములు (ii) కవినిబద్ధవక్తృకృతములు.

ఈ వర్ణనాత్మక సీసములు వర్ణ్యవస్తువు, గుణము, క్రియలకు సంబంధించినవై యుండును. అట్లే గంభీరవస్తు వర్ణనమునకును, విస్తృతవిషయ ప్రతిపాదనమునకును - వర్ణనాత్మకము ఉపయోగింపబడును,

ఇక కథన కౌశలమును బట్టి సీసపద్యము కవి భావిత భావనా రామణీయ కతను వ్యక్తము చేయును.

సీసము లీ గ్రంథములో 144 వాడబడినవి.

1 కవికృతసీసము : 1-22

అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయసింధుగతకైతవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచిత సత్త్రశాలయై
బెట్టుగఁ బెరుఁ గయాక్షేత్రసీమ
నిలువ నీ దయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

తే. మఱ్ఱి మాత్రంబె పిల్లమఱ్ఱి పేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు.

ఇందలి తేటగీతిలో నిత్యసమాసయతి ప్రయుక్తమైనది.

ఈ యతి నిత్యసమాసమై, నిత్యమును కవిగృహము "శారదా పీఠక" మని తెలుపబడినది నిజవంశ ప్రస్తావన చేయుచు వెలిపిన ఈ వాక్యము-

"పినవీరు వాక్యసరణి సరసులకు నెన్నఁ
గర్ణరసాయనంబు"- ఆదికవి నన్నయభట్టు తన "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి" యను పద్యములో- (1) అక్షర రమ్యత (2) నానారుచిరార్థ సూక్తినిధి కలదని పేర్కొనుటను స్ఫురింపఁజేయుచున్నది.

2. గంభీరవస్తు వర్ణనమునకు నీ కవి మహాదేవియగు వాగ్దేవిని వర్ణించి యున్నాడు. షష్ఠీభావాంతాక పూర్వకమైన ఈ సీసపద్యములోని వాగ్దేవి వర్ణనము మిగుల రమ్యముగ వర్ణింపబడినది.

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి
జపహార కీర పుస్తక విపంచిసమంచి
తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందళీ బృందంబు
చంద మేదేవి యానందమూర్తి

తే. కాంచె నేదేవి కాంచనగర్భచతుర
పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంతశిరోగృహస్థలవిహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు (1-6)

వర్ణనాత్మకమైన వస్తువునకు నిది యొక చక్కని యుదాహరణము.

జైమిని భారతములోని ఈ పద్యమును బోలినట్టిదే రామరాజభూషణుని వసుచరిత్రమునను కనబడుచున్నది. దీనిని బట్టి ఈ రచన ప్రబంధ కర్తలకు మార్గదర్శకము నయినదని చెప్పవచ్చును.

సీ. తరుణార్కకబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు
రుచులచే ఫలమోహ రుచులచేత
నకలంకరామ ముద్రికఁ బూనె నెవ్వాఁడు
నయముచే హృత్కుశేశయముచేత
మున్నీరుఁ బల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు
జవముచే గుణగణార్ణవము చేత
నక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు
రణముచే నియమధారణము చేత

తే. ధరణి నెవ్వాఁడు దానవద్విరదదళన
విహృతిఁ దన కేసరికిశోరవృత్తిఁ దెలిపె
నతని మత్కావ్య భవ్యవాగమృతఘటన
మంజులస్వాంతు హనుమంతు మదిఁ దలంతు. (వసుచరిత్ర - 1-8)

3. శ్రీరామ తనయులైన లవకుశులను, వారి పరాక్రమములను వర్ణించుచు, కవి శ్రీరామ ప్రతాపమును వర్ణించుట కవిసంబద్ధ వక్తృకృతమైనది. (6-245)

సీ. చిఱుతప్రాయమున హెచ్చినతాటక వధించి
జమదగ్నిసూనుగర్వము గుదించి
ఖరదూషణాదులఁ గాలుని పురికన్పి
మారీచుచర్మవర్మముఁ జించి
యోజనబాహు నత్యుగ్రత వధియించి
యనిమిషాధీశునందను హరించి
లవణపయోరాశి నవలీల బంధించి
దశకంఠు నాహవస్థలి సదంచి

తే. నట్టి భవదీయచటుల బాహాప్రతాప
విక్రమాటోపమున బొంగవించి సలుపఁ
బద్మగర్భాదులకు నీఁతబంటి యనినఁ
దెక్కుమీఱిన పసిపల్ల శిశువు లెదురె

4. విస్తృతవిషయ ప్రతిపాదనమున సీత తన కొరకై రాముడెన్ని ఘనకార్యముల నొనర్చెనో లక్ష్మణునితో బేర్కొనియున్నది.

సీ. విపులబాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నానిమిత్తంబుకాదె
చలపట్టి దైతేయశాంబరీమృగము న
స్త్రముఁ ద్రుంచె నానిమిత్తంబుకాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన
దాఁటించె నానిమిత్తంబుకాదె
కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికం
ధరుఁ గూల్చె నానిమిత్తంబుకాదె

తే. యట్టిరాముఁడు తానె నన్నడవిలోన
డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచె నట్టి

తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును. (6-71)

వ్యంగ్యగర్భితమైన పల్కులతో సీత రాముని యాజ్ఞను లక్ష్మణుడు తీర్చిన విధమును విమర్శించినది.

జైమిని భారతములోని సీసములు నాటకీయతను వ్యక్తపరచుచు, పలు విధములైన రీతుల వస్తు, గుణ, క్రియామూల వర్ణనములకును, కథాకథనమునకును, ప్రయుక్తములై, విపులములై, పూర్వమహాకవులైన తిక్కన, శ్రీనాథాదుల సీసరచనలను బుడికి పుచ్చుకొని, తరువాతి కవులకు మార్గదర్శకములైనవి.

(7) తేటగీతి - ఆటవెలది :

జైమిని భారతమున 158 తేటగీతులు, 88 ఆటవెలదులు ప్రయుక్తములు. ఇవి వంశవర్ణన కొరకును, సీసపద్య భాగములుగను గన్పట్టు తేటగీతులుగను, పంచపాండవగత నవవిధభక్తి తత్త్వ ప్రతిపాదనమునందును, వీరాది రస ప్రతిపాదిత రసవిజృంభణమునందును, బహుళముగా వాడబడినవి. అట్లే యుదాత్త భావ ప్రకటనమునకును వాడబడినవి.

తే. మొరసె సురదుందుభులు గళత్సురభిదుగ్ధ
కుసుమవృష్టులతోన భోర్కొనుచుఁ గురియు
నమృతధారాభిషిక్తసర్వాంగ మగుచు
బ్రదికె నరవానరాసురప్రబలబలము (6-241)

సూర్యస్తుతి (6-159)

తే. సవిత మూర్తిత్రయాత్మక సప్తతురగ
చండపూష సతామర బలజమిత్ర
హంస ఋగ్వేదరూప మేషాద్యధీశ
బప్రకాశ హిరణ్మయ కర్మసాక్షి.

ఈ వృత్తము లీ విధముగ బహుళార్థకత్వము సాధించుచు, రసౌచితిని, ఛందశ్శిల్పౌన్నతిని ప్రతిపాదించుచున్నవి.

పినవీరభద్రుడు, సూర్యశతకము (మయూర) లోని మరొక శ్లోక మాధారముగా, ఈ తేటగీతిని వ్రాసినట్లు ద్యోతకము. ఆ శ్లోకమిట గాంచవలెను:

ఏతత్ యన్మండలమ్ ఖే తపతి దినకృత స్తార్చోఽసియాని
ద్యోతంతే తాని సామాన్యయం అపి పురుషోమండలేఽణుర్యజూంసి
ఏవం యం వేద వేదత్రితయమయం అయం వేదవేదీ సమగ్రో
వర్గః స్వర్గాపవర్గ ప్రకృతిరవికృతిః సోఽస్తుసూర్యః శ్రియే వః
(మయూర సూర్యశతకము - శ్లో 89)[10]

(8) గద్యములు :

ఈ గ్రంథమునందలి గద్యములు—

(i) కథాకథన నిర్మాణ సౌలభ్యమునకును, (ii) వర్ణనకును
(iii) ఆశ్వాసాంత్యములందును

ప్రయుక్తములు, ఇట్టి సందర్భములలో నీ కవి బహువిధములైన సమాసములను నిర్మించెను. ఇట్టివి హ్రస్వములు, నాతిహ్రస్వములు, దీర్ఘములు, నాతి దీర్ఘములు, నాతిదీర్ఘతర తమములును నగుచున్నవి ఇవి బహుళార్థ సాధకత్వ ప్రయోజన సిద్ధిని బొందినవి

గద్య పద్య నిష్పత్తి

| గద్యములు | పద్యములు | మొత్తము |
|---|---|---|
| 98 | 1884 | 1482 |
| 7 | 100 | |

ఈ గ్రంథములోని వచనములు నూటికేడు వంతున నిర్మితములు. సర్వ సాధారణముగా పూర్వకవులందరు నాశ్వాసాంత్యములయందు గద్యలనే వ్రాసిరి. కాని కవిగతమైన ప్రతిభ, వస్తు నిర్మాణ దక్షత, పద్య గద్యములన్నిటి యందును గన్పట్టును. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమున గద్యకు చోటీయలేదు ప్రాచీనాలంకారికులలో దండి తన 'కావ్యాదర్శము' న 'గద్యం కవీనాం నికషం వదన్తి' యనినాడు

ప్రసాదగుణ వ్యంజనమునకును, గ్రంథగత వస్తు వివరణమునకును, గంభీరవస్తు వర్ణనమునకును, విస్తృతవిషయ ప్రతిపాదనమునకును, ఛందోగత మైన నాటకీయతకును బద్యములు కవిప్రతిభను జాటుచున్నవి. కాని గద్యలు గురులఘు బాహుళ్యమును బట్టియు, నిర్మాణ మిశ్రణమును బట్టియు కవి శక్తియుక్తులను జాటుచున్నవి.

అంతేగాక, రమ్యమైన రచనాపూర్ణతకై యనుప్రాసాదుల నుపయో గించుచు, సంస్కృతాంధ్ర పూర్వకవుల మార్గముల ననుగమించుచు వీరభద్రుడు

గద్యరచనా ప్రణాళికను స్వయంసిద్ధ మొనర్చెను ఈ కవి గద్యలన్నియు నేకవాక్యగతములు.

ఉదాహరణము . (5-125)

"వృక్ష దేశంబునఁ జరించు తిర్యఙ్మనుష్య వర్గంబు నైసర్గికవిశేషంబునుం గనుంగొనుచుఁ గదలి బహువిధ స్వకర్మానురూపజాతు లయిన యేకపాద ద్విపాద త్రిపాదానేక వికటపాదులను శశవృకాచ్ఛభల్ల వలిముఖోష్ట్ర ఖరకురంగ తురంగమ స్తబ్ధరోమ గోమహిష వ్యాఘ్రమార్జారముఖులును నేకశృంగ ద్విశృంగ త్రిశృంగ చతుశ్శృంగ వక్రశృంగ దీర్ఘశృంగులను నులూకాక్ష కోకిలాక్ష కుళీరాక్ష కేకరాక్ష పింగళాక్ష విషమాక్షులును నాదిగాఁగల వికృత వేషులు చరించు నానావిధజనపదంబు లతిక్రమించి పోవుచుఁ దురంగం బగ్రభాగంబున ననేక పిశాచ నిశాచర శాకినీ డాకినీ భూతబేతాళగణ శరణంబును బ్రచండ గండభేరుండ చమర వేదండ గండక రురు వరాహ శరభ శార్దూలాది మృగ సమ్మర్ద నిర్దయ విహారానుగుణ్యంబును నగు నొక్క దారుణారణ్యంబుఁ బ్రవేశించె"

ఇట్టి వచనములు ఉత్కలికాప్రాయము లనిపించుకొనును. ఈతనికి తరువాత వెలువడిన ప్రబంధములతో చాల వరకు వచనము లిట్టివే. వీరభద్రుడు వారికి బాట జూపిన వారిలో నొకడు.

మొత్తము మీద జైమిని భారతమున ఛందశ్శిల్పము బోషించుటలో వీరభద్రుడు తగు న్యాయమొనర్చి కృతార్థుడయ్యెను. రమ్యవస్తు విషయములకును, రససంఘటిత వర్ణనకును, దగు విధమైన ఛందః శాస్త్రప్రసాదిత పద్ధతులనను సరించి, శ్రీనాథ యుగమున నావిర్భవించిన 'మహాకవి' యనదగుటకు 'జైమిని భారత' గ్రంథమొక్కటియే చాలు ననుట నిర్వివాదాంశము.

---

1. ప్రథమాంధ్ర మహాపురాణము - పుట 285, సిద్ధాంతివ్యాసము - (1978)
2. ఆంధ్ర మహాభారతము - ఛందశ్శిల్పము. (పుట 188-189)
3. ,, ,, పుట - (39)
4. ప్రథమాంధ్ర మహాపురాణము - పుట 287.
5. ఆం. మ. భారతము - ఛందశ్శిల్పము - పుట 308.
6. పుట 345. ఆం. మ. భా. ఛందశ్శిల్పము.
7. పుట 278. ఆం. మ. భా. ఛం. శి.
8. ఆం. మ. భా. ఛందశ్శిల్పము. పుట 307.
9. ఆం. మ. భా. ఛ. శి. పుట 388
10. "The Sanskrit Poems of Mayura"
Indo - Iranian Series (Vol. 9)
Columbia Univ- Press. (New York)1917
George Payu Quackenbos, A. M. Ph.D.,

## సూక్తులు - లోకోక్తులు :

1. కన్నుదోయి లేని కాయంబు తోయంబు
   గాని మిగులసౌఖ్యకరము గాదు. (I-58)

2. దాసజనుఁడెందు నే యుపద్రవముఁ జెందు
   నందులకు వచ్చి రక్షించు నచ్యుతుండు (1-114)

3. ధైర్యధనుల కరయంగ లే దసాధ్యములు (1-119)

4. అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రల్లదు నీచకామినీ
   సంగతు వామనున్ బధిరు సాధ్వసమానసు మామఁ గాముకున్
   వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధిఁ బ్రమత్తు మంత్రిఁ జే
   యం గొఱగామి కెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్. (1-121)

5. ఎచ్చోట విలాసినులకు
   మచ్చికఁ జనవిచ్చినం బ్రమాదము పతికిన్
   వచ్చునవశ్యము కాంతలు
   చచ్చినపుడు విశ్వసింపఁజన దెవ్వరికిన్. (3-32)

6. అత్తయు మామయు మగఁడును
   గత్తులబోనులయి బిఱుసు గావలె నెపుడున్
   మత్తచకోరాక్షులకును
   చిత్తము పరపురుషభోగశీలంబగుటన్. (3-33)

7. నాలుకయును దాలువులును
   నీలరుచిం గలిగెనేని నెఱిచరణంబుల్
   నేల పరిమోవవేనియు
   వాలాయము నది వహించు వైధవ్యంబున్. (3-35)

8. కంతుసుఖకేళిఁ దేలు వి
   రంతువుతో నెవ్వఁడే నరుఁడు దనపుణ్యం
   బంతయుఁ గోల్పడి కూలు ని
   రంతరమును రౌరవాదులగు నరకములన్. (3-36)

9. అరసిచూడఁ దెఱవలకు నెందుఁ
   ఛమయుచ్చుఁ దొరుగఁ జనదు. (3-37)

10 ప్రజానురాగంబున ధనంబును ధనంబున ధర్మంబును
ధర్మంబునఁ గీర్తియుండెకురు. (3-38)

11. కలిమి దాఁపక పైతృకంబుఁ జేసినవాఁడు
పుణ్యతీర్థములాడఁ బోవువాఁడు
వితరణశీలుండు వినయంబు గలవాఁడు
పరకాంతలకు నాస పడనివాఁడు
కూరత మెఱసి ప్రస్తుతికి నోర్వని వాఁడు
సత్యశౌచంబులు సల్పువాఁడు
బాంధవ పితృమాతృభక్తిఁ జెందినవాఁడు
కిల్బిషంబులకు శంకించువాఁడు

తే. సత్ప్రసంతానవిఖ్యాతి జరగువాఁడు
నిఖిలభూతదయాసక్తి నెగడువాఁడు
మేలుమఱవనివాఁడు లక్ష్మికిఁ బ్రియుండు
వానియొద్దనె హరియును వదలకుండు. (3-40)

12. జూదరి దుష్ట దుర్వ్యసనుఁ జోరుని సజ్జనదూషకున్ మృషా
వాదిఁ గృపావిహీను గృహవప్రవిఘాతకు లోభి సంతత
స్వోదరపూరకున్ బిఱును నుద్ధతినిం బెడబాయు లక్ష్మి వే
దాది సమస్తవిద్యలు పరాన్నపరాయణుఁ బాయునై వడిన్. (3-41)

13. స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః. (4-57)

14. వహ్ని బోలఁగ నొండు దైవంబు గలదె (4-42)

15. వేము వెగ్గలము పెరుఁగ గలదె మాధుర్యగుణము తిక్తంబు కాక.(4-86)

16. పుడిసెడు నీటిచే నుడుఁగి పోయెడు
ధూళికిఁ గాలమేఘముల్ దొరరునె. (5-7)

17. దోమలమీఁద సుపర్ణుఁ డెత్తిపోఁ గడఁగునె. (5-7)

18. రేఁగుఁబండ్ల కొఱకు ముత్తియంబులు వెలపోయ మూఢుఁడు గలఁడె.(5-59)

19. నాపుత్రస్య లోకోస్తి (7-11)

20. హయమేధ మఖిల పాపక్షయమని నిగమములు చెప్ప. (8-101)

21. ద్వైవిధమెట్లు తెలియవచ్చు. (6-256)

22. కాకుల రొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్న కర్ణంబులకున్. (6-270)

23. స్వామి సకల గోమహీసుపర్వప్రయోజ
నార్థమై మేనుదొఱఁగు ధన్యాత్ముఁ డెవ్వఁ
డతఁడు కైవల్యసౌఖ్యంబు లనుభవించు
ననుచుఁ జెప్పుదు రఖిలధర్మార్థవిదులు. (7-16)

24. అంబుజాప్తుడు లేని నభంబు, దివియ లేని గేహంబు
లింగంబు లేని పీఠము అప్రయోజనము. (7-85)

25. అభ్యాగత స్స్వయం విష్ణు (7-208)

26. బాలక విహీనులకు మానవులకు నౌర్ధ్వదైహికంబులు లేవు. (7-211)

27. మర్త్యకోటికి దేహము లస్థిరములగుట దెలియఁగ నిక్కము. (7-225)

మరికొన్ని సూక్తులు :

1. అగ్నిముఖావై దేవాః (4-41)
2. అటవ్యాం నారసింహః (7-2 0)
3. దుర్బలస్య బలం రాజా (7-214)

లోకోక్తులు

1 గోరుచుట్టుపై రోకటిపోటు (1-64)
2 చింతామణి విడిచి గవ్వ చేకొనుభంగి (1-91)
3. రెంటికిని జెడ్డ రేవడి (4-87)

జాతీయములు

1. తోడు దొన యగు 1-105
2. ముంగొంగు పసిడి 1-116
(కొంగు బంగారము)
3. కాలు కాలం బెనంగుట 2-75
4. కిలుకిలునకు నూడుట 2-77

5. మసమసక యగుట 2-101
6. పంచబంగారమై పొలుచు 2-109
7. కట్టర చేయు 2-107
8-55
8 పచ్చము పాడుగా విరుగుట 4-20
9. యథాయథలగుట 7-181
10. కాలు కాలునకుం బెనమకపడు 4-54
11. తుతబంటి (6-245) (7-211)

పామెత

1. గోరు చుట్టుపై రోకటి పోటు (1-64)

విశేష శబ్దములు

1. ఉమ్మ చూపు (5-8) వేడి కలిగించు
2. కత్తులబోను (8-88) సంకట ప్రదేశము
3. కప్పర పడు (6-89) సంభ్రమము జెందు.
4. కిటుకు పెట్టు (8-29) సాకు పెట్టు.
5. చిచ్చఱపిడుగు (5-29) చిచ్చఱలో అచ్చునకు యతి నిర్ధారకము.
"చిచ్చఱపిడుగు........ జడి"
6 చేదరానము (2-95) (8-76) చేతికానుక.
'నెమ్మినీ రీతి చేదరానమ్ము లొసగి'
7. చంబూకావ్యము (పీఠి-10) చంపూ కావ్యము
చంబూ శబ్దమునకు నిర్ధారకము.

"జంబూ......
ద్రంబూ......
లంబి.........
చంబూ"......

8. ఝింకృతి (5-196) ఝంకృతి రూపాంతరము.
"చిత్రగతి......ఝింకృతి."
"ఝింకృతులం బ్రచండ మదసింధుర" (6-62)
9. తేజి (2-23) గుఱ్ఱము అరబ్బీ పదము.
గుఱ్ఱము - అన్య దేశము.
10 దరిబేసి (5-196) తపస్వి- దర్విష్.
11. దురపిల్లు (6-55) దుఃఖించు "చేపెట్టి... ..దురపిల్లుచు."
12 దిండీరము (8-127) డిండీరము-రూపాంతరము.
"దిండీరాయిత......ధరిత్రీ"
13. నాశిలు (5-105) నాశనమగు.
14. నెమిలి (4-79) నెమలి మేపులొసంగి నెమిళ్ల.
15. తోబుట్టుగలు (7-184) తోబుట్టువులు
"గురు......తోబుట్టుగులు"
16. పాత్రలాడు (5-196) నాట్యమాడు
17 పౌజులు సేయ (8-98) పౌజులు తీర్చుట.
ఫౌజు (హిందీ) అన్యదేశ్యము.
18. ప్రతాపించు (5-'68) (7-168) బలము చూపు.
19. మరుత్తు (7-44) గాలి (తత్సమ రూపము)
20. మరుత్తుడు (1-68) రాజు. రూపనిర్ధారకము.
21. మఱ్ఱాకు (8-140, 8-141) మఱ్ఱియాకు.
22. శరత్తులు (6-11) సంవత్సరములు.
23. రాహుత్తులు - రౌతులు - అన్యదేశ్యము.
24. సమ్రాట్టు (4-125) సామ్రాజ్యాధిపతి. సమ్రాట్టు - ప్రాస.
25. సైతేయుడు (6- 28, 176) సీతాపుత్రుడు-కుశుడు.
26 సోళాదొప్పి (9-43) ద్యూత విశేషము

## విశేషములు

1. వృత్తనామస్ఫురణ :

'చంపకమాలిని' పేరు పురస్కరించుకొని పినవీరన ఈ క్రింది పద్యమున వృత్తముల పేర్లను సరసముగా వివిధ్చియున్నాడు.

సీ. అలసతఁ జూపు నొయ్యారంపు నడపులు
 'వనమయూరము'ల గర్వముఁ గుదింప
నఖల వేమఱుఁ బిల్చునరసంపు బెడఁగులు
 'మత్తకోకిలము'ల మనసుఁ గలఁప
నిటలంబుల నటించు కుటిలాలకంబులు
 'షట్పదంబు'ల విలాసముల గెలువఁ
దరళలోచనముల ధాళధళ్యంబులు
 'హరిణు'ల సౌభాగ్యమపహరింప

తే. దండడించు మనోరథోద్ధత విహార
సరణిఁ 'జంపకమాలిని' తరుణిఁ గూడి
'మానిను'లు గోసి రవ్వన 'మంజరు'లను
సరసిసరసిజములఁ బెక్కు చందములను (8-78)

ఇచట శ్లేషలో వృత్తనామములు చక్కగా నర్థస్ఫురణతో కుదురుకొన్నవి.

౨. గోదావరి ప్రశంస :

i. సింహబృహస్పతిఁ గూడుకొన్న గోదావరి (4-92)

ii. గౌతమిస్నాత జెఱచు తంతముల కరణి (6-119)

౩. జ్యోతిశ్శాస్త్రము :

i వ్యతిపాతయోగము. (8-44)

ii. కుతపకాలము. (4-97)

ఈ కుతపకాలము 'మనుచరిత్రము'న కూడ ప్రయుక్తమైనది.

౪. వైశ్య వీరత్వము :

i. వైశ్యునకుం గనఁ బోలు నిన్నుఁ జిత్రాంగద (6-171)

ii. వైశ్యుఁడను గాన సంగ్రామవనధిలోన
వీరకోటిరమణులకు విలువ గంటి. (7-87)

## జైమిని భారతము - అలంకారములు

జైమిని భారతములో నుపమాలంకారములకు, తక్కిన అలంకారములకన్న ప్రాముఖ్యము గలదు. ఇవి స్వభావోచితమై, కథకనుకూలముగ నున్నవి. వాని నిట జూపుచున్నాను.

1. కుడిచి కూర్చుండి శిలఁ దెప్పకొయ్యఁ జేసి
   జలధిలో నీఁదులాడంగఁ దలఁచినట్లు (1-68)

2. రాజీవయుగళంబుపైఁ గొత్తావులు గొన్నవాలు తుమ్మెదల చందము (1-113)

3. పంక నిర్మగ్నమగు గోవుఁ బరికరించి
   సుకరముగ నుద్ధరించు గోపకుని మాడ్కి (1-180)

4. శ్రీవిష్ణుపదభక్తి చిత్తంబులో లేని
   వానికి శుభములు లేని పగిది
   శంకరునిఁ బూజసేయని పంకమతికి
   గురుతరైశ్వర్యమొదవని సరణి మనము (2-18)

5. యోగ పురుషుడు మమకార ముడిగినట్లు (6-85)

6. దుష్టభుజంగము తన ప్రాతకుప్పసం బూడ్చుగతిన్. (6-42)

7. ధరిత్రీతలము మీఁద ఝంఝూవాతాహతిఁ బడిన పువ్వవల్లికఁ బోలెన్. (6-65)

8. నిదాఘ తప్తకేకిని కబ్బళబ్దమును బోలె (6-79)

9. సగుణ ధర్మరహితులైనట్టి కుటిల వర్తనులఁ గూడ సజ్జనుని ప్రీతి గుణములు నమసినట్లు. (2-68)

10. కూటసాక్షు లత్యంతక ఘోర ఘోరనిరయంబుల [illegible]

11. గంధవ్ర మూఁకుతావి గొనఁగా వెనగొన్న భుజంగి [illegible] (4-120)

12. పశుపాలకుఁడుద్ధతిఁగొంచు బోవఁబెన్దఱగునఁ [illegible] హోమగేహి తర్షత[illegible]
    బోరిఁ జూచు కైవడిన్. (6-76)

18. అహల్య రామచంద్రుని చరణాబ్జరేణువునఁ
    బొంది శిలాకృతి వీడుకొన్న లాగున (1-99)

మరికొన్ని అలంకారముల నిటచూడనగును.

ఉపమ దీనికి ఉదాహరణముగా దాదాపు అరవై పద్యములు కలవు.

రూపక : 1-92, 88, 2-58, 4-185

అర్థాంతరన్యాస : 2-51, 3-67, 6-288

ఉత్ప్రేక్ష 6-188, 249

శ్లేష : 2-49, 55, 5-5, 6-59, 7-55

## జైమిని భారతము - వ్యాకరణము[1] I

1. 'చను' - అను పదము గ్రామ్యరూపము నందలి 'చనె' అని వ్రాయబడినది. (2-76)
2. కర్మధారయమున ట కారము వచ్చుట. (4-47)
   ఇల్లటము+అల్లుడు = ఇల్లటపుటల్లుడు
3. అందుకు - అనునర్థమున 'కై' వాడబడినది.
   చమూవధూటి నీకై (3-51)
4. దొవ-దవు-దవ్వు-దొ- ఈ నాల్గింటిలో నేదేని ప్రయోగించవచ్చును.
   'దొదొవున నిల్చి' (2-51)

## వ్యాకరణము - II

శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు కొన్ని వ్యాకరణ విశేషములను ఈ గ్రంథము నుండి ఉదాహరించి యున్నారు.[2] ప్రధానమైనవి గ్రహించినాను.

1. ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృత వాక్యంబు గానంబడియెడి.

ఉదా : అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి (4-71)

2. ఒక్కొక్కచో బహుళంబు సప్తమికిం బ్రథమయునగు.

ఉదా : జనయిత్రి చిచ్చుటికిన (8-86)

3. పకారంబు కొన్ని యెడల శత్రర్థకపరక చువర్ణంబునకు గాన బడియెడి.

గర్వింపుచు (2-46)

7. కాదె కదార్థకంబగు.
శౌరి కృపగాదె నాకు నక్షయబలంబు (2-64)

నేను మరికొన్ని ఉదాహరణములను కూడ చూపుచున్నాను

### క్త్వార్థకేకార సంధులు

1. 'రథావతరణం బొనరించెమ రేగుదెంచినన్ (5-91)
2. ఎదిరిం బాకర్షరుక్ప్రంభ మండను(డై (5-180)
3. మూడు బలునారసముల్ బొడిగాతపత్రమున్ (7-7)
4. పుత్రా యెఱిఁగిట్లు చేయు పితృహత్య (7-56)
5. ప్రయాస మొందనిమిష రాట్సుతుండు (8-125)

### తత్సమ సంధులు

1. దనుజగృహీత సీతఁ దనదారని క్రమ్మఱఁదెచ్చి యేలగఁ (6-29)
2. మనుజేశుని తల్లి పేరమాతఁట (6-115)

### కొనికి క వాడుక

1. చుట్టుక (3-108)
2. కట్టుక (3-109)
3. పట్టుక (4-128)
4. తోలుక (7-82)
5. అలందుక (7-116)
6. ఎత్తుక (8-74)
7. కు వర్ణమునకు ముం దుకారాంత శబ్దములకు నగాగమముఁ జేర్పవిఁకి-కుశిందనందనుఁడు పెట్టిన పత్రిక చూపి రాజుకున్ (8-57)

## ఛందోవిశేషములు

**యతులు :**

1. **స్వరయతులు** (ఋత్వ సంబంధవళి) : ఇ,ఈ,ఋ,ౠ,ఎ,ఏ- లకు వట్రుసుళికి కేవల స్వరములు చెల్లును. క కారాది హల్లులపై వట్రుసుడి(ఋత్వము) చేరియుండగా హల్లులను విడనాడి ఋకారమునకు మాత్రము యతి గూర్చుట విశేషము

ఉదా. కృష్ణ దర్శింపకున్న నా+ కేమిదిక్కు. (2-109)
నాకు + ఏమి (అప్ప 3-28)

2 **వ్యంజన యతులు** (అనుస్వార సంబంధ యతి) బిందు పూర్వక 'ట,ఠ,డ,ఢ' లు బిందుపూర్వక 'త,థ,ద,ధ' లతో యతిమైత్రి నందును

ఉదా: చం, డిక యంతర్హితయయ్యె మామయు
మ ఱం+దిన్ నిద్రమేల్కాంచు (3-116)

3 **భిన్న యతి .**

ధృ+ఇంచు - ధర్+ఇంచు - ధరించు. ధరియించు, ఇంచుక్ పరంబగు నపుడు రెండు రూపములు వచ్చును ధరించు - అనుచోట 'ర'తో యతి, ధ,రి యించు - అనుచోట 'ఇ' కారముతో యతి. ధరియించు - అను రూపమున స్వరయతి - భిన్నయతి యనబడును.

ఉదా: మును, పే నను దీవించు టిది శ+పించుట గాదే. (7-205)

4. **అంత్యోష్మ సంధివడి :**

వర్గహల్లులకు (పొల్లులగు క చ ట త ప ల కు) పరమైన హ కారమునకుఁ ద త్తద్వర్గ చతుర్థాక్షర మాదేశమగు హ కార మంత్యోష్మ మగుటచే ఈ యతి కీ పేరు వచ్చినది.

ఉదా॰ మరుద్ధతి......బ్ర+హ్మాండంబు (3-150)

5. దేశ్య నిత్య సమాస విశ్రాంతి :

గ్ర. కన్గొన మాణిక్యరథంబు దిగ్గి చని సా+ష్టాంగంబుగా మ్రొక్కి
(8-180)

6. నిత్య సమాస విశ్రాంతి. రసాయన శబ్దము.

మట్టి మాత్రంబె పిల్లలమట్టి పేరు,
పేరు వలెగాదు శారదా పీఠకంబు,
వారిలోపల పినవీరు వాక్యసరణి
సరసులకు నెన్న కర్ణ రసాయనంబు. (1-22)

7. అఖండ యతి .

ఈ యతిని అప్పకవి చెప్పలేదు (యతి భేదముగా). అచ్సంధి గల శబ్దము లందు స్వర ప్రధానవడియే పాటింపవలసి యుండగా, ఆ శబ్దద్వయ సమ్మేళ నము (ఏక శబ్దముగా) భావించి, సంధిస్థంమున నిలచియున్న వ్యంజనాక్షరము నకే యతి గూర్చుట అఖండయతి–

(1) నడుమన యొక మార్గణమున + ంచ్చిఱుంచివడిన్ (2-68)

ప్రా స

1. 'ంబ' - 'మ్మ' లకు ప్రాస.

ఉదా అమ్మఖవాజిఁ బాండుతనయాధ్వర వాహ మెదిర్చి మోము
మోవం బసివెట్టి (7-145)

ర-ఱ యతి ప్రాస సాంకర్యము.

శా, రవి మానన్నయభట్టుఁ దిక్కకవి నే బ్రాప్పెగ్గడన్ సోమునిన్.(1-6)

## చిత్ర కవిత

పాదభ్రమకము వ్రాసిన జైమిని భారత కర్త చిత్రకవితా కర్త.
(కందము) (8-221)

వీరవర కైరవ రవీ
సారసభర సౌధయూధ సౌరభ సరసా
వారణ రథ్య రణ రవా
తారభవన తానమావతానవ భరతా.

1. ఈ నాలుగు ఉదాహరణములు "సర్వలక్షణ సార సంగ్రహము"న కూచిమంచి తిమ్మకవిచే చూపబడినది (1927)

2 ప్రౌఢ వ్యాకరణము వ్యాఖ్యాత బులుసు వెంకటరమణయ్య వారి ప్రతి - 1959.

జైమిని భారతములో షష్ఠాశ్వాసము రామాయణోత్తర భాగము. జైమిని భారతమును సంపూర్ణముగా పరిశీలనము చేయు సమయమున నీ యుత్తర రామాయణములోని కొన్ని ప్రధానమైన ఘట్టములను కూలంకషముగా నాలోచింప వలసిన యగత్యము కలదు. ఇట్టి యాలోచనము చేయనిచో నసంపూర్ణమును కాగలదు.

రామాయణమునం దుత్తర భాగమునకు మిగుల ప్రాశస్త్యము కలదు. తెలుగులో నీ యుత్తర రామాయణమునకు బహుళ ప్రచారమున్నది. అట్లే సంస్కృతమునను దీనికి రామాయణకాలము నుండియు ప్రచారము గలదు. ఈ భాగము దేశములోని పలుభాషలలో నాటకములుగను, వచన కావ్యములుగను, వివిధ సాహిత్య ప్రక్రియల నందుకొని యుండుట దీని ప్రాశస్త్యమును సూచించుచున్నది.

### కథాంశముల పరిశీలన

రామాయణోత్తర కాండములోని కథావస్తువునందలి ప్రధానాంశములు[1] :

1 రావణ సంహారానంతరము తిరిగి వచ్చిన శ్రీరాముడు అయోధ్యలో సింహాసన మధిష్ఠించుట.

2 అగస్త్యుడు శ్రీరామునకు రాక్షసవంశ వివరములు చెప్పుట.

3 సీతారాముల గృహస్థ జీవితము

4 శ్రీరాముడు సీతను పరిత్యజించుట

5. శత్రుఘ్నునిచేత లవణుని శ్రీరాముడు చంపించుట

6. శ్రీరాముడు శంబూకుని వధించుట.

7. శ్రీరాము డశ్వమేధమును చేయుట.

8. కుశలవులు శ్రీరాముని చేరుట.

9. సీత పాతాళమును చేరుట.

10. కౌసల్యాదులు స్వర్గమున కేగుట.

11 కుశలవులు పట్టాభిషిక్తు లగుట.

12. శ్రీరాము డవతార పరిసమాప్తి యొనర్చి వైకుంఠమున కేగుట.

## పద్మపురాణము - ఉత్తర రామాయణము

1. శ్రీరాముడు, రావణుని బ్రాహ్మణునిగ నగస్త్యు డెరింగింప, రావణ వధ పాతకమని యెరింగి యశ్వమేధము చేయుట.

2. సీత శ్రీరాముని చేత విడువబడుట కామె చిన్నతనమున కీర దంపతులకు గలిగించిన యెడబాటు కారణమగుట. కీరాంగన శపించుట కీరాంగన చాకియై యయోధ్యయందు జన్మించుట

## కుందమాల - ఉత్తర రామాయణము

కుందమాల (దిఙ్నాగుని)లో రామాయణోత్తర భాగ మారంకములలో వర్ణింపబడినది. అందిచ్చట కావలసిన విషయములను స్పృశించక తప్పదు[2].

1. సీతను రామాజ్ఞచే లక్ష్మణు డడవికి గైకొనిపోవుట. లోకాపవాదాది వృత్తాంతము వివరించుట. వాల్మీకి సీతను దన యాశ్రమమునకు గైకొనిపోవుట.

2. లవకుశులు జన్మించుట తగు విద్దల నేర్చుకొనుట వాల్మీకి రాకకై యాగాది సర్వమును సిద్ధమొనర్చుట కుందమాలను సీత గోమతి నదికి సమర్పించుట.

3. సీత సమర్పించిన కుందమాలను రాముడును, లక్ష్మణుడును, చూచుట. పిదప సమీపమునందలి యాశ్రమమునన నున్న రామలక్ష్మణులు వాల్మీకి వద్ద కేతెంచుట. సీత వారిని చాటునుండి చూచుట రాము డా యాశ్రమ వాతావరణము చూచిన పిమ్మట సీతకై దుఃఖించుట

4. సీత రాముని కంటబడకుండ దీర్ఘిక వద్ద పగలంతయు గడపుట. లవకుశులకు సీతపేరు తెలియకుండుట. తిరస్కరిణీ విద్యచేత సీత రామునికి గనుపింపకుండుట ఆమె నీడను మాత్రమే చూచుట. రాము డామెకై విలపించుట.

5. శ్రీరాముడు సీతను గూర్చిన చింతలో మున్నుట. తన పోలికలు గల్గిన లవకుశులను గని దుఃఖించుట. తల్లి పేరును వారు వివరింపలేకుండుట.

6. లవకుశుల రామాయణ కథాగానము. కథాగానము విని కణ్వుని వలనను, వాల్మీకి వలనను నాటకీయముగా రాముడు, లవకుశులను సీతను దర్శించుట. ఆకాశవాణి సీత గుణములను గుర్తించుట లవుని యువరాజుగా వాల్మీకి యాజ్ఞచే నభిషిక్తుని చేయుట

## భవభూతి :

### (ఉత్తర రామాయణము)[3]

### ఉత్తర రామచరితము - కథాంశములు :

ఈ నాటకమును భవభూతి సప్తాంకములలో రచించెను

1. శ్రీరాముని పట్టాభిషేకము.

2. సీత చిత్రపటముల దర్శించుట.

3 లోకమునందలి యాడికలు శ్రీరాముడు తెలిసికొనుట.

4. లక్ష్మణుడు సీతను గంగాతీరమున విడచుట.

5. కుశలవుల జన్మము - సర్వ విద్యలను నేర్పుట.

6 శ్రీరాముడు సీతా ప్రతిమ నాధారముగాగొని హయమేధము చేయ నుంకించుట.

7. శంబూకుని వృత్తాంతము.

8. పంచవటిలో సీతను స్పృశించినట్లు రాముడు భావించుట.

9. వాల్మీకి యాశ్రమమున జనకుడును, కౌసల్యయు, లవకుశులను జూచి, సీతారాముల పోలికలు వారిలో చూచుట

10 తలిదండ్రుల వివరములు చెప్పక పోవుట

11. యాగాశ్వమును వారు పట్టుకొనుట.

12. పెక్కురు వీరులను వారు జయించుట.

13. శ్రీరాముడు లవకుశులను జూచుట.

14 వారిని జూచుట తోడనే శ్రీరాముడు తన కుమారులని భావించి దుఃఖించుట.

15 లవకుశులు చిత్రకూట వనవిహారాది విషయములు చెప్పుట.

16 వాల్మీకి నాటకీయముగ లవకుశ జననాది విషయములను దెల్పుట.

17 సీత భూమిలో లయమొందెనా యని రాముడు దుఃఖించుట.

18. భాగీరథీ పృథ్వులు సీత నరుంధతి కప్పగించుట. అరుంధతి మాట లచే త్రిలోకవాసులు సీతశుద్ధి నంగీకరించుట. వాల్మీకి కుశలవులను తలిదండ్రుల కప్పగించుట. శ్రీరాముడు సీతకై గూర్చి దీక్షను గైకొనుట

## జైమిని భారతము - సంస్కృతము :

సంస్కృత జైమిని భారతమున కూడ రామాయణోత్తర భాగపు కథకు విపుల ప్రాశస్త్యము గలదు.

1. సీతను శ్రీరాము డడవిలో వదలుమని లక్ష్మణుని బంపుట.
2. సీత కుశలవులను గనుట.
3. వాల్మీకి వారికి సర్వవిద్యలను నేర్పుట.
4. రాముడు యాగమును జేయుట
5. యాగాశ్వమును లవుడు బంధించుట
6. దానికై శత్రుఘ్నుడు, లక్ష్మణుడు, భరతుడు, శ్రీరాముడు, కపి సైన్యముతో వచ్చి మూర్ఛిల్లుట.
7. కుశుడు యుద్ధాది సర్వవిషయములు సీతకును, వాల్మీకికిని నివేదించుట.
8. వాల్మీకి మూర్ఛిల్లిన వారిని పునరుజ్జీవితుల జేయుట.
9. వారందరును నయోధ్యకు వెళ్లుట.

ఇంతవరకు సంస్కృత గ్రంథములలోని తీరు వ్యక్తమైనది. ఇక తెలుగు గ్రంథములలోని తీరును చూడవలసి యున్నది.

## తిక్కన - ఉత్తర రామాయణము :[4]

ఈ గ్రంథమున రామాయణోత్తర కథ కేవలము మూడాశ్వాసములలోననే వ్యాపించినది. కడకిన భాగమున రావణాది రాక్షస వృత్తాంతమే వర్ణింపబడినది.

## అష్టమాశ్వాసము - 139 పద్యములు :

1. శ్రీరాముని వినోద విహారము.
2. సీతారాము లుద్యానమున విహరించుట - జల విహారము.
3. లీలా విహారము-సీత గర్భము దాల్చుట.
4. సీత గంగాతీరమునకు బోగోరుట.
5. రాముడు నర్మసచివుల వలన లోకాపవాదము నెఱుగుట.
6. లోకాపవాద భీతుడై రాముడు తమ్ములతో నాలోచించుట.
7. సీతను విడనాడ నిశ్చయించి, లక్ష్మణుని వెంట నామె నడవులకు బంపుట.

## నవమాశ్వాసము - 109 పద్యములు :

1. లోకాపవాద వృత్తాంతము లక్ష్మణుడు సీతకు చెప్పుట.
2 సీత చింతించి లక్ష్మణునితో నయనిష్ఠురముల నాడుట.
3. సీతను విడిచి లక్ష్మణుడు తిరిగి వచ్చుట
4 మునిపుత్రులవలన సీతా వృత్తాంతము విని వాల్మీకి తన యాశ్రమమునకు దోడ్కొని పోవుట
5 లక్ష్మణు డన్నతో తన విధిని నిర్వర్తించితినని వివరించుట
6 లక్ష్మణుడు రామునకు దుఃఖోపశమనము గావించుట
7 దుఃఖమున రాముడు సీతను దలంచి చింతించుట.
8 లవణుని వృత్తాంతము.

## దశమాశ్వాసము - 163 పద్యములు

1. లవణుని శత్రుఘ్నుడు చంపుట
2. శంబూకుని వృత్తాంతము.
3. అగస్త్యుని యాగము చూచుటకై రాముడు వెళ్లుట.
4. రాము డశ్వమేధము నాచరించుట
5. కుశలవులు గానము చేయుట
6. రాముడు వారి గానము విని సన్మానించుట.
7. వాల్మీకి రామునికి లవకుశుల నప్పగించుట
8. రామచంద్రుడు పుత్రసహితుడై నిజనగరమున కేగుట.
9 కుశలవులకు రాముడు రాజవిద్యల నేర్పించుట.

## ఉత్తర రామాయణము: ద్విపద

తిక్కన తరువాత తెలుగులో ఈ యుత్తర రామాయణము వ్రాసినది కాచభూపతి, విఠలరాజు, - వీరు దీనిని ద్విపదలో వ్రాసిరి. ఇది శ్రీరామ నిర్యాణ పర్యంతమును వ్రాయబడినది అమూలకములైన లోకమునందలి కథలు కూడ రంగనాథ రామాయణమున గలవు. రంగనాథ రామాయణ కర్తయగు గోన బుద్ధారెడ్డి కుమారులైన వీరు వ్రాసిన ఈ గ్రంథము రంగనాథరామాయణోత్తర భాగముగ పేర్కొనబడినది

భద్రుడు లోకాపవాదమును శ్రీరామునికి తెలియజేయుటయు, శ్రీరాముడు పరులకు గనుపింపక, కామరూపమున నిరువురు స్త్రీలతో నుండుటయు, నొక్క రక్కసి సీతబుద్ధి కెక్కించుటయు, సీత శ్రీరాముని పైవిషయ మడుగుటయు నిందు గలవు.[5]

## జైమినిభారతము: ఉత్తర రామాయణ విశేషములు
## (పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు)

1 శ్రీ రాముడు దుస్స్వప్నము గనుట.

2. చారులచే చౌరుల వృత్తాంతము దెలియుట.

3. శ్రీరాముడు సోదరులతో జానకి నెడబాసెదననుట.

4. లక్ష్మణుడు సీతాదేవి నరణ్యమునకు గొనిపోవుట.

5. జానకి మార్గమున దుశ్శకునములు చూచుట.

6. లక్ష్మణుడు సీతకు రామాజ్ఞ నెరింగించుట.

7. సీత తన దురవస్థ లక్ష్మణునితో జెప్పి శోకించుట.

8. వాల్మీకి యాశ్రమమున సీత కుశలవులను గనుట.

9. శ్రీరాముని యశ్వమేధము.

10. కుశలవులు యాగాశ్వమును బంధించుట.

11. శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు క్రమముగా వచ్చి మూర్ఛితులగుట

12. శ్రీరాముడు మూర్ఛనుండి తేరుట.

13. సోదరులతో, పుత్రులతో శ్రీరాము డయోధ్యను జేరుట.

## సంస్కృత మూలమునందు తిక్కన వదలివేసిన విషయములు

1. బంగారు సీతాప్రతిమ విషయము.

2. సీత రసాతలమునకు బోయిన పిమ్మట జనముల హాహారావములు, శ్రీరాముని దుఃఖము, భూదేవి పైద శ్రీరాము డనుగ్రహించుట.

3. నృగ మహారాజు కథ

4. నిమి కథ

5. లవణాసురుని బాధలకు తట్టుకొనలేమని మునులు శ్రీరామునకు జెప్పుట.

6 లవణుని వధించుట కేగునపుడు వాల్మీకి సౌదాస నరేంద్రుని కథ చెప్పుట

7. దండుని కథ నగస్త్యుడు చెప్పుట.

8. ఇంద్రుని కథను జెప్పి లక్ష్మణు డశ్వమేధమును జేయుమనగా శ్రీరాము డిల మహారాజు కథను జెప్పుట.

9. సీత రసాతలమునకు వెళ్ళిన సమయమున శ్రీరాముని ఓదార్చుటకు బ్రహ్మ వచ్చుట

10 కౌసల్యాదులయు, శ్రీరామ లక్ష్మణులయు గమనము.

ఈ గ్రంథము లన్నిటియందును నుత్తర రామాయణ కథాభాగమున సీతను శ్రీరాముడు త్యజించువరకును సమముగా నడచినది. సీత గంగానదీ తీరమున గుశలవులను గనిన విషయము కూడ గ్రంథము లన్నిటను గలదు. శ్రీరాముడు యాగము ప్రారంభము చేయబోవు విషయ మొక్కొక్క గ్రంథమున నొక్కొక్కరీతి వర్ణింపబడినది.

వాల్మీకి, శ్రీరాముడు సీతను పరిత్యాగము చేసిన పిమ్మట యాగాత్పూర్వ మకస్మాత్తుగా నెటనుండియో లవకుశులను సవన సమయమునకు రాముని కద్దకు తెప్పించెను. ఈ విధమునే తిక్కన కూడ అనుసరించినాడు కుందమాలలో కూడ దిఙ్నాగుడు వాల్మీకినే యనుసరించినట్లు తెలియును. ఇవన్నియు నిట్లుండగా భవభూతి మాత్రము దన యుత్తరరామచరిత్రములో లవకుశులను వాల్మీకి యాశ్రమములోననే సర్వవిద్యలను గరపినట్లును, జనకుడు, కౌసల్యయు వారి నా యాశ్రమములోననే దర్శించినట్లును వర్ణించినాడు. దీనినిబట్టి భవభూతి మాత్రము వాల్మీకి రామాయణము నాధారముగ గైకొనలేదని తెలియుచున్నది.

మొదట వాల్మీకి రామాయణమును వ్రాసినాడు. ఇది త్రేతాయుగమున జరిగినది ఆ యుగమున నాయకుడు శ్రీరాముడు

వ్యాస శిష్యుడని పేర్కొనబడు వారిలో జైమిని కూడ తన భారతమునం దుత్తర రామాయణ కథను వర్ణించినాడు.

ప్రాచీన తెలుగు వాఙ్మయమున నుత్తర రామాయణ కథను వ్రాసినవారు ముగ్గురే వ్యక్తమగుచున్నారు.

1. తిక్కన నిర్వచనోత్తర రామాయణము-పద్యము.

2. కాచవిభుడు - విఠలరాజు (ద్విపద)

3. జైమిని భారత షష్ఠాశ్వాసమందు పద్యరూపమున వ్రాసిన పిన వీరభద్రుడు

వి భా గ ము

సంస్కృతములోనను, తెలుగులోనను, వచ్చిన ఉత్తర రామాయణ చరితముల కాలక్రమము (Chronological order) నీ విధముగ గైకొన వలసియున్నది.

a వాల్మీకి రామాయణము (సంస్కృతము)

b వ్యాసశిష్యుడు-జైమిని సంస్కృతమున వ్రాసిన జైమిని భారతము.

c దిఙ్నాగుడు-కుందమాల- (సంస్కృత నాటకము). (8 వ శతాబ్ది)

d. భవభూతి - ఉత్తరరామచరితము (సంస్కృత నాటకము). (10 వ శతాబ్ది)

e తిక్కన నిర్వచనోత్తర రామాయణము. (పద్యము-తెలుగు) (13 వ శతాబ్ది)

f. కాచవిభుడు, విఠలరాజు-
ఉత్తర రామాయణము (ద్విపద) తెలుగు. (14 వ శతాబ్ది)

g. జైమిని భారత షష్ఠాశ్వాసభాగము నందలి ఉత్తర రామాయణము (తెలుగు) (15 వ శతాబ్ది)

పై గ్రంథకర్తలను రెండు భాగములుగ విభజించవచ్చును పైన పేర్కొన్న గ్రంథములలో కథాకథన దృష్టితో పరికించిన యెడల వాల్మీకి రామాయణము ననుసరించిన వారు దిఙ్నాగుడు, తిక్కన, కాచవిభుడు - విఠల రాజు, - వీరు త్రొక్కిన మార్గ మొకటి. ఈ మార్గము త్రేతాయుగమున జరిగిన రామాయణ కథను వాల్మీకి వ్రాసిన కథారీతి ననుసరించినది. రెండవ మార్గము ననుసరించిన వారిలో ద్వాపర యుగములో ప్రవర్తిల్లిన వ్యాసర్షి శిష్యుడగు జైమిని, భారతమును వ్రాసియున్నాడు. ఈ జైమిని భారతములో మన కగుపడు చున్నది కేవల మశ్వమేధ పర్వమే. అరువది యెనిమిది అధ్యాయములలో గం

యశ్వమేధ పర్వమున పంద్రెండధ్యాయములలో వ్యాపించిన కథతో మనకు ప్రస్తుత సంబంధము గలదు. ఈ భాగము "కుశలవోపాఖ్యాన" మను పేరు గల్గినది ఈ కుశలవోపాఖ్యానము జైమిని యశ్వమేధము నందారవవంతుగా గన్పట్టుచున్నది ఈ కథ ననుసరించిన వారు సంస్కృతమున భవభూతి, తెలుగులో పినవీరభద్రుడు.

## ఉత్తర రామాయణములోని కొన్ని విశేషాంశములు :

### A. అపకీర్తి - వ్యక్తిత్వము :

శ్రీరామునకి సీత పతివ్రత యని తెలియును. రావణుని తోడి యుద్ధము ముగిసిన వెనుక పెక్కేండ్లు లంకలో నున్న కారణమున నామె నగ్నిపరీక్ష చేయుటయు జరిగినది అట్టి యగ్ని పరీక్షను దేవతలెల్లరును విచ్చేసిరి ఇంత జరిగిన పిమ్మట కూడ శ్రీరాముడు కేవలమొక రజకుని మాటనునుబట్టి సీతను గంగాతీరమున వదలి వేయుమని లక్ష్మణుని యాదేశించినాడు అట్లు వదలి వేయు నాటికి సీత గర్భవతి. రామావతారము దశావతారములలోని మానవావతారము. కాని యట్టి మానవావతారమునకు ప్రతీక యగు రాముడు కేవలము మానవుడు కాడు మానవోన్నతుడు. రామాయణమునకు ఉత్తర భాగము నందున్న ఈ కథ జనసామాన్యమున కాదర్శ ప్రాయమైనదని పెక్కండ్రు విమర్శకులు పేర్కొని యున్నారు. సామాన్య మానవు లిట్టి యపవాదమును లెక్కసేయరు. లోగడ రామ రావణ యుద్ధమైన పిమ్మట సీత పాతివ్రత్యమును లోక మెరిగినది. అయినను రాము డీ కథలో రజకుని మాటను చారుల వలన విని వదలివేయుట యేమంత సమంజసమైన విషయము ? అట్లు చేయనిచో శాశ్వతమైన కీర్తికి భంగము వాటిల్లు ప్రమాదము కలదు. అందుననే రాము డాదర్శపురుషుడైనాడు.

రాముడు తన తండ్రిమాట జవదాటలేదు అట్లు పదునాల్గేండ్లడవిలో గడపినాడు. సీతాసమేతుడై వెళ్లినాడు అట్లు చేయడేని ''అపకీర్తి'' రాగలదు. తిరిగివచ్చి రాజ్యము చేతుననిగాని, తానడవిలో నున్న సమయమున తండ్రి చనిపోవునని గాని యూహించలేదు. రాజుగా నాతడు ధర్మరాజు. నేటికిని ''రామరాజ్య'' మను పేరు నిలిచియున్నది.

## స్వప్నము - పూర్వరంగము

రాముని వ్యక్తిత్వమునకు లోకమున పన్నె తెచ్చినవారిలో లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు కూడ గలరు. సీత నడవికి బంపుటకు ముందు శ్రీరాముడు దుస్స్వప్నములను గనినాడు ఈ విషయము సంస్కృతాంధ్ర జైమినిభారతము లలో గలదు.

నాలుగుమాసము లరుగఁగఁ
దా లక్ష్మణుచేత సీతఁ దడయక గంగా
కూలమున విడువఁ గల గని
యాలో మేల్కాంచి గుండియ తటాలనఁగన్. (జై. భా. 6-18)

ఈ కల రామునికి చరమనిశావేళలో వచ్చినది అనగా తెల్లవారుజామున వచ్చినది. ఆ సమయమున వచ్చిన కలలు నిజమగు ననుట మనకు లోకమున తెలియుచున్నది. ఈ సందర్భమున వసిష్ఠుడు పుంసవన క్రియలు చేయవలెనని తెలిపినాడు జనకుడు వచ్చి చూచి వెళ్ళినాడు. సరిగా నా సమయమందే జానకియు భర్తతో తనకు గంగాతీరములందు విహరింపవలెనను కోర్కె గల్గినట్లు వివరించి నది. 'సరే' యని రాముడా మరునాడు పంపగలనననినాడు ఆ రాత్రి చారులచే సీతా విషయకమైన యపవాదును రాముడు విని, తన కల కల్లగా లేదు నిజమైనదని భావించినాడు. అట్లపవాదము వేసిన రజకుడు పూర్వజన్మ మున కీరము. సీత చిన్నతనమున నా కీరదంపతుల నెడబాపినది ఆ కారణ మున కీరాంగనచే శపుతురాలైన సీత పెక్కు వత్సరము లడవిలో గడపి,భర్తతో సుఖముగా జీవితమును గడపవలయుననుకొను సమయమున నెడబాటును బొంది నది శ్రీరాముని స్వప్నమునకు సీతాగతమైన శాపము తోడైనది ఫలితము తప్పలేదు.

## B: లోకాపవాదము: మానవీకరణము

నాటకీయముగా సీతను శ్రీరాముడు గంగాకూలమునకు బంపెను. ఆ కార్యమునకు లక్ష్మణుడాలంబనము. తమ్ము లీ కార్యము చేయవద్దని చెప్పినారు. రాముడు, లక్ష్మణుని బిలచి "ఏవా పనిని జేయనిచో నొక్క కత్తి వ్రేటున దన శిరము ఖండించు" మని చెప్పెను లక్ష్మణుడు సీత నడవికి గొనిపోవు సమ యమున దుశ్శకునము లెదురైనవి. దారిలో రామాజ్ఞ నామెకు లక్ష్మణుడు తెలుప

నామె యేడ్చినది. మూల వాల్మీకములో లక్ష్మణుడు సీతతో మాట్లాడిన విష యము లేదు. నాటకీయముగా నీ సంభాషణము మిక్కిలి ప్రాశస్త్యమును వహించియున్నది. కాని దీనిని వాల్మీకి యేలనో వ్రాయలేదు.

అట్టి సమయమున తిక్కన సీత చింతించినట్లును లక్ష్మణునితో నయ నిష్ఠురముల నాడినట్లును వ్రాసినాడు. ఇట్టి వాక్యములు జైమిని భారతమునందును గలవు. మూలమునందు లేని విషయమగు నిది పదియారు పద్యములలో తిక్కనచే వ్రాయబడినది.

సీ. అఖిలధర్మస్థితి నపచారి యందునే?
యౌవనంబునఁ దప మాచరించెఁ;
గరుణాసముద్రుఁడు గాఁ దందునే? యట్టి
యపరాధిఁ గృతక వాయసముఁ గాచె,
నాశ్రితరక్షమై నర్థి లేఁ దందునే?
పగతుతమ్ముని రాజ్యపదవి నిల్పెఁ;
బాటించి నన్ను సంభావింపఁ డిందునే
నాకుఁగా నెన్ని యత్నములొ చేసెఁ;

తే. బతి జనించిన కోలెను బరహితైక
లోలమతి, యొదల సిదిమిన బాలు వచ్చు
నాతఁ డిది కార్యమని నిశ్చయంబు చేత
నా యభాగ్యంబు, యొండొక వేయు నేల.
(నిర్వచనోత్తర రామాయణము ౮-౨౨)

ఇదే విధమైన పద్యమును వీరభద్రుడు కూడ తన గ్రంథమున వ్రాసి, సీతాదేవి మానసికస్థితిని వ్యక్తపరచి యున్నాడు. దాని నిట చూడనగును.

సీ. విపుల బాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నా నిమిత్తంబ కాదె
చలపట్టి దైతేయ శాంబరీ మృగము మ
స్తముఁ ద్రుంచె నానిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన
దాఁటించె నానిమిత్తంబ కాదె

కదనరంగమున జగద్ద్రోహిఁ బఱ్ఱికం
 ధరుఁ గూల్చె నానిమిత్తంబు కాదె.

తే. యట్టిరాముఁడు తాన నన్నడవిలోన
విడిచి రమ్మని నిన్నుఁ బంపించె నట్ల
తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును. (జై. భా. 6-71)

ఇట్టి పద్యమే కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణమునందును గలదు. ఇట్లే తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందు సీత మరికొన్ని వాక్యములు పల్కినది.

''...... ..మొగమాట లేక మ
న్ననయెడనైన రాజులు మనంబులు ద్రిప్పఁగ బల్కఁగల్గునే?
(ని.ఉ.రా. 9-27)

''... . ...నీవును
బూని యొనర్చు టది యెల్లఁ గొల్చెమె చెప్పుమా?
(ని ఉ.రా 9-28)

''............ యట్లు జగంబువారలున్
మానము లేక యీ తులువమాటల నాడెనాద దుస్సహంబైనది''
(ని.ఉ రా 9-30)

సీతాపాత్రచిత్రణమున నీ వాక్యము లతి చిత్రములుగా గన్పించినవి. ఈ పద్యభాగములు తిక్కన రచించుట సీతలోని బాధను వ్యక్తము గావించుటకే వ్రాసినట్లు కన్పించును సీస పద్యములో నొక్కొక్క పాదమున నొక్కొక్క మహత్కార్యము నాతడు చేసియున్నాడు. వానిని సీత పల్కుచు, న్యాయాన్యాయ విచారణ పునరుక్తము గాలేదని భావించినది.

పై పద్యములలో సీతను తిక్కన కొంతవరకావేశపూరితయైనట్లు చిత్రించి నాడు. ఆమె పల్కులు మానవస్త్రీ పల్కులయట్లున్నవి. కాని వీరభద్రుని గ్రంథమున సీత ఇంత యావేశము కానవచ్చుట లేదు. ఎన్నేండ్లనుండియో శ్రీరామునితో సీత సంసారము చేసినది. ఐనను భర్త స్వభావమును, గుణగరిమను సీత గ్రహించలేదా? యను ప్రశ్న యుదయించుచున్నది వీరభద్రుని సీతలో నొక బాధామయమైన మూర్తి గోచరించుచున్నది.

ఉ. దీక్షితుఁడైన కౌశికుఁడు దేరఁగ నాఁడు వివాహవేళ నా
లక్షితకాకపక్షసమలంకృతమున్ నవరత్నకుండల
ప్రేక్షితమున్ సుధాకిరణబింబనిభంబు విశాలపుండరీ
కాక్షము నైనరామునిముఖాంబుజ మెన్నఁడుఁ బాయదాత్మలోన్.

క. ననుఁ బాసి విరహతాపముఁ
గొని తీఁగలఁ గౌఁగిలించుకొనె నఁట నేఁడ
వ్వన వల్లులలోనన్ న
న్ను నునిచెనఁట రాముఁ డేమనుదు దైవంబున్.

తే. అత్తలకుఁ గేలు మోడ్చితి ననపరాధ
పూర్ణగర్భిణి యని మనంబున గణింప
కడవిఁ ద్రోయించె నను రాముఁ డనుము చనుము."

జై. భా. (6-72, 73, 74)

ఈ పద్యము లందుకు నిదర్శనములు. కావున జైమిని భారతములో సీత కరుణాభరితయగునొక స్త్రీమూర్తి యగుచున్నది. కాని తిక్కన సీతలో దెబ్బ తినిన బెబ్బులి కానవచ్చుచున్నది. ఆమె పల్కులు నిందాగర్భితములు కావు. మాటలలో వ్యంగ్యత లేదు. వాచ్యముగ లోకులను, "మానము లేని వారని" నిందించినది ( 9-30 ని ఉ. రా. ). కాని, వీరభద్రుని సీతలో నుదాత్తత - కరుణము సమపాళ్లలో కలయబోయనైనది. తిక్కన సీతలో "ఆత్మగౌరవము" తొంగిచూచుచున్నది. కాని వీరభద్రుని సీతలో విధికి గట్టుబడిన 'హతభాగిని' నిండుగా గన్పట్టుచున్నది. ఈ విధముగా రెండు గ్రంథములలోని సీతలో ద్వైవిధ్యము గోచరించుచున్నది. కాని యతిమానుషమగు గుణములు గాక, 'మానవీకరణమే' మన కిమెయందు స్పష్టమగుచున్నది. జైమిని భారతమున నీ ఘట్టము మిగుల రసవత్తరమైనదై యలరారుచున్నది.

## C. యాగము

సీతను విడనాడిన శ్రీరాముడు పెక్కు విధముల దురపిల్లినాడు. ఇట్లు వివిధరీతుల విచారించుచున్న రాముని లక్ష్మణు డశ్వమేధము చేయుమని చెప్పినట్లు వాల్మీకి మూలరామాయణములో గలదు జైమిని సంస్కృతమున శ్రీరాముడే

సవనమును జేయ నుంకించినట్లును దెలిపినాడు. జైమిని వ్రాసినదే యుక్తి యుక్తముగ నున్నది. తెలుగు జైమిని భారతమున రాముని పల్కులను గవి తెలిపిన రీతి-

"హయమేధ మఖిలపాప
క్షయ మని నిగమములు చెప్ప" (జై భా 6-101)

ఇట్లు హయమేధము జేయుటకు శ్రీరాముడు కారణమును వేర్కొనినాడు. రావణుని వధించుటచే బ్రహ్మహత్యాపాతకము జుట్టుకొనినదని (6-98) దాని నుండి విముక్తుడగుట కట్లు చేయుదుననినాడు. వసిష్ఠ, విశ్వామిత్ర, జాబాలి, గాలవ మహర్షులను జూచి యా సవనము జేయుటకు దగిన విధులను వివరింపు మనినాడు (6-100)

వివరము లన్నియును గ్రహించిన రాముడు యాగమునకు సర్వసన్నద్ధమై యాగము నారంభించినాడు బంగారు సీతా ప్రతిమని నిర్మింపించినాడు. రాముడు, హయము వెంట శత్రుఘ్నుని, సైన్యమును బంపి, హరిహర బ్రహ్మాదులతో గలసి దిక్పతులు వెంటవచ్చినను, సవనాశ్వ మాతనిచే రక్షింపబడవలెనని వీడ్కొలిపినాడు. అశ్వము వరుణపురము వరకు వెళ్ళినది అచటి కాననమున రాముని జ్యేష్ఠపుత్రుడైన లవుడు హయముఖమున గల పట్టికను జదివి కోపము వచ్చి బంధించినాడు (6-116)

యుద్ధ కారణములు

లవుడు బంధించుటకు గొన్ని కారణములు కానవచ్చుచున్నవి. "వీర మాతయగు కౌసల్యా పుత్రుడు రఘుపతి" విడిచిన యశ్వమగుట మొదటిది. రఘుపతి తన తండ్రియనియును దెలియకుండుట రెండవది. శౌర్యపరాక్రమాదు లతో రాజోచిత విద్యలన్నియు నేర్చుకొనిన లవుడు తన విద్యను బ్రదర్శించుట కంతవరకు నెట్టి యవకాశమును లభింపమి మూడవ కారణము. సర్వస్వమైన తమ తల్లికన్న కౌసల్య వీరమాత యగునా యనుట నాల్గవ కారణము. ఈ కారణములన్నియు యుద్ధ విద్యా సంపన్నుడగు లవునిలో రాశీభూతములై సహజ క్షత్రియవంశ మర్యాదను నిలబెట్టగా గుణము ముందరి కడుగిడలేదు.

### పర్యవసానము - ప్రోద్బలము :

లవకుశులు రాముని కుమారులని వాల్మీకి సర్వయుద్ధ విద్యలను నేర్పి విశారదులను గావించినాడు రాముడు సూర్యవంశము నందు జన్మించినాడు రాజసత్తముడు. లవకుశులును నదే వంశము నందలివారు అంగా క్షత్రియ వంశ విద్యలన్నియు విధిగా వారికి రావలయును రాజులు రజోగుణ ప్రధానులు తమ తల్లి తమకు సర్వస్వమని నమ్మిన లవునకు కౌసల్యా పినమాత యుటయు సీర్ష్యా హేతువైనది ఆ గుర్రము నంటిన సైన్యమును, వీరాధివీరులును నెంతటి వారను విషయ మాతనికి దెలియదు పినతండ్రులగు శత్రుఘ్ను, లక్ష్మణ, భరతాదులు వత్తురనియు, పిదపయుచో శ్రీరాముడును రాగలడనియు నెరుగడు. కావుననే పైన వివరించిన మూడవదగు నిజవిద్యా ప్రదర్శనమునకే సమకట్టెను. రాజసమునకే మాత్రమను లోటు రానీయలేదు. అద్వరఘోటకమును బట్టుకొనిన పెద్ద కుమారుడు లవుడు మూర్ఛిల్లినాడని పని తల్లి విలపించినట్లు మునులు తెలిపిన పై విషయము విని, కుశుని "కుశలదవై గెలువు రిపుల నిరంకుశ వృత్తి" (6-184), యని యుద్ధభూమికి బంపినది యుద్ధమున కెవ్వరు వచ్చిరను విషయమును సీత గ్రహించలేదు ఆమె వీరమాత. ఆమె కా సమయమున కదియు జ్యేష్ఠ పుత్రుడగు లవుడు మూర్ఛిల్లినాడని తెలియుటతో నింత పిరికితనము కావలెనను దీక్ష వహింపుటచే దానితో కుశుని దీవించి పంపినది ఆ పరిస్థితిలో సీత శత్రువు లెవ్వరను విషయము గ్రహింపకుండుటయు యుక్తియుక్తము. అది లవకుశుల శౌర్యమును వ్యక్తపరచుట కేర్పడిన కారణము

జానకియు రజోగుణము నవలంబించినది. కావుననే పట్టుదల మెచ్చెనది. తల్లి యాశీర్వచనబలము చేతను, సౌరమంత్ర ప్రభావమునను, నిజపరాక్రమబలసంపద చేతను, కుశుడు - శత్రుఘ్నుని, లక్ష్మణుని, భరతుని, కపిసైన్యమును, చివరకు శ్రీరాముని కూడ మూర్ఛ నొందించెను అంతియెగాదు, సీతాసుతులు మూర్ఛిల్లిన యోధులందరి తొడవులను, మణిహారములను గైకొని, రథముపైనా యోధుల శరీరములను గొని, తల్లికి జూపినారు దానికి జానకి విస్మయమంది, "రాఘవుని మీరు గెల్చుట జీంకపిల్లలు సింహము జయించు తెఱగు"- అని ఎవరించియు, "దైవిక మెట్లు తెలియవచ్చు ననియు" "నజ్ఞాతవాసనై వనమున నున్న నా పదియేను పాటు మీచే బయల్పడియు"

ననియు దెల్పినది అనగా దీని యర్థమామె కజ్ఞాతవాసము ముగిసె ననుట-చెప్పకయే చెప్పుచున్నది. ఈ మాట సీత పతివ్రతాతిలకమనుటను మరొక్కమారు చెప్పుచున్నది. ఈ విషయ మంతయు నారదుని వలన నెరిగిన వాల్మీకి లవకుశుల నాశీర్వదించి, వారిచే సర్వమెరిగి, రామాదుల మంత్రయుక్తముగా దేహక్షాళన మొనరింప వారందరును బునరుజ్జీవితులైరి

### హితబోధ - మందలింపు

చ. "తనయుఁడు దాపలప్రకృతిఁ దప్పి యొకానొక తప్పు చేసినన్
గని కరుణింపగావలయుఁ గాని ఖలంబున విగ్రహింపఁగాఁ
జనదటులుండెఁ బుత్రు లనిశంబును జూపెడు శౌర్యతేజముల్
జనకున కెయ్యెడం బరమసౌఖ్య విశేషము లెన్ని చూచినన్."

సీ. చిరుత ప్రాయమున పెచ్చిన తాటక వధించి
జమదగ్నిసూను గర్వము గుదించి
ఖరదూషణాదులఁ గాలుని పురికన్పి
మారీచు చర్మ వర్మములు చించి
యోజనబాహు నత్యుగ్రత వధియించి
యనిమిషాధీశు నందను హరించి
లవణ పయోరాశి నవలీల బంధించి
దశకంఠు నాహవస్థలి నడంచి

తే. నట్టి భవదీయచటుల బాహాప్రతాప
విక్రమాటోపమున కంగలించి నిలువఁ
బద్మగర్భాదులకు నీతఁబంటి యనినఁ
జెప్పఁ పిటిన వసవల్పు శిశువు లెదిరె.

క. పాతాళమునకు వరుణా
హూతుఁడనై యేను బోవ నుద్వృత్తి నప
ఖ్యాతి యిటు సంభవించెను
నీ తనయులు ని న్నెఱుంగ నేరనితనన్

(జై. భా. 6-244, 245, 246)

వాల్మీకి పలికిన ఈ మాటలు సంస్కృత జైమినిభారతమున లేవు. పిన వీరభద్రుడు సమయ సందర్భోచితిని బట్టి వాల్మీకిచే పలికించినాడు. ఇట శ్రీరామునికి వాల్మీకి చేసిన హితబోధ కానవచ్చుచున్నది. శ్రీరాముడు తన తమ్ములందరును నిహతులైన పిమ్మట కోపోద్రిక్తుడైనాడు.

యుద్ధమునకు వచ్చిన వెంటనే కుశుని పుట్టుపూర్వోత్తరముల నడిగి తెలిసికొని పిమ్మట యుద్ధము చేసినాడు. ఆ కారణముననే వాల్మీకి పై విధముగా శ్రీరాముని కొంత మందలించినట్లు కూడ స్పష్టపడుచున్నది తన కుమారుడని తెలిసిన పిమ్మట కూడ రాముడు యుద్ధము నాపలేదు అనగా పౌరుషభావమతనిని యుద్ధమునకు ప్రోద్బలము చేసినది. అతని హృదయకుహరమున కుమారుని శౌర్య తేజమున నుట్టిపడు పరమసౌఖ్య విశేషము కానరాలేదు అట్టియెడ యుద్ధము తథ్యము, అనివార్యము రామునితో సమమైన బలపరాక్రమముల గల్గినవారు లవకుశులని కూడ వాల్మీకి స్పష్టము చేసినాడు తండ్రి, తన కుమారుని పొగడుట తగని విషయము (అనౌచిత్యము). కవి యగు వీరభద్రుడిది యెరిగినవాడు కావుననే రాముడు వారిని పొగడినట్లు వర్ణించలేదు తాను సీతాపుత్రుడనని కుశుడు పల్కినాడు. తన కుమారునితో దాను యుద్ధము చేయుటలో రాముడు సందేహము జూపలేదు ఆ యుద్ధభూమిలో వారు పితాపుత్రులు కానేరరు యుద్ధమూర్తులు, పరాక్రమ మూర్తులు, శౌర్యతేజో బలపరాక్రమ సంపన్న సమానస్కంధులు కాని వాల్మీకి పితాపుత్రుల మధ్య యుద్ధము జరిగిన సమయమున సమీపమున లేడు కావుననే "అపఖ్యాతి యెటు సంభవించె" నని కూడ తెల్పియున్నాడు ఇచట వాల్మీకిపాత్ర తగాదాలు దీర్చు పెద్దమనిషి) మధ్యవర్తి పల్కిన పల్కులుగా స్పష్టపడుచున్నవి రాముడు యుద్ధమున నోడినాడనిన నపఖ్యాతి గదా! కాని సముయుజ్జీలైన కుమారులచేత నోడింపబడుటయు ఖ్యాతిదాయకము అట్లు వారిద్దరును యుద్ధము చేసియే యుండవలయును విధివశాత్తున నిర్వురకును నాహవము ప్రవర్తిల్లినది కుమారుడు తండ్రి నెదిరించినట్టి యపఖ్యాతి లోకసహజతకు విరుద్ధము ఎంతటి వీరుడైనను గుమారుడు తండ్రి నెదిరించుట యుక్తి యుక్తముగా గానవచ్చుట లేదు కాననే వాల్మీకి దాని నపఖ్యాతి యనియు, గుమారులు రాము నెరుగని కతమున నాహవము జరుగుటకు గారణమైన దనియును సార్థకముగా వివరించినాడు వీరభద్రుడు కూడ పితాపుత్రుల మధ్య విధిచే విపరీతమైన యుద్ధ సమస్యను

మిక్కుటమైన శిల్పముతో రచించి, దానిని తర్కబద్ధమైన హేతువుల కాటపట్టుగ నిలిపినాడు.

## శిల్పము

జైమిని సంస్కృతమున వ్రాసిన భారతమే వీరభద్రుని యాంధ్ర జైమిని భారతమునకు మూలము. సంస్కృతమున కుశలవోపాఖ్యానము పండ్రెండధ్యాయములతో గూడినది. ఇందు యుద్ధము సప్తాధ్యాయ పర్యంతము వర్ణింపబడినది. ఇందలి శ్లోకములు నాలుగు వందల నాలుగు. కథాకథనదృష్టితో వీరభద్రుడీ యుద్ధవర్ణనను దెలుగులో నూట యిరువది పద్యములలో వర్ణించినాడు. కుశలవోపాఖ్యానమును నీ కథలో తక్కిన భాగమునకన్న యుద్ధభాగమే మిక్కుటముగా వర్ణితము. పరిమాణదృష్టితో జూచినను యుద్ధవర్ణనకే మిగుల ప్రాధాన్య మీయబడవలెను. లేనిచో లవకుశుల యుద్ధప్రవృత్తి స్పష్టము కాదు.

కథలో నాయువుపట్టులైన పై యుద్ధాదిక విషయము లేలనో వాల్మీకి వ్రాయలేదు. తరువాత భవభూతియే దీనిని గ్రహించినాడు. వీర రస స్ఫూర్తిని వ్యక్తము చేయదలచి జైమిని యిట్టి రసనిష్యందవ్యక్తమగు నుపాఖ్యానమును సిద్ధము గావించుటకు స్వప్రతిమానమైన శిల్పమును బ్రదర్శించినాడు. తెలుగులో తక్కిన పై భాగమంతయు విడచివేయుటకు (1) మూలరామాయణ కథ (వాల్మీకి) నాధారముగా గ్రహించుట (2)పితాపుత్రులమధ్య జరిగెడు యుద్ధమనౌచిత్య ద్యోతకమనుకొనుట - ఈ రెండును గారణములు. వీరభద్రుడు జైమిని వ్రాసిన సంస్కృత జైమిని భారతము నాధారముగా తన కథను వెలయించినాడు. కాని దీని (కుశలవోపాఖ్యానము) ప్రాధాన్యమును గ్రహించి మూలమును మించి రక్తితో, యుక్తితో, సమయస్ఫూర్తితో, శిల్పమును బాదించినాడు. అట్లే రసశిల్పమును బ్రదర్శించినాడు.

## D. జైమిని భారతము : యుద్ధవర్ణనకు గల కారణములు
## ( కుశలవోపాఖ్యానము )

### రాముడు ధీరోద్ధతుడు కాదు

మాయాపరః ప్రచండశ్చపలోఽహంకార దర్పభూయిష్ఠః
ఆత్మశ్లాఘానిరతో ధీరైర్ధీరోద్ధతః కథితః (సాహిత్యదర్పణము)

మాయలమారితనము, ప్రచండత, చాపల్యము, అహంకారము, ఆత్మ శ్లాఘమను గుణాలు ధీరోద్ధతుడు - అట్టి గుణములు శ్రీరామునిలో లేవు.

శ్రీరామునితోడను, పినతండ్రులతోడను లవకుశులు యుద్ధ మొనర్చుట - అనౌచిత్యమైనట్లు గానవచ్చును. కాని దీనికి గారణము - యుద్ధమునకు వచ్చిన వారెవ్వరను విషయము లవకుశులకు తెలియదు. వారు యుద్ధ మొనర్చుటలో శిల్పమున్నది. ఈ కారణమున రౌద్ర రసాభాసమిట గానవచ్చుట లేదు "రౌద్రే గుర్వాది గత కోపే"? రౌద్రాభాసము-గురువులగు పితృ, భ్రాతృ, ముని, సుర, యాచార్యులపై గోపము జూపినచో జరుగును. కాని రౌద్రరస నాయకుడు ధీరోద్ధతుడు ఔద్ధత్యలక్షణము లిట వీరెవ్వరికిని లేవు రౌద్రమునకు గ్రోధము స్థాయిభావము వీరరసమునకు ఉత్తమ నాయకము దీని స్థాయి ఉత్సాహము ఇచట నిదే పరిఢవిల్లినది

**ఆయువు పట్టులైన విషయములు**

1 సీతా పరిత్యాగము - రాముని ధర్మనిరతి

2 లవకుశులు యుద్ధము చేసి తండ్రిని మించిన పరాక్రమము జూపి లోకమున కాదర్శము నెరపుట

**అవరోధకములు :**

1 రాముని శౌర్య పరాక్రమ వినయాది సత్త్వగుణ సంపన్నత కుశలవులలో గానవచ్చుట

2. లోకాపవాద భీతిచే సీతా పరిత్యాగము వలన, శ్రీరామ - లవకుశుల యుద్ధము వాటిల్లుట - తద్వారా సీత లోకాపవాదు కల్పితమైనదనుటయు గమనీయము.

3 యుద్ధ వర్ణన బహుళముగా నొనర్చుట వలన లవకుశుల పరాక్రమమునకు విలువ గల్గినది. కొద్ది పద్యములలో వ్రాసిన వారి యుద్ధ నైపుణ్యము కానరాదు.

ఈ కారణములచే జైమినియు, వీరభద్రుడును యుద్ధమును బహుళముగా వర్ణించినారు.

E. మరొక్క విషయము :

లవకుశులు రామునివద్ద యుద్ధ విద్యలు నేర్చుకొనిరనుట నిర్వచనోత్తర రామాయణము లోని దశమాశ్వాసమున నున్నది. ఇట్లు జరుగుట తవకాశము కనుపించుట లేదు. సీత లవకుశుల నడవిలో ప్రసవించినది. వారు రాముని వద్దకు వెళ్లుట కెట్టి యవకాశమును లేదు రామునితో వారు యుద్ధ మొనర్చుటకు దగిన విద్యలన్నియును వాల్మీకియే గురువై నేర్పియున్నారు. ఇట్టి ప్రశ్నలుద యించునను కారణముననే తిక్కన యుద్ధ విషయమే లేకుండ తన గ్రంథమును వెలయించి యున్నారు అడవి నుండి హయమేధ యాగ సమయమునకు వాల్మీకి వారిద్దరిని శ్రీరామున కప్పగించుటకే వెంట గొని వచ్చినాడు. ఇది సమంజస ముగా నున్నది. అందువలనే, శ్రీరాముడు వారికి యుద్ధ విద్యలు నేర్పినట్లు తిక్కన వ్రాయుట తగు నుచితముగా నున్నది.

F. ఉత్తర రామాయణము - సొహరాబ్ మరియు రుస్తుమ్ :

భారతీయ వాఙ్మయ ప్రపంచమున నుత్తర రామాయణమున కెంత ప్రాధాన్య మున్నదో, పారశీక దేశచరిత్రలోని కథ యగు "సొహరాబ్ మరియు రుస్తుమ్" కథకు కూడ నంతియే ప్రాముఖ్యము గలదు. ఇంతవరకు నుత్తర రామాయణలో గ్రంథపు తీరుతెన్నులను గ్రహించియున్నాము.

"సొహరాబ్ - రుస్తుమ్" - కథామూలము[8].

ఉత్తర రామాయణమునకు మూలమైన రామాయణ గాథను, దాని మూల మును విమర్శించి పిమ్మట, దానితో ప్రధాన లక్షణములలో పోలిక గల్గిన "సొహరాబ్ - రుస్తుమ్" - కథా మూలమును గూడ స్థాలీపులాక న్యాయమున విచారించవలసి యున్నది.

ఆంగ్లమున మన కీకథ కానవచ్చుచున్నది. కాని యంతకు ముందు దీనిని చరిత్రరూపకమును చూడనగు

ప్రధానముగా ఫిరదౌసీ యను పారశీక రచయితచే పర్షియను భాషలో వ్రాయబడిన నీ చరిత్ర (1) "షా నామా" యను పేర బరగుచున్నది (2) పిదప ప్రఖ్యాత సైనికుడగు 'సర్ జాన్ మెల్కామ్' (కొంతకాలము బొంబాయి గవ ర్నరు) దీని నాంగ్లమున కనువదించినాడు. (3) 'షానామా' యను నీ గ్రంథము

ఫ్రెంచి భాషలోనికి తర్జుమా చేయబడెను. Mohl అను నాతడు దీని ననువ దించెను ఈ అనువాదపు సమీక్షను సెంటు బొవే (Saint Beauve) చేసి యున్నాడు. (4) T F. Fraser వ్రాసిన "Travels and adventures in the Persian Provinces on the southern Banks of the Caspian Sea" అను గ్రంథము (5) Alexander Burness వ్రాసిన "Travels into Bokhara" గ్రంథమును గూర్చిన Eugene Flaudin వ్యాసములును, "Sohrab and Rustum" కథ నాంగ్లమున Matthew Arnold పద్యరూపమున స్వయం కల్పితము గావించుటకు దోహదములైనవి. ఇది 1853 లో వ్రాయబడిన సత్యోత్తమ గ్రంథముగా నుతి కెక్కినది

## సొహరాబ్ - రుస్తుమ్ - కథావస్తువు

చరిత్రగా వెలసిన ఈ కథ పర్షియనులకు, టార్టారులకు సంబంధించిన యుద్ధ గాథ. పర్షియన్ వీరుడు రుస్తుమ్ టార్టార్ వీరుడు సొహరాబ్. రుస్తుమ్ తన భార్య గర్భవతిగా నున్నపుడామెను వీడి పర్షియన్ రాజ్యమునకు పోవును. ప్రసవించిన తోడనే భార్యను దనకు మగ శిశువు జన్మించినదా? లేక స్త్రీ శిశువు జన్మించినదా తెలుపుమని కోరెను మగబిడ్డ జన్మించినను, రుస్తుం భార్య కుమార్తె జన్మించినట్లు భర్తకు వార్త నంపెను. సహజ వీరము గల రుస్తుమునకు పుత్రుడు గల్గిన వార్త తెలిసిన నాతడు (ఆ బిడ్డడు) యుద్ధమునను బలి యగు నని భావించినని ఆ కారణమున రుస్తుమునకు సొహరాబ్ తన కుమారుడని తెలియుట కవకాశము లేదు పర్షియన్ - టార్టారులకు మధ్య జరిగిన యుద్ధమున వీరిద్దరు వీరులు ద్వంద్వ యుద్ధమునకు దలపడుదురు మొదట జరిగిన యుద్ధ మున సొహరాబ్ తన తండ్రి నోడించియు, చంపుటకు నిరాకరించెను పిమ్మట రుస్తుమ్, సొహరాబ్‌ను యుద్ధమునకు ప్రేరేచి చంపుటకై గట్టి దెబ్బ తీయును. అట్లు దెబ్బ వేయు సమయమున 'రుస్తు'మని గట్టిగా నరచిన యా పర్షియన్ వీరుడే తండ్రి యని గ్రహించి పడిపోవను. వెంటనే 'నీవే నా తండ్రి' వనును. కాని భార్య మాటలు మనస్సులో మెదలి, రుస్తుము 'నాకు వీరుడగు కుమారుడు లేడు. కేవలము కుమార్తె గలదని తెలుపును. తల్లి మాటలను గుర్తుంచుకొనిన సొహరాబ్, తన భుజముపై నున్న గ్రిఫ్ఫిన్ బొమ్మను గుర్తుగా తండ్రికి

జూపును. దానిని జూచిన వెంటనే రుస్తుమ్ మానవాతీతమైన బాధనువడి, సొహరాబ్ కోరిన చివరి కోర్కెలను నెరవేర్చి సైన్యముతో తిరిగి వెళ్లను సొహరాబ్ మరణించును

**మన కగుపడు ముఖ్య విశేషములు :**

ఆంగ్ల వాఙ్మయమునందు కూడ ప్రాచీన సంస్కృతాంధ్ర వాఙ్మయములలో వలె నితిహాసరచన యందు గొన్ని సిద్ధాంతములు సూక్ష్మముగా గానవచ్చు చున్నవి మాథ్యూ ఆర్నాల్డ్ వ్రాసిన ఈ కథపై హోమర్ (గ్రీకు సుప్రసిద్ధ రచయిత) ప్రభావ మధికమై యున్నది. మాథ్యూ ఆర్నాల్డ్ జీవిత మాధునికత కన్న, ప్రాచీన వాఙ్మయమునకు నధికముగా వంకిత మిచ్చినాడు ప్రాశ్చాత్యేతిహాసములలో నీ క్రింది విషయములు స్పష్టపడుచున్నవి

1 ప్రసిద్ధ వ్యక్తుల ప్రత్యక్ష చర్యలు నిరూపించుటకు మాత్ర మితిహాసరచనము

2 వారి పాత్ర చిత్రణమును నిరూపించుటకు మాత్ర మితిహాసములు రచించుట

3 సమకాలీన సిద్ధాంతములు, జీవన విధానముతో గూడిన వర్ణన మిట్టి రచనలోని పాత్రలపై ప్రభావము చూపుట

4 సుప్రసిద్ధ వీరుల మధ్య జరుగు ద్వంద్వ యుద్ధములు, వాని వర్ణనలు, ప్రధాన లక్షణములై యుండుట

5. ఇట్టి వర్ణనములు నాటకీయముగా నుండును

ఈ యైదు లక్షణములను ప్రాశ్చాత్యేతిహాస గ్రంథములలో గలవని రూఢి యగుచున్నది. మాథ్యూ ఆర్నాల్డ్ వ్రాసిన 'సొహరాబ్ - రుస్తుమ్' గ్రంథమున నీ యైదు లక్షణములను హోమర్ ప్రభావము నెట్లు చూపినవో, తెలుగలో జైమిని భారత గ్రంథము వ్రాసిన పినవీరభద్రునిపై వాల్మీకి, జైమినుల ప్రభావమట్లే కనుపించుచున్నది. పూర్వకవులు తమ ప్రభావము తదుపరి కవులపై చూపుట సహజమైనను, తదుపరి కవులు దాని నుండి తప్పించుకొనలేకపోవుటయు, తమ పాండిత్యము చూపుటయు, సైద్ధాంతిక వినూత్న దృక్పథమును గల్గియుంకటయు మనకు వారి కావ్యతత్త్వముగా గోచరించు చున్నది.

మన వాఙ్మయమున విషాదాంత కావ్యములు లేకుండుటకు గల కారణము ; వాని తత్త్వము :

ప్రాచీన కాలము నుండియు మన వాఙ్మయ తత్త్వమున విషాదాంత కావ్యములు లేవు. ప్రాచీనాంధ్ర వాఙ్మయమునను, సంస్కృత వాఙ్మయమునను నిట్టివి కానరావు. సర్వ సాధారణముగా రాజుల గాథలే మనకు కన్పట్టుచున్నవి అట్లుగానిచో రాజర్షుల గాథలను చూడవచ్చును. ఎట్టి కథలైనను, నీతి, ధర్మము, లోకహితము నను గూర్చి నట్టి రచనలే మనకు గానవచ్చుచుండుటచేత లోకము దుఃఖపూరితము కారాదను తత్త్వమును ప్రాచీన గ్రంథములు ప్రపంచించుచున్నట్లు మనకు స్పష్టమగుచున్నది. అందువలనే "లోకాః సమస్తా స్సుఖినో భవంతు" అను ప్రాచీన వాక్యము కానవచ్చుచున్నది. Aristotle దుఃఖాంత కావ్యములను నిర్వచించి యున్నారు. కాని ప్రాచ్య అలంకార శాస్త్రజ్ఞులందరును, దృశ్య కావ్యములలో మరణము, యుద్ధము మున్నగు వానిని చూపవీలు లేదని నారు. దీనినిబట్టి లోక ప్రచారమున "అమంగళము ప్రతిహతమౌగాక" అను వాక్యము రూఢి యైనది. కావ్య ప్రయోజనమును గూర్చి తెలుపుచు, "శివేతర క్షతయే" అని పేర్కొనుటలో మంగళము - కావ్యమునకు విధి యను మాట తెలియుచున్నది.

పై విధమునే సమర్థించుచు, భరతాదులు కూడ "ఆనందము, ధర్మోపదేశము" -అను రెండును కావ్యప్రయోజనములుగా పేర్కొనిరి. దీనినిబట్టి మన వాఙ్మయమున విషాదాంత కావ్యములు వ్రాయుట కవకాశము కనపడుట లేదు.

### ఉత్తర రామాయణము  సొహరాబ్ - రుస్తుమ్
(పోలికలు)

1 ఈ రెండును ఇతిహాసములే.

2 కారణాంతరములయ్యును, గర్భిణులైన భార్యలను విడచుట.

3. తలిదండ్రుల వైవాహిక సంబంధమును పుత్రులెరుగకుండుట.

4. తండ్రులకు కుమారులతో యుద్ధము చేయవలసివచ్చుననుమాట నెరుగకుండుట

5 ఒక్కొక్క యెడ తండ్రిని కుమారుడే జయించుట.

6 యుద్ధకారణ మెట్టిదైనను, యుద్ధ మనివార్యమగుట

7. తల్లులు కూడ తమ కుమారులు, తండ్రులతో దారసపడుట నెరుగకుండుట.

8. జీవిత విమర్శనములుగా నీ రెండు గ్రంథములు గన్పట్టుట.

9. నైతిక సిద్ధాంతముల కాలవాలమై భవిష్యత్ప్రపంచమునకు మార్గ దర్శకత్వము నీ రెండు గ్రంథములు వహించుట

10. విశిష్ట వ్యక్తులే నాయకులగుట.

11. వీరరసమును జిప్పిలజేయు యుద్ధవర్ణన

12 ఈ రెండు కథలును నుపాఖ్యానములే యగుట.

13. ఇందలి వర్ణనములు నాటకీయపద్ధతిలో నుండుట.

14. కళాత్మకము, వస్త్వైక్యమునగు రచన నీ రెండు గ్రంథములలోని గాథలు గలిగియుండుట.

15. కానున్నది కాకమానదను వేదాంతతత్త్వ మితిహాస నిర్మాణ సిద్ధాంతమగుట.

16. అంతులేని పరాక్రమమును బ్రదర్శించుటకై వీరులగు పాత్రలు చూపు నుత్కంఠ.

17. శిల్పమును బోషించుటకై కవులు గైకొనిన జాగ్రత్త.

ఈ విధముగా 'నుత్తర రామాయణ' మును, 'సొహరాబ్ - రుస్తుము' కథయు సుప్రసిద్ధములై, చదివిన కొలదియు నింకను జదువవలయునసనెడి యుత్కంఠను గల్గించు గ్రంథరాజములుగా గన్పట్టుచున్నవి. ఈ రెంటిలోని పోలికలెట్టివో, భేదములును నట్లే ద్రష్టవ్యములు.

### ఈ రెండు గ్రంథములలోని భేదములు

1. యుద్ధమునకు ముందు రాముడు తన కుమారుడగు కుశునెరిగియు యుద్ధము చేయుట.

రుస్తుము తన కుమారుడని యెఱుగక సొహరాబుతో యుద్ధము చేయుట.

2 సీత లవుని మూర్ఛ నెరిగి విచారించుట.

సొహరాబ్ మరణమును దల్లి యెరుగకుండుట.

3 'ఉత్తర రామాయణము' - సుఖాంతము.
'సొహరాబ్ - రుస్తుము' - దుఃఖాంతము.

4. ఉత్తర రామాయణములో వాల్మీకి పితాపుత్రులను గల్పుట.
'సొహరాబు - రుస్తుము' లో పితాపుత్రు లొండొరుల నెరింగియు విధివశమున వేరగుట

5. అశ్వమేధ యాగాశ్వమును లవుడు బంధించి తండ్రితో యుద్ధము చేయుట (ఉ. రా)

టార్తారులతో పర్షియనులు చేయు యుద్ధములో భాగముగా 'సొహరాబు - రుస్తుం' యుద్ధము చేయుట

6. సీతారాముల యెడబాటుకు రాజకీయములే కారణములు; రజకుని పల్కులు తోడ్పడుట.

భార్యను వదలుటలో రుస్తుమునకు రాజకీయ కారణములు తోడ్పడుట.

7 రాముని యవతారము పూర్ణమయ్యు, నతిమానుష లక్షణములు గల్గియుండుట

రుస్తుము సహజ మానవ లక్షణములను గల్గియుండుట

8 రుస్తుము భార్య, తనకు స్త్రీ శిశువు జన్మించినదను నబద్ధము చెప్పియు, సొహరాబ్‌ను మృత్యు గహ్వరము నుండి రక్షించలేకుండుట

సీత భర్తయగు రాముడు, లవకుశులచే మూర్ఛితుడై, పిమ్మట వారి యునికిని గ్రహించుట

9. 'సొహరాబు - రుస్తుము' వస్తువు చారిత్రకము. ఐనను స్వకపోల కల్పన ముండుట

ఉత్తర రామాయణము సంస్కృత జైమిని భారతానుసరణమైన కథా వస్తువు గల్గియుండుట.

ఈ విధముగా గొన్ని పోలికలు, భేదము లున్నను వీనిలో నితిహాస నిర్మాణము, శిల్పదృష్టితో జూచిన పోలికలే మిన్న. పితాపుత్రుల మధ్య యుద్ధములు, వాని నాటకీయత, యుద్ధ పరిస్థితులు- కవుల శిల్ప రచనా రామణీయకతను ద్యోతకము గావించుచున్నవి.

రాముడు కుమారు నెరిగియే యుద్ధ మొనర్చును. తన కుమారుడని తెలియకుండియు, రుస్తుము- సొహరాబును వారించును. కావుననే కొన్నియెడల కవ్వించినట్లు కూడ Mathew Arnold స్పష్టము గావించియున్నారు. రాముడు ధీరోదాత్తుడు, సత్త్వగుణ గరిష్ఠుడు. రుస్తుము సహజరజోగుణ సిద్ధ హస్తుడు ఈ విధమైన తారతమ్యమును మనకు గోచరించుచున్నది.

మూలమా? కాదా?

స్థూలముగా నీ రెండింటిలో నేదో యొకటి రెండవ దానికి మూలమని భ్రాంతి కలుగును. దానికి గారణ మీ రెండింటి యందలి సహజములగు పోలికలు. ఈ రెండును రెండు కథలు. ఒకటి సుఖాంతము. వేరొక్కటి దుఃఖాంతము. రెండింటికిని మూలములు వేరు. ఈ దృష్టితో జూచిన నీ రెండును రెండు దేశములలో వేర్వేరు కాలములలో నుద్భవించి, ప్రవర్తిల్లిన గ్రంథరాజములు- యాదృచ్ఛికమగు పోలికలు గలవు. అంతమాత్రమున నే గ్రంథమును, రెండవ దానికి మూలముగాని, అనుసరణముగాని కాదనుటలో విస్పష్టత గోచరించుటచే, గవేషణకు, విప్రతిపత్తికి స్థానము లేదనుట సత్యదూరము కానేరదు.

---

1. "తిక్కన కావ్య శిల్పము" - సిద్ధాంత వ్యాసము - Dr. K. V. రామకోటి శాస్త్రి - 1978 పుట 10
2 ఉత్తర రామాయణము - ఉపోద్ఘాతము - పుట 41-52 నేలటూరి రామదాసయ్యం గారు. 1965 ఏ పి సాహిత్య అకాడమీ
3 ఉత్తర రామ చరితము - ఉపోద్ఘాతము. పుట 29-36 వ్యాఖ్యాత నేలటూరి రామదాసయ్యం గారు (1965).
4. నిర్వచనోత్తర రామాయణ పీఠిక (1968). డా॥ పాటిబండ మాధవశర్మ (సాహిత్య అకాడమీ)
5 "వీరి రచన తంత్రి రచన యంత యుత్తమము కాకపోయినను రసవంతముగానే ఉండును." పుట 27. ఆంధ్ర వాఙ్మయ చరితము- డా॥ దివాకర్ల వేంకటావధాని.
6. జై. భా. (6-44)
7. కావ్యాలంకార సంగ్రహము- పుట. 4-38. వ్యాఖ్యాత స. సూ. శాస్త్రి. 1959-65.
8. **Matthew Arnold - First Edn. 1963. Second Edn. 1972. Critical Study by Sri C. L. Sastri.**
9 పుట 116, కావ్యాలంకార సంగ్రహము. స.సూ. శాస్త్రి.

కావ్యములు సంస్కృతాలంకార శాస్త్ర సిద్ధాంతముల ననుసరించి రెండు విధములుగా విభజింపబడినవి.

1. శ్రవ్య కావ్యములు
2. దృశ్య కావ్యములు.

ప్రాచీన కాలము నుండియు శ్రవ్య కావ్యము లెన్నియో దృశ్య కావ్యము లుగా మార్చబడుచున్నవి. సర్వసాధారణముగా కావ్యములు శ్రవ్య కావ్యములు. అట్లే అంకము, ప్రవేశకము, రంగము, విష్కంభము మున్నగు వానిచే చూచుట కనువుగా సిద్ధపరచిన వన్నియు నాటకములై దృశ్య కావ్యము లగుచున్నవి. ఇట్టి దృశ్య, శ్రవ్య కావ్య లక్షణములు గల గ్రంథములు ప్రాచీన కాలము నుండియు మన కెన్నియో కనబడుచున్నవి. దృశ్య కావ్య లక్షణములు గల్గినట్టి శ్రవ్య కావ్యములును లేకపోలేదు. ఈ క్రింద దృశ్య శ్రవ్య కావ్యములను గూర్చిన లక్షణకారుల యభిప్రాయ నిర్వచనములను సూచనాప్రాయముగ చూడ వలసియున్నది.

### శ్రవ్య కావ్య స్వరూపము .

1 కవనీయం కావ్యం (వర్ణింప దగినది) (లోచనకారుడు)
2. కవతీతి కవిః తస్య కర్మ కావ్యమ్ (విద్యాధరుడు)
3. కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతి కవిః తస్య కర్మ కావ్యం (భట్టగోపాలుడు)
4. లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యము (మమ్మటుడు)[1]

మరికొన్ని నిర్వచనములు[2]

1. శబ్దార్థౌ సహితౌ కావ్యమ్ - భామహుడు (పుట 94)
2. శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళీ (పు. 94) (దండి)
3. రీతిరాత్మా కావ్యస్య - వామనుడు (పుట 95)
4. కావ్యస్యాత్మా ధ్వనిః (ఆనందవర్ధనుడు)
5. వాక్యం రసాత్మకం కావ్యమ్. (విశ్వనాథుడు) పుట 99.
6. శబ్దార్థోభయము కావ్య శరీరము. (మహిమభట్టు) పుట 100.
7. వక్రోక్తిః కావ్య జీవితమ్. (కుంతకుడు) పుట 101
8. ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితమ్. (భరతుడు)

ఇవన్నియు శ్రవ్య కావ్య సంబంధములైన నిర్వచనములు. ఇక దృశ్య కావ్య సంబంధులైన నిర్వచనములను గాంచనగును.

**దృశ్యకావ్య నిర్వచనములు :**

1 నాటకమితి నాటయతి విచిత్రరంజనా ప్రవేశేన సభ్యానాం హృదయం నర్తయతీతి నాటకమ్.[3] (నాట్య దర్పణము)

2. కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశ లక్షణాన్వితాః[4] (భరతుడు)

3 అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే
రూపకం తత్సమారోపాత్ దశధైవ రసాశ్రయమ్[5]
(నాట్యమే రూపకము)
(ప్రతాపరుద్ర యశోభూషణము)

4 ''పంచ సంధి చతుర్వృత్తి చతుష్షష్ట్యంగ సంయుతమ్
షట్త్రింశల్లక్షణోపేతం గుణాలంకార భూషితమ్
మహారసం మహాభోగ ముదాత్తరచనాన్వితమ్
అశ్లిష్ట సంధి యోగం చ సుప్రయోగమ్ సుఖాస్పదమ్
మృదుశబ్దాభిధానం చ కవిః కుర్యాత్తు నాటకమ్[6]''

ముఖ ప్రతి ముఖాదులగు పంచసంధులు, కైశిక్యాది వృత్తి చతుష్టయము, ఉపక్షేప పరికరాదులగు చతుష్షష్టి సంధ్యంగములు, భూషణ ప్రభృతులు ముప్పది యారు లక్షణములు, మాధుర్యము మొదలైన గుణములు, ఆశీరాదులగు నాట్యాలంకారములు, ఉపమా రూపకముల వంటి కావ్యాలంకారములు- అను వివిధ సామగ్రి సమలంకృతమైనదిగా కవి నాటకమును సృజించవలెను. శృంగార, వీర, కరుణాదిరసబంధురమును, బహుభాష సంపన్నమును, ధీరోదాత్తాది నాయక గుణ వర్ణ భాసురము, పవిత్ర వైదిక ధర్మ బోధకమును, సహృదయ మనః ప్రీతి హేతువును- అగునట్టిదిగా నాటకము విలసిల్లవలెను. సూత్రములు కూర్చినట్లుగా సంధ్యంగము లొండొంటితో కూడి యుండునట్లును, లాస్యాంగములు మెఱయు విధముననను, మంజుల వృత్తాంతములు వెలయు రీతిని, అశ్లిష్ట మృదు పదము లెసగు కరణిని నాటకమును రచయిత తీర్చిదిద్దవలెను

మన జైమిని భారత గ్రంథములో- నాటక లక్షణములన్నియు లక్షిత ములై యున్నవి. ఈ గ్రంథము మహాభారతము వలె నితిహాసమై యుండియు, నాటక లక్షణములుండుటచేత, "ఇతిహాస నాటకము" (Epic Drama)- భాగలందులకు భిన్నాభిప్రాయ మున్నట్లగుపడదు. ఆ లక్ష్య లక్షణ సమన్వయ మిట నొనరింపబడినది.

వ్యాస శిష్యుడైన జైమిని తన గురువుగారి లక్షణములను బుడికి పుచ్చు కొని యాతని కలిమానమైన గ్రంథమునే తానును రచించినాడు. నేడు మనకు జైమిని భారత మనబడు గ్రంథములోని అశ్వమేధపర్వమే కానవగుచున్నది. ఆ భాగములోని అశ్వమేధపర్వమే కానవగుచున్నది. ఆ భాగములోని విషయములే పిరభద్రకవి అష్టాశ్వాసములలో రచించియున్నారు.

భారతము వలె జైమిని భారతమును ఇతిహాసమే ఈ గ్రంథమున పెక్కు విషయములు స్ఫురించుటయే కాక నాటక లక్షణములు కూడ గోచరించు చున్నవి నాటక లక్షణములలో ప్రధానముగా నారు గలవు 5

1 ఘటనల ఐక్యము
2 ఘటనా సార్థకత.
3. ఘాత ప్రతిఘాతగతి.
4. స్వాభావికత
5. చరిత్ర చిత్రణ
6 కవిత.

ఈ యారు లక్షణములును జైమిని భారతము నందెట్లు పరిఢవిల్లుచున్నవో పరిశీలించవలసి యున్నది.

1. ఘటనల ఐక్యము : ఘటనల ఐక్య మనగా నాటకము నందే విష యము ప్రారంభమున గన్పట్టునో తత్సంబంధమైన యంతమే ఉండవలయును.

జైమిని భారతమున వస్తువు ప్రారంభమగు నాటికి ధర్మరాజు మహాభారత యుద్ధము చేసి, తన వారినందరను వధించి (గోత్రవధ గావించి) యా పాపము నుండి విముక్తుడగుటకై విచారించుచుండెను. అట్టియెడ వ్యాసు డా ప్రదేశమునకు విచ్చేసి యశ్వమేధ యాగము గావించుమని, తద్యాగ ఫలమున పాప పరిహార మగునని తెల్పెను. అట్లాతడు శ్రీకృష్ణుని సాహాయ్యమునను, తన తమ్ముల సాహాయ్యమునను హయమేధ మొనర్చెను హయమేధాశ్వము విడచినంతనే ఆ యశ్వము పెక్కు రాజ్యములందు ప్రవేశించినది. ఆ హయరక్షణ కేగిన అర్జునుడు పెక్కుడుములకు లోనై నీలధ్వజుడు, హంసధ్వజుడు, సుధన్వుడు, సురథుడు, ప్రమీల, భీషణుడు, బభ్రువాహనుడు, నకులధ్వజుడు, సుచిత్రుడు, తామ్రధ్వజుడు, వీరవర్మ, చంద్రహాసుడు, - మున్నగు శక్తివీరులను జయించి నాడు. ఇదంతయు శ్రీకృష్ణమూర్తి దయయే. కాని దాని నాచరించుటకు దగిన పాండవ వీరుడును, శ్రీకృష్ణుని యాప్తుడును నగు వ్యక్తి యవసరము. కాన విజయునే ధర్మజు డశ్వరక్షకై నియోగించినాడు. ఎల్ల సమయముల నాతనిని శ్రీకృష్ణుడు కంటికి రెప్పవలె కాపాడినాడు. శ్రీకృష్ణ కృపను జవిచూచిన విజయుడు మార్గములోని వీరులను గెలిచినాడు. ఈ విధముగా గ్రంథాదిలో నేయే పరిస్థితులున్నవో, వాని ననుసరించియే గ్రంథమంతయు సాగినది. అట్లు సాగుటయే కాక, గోత్రవధాపాతకము కారణముగా నారంభించిన అశ్వమేధము సఫలీకృతమైనది. ఇట్లు యాగము సఫల మగుటలో గ్రంథ ప్రారంభమున యుధిష్ఠిరున కెదురైన సమస్య తీరిపోయినది. ఈ విధముగా గ్రంథాదిలో ఘటనల యైక్యము సక్రమమై సాగినదని చెప్పవచ్చును. అశ్వమేధ పర్వమున గల వస్తువు పరిణతి నందినదనియును, ఫలము నందినదనియును జెప్పగలము.

**2. ఘటనా సార్థకత** : ఘటనా సార్థకత - నాటకారంభము నందలి విషయమునకు గల ఫలము నాటకాంతము నందును గన్పట్ట వలయును. ఏ సంబంధము లేని యవాంతర విషయములను జొప్పింపరాదు. ఒక దృశ్యము లోపించిన నాటక పరిణతి చెక్కు చెదర కూడదు. ఎన్ని సార్థకములైన ఘటనలు కూర్చిన, కవి సామర్థ్యమంతగా ప్రకటిత మగును. ఘటనలన్నియు మూల ఘటన యందు సంక్రమించవలెను.

జైమిని భారత గ్రంథములో నశ్వమేధ యాగము నిర్విఘ్నముగ పరిసమాప్తి నొందవలయును. ఈ యాగము పునీతులగుటకై, గోత్రవధా పాపము నుండి ముక్తులగుటకు నారంభింపబడినది. దానికై యాగాశ్వము కావలయును. యౌవనాశ్వుని వద్ద యాగాశ్వము కలదు. దానిని భీముడు, వృషకేతుడు, మేఘవర్ణుడు, కలిసి యౌవనాశ్వుని జయించి తెచ్చినారు. ఆ పిమ్మట యాగము ప్రారంభమై సవనాశ్వము లోకయాత్రకు విడువబడినది. పన్నెండు మంది వీరులను జయించి (శ్రీకృష్ణ భగవానుని మాహాత్మ్యమున) పాండవ మధ్యముడా యశ్వమును దిరిగి తెచ్చుటయు, తదుపరి యాగము యథారీతిలో సాగుటయు జరిగినది. గోత్రవధ యను భయముతే పాండవాగ్రజుడు చేసిన యాగ ఫలము మనకు గ్రంథాంతమున గన్పట్టుచున్నది.

ఇక గ్రంథ మధ్యమున ప్రవర్తిల్లిన పెక్కు కథలు మూలకథతో సర్వదా సంబంధము గల్గినవే ఎలననగా ప్రధానముగానున్న రసము వీరమే యైనను, అద్భుత, భయానక బీభత్స రసములతో బాటు భక్తి వీరమునకును ప్రాముఖ్యము గలదు. సాక్షాద్విష్ణుమూర్తియే శ్రీకృష్ణుని రూపమున నవతరించి తాను పరమాత్మయై, జీవాత్మగా, భక్తాగ్రగణ్యునిగా పాండవ మధ్యముని జిత్రించి, గోత్రవధానంతర పాపమును బరిహరింప గృత నిశ్చయుడైనాడు. ఆ కారణముగా పరమాత్ముడు సవనాశ్వమును గాపాడుచు, పెక్కురు రాజర్షులను పాండవ పక్షము జయించునట్లొనరించును.

చిన్నచిన్న కథ లీ గ్రంథమున ప్రధానకథ కనుబంధింపబడినవి. అట్టివి:

1. పూర్వము నిజసోదరుడైన సాల్వుని శ్రీకృష్ణుడు చంపెనని, ఫలితముగా పగతీర్చుకొనుటకై వాసుదేవుని మూర్ఛనొందించిన అనుసాల్వుని కథ.

2. సౌబరి మహర్షి యాశ్రమ వృత్తాంతము.

3. యాగాశ్వము గోడిగయై, వ్యాఘ్రరూపము బొందిన వృత్తాంతము.

4. వృషదేశ వృత్తాంతము.

5. బకదాల్భ్య వృత్తాంతము

6. దుశ్శలా వృత్తాంతము.

7. నకుల వృత్తాంతము
8. నక్షత్రప్రస్థుని వృత్తాంతము.

ఈ చిన్న చిన్న కథలన్నియు ప్రధాన కథ కనువర్తింపబడినవి. ఇవియే గాక మరికొన్ని ఉపాఖ్యానములు కూడ నున్నవి. ఇవన్నియు ఘటనల సార్థక్యము గల్గియుండుటచేత నసవసరములైన వృత్తాంతములుగా చూపట్టుట లేదు. వీనిలో నే యొక్కటి లోపించినను, జైమిని కృతమగు "జైమిని భారతము"న లోపము కానవచ్చుట లేదు. మూల సంస్కృత జైమిని భారతమును పీరభద్రు డనుస రించుట కారణముగా పలువిధములైన సార్థక్యవంతములైన ఘటనలు కూర్చిన కవి సామర్థ్యము మనకు ద్యోతకమగుచున్నది. ఈ ఘటనలన్నియు మూలఘటన యందు సంక్రమించుచున్నట్టివే కాక పై ఘటనాసంచయముచే మూలఘటన ముందునకును, వెనుకకును జరుగుచున్నది

3. ఘాత ప్రతిఘాత గతి.

దీని కర్థము- కథ సరళముగా సాగిపోక, దాని గతి మారవలెను. దీనికి గారణమేదియేని యడ్డంకి. ఈ ఘాత ప్రతిఘాతము లెంత ప్రబలములైనచో నంత ప్రయోజనకారులై వన్నె తెచ్చును.

ఈ దృక్పథముతో నాలోచించినచో, జైమిని భారత గాథలో నెనిమిదా ఖ్యానములును సరళమైన కథను మనకు జూపుటలేదని స్పష్టీకరించుచున్నది. ఈ గాథలో నెన్నియో మలుపులు మనకు కనుపించును. అట్టి మలుపులున్న కథాభాగముల నీ క్రింద పేర్కొనవలసి యున్నది.

1. యౌవనాశ్వునితో భీమాదుల యుద్ధము.
2. అనుసాల్వునితో శ్రీకృష్ణవృషకేతాదులు యుద్ధము చేయుట.
3. సౌభరి మున్యాశ్రమ వృత్తాంతము.
4. ఉద్దాలకుని గాథ.
5. ప్రభావతి సుధన్వుల ప్రణయము - తైలపరీక్ష.
6. సవనాశ్వము గోడిగయై, వ్యాఘ్రియగుట.

7. వృక్ష దేశ వృత్తాంతము.

8. బభ్రువాహన వృత్తాంతమునందు మధ్యన ప్రవర్తిల్లిన కుశలవో పాఖ్యానము.

9. బభ్రువాహన సంబంధమైన పాతాళగమనము.

10. మయూరధ్వజుని దేహమునందు అర్ధభాగమును శ్రీకృష్ణు డడుగుచ భక్తిని పరీక్షించిన విధము.

11. యముడు, వీరవర్మకు అల్లుడైన విధము.

12. సవివరముగా తెలుపబడిన చంద్రహాస గాథ.

13 సాంగ్రామ మహిమా వర్ణనము.

ఈ పేర్కొన్న విషయములందే కథాగతి కొంతలో గొంత మారినది అట్టి సంఘటనలలో ముఖ్యముగా ప్రబలమని పేర్కొనదగినవి - అనుసాల్వుని తోడి యుద్ధము, సుధన్వుని తైలపరీక్ష, జీవమణి కొరకు పాతాళమునకు బభ్రువాహనుడు వెళ్లుట, కుశలవోపాఖ్యానము, మయూరధ్వజుడు విప్రకార్యార్థమై నిజ శరీర సమర్పణము, విషయా చంద్రహాసుల వివాహ ఘట్టము, మున్నగునవి. ఇవన్నియు సవివరములై వర్ణింపబడి ప్రయోజనసహితమైనవి. అట్లే ప్రబలములు నునై యున్నవి. ఈ సంఘటన లన్నియును గలపిన ప్రధాన గ్రంథమున మూడాశ్వాసముల కథాభాగము నాక్రమించుచున్నవి. సంస్కృత మూల జైమిని భారతములోని నిర్దిష్ట ప్రయోజనమునే తెలుగు కావ్యము కూడ సిద్ధింపజేయు చున్నది ఈ వృత్తాంతములలో ననుసాల్వుని యుద్ధము శ్రీకృష్ణ సంబంధమైన విరోధమును: సుధన్వుని తైల పరీక్ష - ధర్మాధర్మ నిర్ణయమే కాక, భక్త్యవ బోధకమును; బభ్రువాహన పాతాళగమన మర్జునునిపై పుత్రుడగు బభ్రువాహను నికి గల ప్రేమను, తత్సమయమున శ్రీకృష్ణుని విశ్వవ్యాపకత్వము (Omni-presence)ను, నిరూపించుటకును కుశలవోపాఖ్యానము తండ్రిని మించిన తనయులు లోకములో గలరను విషయము చాటుటకును; మయూరధ్వజుడు విప్రకార్యార్థమై తన అర్ధ శరీరము నిచ్చుటలో వైదికభక్తి తత్త్వమును గ్రంథములో నెరవుటకును, విషయా చంద్రహాసుల వివాహము వలన నదృష్టవంతుని

తెరచువారును, దురదృష్టవంతుని భాగుపరచువారును తేరను విషయము చాటుట కును, చంద్రహాసు డెంత నిర్ద్వంద్వమైన విష్ణుభక్తి పూరితుడో తెలియజేయుట కును వర్ణింపబడినవి. ఈ కారణముగా పై వృత్తాంతము లన్నియు సంస్కృ తాంధ్ర జైమిని భారతములు రెండింటికిని వన్నె తెచ్చుచు బహుళ ప్రయోజకత్వ మును సాధించుచున్నవి.

4. స్వాభావికత :

భక్తి, వీరము, తాత్త్వికత, మోక్షసాధకము మొదలగు పెక్కు గుణ ములు గల్గిన ఈ గ్రంథమున స్వాభావికత లేదు మన కగుపడు ఉపాఖ్యానము- చిన్నదైనను, పెద్దదైనను కొన్ని యతిమానుష పాత్రలు-గలవు. ఇందలి పాత్ర లన్నియు (ప్రధానముగా ద్రౌపది, భీముడు, ధర్మరాజు, శ్రీకృష్ణుడు, పాండవ మధ్యముడు మున్నగు పాత్రలన్నియు) మహాభారతము లోనివి ఆ కారణముగా నిదియును మహాభారతమువలె నితిహాస మగుచున్నది. అతిమానుషముగా పాత్రలు ప్రవర్తించుట చేత నద్భుతరసము వీరరసమున కంగమైనది.

5. చరిత్ర చిత్రణ :

ఈ గ్రంథములో ధర్మరాజు దుఃఖము పూర్వపు కురుక్షేత్ర యుద్ధ చరి త్రను స్థాలీపులాక న్యాయముగను; సాల్వుని పూర్వము శ్రీకృష్ణుడు సంహ రించిన విషయ మనుసాల్వునితో నాతని యుద్ధమునందును, వ్యాసుడు తెలిపిన మరుత్తుని కథలో పూర్వము మరుత్తుడు చేసిన దాన విషయములును, సౌభరి మహర్షిచే వివరింపబడిన ఉద్దాలక మహర్షి వృత్తాంతభాగములో శిలామోక్ష విష యమును, యాగాశ్వము గోడిగయు, వ్యాఘ్రియు నగుటలో పూర్వమొక రాక్ష సుడు పార్వతీదేవిని మోహించిన సంఘటనయు, బభ్రువాహనుని వృత్తాంతము వలన నర్జునునికి పూర్వ మొక పుత్రరత్నము కల్గెననియు, శ్రీరామ చరిత్ర యను "లవకుశోపాఖ్యానము"న భారతకాలమునకు పూర్వమైన రామాయణ కాలములో సీతామహాసాధ్విని గూర్చిన నిందాభాషణము ఫలితముగా లవకుశు లను కుమారులచే తండ్రియగు శ్రీరాముడు మూర్ఛిల్లిన విషయమును, చిట్టచివరి భాగములో బకదాల్భ్యుని వృత్తాంతము వలన సర్వప్రపంచపు చరిత్రయు,

వేదాంతమును, దుశ్శలా వృత్తాంతమున పూర్వము జరిగిన జయద్రథ వధయు, సత్త్రప్రస్థుని కథలో ధర్మదను బ్రాహ్మణుని వృత్తాంతమును మనకు గోచరము అగుచున్నవి.

## చంద్రహాసోపాఖ్యానము-రసము-పాత్రలు

చంద్రహాసుని కథను లోకము బ్రహ్మనాళ్లనుండి గ్రహించినది. మూల సంస్కృత జైమిని భారతమున జైమిని దీనిని వ్రాయగా, వీరభద్రు డనువదించి నాడు.

ప్రధానముగా జైమిని భారత గ్రంథము భక్తులకు నిలయము. ఇందలి రసము వీరము. స్థాయిభావ ముత్సాహము. చంద్రహాసుడు భక్తి వీరము మూర్తీ భవించినవాడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువును నమ్మిన భక్తుడు. తల్లిదండ్రులను చిన్న నాటనే కోల్పోయి, విధి చేతిలోని కీలుబొమ్మయై, భగవంతునే నమ్మిన పరమభాగవతుడు. అర్జునునికి ఈ కథను నారదుడు వినిపించుటలో సార్థక్యము న్నది. ఈ కథ జరుగునంతవరకును శ్రీకృష్ణుడు, విష్ణుభక్తులను గూర్చి పేర్కొ నుటయు, వారి నర్జునుడు చూచుటయు జరిగెను. ఈ భాగమును నారదునిచే చెప్పించుటలో చంద్రహాసుని అత్యుత్తమ స్థితి వ్యక్తమగుచున్నది. దుష్టబుద్ధి పెట్టిన బాధలన్నియు భరించిన మహాభక్తుడుగా చంద్రహాసుడు కన్పట్టుచున్నాడు. శ్రీమహావిష్ణువు నందలి విశిష్టభక్తి తత్త్వమును, తదుత్సాహమును చంద్ర హాసుడు చూపుటలో, భక్తివీర మిట నత్యుత్తమస్థాయిలో వర్ణితమైనది ఈతడు ఏకాదశీ వ్రత నిష్ఠాగరిష్ఠుడు సంపూర్ణమైన ఉపాఖ్యానముగా నిది విరాజిల్లు చున్నది.

దుష్టబుద్ధి, అతని కూతురు విషయ, కొడుకు మదనుడు, కుంతలరాజు కుమార్తె చంపకమాలిని మున్నగు పాత్రలు ఈ కథాభాగమున నుచితమైన రీతిని ప్రవర్తిల్లినవి. దుర్మార్గపు బరాకాష్ఠగా దుష్టబుద్ధి కనబడినాడు. ఈతడు చేసిన పనులకు తగిన ఫలిత మనుభవించినాడు. మహాభాగవతములోని భక్తుల స్థాయికి చంద్రహాసుడు తగ్గలేదు. గజేంద్రుడు, ప్రహ్లాదుడు మున్నగు వారి భక్తిశ్రేణిని చేర పీఠనికి గలదు. శ్రీహరి కృపచే దుష్టబుద్ధి కుతంత్రము లన్నియు వమ్మైనవి; విషయను, చంపకమాలినిని వివాహము చేసికొనుటయు జరిగినది.

కాళికాలయము లోనికి పంపి చంద్రహాసునిపై పగతీర్చుకొన నుద్దేశపడిన దుష్టబుద్ధి, ఆ పిదప మదనుడు, చనిపోవుటయు పిమ్మట వారు పునరుజ్జీవితులగుటయు జరిగినది.

ఇదంతయు శ్రీ కృష్ణభక్తి కథనమే. ఉపాఖ్యానములలో నిది సమగ్రము. దీనికి ఫలశ్రుతి కూడ వ్రాయబడి యున్నది. ఈ యుపాఖ్యానములో దుష్టబుద్ధి పాత్ర కాక, తక్కిన పాత్రలన్నియు శ్రీకృష్ణ భక్తి పూరితములగుచున్నవి.

6. కవిత్వము :

వీరభద్రుని గ్రంథములలో నిది చిట్టచివరి గ్రంథము. ఆ కారణమున నిందలి శయ్య, రీతి, పాకము పరిశీలించినచో నితనిది ప్రౌఢ కవిత్వమని చెప్పక తప్పదు.

నాటకమని పేర్కొనుటచే ఈ గ్రంథములో మరికొన్ని నాటక లక్షణములు గలవు. వానిని కూడ పొందుపరచవలసి యున్నది.

### ఇతరములగు నాటక లక్షణములు

నాయకుడు :

జైమిని భారతమునందు నాయకుడు ధర్మరాజు. ఈయన పాండవాగ్రజుడు. మహా భారత గ్రంథమునందు వలెనే ఈ గ్రంథమునందును తమ్ము లెవ్వరును నితని మాటను జవదాటరు. ఈ కథాకాలము నాటికి మహాభారత యుద్ధము జరిగినది. కర్ణుని పుత్రుడైన వృషకేతుడు కూడ పాండవ పక్షముననే గలడు. అట్లే భీముని కుమారుడైన ఘటోత్కచుని కుమారుడగు మేఘవర్ణుడు వీరినంటియే యున్నారు. వృషకేతుడును, మేఘవర్ణుడును యాగము నిర్విఘ్నముగా సాగుటకై తోడ్పడిన వీరాగ్రగణ్యులలో నున్నారు యాగదీక్ష గైకొనిన యుధిష్ఠిరుడు హస్తిపురి దాటిపోలేదు. ఇది సర్వసాధారణముగా నెల్లరు రాజులను నొనరించెడి కార్యము ఈతడు చేసిన యాగమున కుపనాయకుడుగా శ్రీకృష్ణుడవతరించినాడు.[8] అనునాయకులుగా నర్జునభీమాదులు వ్యవహరించినారు. ఈ హయమేధ సవన ఫలము పొందినవాడు ధర్మరాజు దానిని తాను పొందుటయే కాక శ్రీకృష్ణార్పణము గావించినాడు.

ధర్మరాజు గ్రంథప్రారంభమున కురుక్షేత్రమున తా నొనరించిన గోత్ర వధకు విదారించు సమయమున వ్యాసు డవతరించి,యాగోన్ముఖుని జేయుటయు, తత్కార్యనిర్వహణకై శ్రీకృష్ణు డాహూతుడగుటయు జరుగును.

వ్యాసభారతములో వలె జైమిని భారతములో కూడ యుధిష్ఠిరుడు భక్తి, రాజనీతి, శక్తి, లౌక్యము, ధర్మము మూర్తీభవించినవాడు ? అంతేగాక ధీరుడు, ఉత్తముడు (Ideal Person) ఉదాత్తుడును నగుచున్నాడు

## జైమిని భారతమున అర్థప్రకృతులు

బీజము :

వికలమనస్కుడై, జరిగిన గోత్రవధను గూర్చి విదారించుచుండిన యుధిష్ఠరుని వ్యాసుడు హయమేధయాగము చేయుటకై ప్రోత్సహించి,సవివరముగ దానిని దెల్పెను. అపు డాతని మనస్సున యాగము చేయవలెనను సంకల్పము జనించినది ఇట్టి హేతువు నాయకుడైన యుధిష్ఠిరుని మనమున బీజరూపమున ప్రవేశించినది. ఆ బీజమే క్రమ క్రమముగ స్థిరపడి చిట్టచివరకు ఫలప్రాప్తిని బొందించినది.

బిందువు :

యాగకార్యమున కుపబలకముగ సవనాశ్వము విడువబడినది అట్లు విడువబడిన అశ్వము దేశమందలి రాజన్యులను జయించవలెను. అట్లు జరుగుటలో నడుగడుగునను నాటంకము లెదురైనవి. ఇట్టి యెడ జైమిని భారత కథ కుంటు వడినది. కథావృత్తికి భంగము కలుగుటయే కాక, హస్తిపురికి తిరిగి సవనాశ్వము వచ్చువరకు శ్రీకృష్ణుని మాహాత్మ్యమే పాండవ మధ్యముని ప్రేరేచినది. ఈ బిందువు ఫలప్రాప్తివరకు వ్యాపించినది. శ్రీకృష్ణ మాహాత్మ్యమను నా బిందువు తాత్కాలిక ప్రయోజనము ముఖ్యముగా ననుసాల్వునిచే హయ మపహరించిన పుడును, బభ్రువాహను డర్జునుని శిరము ఖండించినపుడును, మకరధ్వజుని బరీక్షించి హయము విడిపడ చేసినపుడును సాధించినది. ఆ తాత్కాలిక ప్రయోజనము సిద్ధించిన వెన్వెంటనే బిందువు శాశ్వత ప్రయోజనమైన హయమేధ యాగసిద్ధికి సిద్ధపరచినది. ఈ తాత్కాలిక ప్రయోజనమూలమైన నుపాఖ్యానము

లాటంకములైనట్లును, విరుద్ధాంశములుగను చూపట్టుటలేదు. ఇవి ప్రధాన కథను కొంతవరకు మరుగుపరచుచునే యున్నవి.

పతాక :

నాటక దృష్టితో జూచిన ఈ గ్రంథమున నాయకుడు ధర్మరాజు. ఉప నాయకుడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుని కథలును, మాహాత్మ్యమును, ప్రధానకథను పోషించుచున్నవి. కావున ప్రసంగవశమున వచ్చిన శ్రీకృష్ణుని కథలు ప్రాసంగి కేతివృత్తము లగుచు, "పతాక" లగుచున్నవి. ఈ కథలు ప్రధాన ఫలమైన హయమేధము సాధించుట కుపబంధకముగా నుండియు, విభిన్నములైన భాగము లగుటచే తమ ప్రత్యేకతను గలిగియున్నవి. కావున నివి పతాకమే గాని ప్రకరి కానేరదు.

కార్యము :

ఫలాగమమునకు హేతువు కార్యము. హయమేధ కార్యము సంపూర్ణ మొనర్చుటలో యుధిష్ఠిరునకు గల సర్వశక్తి స్వరూపమును శ్రీకృష్ణుడే యైనాడు. ఈ కార్య మీ గ్రంథమున సమస్తేతివృత్త వ్యాపియైనది. శ్రీకృష్ణశక్తియే ఫల యోగమును శీఘ్రతరము జేసినది; కాని కార్యము గ్రంథాంతమందే జరిగినది యాగ మొనర్చుట హేతువు. గోత్రవధాసంబంధమైన పాపపరిహారము ఫలము. కాన మనకు కార్యము గ్రంథాంతమున గోచరించును.

### సంభాషణలలోని నాటకీయత

ఈ గ్రంథములోని సంభాషణలలోని నాటకీయత మన కీ క్రింది ఘట్టము లలో గోచరించుచున్నది.

1. ధర్మజ వ్యాసుల సంభాషణము (బోధనము)
2. శ్రీకృష్ణ - భీమసేనుల సంభాషణ
   (సరసము వ్యంగ్యరూపమున చిత్రితము)
3. వ్యాసుడు - ధర్మజునకు వివిధ విషయములను తెలుపుట (బోధ)
4. ద్వారకలో శ్రీకృష్ణ-భీమసేనుల సరసాలాపములు.
   (ఇవి కూడ వ్యంగ్య మర్యాద ననుసరించినవి).
   (హాస్యమున కాలవాలము)

5 రుక్మిణి - శ్రీకృష్ణునితో పల్కిన వ్యంగ్య వాక్యాలు.

6. సుధన్వుడు - ప్రభావతి సంభాషణము.

7. లోకాపవాదు వినిన శ్రీరాముడు దుఃఖించి, సీతాదేవితో నెడబాటును గోరుట. (కరుణ భరితము)

8 లక్ష్మణుడు పల్కిన "శ్రీరాముని మాటలు" విని సీత దుఃఖించుచు పేర్కొనిన వ్యంగ్య గర్భిత వాక్కులు

ఈ పల్కులు కరుణరస భరితములు.

9. లవకుశులను గూర్చిన విషయములు తెలిసికొనుటకు శ్రీరాముడు చూపిన ఉత్సాహము - ఆ సందర్భమునందలి మాటలు.

10 అర్జునుడు, బభ్రువాహనుని శౌర్యమును శంకించుచు వ్యంగ్యముగా మాట్లాడిన రీతి.

11 మయూరధ్వజుని మోసగించుటకు కృష్ణార్జునులు పన్నిన మాయోపాయము - ఆ సందర్భమునందలి మాటలు.

ప్రధానముగా నాటకమున గన్పట్టు పాత్ర పల్కిన పల్కులలో "నాత్మీయతా భావము" (Self Expression) కనబడవలెను. అనగా, పాత్రను సృష్టించుటలో - ఆ పాత్రచే ఒకానొకప్పుడు సమయోచితముగా పలికింప చేయుటలో కవి చూపెడి శిల్పము నాటకీయ సంభాషణ మని చెప్పవలసి యున్నది ఇట్టి సమయమున పాత్రకు సంబంధించిన మూర్తి సాక్షాత్కారము (Personality) జరుగవలెను. దీనిని బట్టి రచన రసవంతమగునా, కాదా యని నిర్ణయింతుము అట్టియు భావమును బట్టియే స్వీకరింపబడును భావము లేని రసము, రసవర్జితమైన భావము లేదు [8]

బభ్రువాహనుడు, హయముఖము నందున్న పట్టిక చూచి, సిద్ధమై వెరలి విప్రచ్ఛునికి నమస్కరించగా నాతడు తిరస్కరించినాడు. చేసిన తప్పును క్షమించమని- వృషకేతుడు, ప్రద్యుమ్నుడు, యౌవనాశ్వుడు, సాత్యకి పల్కగా, నర్జును డియకొనక,

"ముంగలఁ బాఱతెందు హయముం గని పట్టి పిఱుందవచ్చు సే
నం గని ప్రాణభీతిఁ గదనంబునకుం జొరవైతి వోరి మా

వంగర మోట బొంకు మును వైశ్యునకుం గనెఁ బోలునిన్ను ఛీ
త్రాంగద''    (5-171)

అని పేర్కొనినాడు.

చేసిన తప్పు క్షమింతమని వేడుకొనిన బభ్రువాహనుని యుద్ధమునకు ప్రేరేచుటకై పలువురి మాటలను లెక్క సేయక కిరీటి పల్కిన పల్కు లాతని లోని అహంకార తత్త్వమును ప్రదర్శించుచున్నవి. ఈ మాటలను వినిన బభ్రు వాహనుడు యుద్ధ మారంభించినాడు ఇట్టి సంభాషణలో 'ఆత్మ వ్యక్తీకరణము' 'మూర్తిమత్వము' బహిర్గతమగుచున్నవి.

ఇట్టి గ్రంథములోని పాత్రల సంభాషణము లన్నియు సార్థకతను బొందినవి. నిర్దిష్టమైన ఉద్దేశ్యము తోడనే కవి సార్థకమగు సంభాషణను నెరపి నట్లు ఈ గ్రంథములోని సంభాషణా శిల్పము వ్యక్తము చేయుచున్నది.

ప్రవేశకము - జైమిని భారతము :

జైమిని భారతమునందు మొదటి మూడాశ్వాసముల కథ-ఒక సంవత్స రము లోపునను, తక్కిన ఐదాశ్వాసముల కథ రెండవ సంవత్సరముననుజరి గిన కథగా భాసిల్లుచున్నది. శ్రీకృష్ణుడు మొదటి పర్యాయము హస్తినాపురికి వచ్చి, ద్వారకకు వెళ్లి, తిరిగి సంవత్సరము లోపల వచ్చును. ఇచట నొక ప్రవేశకమును సిద్ధపరచవచ్చును. ప్రవేశకము సంవత్సరము లోపల జరిగిన కథకు రెండంకముల మధ్య కూర్చవచ్చును. కాన నిట నిది సమయోచితము. శ్రీకృష్ణుడు రానిచో భావికథ జరుగదు కాన నచట ప్రవేశకము సిద్ధింపగలదు.

ఇక రెండవ ప్రవేశక మర్జునుని మూర్ఛా సమయమున జీవన్మణి గైకొని రాబడుటయు, శ్రీకృష్ణాదుల సహకారమును గానవచ్చును. ఇచట మరణము చూప నసాధ్యము. రెండవ ప్రవేశకముచే కథను నడపించవచ్చును. ఇది రెండవ సంవత్సరములోని కథ. ధృతరాష్ట్రిడను నాగుని కుతంత్రమున నర్జునుని శిరస్సు మాయము కాగా శ్రీకృష్ణ మాహాత్మ్యమున వృషకేతుడు, అర్జునుడు పునరుజ్జీవి తులగుదురు. ఇచట ప్రవేశకమును రూపొందించుట తగినట్లుండును.

### విష్కంభము - జైమిని భారతము :

శివభువి వృత్తాంతము; ప్రమీల వృత్తాంతము; యాగాశ్వము-గోదిగయ వ్యాఘ్రమియనగు మూడు వృత్తాంతములను కథన మొనర్చునపుడు విష్కంభము ప్రయోగించవచ్చును. ఇచట కథను సంగ్రహ మొనర్చనగును. అట్లే శ్రీరామ చరిత్రము - భారతమునకు బూర్వము జరిగినది గాన నచటను నొక విష్కంభ మును ప్రయోగించవచ్చును. అధునిక నాటకములలో గత విషయము నెచటనైన పేర్కొనవలసి వచ్చిన నచట "Flash Back" ను ప్రవేశ పెట్టుదురు. ఈ గ్రంథమున నట్టివి కొన్ని గలవు.

పాండవులు శ్రీకృష్ణుని స్తుతించు సందర్భము, యాగాశ్వము గోదిగయ వ్యాఘ్రమియ నగుట, లవకుశ యుద్ధ సందర్భము, చండి - ఉద్దాలక వృత్తాంత కథనమును సౌభరి చేసినపుడు,- "Flash Back" ప్రయోగించవచ్చును. అవసరమైన విష్కంభమును కూడ ప్రయోగించి కథను సంక్షేప మొనర్ప వచ్చును. చిట్ట చివరి భాగమున సక్తుప్రస్థుని కథ, నకులోపాఖ్యానము, జల యాత్రా వర్ణనమును సంక్షేపించి విష్కంభము రూపొందించనగును.

### వీరభద్ర కవి - నాటక సదృశ కావ్యమును వ్రాయుటలో గల యౌచిత్యము :

జైమిని భారతములో ప్రధాన కథ కంటెను ఉపాఖ్యానములు మించి యుండుట చేత ఈ గ్రంథమునందలి నాటకీయత తగు నౌచిత్యముతో నలరారు చున్నది. ఈ గ్రంథము పదునైదవ శతాబ్దిలో రచించబడినది. ఆ నాటికి సంస్కృత వాఙ్మయములో భవభూతి, కాళిదాసు, దిఙ్నాగుడు మున్నగు మహా మహులు నాటకములను రచించి జగత్ప్రసిద్ధి నొందిరి ఏ కారణముననో తెలుగుభాషా యోషకు నాటకమను నలంకారము చేర్చబడలేదు. ఆ లోటును తీర్చుట కొఱకు జైమిని భారతాది గ్రంథములు నాటక శిల్పముతో రచించబడె నని మన మూహించవచ్చును అందును చిన్నవి, పెద్దవి యైన నుపాఖ్యానము లతో నీ గ్రంథమును వెలార్చుటలో సాంఘికముగా నీతడానాడు ప్రత్యేక విశిష్ట స్థానమును బొందినాడని మన మూహించవచ్చును ఈ విధముగా "జైమిని భారతము" ఐదారంకములతో చక్కని సంభాషణా శిల్పముతో, కథాకథ

నములో, విష్కంభ ప్రవేశకాదులతో, ఘటనల ఐక్యము, సార్థకత, చరిత్ర చిత్రణ, ఘాతప్రతిఘాతగతి, చక్కని కవిత్వము, మిశ్రకత, అర్థ ప్రకృతులు, నాయకోపనాయకానునాయకులతో నాటకీయతను వెలార్చుచున్నది. పదునైదవ శతాబ్దిలో నాటకము లేని లోటు నీ గ్రంథము తీర్చుచున్నది.

### పంచసంధులు [9]

భరతుని నాట్యశాస్త్రములో గల పంచసంధులను లక్ష్యలక్షణ సమన్విత ముగా నిట జైమిని భారతమునం దెట్లన్వయింపనగునో పరిశీలింపవలసియున్నది

(1) ముఖసంధి : నానార్థరససంభవమగు బీజ సముత్పత్తి కావ్యమం దెద్చుట జరుగునో, ఆ కథాభాగము ముఖసంధి ఇది ప్రారంభమనెడి కార్యావస్థ ననుసరించి యుండును.

జైమిని భారతమం దీ భాగము ప్రారంభమునందు వ్యాసుడు వచ్చి గోత్రవధాపాపపరిహారణార్థము హయమేధము చేయుమని తెలిపినపుడు ముఖసంధి మన కగుపడుచున్నది. ఈ సందర్భమున హయమేధ యాగము చేసినపుడే పాండవు లెల్లరకు నానార్థరససంభవ మగుచున్నది. అట్టియెడ గ్రంధమునం దీభాగమున బీజసముత్పత్తి జరిగినది. ఒకవిధముగా నాలోచించినచో వ్యాసుడే పై గ్రంథమునందలి బీజసముత్పత్తికి గారణభూతుడగుచున్నాడు. వ్యాసుడు తెలిపిన పై కథాభాగము (అనగా యుధిష్ఠిరుని యాగమునకు ప్రోత్సహించుట) దాదాపు పదునెనిమిది పద్యములలో గన్పట్టుచు, ముఖసంధి యగుచున్నది.

(2) ప్రతిముఖసంధి . ముఖసంధియందు నిష్పన్నమైయున్న బీజము అవాంతర కారణములచే మరుగుపడి యున్నపుడు బీజము ద్ఘాటితము చేయబడు కథాభాగము ప్రతిముఖసంధియందు సువ్యక్తము చేయబడును.

ఈ సందర్భమున ప్రధాన విషయ మేమనగా, వ్యాసుడు హయమేధయాగ మొనర్చుటకు యుధిష్ఠిరుని కనుమతి యిచ్చినాడు. కాని తద్విషయమై సర్వవస్తు సంపద కావలయును. "ఆ వస్తు సంపదయు, సువర్ణరాసులును మరుత్తునిచే బ్రాహ్మణులకు దానము చేయబడినవి. కాని యది వారి స్వామ్యమునందు లేదు.

వారు దానిని విడచిపుచ్చినారు. కావున వానిని గైకొని వచ్చి యాగము నిర్విఘ్న మొనర్పవచ్చు"నని వ్యాసుడు పల్కినాడు. కాని యా పరిస్థితిలో శ్రీకృష్ణా గమన మత్యవసరమైనది. కారణమేమనగా శ్రీకృష్ణుడు లేనిదే పంచ పాండవు లేమహాకార్యములను నిర్వహింపలేరని స్పష్టము. వ్యాసుడు చేసిన బోధచే యుధిష్ఠిరుడు యాగోన్ముఖుడైనను గురువు, తండ్రి, దైవము, బంధువు, సర్వస్వ మైన శ్రీహరి రూపమున నున్న యా వాసుదేవుని రాకకై పాండవులు వేచి యుండుటలో నాశ్చర్యము లేదు. జైమిని భారత మందలి పై కథాభాగములో ముఖసంధియం దవ్యక్తముగా నున్న బీజము సువ్యక్తమై ప్రతిముఖ సంధియై నిలచినది.

(3) గర్భ సంధి : బీజము ముఖసంధి యం దుద్భూతమై, ప్రతి ముఖ సంధి యం దుద్ఘాటితమై, గర్భసంధి యం దుద్భేదమును బొందును. అనగా ఫలోన్ముఖ మగును. ఇందు ఫలము చేతి కందినట్లే యుండి మరల దూరమగు చుండ, దాని కొరకు మరల ప్రయత్నము సాగుచుండును.

వ్యాసుని యాజ్ఞయు శ్రీకృష్ణుని సాహాయ్యమును గైకొన్న యుధిష్ఠిరుడు యాగము ప్రారంభము చేసి భీమాదులను బంపి యౌవనాశ్వుని వద్ద నున్న సవ నాశ్వమును జయించెను. ఆ యశ్వమును లోకయాత్రకై ఎడచుచు కిరీటిని రక్షగా నుంచినాడు. దారిలో కిరీటి నీలధ్వజరాజును, నాతని కుమారులైన సుధన్వుని, సురథుని జయించి, వృక్ష దేశములోని భీషణుని మడియజేసి, బభ్రు వాహనుని రాజ్యము చేరును. కాలాంతరమున సవ్యసాచివలన చిత్రాంగదకు బభ్రువాహనుడు జన్మించినాడు. అతడు మహావీరుడు, తేజస్సంపన్నుడు. పాండవ వీర్యమున జన్మించిన యాతడు తండ్రి యగు గుంటిమధ్యముని విగత స్పృహుని జేయుటలో వింతలేదు ఆ కారణముగా తిరిగి పార్థుడు సజీవుడగు టయు కథలో నవసరమగుచున్నది. లేనిచో ధర్మజుని యాగమునకు విఘ్నము వాటిల్లును. తత్సమయమున శ్రీకృష్ణు డరుదెంచి శ్వేతవాహనుని బ్రతికించినాడు. పాతాళమున గల మృతసంజీవిని యను మణిని బభ్రువాహనుడు గొనివచ్చు సమయముననే ధృతరాష్ట్రుడను నాగరా జర్జునుని శిరస్సును మాయము చేసినాడు. అర్జునుడు బ్రతికి లోకము జయింపబడిననే యాగము నిర్విఘ్నమగును. ఈ విధముగా చేతి కందినట్లే యందిన ఫలము జారిపోయెడి స్థితి వచ్చి శ్రీకృష్ణుని

చేత నర్జునుడు ప్రతికింపబడినాడు కావున నీ కథాభాగము జైమిని భారత గ్రంథ మందలి ప్రధాన కథాభాగములలో నుత్కృష్టమై యున్నది. అంతియేగాక "లవకుశోపాఖ్యానము" నష్టాఖ్యానముగా తీర్చి దిద్దుచు కవి తన మనోగత భావమైన సామ్యమును (అనగా లవకుశులు శ్రీరాముని జయించిన రీతినే బభ్రు వాహనుడు కూడ జనకుడగు నర్జునుని జయించినట్లు) సువ్యక్తము చేసినాడు. ఇచట నాటకీయమైన గర్భసంధి మనకు గోచరించుచున్నది. మరియును, జైమిని భారత గాథలో మన కగుపడు వీరులలో బభ్రువాహను డనుపమ శౌర్యమును ప్రదర్శించినాడు. సాటిలేని పరాక్రమమును జాటిన బభ్రువాహనుని గెలిచినచో రాజన్యుల నెల్లరను దాదాపు ధర్మరాజు జయించినట్లే యగుచున్నది.

4 విమర్శసంధి (అవమర్శ సంధి): ఫలోన్ముఖమైన బీజార్థ మేదేని యొక తీవ్రమైన విఘ్నముచే భంగపడగా ఫలప్రాప్తి సంశయాస్పదమగును. అపుడు నాయకాదులు తమ శక్తినంతటిని వినియోగించి దానిని తొలగించుకొనిన ఫలప్రాప్తి నిశ్చితమగును.

బభ్రువాహనుని రాజ్యమునుండి వీరులతో శ్రీ కృష్ణార్జునులు బయలుదేరి తామ్రధ్వజుని రాజ్యమునకు వెడలినారు. తామ్రధ్వజుడు మహావీరుడు, తేజోశాలి, మహాభక్తుడు. ఈయన కుమారులు కూడ వీరులే. అంతకు ముందే రత్ననగరము నుండి వచ్చిన మరొక హయమేధాశ్వము వారివద్ద నున్నది. ఈ రెండు హయము లొకదాని నొకటి గదిసినవి. మయూరధ్వజుని కుమారుడైన తామ్రధ్వజుడు దానిని పట్టుకొనుటకు మంత్రియైన బహుళధ్వజుని ఆజ్ఞాపించినాడు. పాండవ సైన్యమునకు, తామ్రధ్వజుని సైన్యమునకు మిక్కుటముగా పోరు జరిగినది. ఆ యుద్ధములో శ్రీకృష్ణుడు కూడ మూర్ఛ నొందినాడు. మూర్ఛ వీడిన పిమ్మట శ్రీకృష్ణ దర్జునునితో మయూరధ్వజుని రాజ్యములోని శ్రీకృష్ణభక్తిని, త్యాగ నిరతిని జూపుదునని పల్కి, యాతని రాజ్యములోని గృహస్థులను జూపినాడు. వారు పడకటింటి యందలి సంభాషణమునను శ్రీకృష్ణభక్తులే.

ఆ పరిస్థితులలో వారిని జయించుట దుర్లభమని శ్రీకృష్ణుడు గ్రహించి మాయోపాయము చేతనే మయూరధ్వజుని గెలువ నిశ్చయించి, తన యెడ నాతనికున్న భక్తిని బరీక్షించినాడు అట్లు పరీక్షలో గెలిచిన మయూరధ్వజునికి

వాసుదేవ ధనంజయు లిద్దరును తమ తమ మాయాస్వరూపములను వీడి స్వస్వరూపములను జూపగ నా రాజసత్తముడు తన రాజ్యమును సర్వస్వమును ధారపోసినాడు

ఈ విధముగా బహుళ శక్తి సంపన్నుడైన మయూరధ్వజుని ఉపాఖ్యానము ప్రధాన జైమిని భారతగాథను ముందునకు సాగకుండ నిలిపినది. ఇది కథా కథన దృష్టితోడను, నాటక దృష్టితోడను జూచిన తీవ్రమైన విఘ్నముగా మనము భావించవచ్చును ఉపనాయకుడైన శ్రీకృష్ణుడే తన శక్తి సంపద నంతను వినియోగించి యా విఘ్నమును దొలగించవలసి వచ్చినది ఆ విమ్మట వీరవర్మను చంద్రహాసుని కూడ శ్రీకృష్ణ సాహాయ్యముననే అర్జునుడు గెలిచి నాడు. అనగా వలోన్ముఖమైన బీజ మిట మయూరధ్వజుని వృత్తాంతముచే తీవ్ర విఘ్న మందినది. కావున నిట నిది యవమర్శ- లేక విమర్శ సంధి యగుచున్నది.

5 నిర్వహణ సంధి బీజ సహితములును, నానా భావసంయుక్తములును నైన నాలుగు సంధులయందలి ప్రారంభాద్యవస్థలును ఫలప్రాప్తియందు సమ్మేళనము చెందిన కథా భాగము "నిర్వహణ సంధి" యగుచున్నది.

యాగ సమాప్తివలన నిర్వహణ సంధి జైమిని భారతమునందు మనకు గన్పట్టుచున్నది. ఇచట ధర్మ సంరక్షణము ప్రధానమైనది గోత్రవధా సందర్భమైన పాపము పరిహారమైనది. కథా సంవిధానము దెబ్బతినలేదు. మొత్తము మీద నాయకుడైన యుధిష్ఠిరుని మనస్సంకల్పము నెరవేరినది. వ్యాసుని, శ్రీకృష్ణుని సాహాయ్యము సఫలమైనది. ఇచట తక్కిన నాలుగు సంధులయందలి యవస్థలను ఫలప్రాప్తియందు సమ్మేళనము పొందినవి. ఇది మన కథమాఖ్యానము నందలి చివరి భాగమున గన్పట్టును. యాగఫలమును ధర్మరాజు తాను గ్రహించి శ్రీకృష్ణునికి ధారవోసినాడు ఈ భాగములో జైమిని భారతమునందు నిర్వహణ సంధి పొసగుచున్నది

":JAIMINI has no heroines, but heroes:"

ఇతిహాస నాటకమైన జైమిని భారత గ్రంథము మోదాంతమై, సర్వ జనులకును మోదమొనర్చి, శాస్త్రకారులు నిర్వచించినట్టి మోదాంతనాటకముగా రూపొందినది. "యతో ధర్మ స్తతో జయ" మను నానుడి సార్థకమైనది. ధర్మరాజు ధర్మపరమైన అర్థకామములను మోక్ష సాధక మొనర్చినాడు పాత్రలు ప్రయోజన సిద్ధిని బడసినవి. ఈ గ్రంథమునందు ధర్మరాజు నాయకుడు. శ్రీకృష్ణు డుపనాయకుడు. భీమార్జును లనునాయకులు. ద్రౌపది, ప్రమీల, ప్రభావతి, సత్యభామ, రుక్మిణి యంటి స్త్రీ పాత్రలున్నను, నాయిక పాత్రగా చెప్పుటకు వీలులేని స్థితిలోనున్నవి. కావున ఆంగ్ల రచయితయైన Ruskin చెప్పినట్లు "Shakespeare has no heroes but heroines" అను వాక్కు మన ఈ జైమిని భారత గ్రంథముపట్ల తారుమారై, వ్యతిరేకమై "JAIMINI has no heroines, but heroes" అని పేర్కొనుటకు దగిన స్థితిని సృష్టించుచున్నది.

జైమిని భారతము - అంతర్యుద్ధ దీపికము, ఆదర్శ నిరూపకము, యథార్థ నిరూపకము[10].

జైమిని భారత మను నీ యితిహాస నాటకము (Epic Drama)న నాంతరంగికమైన భక్తిభావమే ప్రబలమైనది. వీరు లెల్లరి యందును భక్తియే గన్పట్టుచున్నది. భక్తి సంభరితమైన వీర మీ భక్తుల మధ్య నొక యంతర్యుద్ధ మును సృష్టించినది ఇచట బాహ్య యుద్ధములను బురస్కరించుకొనిన ఆంతరం గిక ప్రవృత్తి వికాస పరివర్తనము భక్తుల మధ్య ఉప్పతిల్లినది. ఇతిహాస నాటకమగు నీ గ్రంథమున ధర్మజుని యాదర్శ నిరూపకము, భక్తి సంబంధమైన యాదార్థ్య నిరూపకము జరిగినది. నాటక లక్షితమైన కథాంశము లీ గ్రంథమున బహుళముగా నున్నవి. కావ్యత్వ, ప్రబంధత్వ సిద్ధికై చేయు వర్ణనములు తక్కువగా నున్నవి. కథా ప్రవృత్తియు బహువేగముగానున్నది. ఈ కారణముల వలన నీ గ్రంథ మొక "ఇతిహాస నాటక"మై ప్రవర్ధిల్లి విలసిల్లినది. అర్థోపక్షేపాదులతోడను, అంక సంఖ్యచేతను బునర్ముద్రించి, నాటకముగ వ్రాయుటకు దగిన లక్షణములన్నియు దీనియందు నిక్షిప్తములై యున్నవి. ఆ

కారణము చేత కూడ "జైమిని భారతము" తప్పక నొక "ఇతిహాస నాటకము" కాగలదనుటలో నెట్టి భేదాభిప్రాయమును నుండ నక్కరలేదనుటయే యుక్తి యుక్తముగా నున్నది.

---

1. పుట 90- (ద్వి. ఆ.) కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి. (1959).
2. కావ్యాలంకార సంగ్రహము-స.సూ. శాస్త్రి. (1959).
3. ఎ. తెలుగు నాటక వికాసము. Dr. P.S.R. అప్పారావు. (పుట 41)
   బి. నాట్య శాస్త్రము-భరతుడు. (16-169).
   సి. ప్రతాపరుద్రీయము - (వ్యాఖ్యాత, అనువాదకర్త) శ్రీ చలమర్ల రంగా చార్యులు. (పుట. 177).
4. ప్రతాపరుద్ర యశోభూషణము (ఆంధ్రము) పుట. 212. శ్రీ చలమర్ల రంగా చార్యులు.
   నాట్యశాస్త్రము-భరతుడు (ఆంధ్రీకర్త. పోణంగి శ్రీరామ అప్పారావు-నాటకాది రూపక స్వరూప సారాంశము.) (పుట. 588).
5. పుట 110-"నాటక విమర్శ" - శిష్ట్లా రామకృష్ణశాస్త్రి.
6. పుట. 308-"పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు"-డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యము.
7. పుట. 41- "ముందు చదువవలసిన ముఖ్య విషయాలు" "అనంతం" - జైమిని భారతము (వ్యావహారికము) "పాత్ర చిత్రణ"-జూన్-1975.
8. సాహిత్య శిల్ప సమీక్ష-పుట. 121, 119. ఆచార్య పింగళి లక్ష్మీకాంతము.
9. పుటలు 596, 597 నాట్యశాస్త్రము (తెలుగు) డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు. "ఇతివృత్త నిర్మాణము-విశేషాంశములు" పై పుటలలో లక్షణ మీయ బడినది.
10. పుట. 110 - నాటక విమర్శ.

పిన వీరభద్రుని కవితాదర్శమును గ్రహించవలయుననిన - జైమిని భారతములోని విశేషములను గ్రహించుట ముఖ్యము. ఆ విశేషము లీతని కవిత కనుబంధించినది.

అల్లన విచ్చు చెంగలువలందు రజంబనుకప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్త చన్నుఁగవ పయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగనేర్చుఁ గబ్బముల్.
(జై. భా. 1-25)

ఈ పద్యము పిన వీరన కవిత్వమునకు నాయువుపట్టు. ఈ కవి తన వంశమును గూర్చి—

'మఱ్ఱి మాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁ గాదు శారదా పీఠకంబు
వారి లోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు' (1-22 జై. భా.)

అని పేర్కొనినాడు. తన తండ్రి, తాత, అగ్రభ్రాత— "భువనభాసురకృతి నిర్మాత" అని వ్రాసికొనినాడు. చివరకు 'పినవీరుఁ బోలఁ గలరే సుకవుల్' (1-21) అనియు వ్రాసికొనినాడు. ఈ విషయములను బట్టి పిన వీరభద్రుని వంశము కవులకు, పండితులకు నిలయమగుట యథార్థము.

సాళువ నరసింహరాయ లాస్థానమున నొక్కనాడు పల్కిన మాటలు—

క. "నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమిని భారత మనగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

క. ఆ పురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేనిఁ
జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేని

దెనుఁగు నుడికారమున మించు గనియె నేని
గుందనము కమ్మవలచినచంద మగును''
(జై. భా. 1-17, 18)

పై విషయములను బట్టి, జైమిని భారతము తెలుగులోని కనువదింపబడక పూర్వము, లోకమున నొక ప్రసిద్ధ గ్రంథమని తేలుచున్నది. సాళ్వ నరసింహ రాయలు నిరతమును రాజీజుని భారత గాథలను వినెడి వాడనియును తెలియవచ్చుచున్నది

తెనుగు నుడికారము హెచ్చుగానున్నను, కవి ప్రసిద్ధుడైనను 'కుందనము' కమ్మ వలచిన చందమగునని పేర్కొనుటయు మరొక్క విశేషము రాజు తెలిపిన భావమును పినవీరభద్రుడు వమ్ము గావింపక, తెలుగు నుడికారమునే హెచ్చుగా వాడినను, సంస్కృత పదములను, పదబంధములను వీడలేదు ఆదిలో ఈ కవి తన గ్రంథమున కుకవినింద గావింపలేదు. జైమిని భారతమున చివరకు చేసినాడు [1]

'కుకవి మల్లికషోల్ల సత్కులికహస్త
పల్లవుడు చెప్పెఁ బినవీరభద్రసుకవి' (8-219)

పై పద్యమునందు ఈ కవి (1) సమృద్ధ సారస్వతుడు (2) సత్కవీంద్ర సఖుడు - అను రెండు విశేషణముల నుపయోగించినాడు ఇవి కవి యందలి (1) ఔద్ధత్యము (2) ఆత్మవిశ్వాసాధిక్యము - గుణములను ద్యోతక మొనర్చుచున్నవి.

సుదీర్ఘ సంస్కృత సమాసము లీతని కవిత యందు బహుళముగా నున్నవి

1. "శివరాత్రి ప్రమదావలోకన తరస్వికోటిభృత్కన్యకాధవసేవానుగ''
(జై. భా. 4-148)

2. ''వాలుకాగణన శక్త ప్రాతయాత్రాసముద్భవ భారాపగమ ప్రమోద భర దృప్యద్రాజబాహార్యవైభవ లీలాపరపాకశాసన. (4-148)

3. ''నిర్యత్న దేదీప్యమాన రత్న దీపికా నిర్యత్రభాపూర దూరీకృతాంధకారంబును.'' (348)

4 "ధగద్ధగిత శాతకుంభ రస నిసర కుసుంభరాగ సముత్తంభిత విచిత్ర చీనిచీనాంబర తిరస్కరిణీ వితానచ్ఛాయా పరిష్కారంబును" (8-48)

ఈతని సంస్కృత భాషా పాండిత్య మిట వ్యక్తము.

ఈతని సంస్కృత భాషాజ్ఞానమునకు తెలుగు నుడికారము తోడైనది.

## జైమిని భారతము - అచ్చిక పదములు :

అప్పళించు, అగడము, ఆటపాటలు, ఉమ్మ, ఎచ్చులు కందతుందములు, కత్తరగలియు, కొదికి, కృతపద్ధ తప్పు, చీకటిలుగొలపు, చెంగిరి, దేయార్పు కొను, చౌకళించు, జాలెలు, జగడించు, తూకము తోటులు, తెగదెంపు, దొంతి కొల, దొడ్డ, నడగడు, పచ్చిబందగలు, పడుచు కొడుకవు, బోలెము, మిడుకు, ములుచ, మారిమసంగు, మదిచుట్టను, వీసరపుచ్చు, వీపువిటిగి, వీపునెటుకురను, వెలివేకిదాకు, వారబట్టు, - అను వానిలో కొన్ని వ్యావహారికములు.

## విశేష పదబంధములు

ఆయవారపుసంచి, అఘటన ఘటనా సామర్థ్యము, ఇట్టితోలుసజ్జ, ఉత్తుక బంటి, చింపిగొడుగు దడక, తొప్పదోగుట, తుత్తుమున్లు నులివాడు తొడసీ యెన్ను, ప్రాతముతుక సీగ్గావి దోవతి, మసమసగ యగుట, వినీవినమి, హాటాహంటి

## సంస్కృతములోని విశేష ప్రయోగములు

ఉగ్రంపశ్యుడు, ఊరుదఘ్నము, కచాకచి, కంఠదఘ్నము, ఖడ్గాఖడ్గి, బాహాబాహి, ముష్టాముష్టి - అనునవి

బాణముల వాడుకలో ఈ కవి 'బాణ' శబ్దమునకు పర్యాయ పదముల నెన్నియో వాడినాడు

మార్గణము, శిలీముఖము, అస్త్రము, బాణము, శరము, కాండము, కోల, సాయకము, కంకపత్రము, శతాంగము, నారసము, అమ్ము, అంబకము, ఆశుగము, తూపు, ప్రదరము. (పదునారు). వీనివలన నీతని సంస్కృత పాండిత్యము, యుద్ధవర్ణనను బహువిధములైన పదములతో చూపవలయుననెడి వైచిత్రియు ద్యోతమాన మగుచున్నది

## పద్యములలో గల పోలిక :

కంకంటి పాపరాజు వ్రాసిన ఉత్తర రామాయణములోని సీసపద్యము జైమిని భారతములోని ఉత్తర రామాయణ పద్యమును బోలుచున్నది. కాని వీర భద్రుని పద్యమే ఈ సందర్భమున మెఱుగుగా నున్నది. ఆ పోలిక నిట గాంచనగును.

సీ. విపుల బాహాశక్తి విఱిచెఁ బురారి కో
దండంబు నా నిమిత్తంబ కాదె
చలపట్టి దైతేయశాంబరీమృగము మ
స్తముఁ ద్రుంచె నా నిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన
దాఁటించె నా నిమిత్తంబ కాదె
కదన రంగమున జగద్ద్రోహిఁ బంక్తికం
ధరుఁగూల్చె నా నిమిత్తంబ కాదె

తే. యట్టి రాముఁడు తాన నన్నడవిశోన
డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచెనట్ల
తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును. (6-71)

### ఉత్తర రామాయణము-కంకంటి పాపరాజు

సీ. దర్పించి పరమేశు ధన్వంబు విఱుచుట
నీ నిమిత్తమె కదే నీలవేణి
యెలమిఁ గపిరాజు చెలిమి పాటించుట
నీకొనమే కదే నీరజాక్షి
విబుధేంద్ర సుతుఁ గొంచి వ్రేసి నిర్జించుట
నీ కొఱకె కదే నిర్మలాంగి
క్రోధించి సాగర క్షోభంబు సేయుట
నీ పనికె కదే యో పురంధ్రి

తే. బ్రహ్మ కుంజనిఁ బౌలస్త్యపతి గెలుచుట
నిన్నుఁ గైకొంటకే కదే వన్నెలాడి
యకట యవి యెల్ల నెంచక యొకటి రెండు
తప్పులకు నన్ను నెడబాయ దగునె నీకు.

భీముని వంట :

తే. పసిడి యెడ్డెనలను మించు పద్మరాగ
భాజనంబుల వడ్డించు బహుపదార్థ
వితతు లమరెను మేరుసంగతసహస్ర
కరుసఁ బొదివినచిత్ర మేఘముల కరణి

ఇది గ్రంథాంతమునందు యాగ సందర్భమున చేయబడిన వంట. నాతు భీముని పాకమును మెచ్చుకొనని వారు లేరు. నాటినుండియే భీమపాకమని పేరు వచ్చినది. నేటి గోధుమ పిండివంట, వీరభద్రుని కవనమున 'సైదపు' పిండివంట యైనది. తాపసులు కూడ నాటి భోజనమున తృప్తి చెందిరి. ఏలనో శ్రీకృష్ణుని భోజనమున 'మాంసము' కూడ వర్ణితమైనది ఈతని భోజన మీతని 'భోజన ప్రియత్వము'ను తెలుపుచున్నది.

స్త్రీ పౌరుషమునకు చిహ్నము ప్రమీల పాత్ర. ఈమె విజయు నంతటి వానిని గూడ వశమొనర్చుకొనినది. నేటికిని లోకమున పెక్కురు 'ప్రమీల' అను నామమును ధరించుచున్నారు. దానికి కారణము బహుశః ఏ రామె పౌరుషమును కల్గియుండురని వారి యంతర్గత భావమై యుండవచ్చును.

ఇక నీ కవి రచనమున శాస్త్రవిషయములు కూడ బోధపడుచున్నవి. కామశాస్త్రమున నీతడు చూపిన పాండిత్యము ప్రభావతీ-సుధన్వుల కథలో మనకు గనుపించుచున్నది.

అట్టి పద్యములు:

ఋతు ధర్మము :

తే. "రమణి తావక ఋతువాసరములు పెక్కు
గలవు గాని"

చ. అనవుడు నేఁటి తోడఁ బదియాఱు దినంబులు నిండె మందటన్
దినములు లేవు పైతృకతిథిన్ ఋతుదానము సేయఁజెల్లు యా
మినికరజామునన్ వినుఁ సమీకము చేసెద నంచు నిట్లు పో
వ నుచిత మౌనె నీ వెఱుఁగవా నిగమార్థరహస్య ధర్మముల్.
(4-117, 118)

11. శ్రీకృష్ణుడు-రుక్మిణితో జరిపిన సరస సల్లాపములు
(కామశాస్త్ర విషయము)

"కామమెప్పుడున్, రమణుని కంటె నెన్మిది గుణంబులు గాదె లతాంగి కామియన్." (3-67)

III వేదాంతము - వైదిక పరిజ్ఞానము

1 'అగ్నిముఖావై దేవా' అనుచు నిగమములు చాటు (4-41)

2. అక్షయ పుణ్యశీలు నిగమార్థ రహస్య కథా ప్రవీణు (4-81)

3. ఉద్దాలకుడు శ్రాద్ధవిధుల సర్వ్తరించుట

4. హయమేధ మఖిల పాపక్షయ మని నిగమములు చెప్పు (6-101)

5 ఆమ్నాయ పథ విహీనాచారముల చేతఁ బ్రజలు నన్యోన్య వైర ముల చేత (8-212)

6 కాలక విహీనులకు మానవులకు నౌర్ధ్వదైహికంబులు లేవు. (8-211)

7 సుతునిం గృతోపనయనుం గావించి వేదాగమార్థ రహస్యములు దెల్పి (8-49)

8. యోవై పితా స పుత్ర (7-224)

మరొక్క విశేషము

జతముడి జాహ్నవీతటనికాకర పోతముఁ జూచి యొవ్వరి
కొడిమెలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁ జేసిరం
చడుగ వివాహవేదిపయి నంబిక నెచ్చెలిఁ జూచినవ్వె నా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్ఞయముల్ దయసేయుఁ గావుతన్. (1-2)

శివుని జటాజూటమున గంగ, బాలచంద్రుడు గలరు. వీని నాధారముగా వీరభద్రకవి గడియారమును వర్ణించినాడు. పూర్వకాలమున గడియారము లిట్లుండెడివి. పూర్వకాలమున గడియార విషయమును గూర్చి కవి చెప్పిన రీతి-

ఒక పెద్ద పాత్రలో నీరుండును నీటిపై నర్ధచంద్రాకారము గల ఒక చిన్న దొప్ప యుండును ఆ దొప్పకు అడుగున చిన్నరంధ్రముండును. దానిపై నీటి నుంచెదరు. ఆ రంధ్రము గుండా దొప్పలోనికి నీరు వచ్చును: నీరు నిండిన తోడనే దొప్పను తీసివేయుదురు దొప్పలో నీరు నిండుటకు గడియ కాలము పట్టును. గడియయైనట్లు లోకమునకు తెలియుటకు గడియ పూర్తి యగుటతోడనే గంటను ప్రయోగించెదరు ఇట్లు గడియల నాహరించునది గాన, నిది సంస్కృతమున ఘటికాహారమై, తెలుగున గడియారమైనది. పూర్వము గంటకొట్టుట, కాలమును చూపుట విడివిడిగా సాధనములచే వ్యక్తపరుపబడెడిది. కాని నేడు పాశ్చాత్యుల మూలమున గడియారము - ఈ రెంటిని గలిపి తెలియ చేయుచున్నది. ఈ 'గడియారము' నాటికే లోకమునకు దెలియునని దీనినిబట్టి తెలియుచున్నది.

### హాస్యము :

ఈ కవి హాస్యము సునిశితమైనది. ద్వారకా నగరము నుండి శ్రీకృష్ణ భీమాదులు హస్తిపురికి వచ్చుచు దారిలో కొంతకాల మాగిరి ఆ సమయమున కవి హాస్యమును వర్ణించెను. అది మూలానుగతమేయైనను, తెనుగున ప్రత్యేకతను గలిగినది.

సీ. తల్లిచన్నుంబాలు ద్రావి యెంతటఁ బోక
పూతనఁ బొరిగొంటి పురిటిలోన
జనని యుగ్గునఁ దృప్తి సనక నిన్నదిదాక
వెరఁజితి శ్రేపల్లె వెన్న లెల్ల
నంబపోత్తునఁ దనియక వెక్కసంబైన
యుదరాగ్ని నార్పి తింద్రోత్సవమున
జనయిత్రియొసగు భక్షణము చాలక తింటి
వా కుచేలునిచేతి యడుకు లొడిసి

తే. కడుపు లోపల సకలలోకములు వరుసఁ
గూడుకొన్నప్పుడును సఱగొఱఁత గాని
తుష్టిఁదవు గావు నీదు పొత్తున భుజింపఁ
దీఱునే నాకు ఘనమైన దీపనంబు (8-58)

ప్రథమాశ్వాసమునను నిట్టిది కలదు.

సీ. మొదల నత్యంశకాముకుఁడ వౌటకు గొల్ల
యిల్లాండ్ర గుబ్బపాలిండ్లు సాక్షి
యతినీచరతిశీలి వగుటకుఁ బారీన
కమఠ సూకర విగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండ కోట్లను
బూరింపలేని నీ బొజ్జ సాక్షి
త్రిలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము నెఱుంగ
దరకుఁ దెచ్చిన వేల్పుతరువు సాక్షి

తే. జడసముత్సాహి వగుటకు జలధి సాక్షి
వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి
మందమతి వౌట నది మఱపొందెఁ గాక
సరవిఁ జేరొ్కనఁ దరమె నీ నటలు కృష్ణ[2] (1-126)

పిన వీరభద్రునికి గల విపులమైన నాట్యశాస్త్రజ్ఞానము.

సీ. నృకళేబరంబు మింటికి వైచి కందుక
క్రీడ వర్తించు డాకిని యొర్తు
దంతిదంత మ్మాలాతముగ ద్రిప్పుచు నాడుఁ
జౌపదంబులకుఁ బిశాచ మొకటి
యజినంబు చెఱఁగుగా నభినయించుచు దేశ
పాత్రయై యొక ప్రేత పాత్ర లాడు
భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు
దరిబేసి యగుచు భేతాళుఁ డొకఁడు

తే. భూతగణములు కరతాళములు మదింప
చిత్రగతి నోర్తు చకచక ఝుంకృతులకు
గొను దువాళల నభిల దిక్కులు చలింపఁ
దాండవం బాడు నట భైరవుండుఁ బోలి. (జై. భా V - 196)

1. కందుక క్రీడ 2. చౌపదము - దేశీయ నాట్య భేదములు. స్త్రీలకు సంబంధించినవి.

3. తాండవము - పురుష నాట్యభేదము.

ఇవి స్త్రీ, పురుష నాట్యభేదములు.

## అనుసరణములు

పిన వీరభద్రుని జైమిని భారతమున పూర్వకవి స్తుతి కలదు. 'పూర్వకవి స్తుతి' అనగా, భక్తితో తన కన్న ముందున్న కవులను నుతించుట. తనకు వారిపై గల భక్తియు, ప్రభావమును గలదని వాచ్యముగ ప్రకటించుటయే ఈ పద్యమునందలి మర్మము. మొదట సంస్కృత కవి ప్రశంసయును, తదుపరి తెలుగు కవుల ప్రశంసయును గావించినాడు.

కవులం బంకజగర్భ సన్నిభుల వక్కాణింతు వల్మీక సం
భవునిన్ వ్యాసునిఁ గాళిదాసు బిల్హణున్ బాణున్ మయూరున్ శుకున్
భవభూతిన్ శివభద్రు మల్హణుని ఘంటామాఘునిం జోరు భా
రవి మా నన్నయభట్టుఁ దిక్కకవి నేబ్రాపెగ్గడన్ సోమనిన్. (1-6)

తెలుగు, సంస్కృతములలో పెక్కురు కవులను వర్ణించినవారు (కవులు) వ్రేళ్లపై లెక్కపెట్టదగిన సంఖ్యలో నున్నారు. జక్కన తన విక్రమార్క చరిత్రమున ముప్పది యెనిమిదిమంది కవులను స్తుతించియున్నాడు. ఈ సందర్భమున నీ కవి జక్కన ననుసరించినట్లు గ్రాహ్యము. ఇక జైమిని భారతమున పేర్కొనబడిన "శుకుడు" అను సంస్కృత కవి "కృష్ణకర్ణామృతము" ను కర్ణామృతముగా రచించిన లీలాశుకుడు జక్కన ఈ కవిని స్తుతించినాడు. శుకు డనునది లీలాశుకుడను పేరునకు సంక్షిప్తరూపము.

పిన పేరన ప్రశంసింపకున్నను, నాతరననుకరించిన కవులు పోతనయు, ఎక్కనయు గలరు.

(1) నన్నయభట్టు వ్రాసిన కణ్వాశ్రమ వర్ణన మాధారముగా, సౌభరి యాశ్రమ వర్ణనమున్నది.

సీ. శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకములచదువు దగిలి
కదలక వినుచుండు కరులును గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణములచల్లనిగా డ్పాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు

తే. గరఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొందు సహజ
వైరివర్గంబులయు సహవాసమవుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది.

(భారతము-ఆది-IV-2[illegible])

అనుసరణము : సౌభరి యాశ్రమ వర్ణన.

సీ. భేరుండములు ప్రక్కబెట్టి చన్నుం బూరి
పాడించి శరభ డింభముల కిచ్చు
శరభముల్ శయనించి హరికిశోరములను
బొదుఁగులపాలిచ్చి నిదురపుచ్చు
నీనినసింగంబు లేనికలేఁజూళ్లు
గుడువ మై నాకుచుఁ గుస్తరించు
లేడిపిల్లలకు బాలెంతచివ్వంగులు
పంతంబు లిచ్చుచుఁ బంచిబిల్లుఁ

తే. బకములు గప్పి పసిపాపపాములకును
మేపులొసఁగి రక్షించు నెమిళ్ల పిల్లు
తెలుక బోదలఁ బ్రోలుఁ జన్నిచ్చి యచటి
జంతుశివహంబు జాతివైరమ్ము మఱిగి.(జై.భా. 4-79)

II. మరి కొన్ని అనుసరణములు.

(a) మదమాతంగ తురంగ కాంచన (సభా 1-18)-నన్నయ
మద మాతంగ తురంగ రత్న (జై.భా. 3-51)-పీరభద్రుడు

(b) సుత శతకంబు (ఆది 5-144)-నన్నయ
బాణ శతకంబు (జై.భా 5-34)-పీరభద్రుడు

III పీరభద్రుని యుద్ధ వర్ణనకు తిక్కన వర్ణన మాధారము

"అర్జునుండును పర్జన్యు నస్త్రవృష్టిఁ
బల్లములు మిణుఁగురు వేలు పఱుపరాక
యుండ నెత్తురు వెల్లు లొండొండ పెరిఁగె
నుబ్బి భూత వేతాళంబు లోలలాడ (ద్రోణ-3-108)

ఇట్టిదే జైమిని భారతమునను గందు-

జల్లెడలును బక్కెరలును
బల్లెంబులు కోర్కు నాతపత్రాదులు న
వెల్లిఁ బడి కలసి మిణుఁగుర
బల్లము నొక్కటిగఁ బొరలి పాఱఁగఁ బొడగన్ (జై.భా. 5-29)

IV కవిత్రయములో నన్నయ, తిక్కనలను స్తుతించినట్లే, ఈ కవి ఎఱ్ఱనను కూడ స్తుతించినాడు.

ఎఱ్ఱన రచనలో గల తెలుగు, సంస్కృత పదముల కలయిక-పిన పీరన రచనకు మార్గదర్శకమైనది.

మూలము (భార-అరణ్య-VII-218)

21)

సీ. కమనీయ కమలినీ కల్లోల వీథులఁ
గదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేఁటి గముల యులివుఁ
బరిపక్వ మంజుల ఫల రసోద్ధతములై
పలుకు రాచిలుకల పటురవంబుఁ

గీ. ప్రియుఁడు వేలువేలఁ బ్రీతిమైఁ జూపుచు
జెప్పుచును బనంగఁ జిగురుఁబోఁడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపంబు
లార నతని తెలుఁగు నరయు చుండె.

అనుసరణము (జై.భా-4-184)

తదయక మందు తైల పరితప్త కటాహము కేలఁ దామరం
దొడికిలి పట్టి రాహువు విధుం గబళించిన రీతిఁ జూపఁ గ్రొ
మ్మొదుగున కేఁగు భద్రకరి మాడ్కి సుధన్వుడు చొచ్చె నిట్టుగా
నుడికెడి నూనె తొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్.

ఇందు 'తొడికిలి పట్టి రాహువు విధుం గబళించిన రీతిఁ జూప గ్రొమ్మొదుగున కేగు భద్రకరి మాడ్కి' అను చోట సంస్కృతాంధ్ర పదములు కలసి ప్రయోగింపబడినవి.

v. శైలి, పదగుంఫనము, సీసపద్యపు పోకడలయం దీతడు జక్కనను ఆధారముగా గొనినాడు.

మూలము - విక్రమార్క చరిత్ర (2-112)

"కల్పాంత దుర్దాంత కలుషాంతకస్వాంత
దుర్వారవహ్నికి నోర్వవచ్చు
నిష్ఠుర నిర్ఘోష నిర్ఘాత సంఘాత
జాత మహావహ్ని సైఁపవచ్చుఁ

ప్రళయ కాలాభీల ఫాలలోచన ఫాల
        భాగానలస్ఫూర్తి బ్రదుకవచ్చు
గాకోదరేంద్ర ఫూత్కార సంభవ తీవ్ర
        కాకోల దహనంబుఁ గదియవచ్చుఁ"

**అనుసరణము** - (జై భా. 6-148)

**సీ.** పద్మరాగోపల ప్రాకార భాసురం
        బారసాతల పరిఖావృతంబు
ప్రోత్తుంగ హేమగోపుర పరిష్కారంబు
        పటురత్న సౌధవిభ్రాజితంబు
వినుతవర్ణాశ్రమ విశ్రమ స్థానంబు
        చతురంగవాహినీ సంకులంబు
వివిధ వస్తువ్రాత విరచితాపణకంబు
        బహుతటాకారామపరిసరంబు"

vi నాచన సోమనను వీరభద్రుడు "ఒక సీస పద్యమున పెక్కు కథలను, పంక్తి కొక్కటి వంతున వ్రాయుట "యందనుసరించెను.

**మూలము** : ఉత్తర హరివంశము.

**సీ.** అభ్రంకషంబైన యాంబోతు నితండు
        త్రుంచినాఁ డితఁడు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
        గాచినాఁ డితండు ద్రోచినాఁడు
బహిర్ముఖార్థమై పర్వతేశు నితండు
        దాల్చినాఁ డితండు వ్రాల్చినాఁడు
ఫణిపరంపర తోడి పన్నగేంద్రు నితండు
        మెట్టి నాఁ డితఁడు చుట్టినాఁడు.

**తే.** నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరి మీఁద హరిహరాధనంబు.

**అనుసరణము :**

సీ. తల్లిచన్నులపాలు ద్రావి యంతటఁ బోక
పూతనఁ బొరిగొంటి పురిటిలోన
జనని యగ్గునఁ దృప్తి సనక నిన్నటిదాఁక
వెరఁజిరి ద్రేపల్లెవెన్న లెల్ల
నంబవొత్తునఁ దనియక వెక్కసం బైన
యుదరాగ్ని నార్చి తింద్రోత్సవమున
జనయిత్రి యొసఁగు భక్షణము చాలక తింటి
వా కుచేలుని చేతియటుకు లొడిసి

తే. కడుపులోపల సకలలోకములు వరుసఁ
గూరుకొన్నప్పుడును నజగొఅఁత గాని
తుష్టిఁదవు గావు నీదుపొత్తున భుజింపఁ
దీఱునే నాకు మనమైన దీపనంబు. (8-68 జై.భా.)

VII శ్రీనాథుని రచనను వీరభద్రుడు పుణికి పుచ్చుకొనినట్లు పద్యము లను, పదబంధములను, సమాసములను గాంచిన గన్పట్టును. ఇట్టివి శృంగార శాకుంతలమునందును నున్నవి. ప్రస్తుత మా గ్రంథప్రస్తావన మవసరము లేదు హర విలాసము లోని పద్యమ నకును, జైమిని భారతపు పద్యమునకును పోలిక గలదు.

మూలము హర విలాసము (2-98)

సీ. పాలపట్టిక యందు భస్మత్రిపుండ్రంబు
గర్జంబులను రాగి తమ్మదోయి
కరమునం దిత్తడి కంబంపుఁ గంటెయుం
ఘనకుచంబుల మీఁదఁ గావిగంత
కటి మండలంబునఁ గరకంచుఁ బట్టంబు
మడిఁచి కట్టిన మేలి నడిమి కట్టు
కేలఁ దామరయందుఁ గేదార వలయంబు
గడకుచ్చు మీఁదఁ బచ్చడపు గంద

తే. సంతరించి పదారు వర్షముల వయసు
ఇచ్చి బాలెంతరాలు తాపస పురంధ్రి
నంబి భామినిఁ దిరువెంగనాంచిఁ జేరి
పాలు వోయింపుఁ దమ్మ పాపనికి ననియె

అనుసరణము (జైమిని భారతము 7-197)

సీ. కటిఁ బ్రాతముతుక నీర్కావి దోవతిపంచె
ప్రూమధ్యమున నూర్ధ్వ పుండ్రకంబు
వక్షఃస్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణ
బిలమున నులివాతు తొడసి యెన్ను
నంసభాగంబున నాయవారపు సంచి
దోర్మూలమున నిర్జి తోలు సజ్జ
కుడికరంబున నఱుగుడు వేణుదండంబు
గూనివీఁపునఁ జింపిగొడుగుఁ పడక

తే. తనకు నంపడ వృద్ధవిప్రుని విధంబు
దాల్చుటయుఁ గూర్మిసఖుఁడు సుత్రామసుతుఁడు
బ్రహ్మచారియై తనవెంట రా మురారి
రత్ననగరంబు సొచ్చి పూర్వ టియాను.

మరికొన్ని అనుసరణములు ·

a బైసి=విశిష్టగుణము, భాగ్యము, గౌరవము
''శివుని బైసి యెఱుంగంగ రాదు భామినీ'' (హర వి 4-29)

అను : జై భా (7-81)

''రత్నమును దోయినపుడ వణుల బైసిచెడిపోవుఁ దుది నీరు పాము లగును'' ఈ కవుల కీ పదమునిన మక్కువ.

b. 'చిరుబంతి పసుపు' అనునది శ్రీనాథునకును, పిఁవీరనకును మక్కువ గల పదబంధము.

'చిఱుబంతి పసుపు ముద్ద సన్నెపై నిడుతంగిన్' (జై.భా. 2-100)

c. మత్తల్లి నర్తనరంగ (జై.భా.) 1-'40
మత్తల్లి మహానృత్యముల్ (కాశీ ఖం.) 6-128

d. సరిసప్రోద్భవసూతి (కాశీ ఖం.) 2-21
శక్రకపోద్భవసూతిపై (జై.భా.) 8-7

e. చెక్కు మీటిన వసవల్చు బాలకుఁడు (శృం నై. 1-17)
చెక్కుమీటిన వసవల్చ శిశువు లెదుర (జై.భా. 6-245)

f. అని తల్లి న్వనితామతల్లి (కాశీ ఖం. 1-56)
మాతల్లి న్వనితామ తల్లిని (జై భా 7-48)

g. హాఁహాల ద్వయంబు (శృం.నై. 2-121)
హాంహాల కల్పక్రూర (జై.భా) 6-228.

viii. పోతనను, వీరభద్రు డేల నుతింపలేదో (కారణము) తెలియదు. కాని పోతన ప్రభావ మీతని కవిత్వమున గన్పట్టుచున్నది ఇందు భక్తి కూడ ద్యోతకము.

మూలము : భాగవతము (I-14)

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నొడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలపఁడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు."

అనుసరణము : (జై. ఆ. II-18)

'శ్రీవిష్ణు పదభక్తి చిత్తంబులో లేని
వానికి శుభములు లేని పగిది
శంకరునిఁ బూజసేయని పంకమతికి
గురుతరైశ్వర్య మొదవని సరణి.'

ఇందు శివకేశవావినాభావము స్పష్టీకరింపబడినది.

**వీరభద్రుని అనుసరించిన కవులు :**

వీరభద్రుని ననుసరించిన కవులు ప్రధానముగా నల్వురు కనబడుచున్నారు.

1. పెద్దన (మను చరిత్రము)
2. రామరాజభూషణుడు (వసు చరిత్రము)
3. సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు (వచన జైమిని భారతము)
4. కనుపర్తి అబ్బయామాత్యుడు (అనిరుద్ధ చరిత్ర)

పెద్దన అనుసరణములు శృంగారశాకుంతలములోనను, జైమిని భారతము లోనను గన్పట్టుచున్నవి

(a) 'పొకాలుము'-పద ప్రయోగము.
మూలము : (జై. భా. 7-228.)

ఉ. "........అనపత్యతవంక నూర్ధ్వలోకమ్ములు
లేకపోయినఁ బొకాలఁగ నిమ్ము"
అనుసరణము .- (మను చరిత్ర - 5-11)

కం. ధనరాజ్య రమా మదమునఁ
గనుగానని నిన్ను శిష్యుఁగాఁ గైకొనుకం
టెను నేరమి గలదే నను
గనలించుచుఁ బ్రేలఁ కిఁకఁ బొకాలు మటన్నన్

ఇచట 'పొకాలుము' - అనునది కోపముతో లేచిపొమ్ము అనునెడ విశేషించి ప్రయోగింపబడినది. ఇది పినవీరన పద్యములో పరితాపముతోఁ బోవుటకై ప్రయోగింపఁబడినది

(b) 'కెళవు' - పద ప్రయోగము.
మూలము : (జైమిని భారతము - 5-53)

కం. అనఘుఁడు సత్త్వమె రూపై
జనియించినవాఁడు వీఁ డసాధ్యం బీవే
కను బ్రద్యుమ్నాదుల నిట
నునిచి మనము కెళవు దొలఁగి యుండుదమనుచున్.

అనుసరణము : (మనుచరిత్రము - ౬-౭౬)

తే.గీ. ఊరు పొడ వైనఁ గెళవుల యూళ్లకుఱికి
మెసవ దొరఁకొంటి ప్రజ మారిమసఁగినట్లు
తితెఁ గతిపయదినముల దేశమెల్ల
మల్లెవట్టిన చేని క్రమంబు గాఁగ.

ఇందు 'కెళవు'- అనగా దూరము అని ప్రాచీన ప్రయోగము

మనుచరిత్రము వలెనే, వసుచరిత్రము, అనిరుద్ధ చరిత్ర గ్రంథములు బాగుగా పరిశీలించిన నవి శృంగార శాకుంతలములోని వర్ణనం ననుసరించినట్లు ద్యోతకమగుచున్నది.

ఇక సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడనుసరించిన రీతులను. (అనువాద) వచన విధానమును గూర్చి ప్రత్యేకమైన నొక విభాగమున వ్రాసితిని.

ప్రస్తుతము కనుపర్తి కవి- నగర వర్ణనా సందర్భమున నెట్లనుసరించెనో చూడవచ్చును.

మూలము : జైమిని భారతము : (౩-4)
(భద్రావతీ పుర వర్ణన)

సీ స్ఫాటికమణిశిలా ప్రత్యగ్రరచనాతి
బంధుర ప్రాకార భాసురంబు
పాతాళఝర్ఝరీ పర్యాప్త కల్లోల
సుకుమార పరిఖోపశోభితంబు
కనక సౌధాంచల కలిత ముక్తావల
రాజిలీలాగ్ర తారాగణంబు
శక్రనీల శిలావిశాల గోపురరోచి
రసమయజనిత విఖ్యాతపంబు

తే. భవన కాసారకహ్లార పద్మకుముద
పుండరీక నీలోత్పల షండసురభి
విపుల మధుకర కలనాద విజిత పుష్ప
చాపనినదంబు భద్రావతీపురంబు-

అనుసరణము-ద్వారకాపుర వర్ణనము
(అనిరుద్ధ చరిత్రము) (I-68)

సీ. ప్రాకార గోపుర ప్రాసాద పద్మరా
గ ప్రభామండిత గగనతలము
సలలిత ఫలపుష్ప సాంద్ర నానా విధో
ర్వీరుహ కలిత శృంగారవనము
చంద్రకాంతోపల సోపాన కలిత శో
భిత జలపూర్ణ వాపీవ్రజంబు
సరస సౌందర్య లక్షణ లక్షితాకార
భామినీ పురుష సౌభాగ్యకరము

తే. గంధ సింధుర సైంధవ బంధురంబు
సార సారస సరస కాసార విసర
మలము జలనిధి పరిఖా సమావృతంబు
పుణ్య నిలయంబు ద్వారకా పురవరంబు.

ఈ విధమున వీరభద్రుడు కొందరు పూర్వకవుల ననుసరించగా, తరువాతి కవు లాతని ననుసరించిరి. శ్రీనాథయుగ మను సంధియుగమున నీతని ప్రముఖ స్థాన మీతని కవితాదర్శము వలనను, అనుసరణముల వలనను వ్యక్తమగుచున్నది. ఈతనికి గల సంస్కృత పాండిత్య మపారము. పూర్వ సంస్కృతాంధ్రకవుల ప్రభావ మీతని కవిత్వము నతిశక్తివంతముగ మార్చినది.

## 'హంసవింశతి' పై వీరభద్రుని ప్రభావము

అయ్యలరాజు నారాయణామాత్యుడు వ్రాసిన 'హంసవింశతి'- పద్యకావ్యముపై వీరభద్రుని ప్రభావము గలదు 'పీఠిక'లో వీరభద్రుని గూర్చిన స్తుతి గలదు.

1. నన్నయభట్టు భీమకవినాథుని దిక్కన సోమయాజిఁ బె
ద్దన్నను ముక్కుతిమ్మ సచివాగ్రణి బమ్మెర పోతరాజు గా
రన్నను రంగనాథుని మహామహుఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రు న్నుతియింతు నాంధ్రకవిరుద్రుల సత్కరుణాసముద్రులన్.

(పీఠిక-11 వ పద్యము.)

2. భోజన వర్ణనమున నీ కవి పూర్వకవులలో పిల్లలమఱ్ఱి వీరభద్రుని జైమిని భారతము ననుసరించినట్లును దోచుచున్నది.

ఉదాహరణము : (I. 105)

"............కల మాన్నంబులుం గల వంటకంబులు బొంగలి, పులి యోగిరంబు దధ్యోదనంబు నానవాలు జున్నులు మీఁగడ పెరుగులు అప్పడంబులు వడుగులు వడియంబులుఁ బెరుఁగు వడియాంబులు మిరియంపు బొడి మెంతికూటు-"
"గారెలు బూరెలు మోరుండలంగ రొల్లెలు మణుగు బువ్వలుం బేణీలు ఒప్పు బూరెలు సజ్జబూరెలు వడ లావడవడ లొబ్బట్లు చిరిమిల్లి సరదాలు బండగవ్వలు జాపట్లు నిద్దెన తేనె తొాలు బొరుగులు నేలఁకి కాయలు......బూరీలు గూళ్వా పిద లాదిగా గల భక్ష్యంబులు"

3. శైవ వైష్ణవ మతముల నీతడు హంసవింశతి యందు సమన్వయించెను వీరభద్రుడు కూడ తన గ్రంథమున నిట్లే సమన్వయించెను.

శివ భారతము - జైమిని భారతము :[3]

1. ఈ రెండు గ్రంథములలో దాస్యవిమోచనమున్నది.

భారతదేశ దాస్యమును శివాజీ కల్గించగా; ధర్మరాజు, కౌరవ దాస్యము నుండి విముక్తి చెందినాడు.

2. అశ్వమేధము చక్రవర్తిత్వ నిరూపణమునకే జరిగినది.

3. యుద్ధ వర్ణనము- వీరుల వృత్తాంతములు. వీనికి ఈ గ్రంథములలో కొఱవు లేదు.

4. ధర్మరాజు, శివాజీ- నాయకులు ధర్మవీరమును బోషించినారు.

5. భయానక, వీరములకు ద్వంద్వయుద్ధము లుదాహరణములుగా వర్ణింపబడినవి.

6. ఈ రెండింటిలో కరుణరసము వర్ణితము.

7. హాస్యము- ఈ రెంటిలోనను గందు.

8. ఈ గ్రంథములలో నాటకీయత గలదు.

9. సంభాషణాశిల్ప మున్నది.

10. జిజియాబాయి- ద్రౌపది పాత్రలలో పోలికలున్నవి.

11. శివాజీ, అర్జునుడు- ఇరువురును యుద్ధవీరులు.

ఈ కవి రచనలోని ప్రత్యేక గుణములు :

1. స్వతంత్ర రచనా క్రమము.
2. భాషలో ధారాశుద్ధి.
3. పద్య నిర్మాణ పటుత్వము.
4. ప్రత్యేక భావ నిరూపణము

శాకుంతల మెట్లరవది మందిచే తదుపరి వివిధ సాహిత్య ప్రక్రియలలో రచింప బడినదో, జైమిని భారత గ్రంథ భాగములను, నలుబది మందిచే పలువిధ సాహిత్య ప్రక్రియల కాలవాలమైనది ఈ కవి సంధి యుగము నందలి మహా కవియై, తన ప్రత్యేకతను నిలుపుకొని యున్నాడు. ఈతని పద్మవ్యూహ, గృధ్ర వ్యూహ రచన మీతనికి యుద్ధరంగము నందలి ప్రత్యక్ష పరిచయమును వెలు వరచుచున్నది.

ఎఱ్ఱన వలె నీతడు సంస్కృతాంధ్ర మిశ్రిత పదరచన మొనర్చుటచే పాంచాలీ రీతి యని చెప్పవచ్చును.

రస నిర్దేశమునకు వృత్తి ప్రధానము వృత్తి రీతి నాశ్రయించి యుండును. యుద్ధాది వర్ణనలచే వీర, రౌద్రరసము లక్కడక్కడ వర్ణింపబడుటచే ఈ గ్రంథమున గౌడీ రీతియు గన్పట్టుచున్నది. ఇక నా కారణమున - ఆరభటీ వృత్తి యుద్ధవర్ణనమున ద్యోతకమగుచున్నది. ఇక వీరరస వర్ణనమున పాంచాలీ రీతి వ్యక్తమగుచున్నది. ఆ కారణమున భారతీవృత్తి కన్పట్టుచున్నది.

ఈతని రచన కావ్యశయ్యా లోనిది. సమయ సందర్భములను బట్టి శైలి మారుచున్నది. ఈతని కవితాధార నైసర్గికము.

ఈతని గ్రంథము సంస్కృతాంధ్ర పదములకు నిలయము. కాని సంస్కృత పదములే మిన్నగా నున్నవి ఉపమా ప్రయోగము, నానుడి, జాతీయ ప్రయోగము, శబ్ద ప్రయోగచాతురి - అనునవి కవికి కరతలామలకములు.

మొత్తము మీద ప్రత్యేక వ్యక్తిత్వము, ప్రతిభ మున్నగునవి ఈయన రచనలో వడియగట్టబడినవి. ఈ విధమున నీతడును, ఈతని రచన జైమిని భారతమును విశిష్ట స్థానము నాక్రమించుచున్నవి.

## పిన వీరన మతసమన్వయము

పిన వీరభద్రుని మతమునకు స్థూలముగ కనఁబడు ఆధారము అతని గురుస్తుతి అది శృంగారశాకుంతలమున గలదు.

శా. అర్థిన్యాత్మక మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థింతు న్యతిసార్వభౌముఁ బరమ బ్రహ్మానుసంధాత నా
నార్థాలంకృతబంధుర శ్రుతిరహస్యజ్ఞాత శ్రీభారతీ
తీర్థ శ్రీచరణుఁబు నుల్లసితమ_త్తి ప్రేయసీ వల్లభున్. (I-౪)

దీసని బట్టి ఈతని గురువు శ్రీ భారతీ తీర్థులు అని తెలియుచున్నది. శృంగేరి మొదలగు మూలశంకర పీఠముల స్వాములందరు భారతీ సంప్రదాయము వారైన యతులగుటచే పిన వీరభద్రుని గురువగు శ్రీ భారతీతీర్థులు కూడ భారతీయతియే యని స్పష్టపడుచున్నది ఈతఁడు శాంకర మతానుయాయి యగుటచే, పిన వీరభద్రుఁడు కూడ శాంకరమతానుయాయి యగుటలో సందేహము లేదు.

అంతేకాదు పినవీరన తన గురువును, జైమినిభారత కృత్యాదిలో చెప్పకున్నను, గద్యలో చెప్పినాఁడు. శృంగార శాకుంతల గద్యలో కూడ ఈ విషయమే తెలుపబడినది.

### జైమిని భారత గద్య

"ఇది భారతీతీర్థ శ్రీ చరణకరుణాపాత్ర గాదయామాత్య పుత్ర వినయ విద్యా సముద్ర పినవీరభద్ర ప్రణీతంబైన జైమిని భారతంబునం దశ్వమేధ పర్వంబునందు"

### శృంగార శాకుంతల గద్య

"ఇది శ్రీ భారతీతీర్థ గురు శ్రీ చరణకరుణాలబ్ధ సిద్ధ సారస్వత పవిత్ర గాదయామాత్య యారాధితామర వీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబయిన శృంగార శాకుంతల కావ్యంబునందు......"

అని వ్రాయఁబడినది అంతేగాదు, శృంగారశాకుంతలమున గల యవ తారికలో తదితర గ్రంథరచనమును గూర్చి తెలుపుచు, "భారతీతీర్థయతి సార్వభౌము గురు కృపాతిశయ లబ్ధకవితా విభూతి గలిగి" అని వ్రాసినాడు.

ఈ నాల్గు విషయముల వలన కూడ, ఈయన గురువు శ్రీ భారతీ తీర్థుల నియే స్పష్టమగుచున్నది.

అంతేగాక, ఆ గద్యలో గల "ఆరాధితామర వీరభద్ర" అనుటలో నీతఁడు వీరభద్ర భక్తుఁడనుట కూడ తెలియుచున్నది దీనికే బలమైన సాక్ష్యము లొసఁగు మరి రెండు మూడు విషయములు కలవు అవి- (1) శృం. శా. లో (ప్ర. అ.- 21) తలిదండ్రుల విషయము తెల్పుచూ, "వీరభద్ర పదపద్మధ్యాన శుద్ధాంతరంగుని నన్నుం బిలిపించి" అని వ్రాసినాడు. (2) తన వంశ గోత్ర మును గూర్చిన పద్యములో, "శివభజనాసక్తుని" అని తనను తాను చెప్పు కొనుట ఈతని మతమునుఁ దెలుపుచున్నది (8) సీమంతినీ కల్యాణములో పినవీరన జన్మాదికమును గూర్చి తెలుపుచు, పెనుమళ్ల సోమమంత్రి వీరభద్రుని కరుణాకటాక్షమున పెదవీరన, పిన వీరన జన్మించిరనియు, అందు వీరభద్రుని అంశ పెద వీరన యనియు, వీరభద్రుఁడు తానె పిన వీరన రూపమున జన్మించినాడనియు, ఆ మహనీయుని కొలకు గాతిరాజు శ్రీశైలస్వామిని పూజించి నట్లును కథ తెలిపినాఁడు [సీ క. I 21-44] ఇదికూడ పినవీరన శివ భక్తుడనుటకుఁ దార్ఢ్యకము. ఇంక పిన వీరన గ్రంథములు చూడవలసి ఉన్నది అందులో కొన్ని ముఖ్యమగు చోట్ల ఈ కవి శివుని స్తుతించి యున్నాడు. కొన్ని ఉపమలలో శివుని కీర్తించినాఁడు. శృం. శా లో షడక్షరి, భస్మము, పంచాక్షరి, ప్రస్తావన ఇరువది మూడు పద్యములలో కలదు

జైమిని భారతమున గల "శివభక్తి"పరమగు పద్యములు

1. చ. ఉడుపతి వంశకర్త మహిమోన్నతి కెయ్యది మేర నాఁడు పా
ల్కడలి జనించినప్పుడు దళంబుగ నందొక మేసిజిడ్డు వోఁ
గడుగుకొనంగ నబ్బెనని కా శివు నొదలమేటఁ బాదముల్
దడఁబడ నోలలాడుచు హాలాహలిగా పడి సీఁదులాడెడిన్. (I-26)

2.ఉ. "... ... ... ... ... ... ...
... ... ... ... ... ... దు
ర్వార విరోధివీర నగరంబులకున్ హదుకంటిమంటలై" (I-36)

3 సీ. ... ... ... ... ... ... ... ...
నిటలాక్షు గుడిలేని కొటిక నున్న యతండు
నిల్లరికవ మీక యేఁచునతఁడుఁ
దగిలి విశ్వాసపాతకముఁ జేసినతండు
శివపంతఁ జెవిబెంతఁ జేర్పనతఁడు." (I-36)

4.తే. "శంకరునిఁ బూజసేయని పంకమతికి
గురుతరై శ్వర్య మొదవని సరణి మనము." (III-18)

5. "అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి" (IV-71)

6.మ శివరాత్రి ప్రమదావలోకన తరస్వి క్షోణీభృత్కన్యకా
ధవసేవానుగ వాలుకా గణన భక్త వ్రాత యాత్రాసము
ద్భవభారాపగమ ప్రమోదభర దృప్యద్రాజతాహార్య వై
భవ లీలాపర పాకశాసన వచః పర్యాయ పద్మాసనా. (IV-148)

జైమిని భారతములో ఉపయోగింపఁబడిన "విష్ణుభక్తి" ప్రతిపాదకమగు విశేషములు :

1 శ్రీరమణ చరణ కలిత విచారణ (II-1)
2. శ్రీ వేంకటాద్రినాథ దయావర్ధిత రాజ్య (v-1)
3 స్థిర శ్రీ మనోహారి శృంగార గేహాగిరీశ. (vII-240)
4. శ్రీరామాయణ భారత చారుకథాసుధా ప్రసన్న పంకేరుహ. (vI-1)
5. శ్రీ చికురబంధ గంధవహీ చంచద్గంధభరమలిమ్లుచ (vII-1)

పై విశేషములు కాక, విష్ణుభక్తి ప్రతిపాదకమగు కంద పద్యమొకటి దశావతార స్తుతిగా గన్పట్టుచున్నది.

క. శరధిచర కమఠ కిటి నర
హరి వామన భృగుజ రామ హలభృజ్జిన క
ల్కి రుచిరరూపాయ జగ
ద్భరణాయ నమోనమోఽస్తు భవతే యనుచున్. (VII-288)

వివరణము : పైన తెలుపఁబడిన విశేషణములు జైమిని భారత కృతిపతి యగు సాళ్వనరసింహరాయలను గూర్చి పిన వీరన వ్రాసినవి. ఇవి ఆశ్వాసము నకు మొదటను చివరను వ్రాయఁబడినవి.

దశావతార వర్ణనము జైమిని భారత సప్తమాశ్వాసము లోనిది. దశావతారములు ఒకే పద్యమున వ్రాయఁబడినవి.

జైమిని భారత కథయంతయు "శ్రీకృష్ణభక్తి" ప్రతిపాదకమే. కాని వ్రాసిన కవి పినవీరభద్రుఁడు. పినవీరన పూర్తిగా శైవుడు. అనగా శివభక్తి పరాయణుఁడు అయన గురువు కూడ భారతీతీర్థులు చిల్లర వెన్నమంత్రి శృంగార శాకుంతల కృతిపతి. ఈయనయు శివభక్తుడే సోమవార వ్రతమును పాటించువాడు. ఇచట 'శైవ-వైష్ణవ' మత సామరస్యమెట్లు కలిగెనని ప్రశ్న కూడ కలుగ గలదు. ఆ సామరస్యము వాఙ్మయమున నాడు క్రొత్తగా నల్లు కొనినది కాదు. కవిత్రయములో 'ఎఱ్ఱన' నాటి నుండి వచ్చుచున్నది.

ఎఱ్ఱన గురువు శంకరస్వామి. ఎఱ్ఱన శంభుదాసుఁడు. ఐనను, "గోవింద గుణాదర సంభృత సౌమనస్యుఁడు." ఈయన రచియించిన గ్రంథములు 1. నృసింహపురాణము 2. హరివంశము. - ఈ హరివంశము నందలి పద్యములు కొన్ని శైవ పరమగు మహిమ్న స్తోత్రము ననుసరించినవి.[4] ఈతని యీ వ్యక్తిత్వము సాహితీ లోకమును సంచలితము గావించినది.

తెలుగు వాఙ్మయములో మొట్టమొదటి నుండి మతసామరస్యమే గాని, మత వైషమ్య మెంతమాత్రమును గానరాదు.[5]

నన్నయ యుగము వెనుక సరిగా క్రీ.శ. 1100 ప్రాంతము నుండి శివకవి యుగమారంభమైనది వీరశైవమును ప్రతిపాదించిన శివకవుల కృతుల నుండి, శైవమున విష్ణుద్వేషమే లేదు దీనికి ప్రమాణములు 1. వీరశైవులకు

విహితమైన దీక్షా విధానములో వ్రతపూజా సమయమున నొనర్చు దేవతాహ్వానమున విష్ణువు నాహ్వానించుట గలదు.

శ్లో. దుర్వాస కశ్యప విరించి మృకండు పుత్ర
దేవేంద్ర బాణ హరి కృష్ణ దధీచి రామ
శ్రీవాసుదేవ కవికుంభజ గౌతమాదీన్
పుణ్యానిమాన్ పరమ పాశుపతాన్ స్మరామి.౬

2 శివ పురాణములు ఘోషిల్లునట్లు విష్ణువు కమలాక్షుఁడై, చక్రమును పొందెను.

3. మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారములో "విష్ణువరేణ్య! గోవిందప్రియభావుక" అను శివసంబోధనములు గలవు.

4. మూర్తిత్రయింటి వీరశైవుఁడగు పాల్కురికి సోమన తండ్రి విష్ణురామదేవుఁడు, తల్లి శ్రియాదేవి.

5. బసవ పురాణమున వర్ణితులైన శివభక్తులలో సిద్ధరామయ్య, ఏకాంతరామయ్య అను వారు గలరు. రామలింగేశ్వరుఁడు కూడ గలడు.

6. పోతన మహాకవి వ్రాసిన గ్రంథములు వీరభద్ర విజయము, మహాభాగవతము, నారాయణ శతకము – అనునవి. ఇందు భాగవతము కేవలము విష్ణుభక్తి ప్రతిపాదకము గదా!

శివకవి యుగము తరువాత తిక్కన యుగము ప్రారంభమైనది. తిక్కన మహాకవియే గాక, మత ప్రవర్తకుఁ డగుటచేత, "మహేశ్వరాం ఘికమల ధ్యానైక శీలుఁడను' అని తన్నుదాను చెప్పికొనినను, మత సామరస్యము కొఱకు హరిహర తత్త్వమునే ప్రతిపాదించినాఁడు. అయినను భారతమున శివోత్కర్షను, లింగపూజా విధానము మొదలగు వానిని స్పష్టముగ ప్రతిపాదించి యున్నాఁడు. తిక్కనను ప్రధానముగ శివభక్తునిగనే కేతన వర్ణించి యున్నాడు. తిక్కన యుత్తర రామాయణమును, కృష్ణకథా విలసితమగు భారతమును రచియించి యున్నాఁడు. తిక్కనకుఁ గృతి నిచ్చిన కేతన శివభక్తుఁడు 'వృషధపాద్వ్యబద్వయీ నికేతనుఁడు.' కవిత్రయములో, చివరి వాఁడగు ఎఱ్ఱన రచించిన హరివంశము శ్రీకృష్ణావతార చరిత్రమును సంపూర్ణముగ నిరూ

పించు గ్రంథము. అట్లే నృసింహావతార కథ విష్ణువు అవతారమును తెలుపును. నాచన సోమన హరిహరాద్వైతమును దృష్టాంతపూర్వకముగ నుత్తర హరి వంశమున వివరించి యున్నాడు శ్రీనాథ మహాకవి, శివకథా రచన కౌతూహలి యయ్యు, "చెన్నకేశవ పాదసేవా విరతుండ" నని చెప్పి పల్నాటి వీరచరిత్ర రచియించి యున్నాఁడు. కొఱవి గోపరాజు హరిహరాద్వైతమునే ప్రతిపాదించి యున్నాడు. పోతనకు ముందువాఁడగు మడికి సింగన కూడ వైష్ణవ భక్తి పరుఁడయ్యు, శివస్తుతిని గావించినాఁడు. పోతన సమకాలికుఁడగు నవంతుఁడు, నల్లాన్ చక్రవర్తుల గోవింద చక్రవర్తుల శిష్యుఁడయ్యును, భోజరాజీయమున శివస్తుతిఁ గావించి యున్నాడు.

ఆ తరువాత పిన వీరన తన రెండు గ్రంథముల రచనములో పూర్వ కవుల సంప్రదాయమునే యనుసరించెను. ఈయన శివ భక్తుఁడయ్యు, జైమిని భారత గ్రంథమును వైష్ణవ భక్తి ప్రతిపాదకముగ వ్రాసెను ఈయన జన్మతః వీరభద్రుఁడు జైమిని భారతము శ్రీకృష్ణార్జునుల కథ. అర్జునుఁడు హయ మేధాశ్వము వెంట వెళ్ళుటయు, శ్రీకృష్ణ ప్రభావమున నాతఁడు దిగ్విజయ యాత్ర చేయుటయు, యాగము నిర్విఘ్నముగ జరుగుటయు నిందు గల కథలు. ఇక శృంగార శాకుంతలమున వైష్ణవభక్తి ప్రతిపాదనకు తావే లేదు ఎచట చూచినను "పంచాక్షరి మంత్ర" మహిమమే కవి చతుర్థాశ్వాసమున 'పంచాక్షరి షడక్షరి' అను రెండు మంత్రముల మహిమను వర్ణించినాఁడు వీరభద్రుని ఉప మలలో కూడ శివభక్తియే ద్యోతకమగుచున్నది దుష్యంతుఁడు రాక్షసులతో యుద్ధార్థము వెళ్ళునపుడు కూడ మునీశ్వరులాతని "శివుఁడు రక్షించుగాక" యని యాశీర్వదింతురు శాకుంతల గ్రంథమంతటిలోనను "పంచాక్షరి" ప్రస్తావన అయిదు స్థలములలో నున్నది. ఒకచో, దాని మాహాత్మ్యము కూడ సంపూర్ణముగ వర్ణింపఁబడినది ఇట్టి వర్ణనమీ కవి చేయుటకు, అతనిలో గల "శివభక్తి" యే ప్రబల తార్కాణము. ఈ రెండు మంత్రములనిన పిన వీరనకు మక్కువ. దుష్యంతుని సభలోనికి శకుంతల వచ్చి, తన్ను స్వీకరించమని కోరినపుడు రాజు, 'హర హర హర' యని శిరః కంపంబులతోఁ జెవులు మూసికొనును. విభ్రమావస్థలో కూడ 'హర' యని దుష్యంతునిచే పల్కించుట పిన వీరన శైవ మునే తెలుపుచున్నది.

జైమిని భారత కృతిపతి సాళ్వగుండ నరసింహరాయలు, ఈయన విష్ణు భక్తిపరుఁడు. ఈ రాజు కోరగా, పిన వీరన జైమిని భారతమును రచియించినాడు, శంకించలేదు. విష్ణుభక్తి ప్రతిపాదకమగు విశేషణములతో రాజును ఆశ్వాసాద్యంతములలో నుతించినాడు. కృతిపతి వంశ వర్ణనము రెండు పద్యములలో 'శివ' ప్రస్తావన చేసినాఁడు. గ్రంథములో 'శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే, శివస్యహృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయగ్ం శివః' అను తత్త్వమును బోధించియున్నాఁడు. పిన వీరన ఒక పద్యములో దశావతార వర్ణనము చేసినాడు చతుర్థాశ్వాసాంత పదములలో 'శివరాత్రి' శబ్దప్రయోగము చేసి శివతత్త్వమును నెఱపినాఁడు. ఇది కృతిపతికై చేసిన విశేషణము. దీనివలన నరసింహరాయలు కూడ శివభక్తిపరునిగ గన్పట్టుచున్నాడు. నరసింహరాయలు, పినవీరననే కాక శైవ మతమును కూడ ఉద్ధరించినట్లు స్పష్టపడుచున్నది. ఇందు విప్రతిపత్తిలేదు. కాననే పినవీరనకు ఆ రాజాస్థానమున ఆశ్రయము లభించినది. తద్వారా మనకి ''జైమిని భారతము'' లభించినది. దీనినిబట్టి నాటి సంఘములో గూడ శైవమునకు ప్రబలస్థానము కలదని చెప్పక తప్పదు. రాజు శివభక్తుఁడగు కవిని పోషించినపుడు, శైవమతమునకు ఆ రాజు ఆధారభూతుఁడనియే తప్ప మరొక రీతి యోచించ శక్యముకాదు. ఈ విధముగ పినవీరన శివభక్తుఁడయ్యు, వైష్ణవభక్తి ప్రతిపాదక గ్రంథ రచనమునకు వెనుకాడక, పూర్వ కవి సంప్రదాయమును నిలిపి, తన శక్తియుక్తులతో శైవ - వైష్ణవ మత సమన్వయము గావించినాడు.

పినవీరనకు కొంచెము తరువాతి వారగు నంది మల్లయ-ఘంట సింగయ కవులు అఘోర శివాచార్యుల శిష్యులయ్యు వైష్ణవుఁడగు తుళువ నరసరాజునకు వరాహ పురాణము కృతి యిచ్చిరి.

ఈ పద్ధతిలోననే తరువాతి యుగమున శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున గూడ రచనలు సాగినవి. శైవ వైష్ణవ భేదము రచనలలో పొడసూపలేదు. అల్లసాని పెద్దన (మను చరిత్రమున శివస్తుతి), నంది తిమ్మన, మాదయ గారి మల్లన (వైష్ణవ సంబంధ గ్రంథ రచన) ధూర్జటి రాయల సన్మానమునకు పాత్రుఁడగుట, తెనాలి రామలింగ కవి శైవుఁడై, ఉద్భటారాధ్య చరిత్ర రచనము చేయుటయు, వైష్ణవుఁడై పాండురంగమాహాత్మ్య రచనము చేయుటయు; శైవుఁ

రైన చదలువాడ మల్లన వైష్ణవ మత గ్రంథమగు తొండరడిప్పొడి యాళ్వారుల చరిత్ర లేక విప్రనారాయణ చరిత్ర అను గ్రంథమును రచియించుటయు, శైవ, వైష్ణవ- మత సామరస్యమునకు ప్రతిబింబములు.

దీనినిబట్టి తెలుఁగు సాహిత్యమున శైవ-వైష్ణవ మత భేదములంతగా ప్రవర్తిల్ల లేదని చెప్పక తప్పదు. ఈ రెంటి సామరస్యము, భక్తి సామరస్యమై తెలుగు వాఙ్మయమున నంతర్వాహినియై ప్రవహించినది. ఈ విధముగ తెలుఁగు కవులు కేవల వాఙ్మయముననే గాక, ఆధ్యాత్మికముునను భిన్నత్వమున నేకత్వ మును సాధించిరి.

## సాళ్వ నరసింహరాయల మతము

శైవ వైష్ణవ మత సహనత.- ఈ రాజు మతమును గూర్చి జైమిని భారతములో కొన్ని విశేషణములు పినవీరనచే ప్రయోగింపఁబడినవి. వీనిని బట్టి, శైవ వైష్ణవ సహనత గలదని తేలును. దాన శాసనములను బట్టి చూచిన, వైష్ణవమతమును కూడ ఆదరించినట్లు ద్యోతమానమగును. అంతమాత్రమున శైవమును త్రోసిపుచ్చినట్లు చెప్ప వీలులేదు. శైవమును ఆదరించనిచో, పిన వీరనకు ఆశ్రయము దొరికెడిది గాదు.

తరువాతి వాడగు కృష్ణదేవరాయలు వైష్ణవుడయ్యును, శ్రీశైలము మొద లగు శైవక్షేత్రములకు దానాదికముల గావించియున్నాడు. అందుచేత నరసింహ రాయలు కూడ శైవుఁడయ్యు వేంకటేశ్వరునికి దాన శాసనముల నేల కల్పింప కూడదు? ఇట్లూహించినను, ఈ రాజు రెండు మతములను సహనముతో జూచి నట్లు తోచును. ఈ విధమగు సహనతకు సాళ్వ నరసింహరాయలే శ్రీకృష్ణదేవ రాయలకు మార్గదర్శకుడైనట్లు చెప్పవచ్చును. ఈ విధముగ మతసహనము విజయనగర రాజుల విశిష్ట లక్షణమగుచున్నది.

## ఉపసంహృతి

వీరభద్రుడు ప్రదర్శించిన విశ్వరూపమును కన్నుల నిండుగా గాంచ వలయుననిన "జైమిని భారతము" పఠించుటకన్న మార్గములేదు. పలు విషయ ముల నెన్నటి నుండియో "నివురుగప్పిన నిప్పు" వలె దాచుకొనిన వీరభద్రుని నిజస్వరూప మీనాడు మనకు వ్యక్తమైనది. "ఏ పుట్టలో నే పామున్నదో"-

అను వాక్య మిట సార్థకమైనది. ఇదంతయును జైమిని భారత గ్రంథముననే మనము గ్రహించినాము. ఈ గ్రంథమువలన నాతడు శాశ్వతకాయుడై యున్నాడు.

''రస సిద్ధాః కవీశ్వరాః''

1 'విజయ నగర సామ్రాజ్యాంధ్ర వాఙ్మయ చరిత్రము'లో శ్రీ దేకుమళ్ళ అచ్యుతరావు-మల్లన-ఈ కవికి సమకాలికుడని పేర్కొనినారు. కాని తత్కావి వివరములు కానరావు.

2. ఆచార్య రామరాజు గారు తమ వ్యాసమున ''కవితా లహరి'' గ్రంథమున నీ పద్యములను పేర్కొనినారు. పుటలు 65, 67 (కవితా లహరి) 1976 జనవరి.

3. ఈ పోలికలను శ్రీ సర్దేశాయి తిరుమలరావు ''సాహిత్య తత్త్వము - శివ భారతము'' (1971) గ్రంథమున చూపినారు. పుట 37, 194, 310

4. 'ఎఱ్ఱన - మత సమన్వయము' - ఆచార్య నిడుదవోలు వేంకటరావు. భారతి-జూను 1967 పుట 44.
పోతన - శ్రీ నిడుదవోలు వేంకటరావు
'తెలుగు సాహిత్యము - మత సామరస్యము' పుట 26, 27.

5. ఈ శ్లోకము 'చిన్మయ దీక్ష' అను వీరశైవ దీక్షా విధానము నిర్వచించు గ్రంథము లోనిది.

| అశ్వాసము/వృత్తములు | కందము | తేటగీతి | ఉత్పలమాల | చంపకమాల | సీసము | మత్తేభము | శార్దూలము | ఆటవెలది | లయగ్రాహి | భుజంగప్రయాతము | మాలిని | మత్తకోకిల | పృథ్వి | మానిని | ఉత్సాహ | తోటకము | స్రగ్విణి | వచనము | వెరశి సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| I | 42 | 19 | 19 | 11 | 18 | 6 | 7 | 8 | + | + | 1 | + | + | + | + | + | + | 17 | 148 |
| II | 28 | 19 | 15 | 15 | 19 | 9 | 4 | + | + | + | + | + | 1 | + | + | + | + | 8 | 118 |
| III | 46 | 8 | 19 | 11 | 17 | 7 | 5 | 2 | + | + | + | + | + | + | 1 | + | + | 12 | 180 |
| IV | 61 | 18 | 16 | 24 | 12 | 7 | 2 | 1 | + | + | + | + | + | 1 | + | + | + | 9 | 146 |
| V | 69 | 17 | 25 | 22 | 18 | 29 | 8 | 1 | + | + | + | + | + | + | + | + | 1 | 17 | 207 |
| VI | 117 | 88 | 81 | 20 | 28 | 28 | 14 | 4 | 1 | + | + | + | + | + | + | 1 | + | 2 | 274 |
| VII | 101 | 81 | 19 | 17 | 14 | 14 | 12 | 6 | 1 | 1 | + | + | + | + | + | + | + | 25 | 241 |
| VIII | 108 | 18 | 11 | 26 | 28 | 14 | 8 | 16 | + | + | + | 1 | + | + | + | + | + | 8 | 228 |
| వెరశి | 56[illegible] | 158 | 155 | 146 | 144 | 114 | 55 | [illegible]8 | 2 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 98 | 1482 |

'సీమంతినీ కల్యాణము' పీఠికలో గల వంశవృక్షము :

ఇది చెలికాని లచ్చారావుగారిచే తెలుపబడినది.

తేదీ (30-3-1919) A.D.

(భరద్వాజ మహర్షి)

↓

12 మంది సోదరులు⟶పిల్లలమఱ్ఱి గాదిరాజు (భార్య నాగాంబ)

- పెద వీరన్న (మంత్రి)
- పిన వీరన (1450 A.D.) (జైమిని భారత కర్త)
  - వీరన్న
  - మల్లేశ్వరుడు (ఇతడు కటకేశ్వరుని వలన పెనుమళ్ళ గ్రామమును పొందినాడు. అచట ఈ వంశము వారు నివసించి పెనుమళ్ళ వారైనారు)
    - వీరన్న
      - నరసన్న
        - తిమ్మన్న
          - నరసన్న
    - సోమేశ్వరుడు
      - దాచిరాజు
        - పెదసోమన్న
        - చినసోమన్న
          - రాయన్న
            - బాపమంత్రి
        - పాపిడిసోమన్న
          - సోమన్న (ఇద్దరు భార్యలు)
            - పేరమ్మ
            - లక్ష్మి

(తరువాతి పుటలో చూడుడు)




'సీమంతినీ కల్యాణము'లోని పిల్లలమఱ్ఱి వారి వంశవృక్షము :

(భారద్వాజ మహర్షి)

(సంతతి)

పిల్లలమఱ్ఱి గాదిరాజు (12 మంది సోదరులు)

(భార్య నాగాంబ)

- పెదవీరభద్రుడు
- పినవీరభద్రుడు (జైమిని భారత గ్రంథకర్త)
  - వీరన్న
  - మల్లేశ్వరుడు
    - వీరన్నమంత్రి
      - నరస్నామాత్యుడు (భార్య పెద్దాంబ)
        - పెద బసవయ్య
        - చిన బసవయ్య
        - ఉమ్మన్న (భావమ్మ)
        - తిమ్మన్న
    - సోమేశ్వరుడు
      - దాచిరాజు
        - పెద సోమమంత్రి
        - పినసోమన
        - పాపిడిసోమన (చక్రమ)
          - (తరువాతి పుట)
- భద్రమ్మ


నర్సన
(వెంకాంబ)
రాయన్న
(లక్ష్మి)
బాచమంత్రి
సోమన
(ఇద్దరు
భార్యలు)
సోమన
(ఇద్దరు భార్యలు)
(పేరమాంబ)
(లక్ష్మి)
బసవమంత్రి (వీరమాంబ)
(నందపురము కృష్ణదేవుని మంత్రి)
పెద నీలమంత్రి
(అన్నపూర్ణ)
పిన నీలమంత్రి
పెదవెంకన్న
సోమనమంత్రి
(గౌరమాంబ)
చినవెంకన్న
మల్లనామాత్యుడు
పెనుమళ్ళ సోమమంత్రి
(సీమంతినీ కల్యాణకర్త)
(పూసపాటి తమ్మభూపాలుని మంత్రి)
(ఇద్దరు భార్యలు)
లచ్చయామాత్యుడు
(భార్య) అన్నమ్మ
లక్ష్మిదేవి (భార్య)
పిన నీలమంత్రి (బాపమ)
సోమనమంత్రి
భాస్కరుడు
బసవన్న

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని 'జైమిని భారత' "పీఠిక" ఆధారముగ కృతిపతి యగు "సాళువగుండ నరసింహరాజు" వంశవృక్షము గ్రహింపబడినది.




'సాళువాభ్యుదయము' అను గ్రంథమును రాజనాథ డిండిముడు సంస్కృతమున రచియించినాడు. ఇందు సాళువ నరసింహరాయల వంశవృక్షము గలదు.[1]



వీరి జనన క్రమము జైమిని భారతములో నొక రీతిగను, ఇచట మరొక రీతిగను గలదు. వీరిలో సాళువ మంగరాజు బుక్కరాయల పుత్రుడైన కంప భూపతికి సేనాధిపతిగ నుండి దక్షిణ దేశమును జయించి పరపక్షి సాళ్వదగుట చేత 'సాళువ' బిరుదము పొందెను. తత్కారణమున నీ వంశము వారికి 'సాళువ' నామము వంశ నామమైనది.

వీరి జనన క్రమమున గల భిన్నాభిప్రాయముల చర్చించవలయుననిన, 'సాళువాభ్యుదయము' లభించుట లేదు. కేవలము ''జైమిని భారత''మే నేటి యాధార గ్రంథము.

పద్మ వ్యూహము



క్రీ. శ. 1889 లో విశాఖ పట్టణమున 'నానార్థ గాంభీర్య చమత్కారిక' అను గ్రంథమున, ఇట్లే పద్మవ్యూహము ముద్రితమైనది. నేటికిని విశాఖ మండలమున విజయనగరమున 'ఫూల్‌బాగ్' అను స్థలమున, ఈ పద్మ వ్యూహము పైన చెప్పిన యాకారముతో ఇటుకలచే నిర్మించబడినది. ఇది క్రీ శ. 1880 ప్రాంతమున అప్పటి విజయనగరము మహారాజును, ఆంధ్ర భోజుడని ప్రసిద్ధికెక్కిన ఆనందగజపతి మహారాజా వారిచే నిర్మింపబడినది. [భారతి - సమగ్రాంధ్ర సాహిత్య విమర్శన: శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు. - సెప్టెంబరు 1965)

## తెలుగులో జైమిని భారతములు - వివిధ రీతులు

| | |
|---|---|
| 1. చంద్రహాస విలాసము | యాదవామాత్యుడు (16 శ.) |
| 2. కుశలవోపాఖ్యానము | రామనార్య |
| 3. జైమిని భారతము (వచన) | సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు (18 శ.) |
| 4. చంద్రహాసోపాఖ్యానము (చరిత్ర-వచన.) | కె. వేంకటరమణప్ప. 1890 |
| 5. చంద్రహాస చరిత్ర (వ.) | అన్నమరాజు సుబ్బారాయుడు 1898. |
| 6. ప్రమీలార్జునీయము | ఎం శ్రీరామమూర్తి 1898 |
| 7. చంద్రహాస నాటకము | ముళ్ళపూడి వెంకయ్య 1899 |
| 8. చంద్రహాస చరిత్ర (యక్షగానము) | రాజా వీరయ్య. 1907 |
| 9. చంద్రహాస నాటకము | గంజి నాగయ్య 1907. |
| 10. -do- | మోచర్ల హనుమంతరావు 1908. |
| 11 చంద్రహాస విలాసము (వ.) | నోరి గురులింగశాస్త్రి 1909. |
| 12 చంద్రహాస చరిత్ర (నా ) | నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి. 1909. |
| 13 చంద్రహాస నాటకము | టి. శేషాచారి 1910. |
| 14. చంద్రహాస చరిత్ర (వ.) | నందనవనము రామయ్య 1911. |
| 15. చంద్రహాస చరిత్ర (వ.) (హరికథ) | షేకు నబీసాహెబు. 1910. |
| 16 చంద్రహాస | మద్దుపల్లి గురుబ్రహ్మము. 1910 |
| 17. చతుర చంద్రహాస (నా ) | ద్రోణంరాజు సీతారామయ్య. 1912. |
| 18. చంద్రహాసోదంతము(చరిత్ర వ ) | నరికొండ వేంకటప్పలరాజు 1913. |
| 19. చంద్రహాస (నా ) | పరమాత్ముని వేంకటప్పయ్య 1913. |
| 20. ప్రమీలార్జునీయ నాటకము | ధర్మవరం కృష్ణమాచార్యులు. 1914. |
| 12. చంద్రహాస ,, | ,, ,, |

| | |
|---|---|
| 22. చంద్రహాస నాటక్ (చరిత్ర) | టి. కందస్వామి మొదలి. 1914. |
| 23. చంద్రహాస నాటకము | గోపాలుని సుబ్బరామయ్య. 1917. |
| 24. చంద్రహాసుడు (నవల) | కె. రఘునాథరావు. 1917. |
| 25. చం ద్రహాస నాటకము | కె. సంజీవకవి. 1921. |
| 26. ప్రమీలార్జునీయము | ద్రోణంరాజు సీతారామారావు. 1921. |
| 27. చతుర చంద్రహాస (నా.) | బలకమర్తి లక్ష్మీనరసింహము. 1922. |
| 28. లలిత చంద్రహాస (నా.) | వేంకట జోగయ్యశాస్త్రి. 1925. |
| 29. బభ్రువాహన | పూసపాటి రంగరాజు. 1932. |
| 30. చంద్రహాస విలాసప్రబంధము | కాకరపర్తి కృష్ణశాస్త్రి. 1934. |
| 31. సంగీత చంద్రహాస (నా ) | ఎం రామరాజు. 1941. |
| 32. ప్రమీల సమర సన్నాహము (గేయము) | మూలము . మైథిలి శరణగుప్త (హిందీ) అను : TPS రామచంద్రాచార్య జూన్ - స్రవంతి. 1953. |
| 33. బాలల బొమ్మల జైమిని భారతము (వ ) | బి. సత్యనారాయణ మూర్తి, ఎల్. నాగభూషణ గుప్త. 1958. |
| 34. విషయ (వ.) | కె భావనారాయణ. 1962. |
| 35. ప్రమీలార్జునీయము (యక్షగానము) | చెర్విరాల భాగయ్య. 1963. |
| 36. చంద్రహాస (యక్షగానము) | ప్రచురణ : కొండపల్లి వారు 1966 |
| 37. మహావీర బభ్రువాహన (నా ) | వేదాంతం రామానుజాచార్య. 1967. |
| 38. చంద్రహాస చరిత్ర | సంపాక సూర్యప్రకాశము. |
| 39. లలిత చంద్రహాస (నవల) | |
| 40. ప్రమీలార్జునీయము | సి. కోటేశ్వరరావు |
| 41. జైమిని భారతము (వచనము) | 'అనంతం'. 1967. |

## విదేశీయ తాళపత్ర వివరణము

HINDI–EPIC–MAHABHARATA

(American Oriental Series) Vol. 12

**Book:** A Census of Indic Manuscripts in the United States and Canada.

Editors: W. Norman Brown
John K. SHRYOCK
E. A. SPEISER
American Oriental Society
New Haven, Connecticut
1 9 3 8
Compiled by H. I. Poleman.

A Contribution from the American Council of learned Societies has assisted in the publication of this volume.

Copyright 1938.
By American Oriental Society
Made in the United States of America
The Cuneo Eastern Press,
Philadelphia
PENNSYLVANIA.

No. 1652 Harvard University
H. Harvard University Library
Cambridge,
Massachusetts (U.S.A.)

5578 No.

Asvamedha Parvan. Translated by Jai Muni. Adh. 1-60+Beginning of 61.107 ff. 5 9 X 9.4 Book form, tied leaves. H. 1652.

**Book:** "Catalogue of the Sanskrit and Prakrit Manuscripts in the Library of the India Office'
Vol. II (Brahminical and Jaina Mss)
By Aurther Berriedale Keith, 

(Professor of Sanskrit and Comparative Philology in the University of Edinburgh)

Published by order of the Secretary of State
for India in Council
At the Clarendon Press, OXFORD.
(1935)
Printed in Great Britain at the University Press (OXFORD)
By John Johnson
Printed to the University

Part I (No. 4204 -6627)
B. Poetical Literature:
MAHA BHARATHA
Pages 869, 870

No. 6496

Burnell. 143. Foll 86. Palmyra leaves, Size 15 in by 1-3/8 in; Fairly written, in the Grantha Character, about A.D. 1860. Nine or ten lines in a Page

The Jaiminiya - Mahabharata, Asramavasa Parvan, the Sita Vijaya Section, in fifty adhyayas.

It begins Fol. 1.

శ్రీమతే రామానుజాయ నమః

జనమేజయ.

"జనాపవాద సహ్రనామ స్త్ర్యాయ జానకీం।
సంపూర్ణ గర్భాం సర్వజ్ఞస్యాప్యాశ్రమమగాన్మునేః॥
తత్ర సా సుషువే పుత్రౌ యమళౌ వీర్యశాలినౌ।
వాల్మీకి శిష్యౌ సర్వజ్ఞౌ సర్వాస్త్ర కుశలౌ శితౌ॥
నామ్నా కుశలవౌ రతౌ ప్రపథాతే తపస్వినౌ,
హయమేధస్య తురంగం బద్ధ్వా రామస్య తౌ తదా॥

Adhyaya II begins fol. 2; A III fol. 3; A IV fol. 4; A V fol. (5) (b); A X fol. 12; A XV fol. 21 (b); A XX fol. 30, A XXV fol. 39 (b); A XXX fol. 46 (b), A XXXV fol. 54 (b); A XL fol. 64 (b); A XLV fol. 77; A L. fol. (85) (b); It ends fol. 86 (b)

ఇత్యుదీరిత మాకర్ణ్య జైమినిర్మునిసత్తమః।
జగదాశ్రమ వాసాఖ్యం పర్వ పుణ్యకథాశ్రయం॥

జైమిని:

సీతావిజయమారభ్య ధృతరాష్ట్రస్య భూపతే।
పరలోకాప్తి పర్యన్తం యదుక్తం నృపసత్తమ
ఖ్యాత మాశ్రమ వాసాఖ్యం పర్వ తత్ కథయామి తే।

ఇతి జైమినియే మహాభారతే ఆశ్రమవాస పర్వణి సీతా విజయే పంచాశోఽధ్యాయః। హరిః ఓమ్।

The boards of the Ms. are ornamental with a coloured flower pattern The Ms. is fairly accurate, It is wrongly described in Catal. Catal III as a Ms. of the Ordinary Asvamedha Parvan

(A.C. Burnell)

---

No. 6497

Meckenzie XI 3. Foll. 153. Palmyra leaves Size 15-5/8 in by 1-1/4 in. Carelessly written, in the Oriya Character, about A D. 1810 four lines in a Page

The Jaimini - Bharata, imperfect Adhyaya I of the Asvamedhika Parvan begins fol 1, A V. fol 13, A X fol. 21; A XV fol 37; A XX fol 59 (b), Ady. XXX fol. 94 (b), A XL fol. 128 (b); A L fol 150.

It ends fol. 153 (b) ఇతి శ్రీ జైమినీయే భారతే అశ్వమేధ పర్వణి ద్విపంచాశత్తమోఽధ్యాయః.

The Ms. is unsinked, in accurate, and not easy to read. fol 95 (b) is half blank, there being a lacuna; The boards are ornamental with a coloured floral design. There is only one hole in the Ms in the Centre The leaves are not numbered

For this see Eggeling no 3233.

(Colin Mackenzie)

## దేశీయ తాళపత్రములు :

"A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Govt. Oriental Manuscripts Library
MADRAS.
Prepared under the orders of the Govt. of Madras.
Vol. I - Prabandhas
Itihasas, Puranas and Mahatmyas
Printed by the Superintendent,
Govt. Press, Madras.
1915
Pages 24, 25, 26.
Nos. 14, 15, 16 & 17.

### No. 14. జైమిని భారతము (అశ్వమేధపర్వము)
### JAIMINI BHARATAMU (ASVAMEDHAPARVAMU)

Substance, Paper : Size, 12 x 8-1/4 inches, Pages 692. Lines 20 on a page Mode of writing, good, but not free from mistakes. Written on the side of paper, condition, very slightly injured. Appearance old., complete Some leaves are misplaced in the binding

Some work as that described under R. No. 12 of the Triennial Catalogue of Mss. Part 3 on a fly leaf attached to this latter manuscripts, there is given a genealogy of the descendants of Gadayamatya, the father of the author. It is extracted in the Telugu remark below :

On fol. 1 (a) Mr. C.P. Brown writes.

"This is one of the poems which are looked upon as పంచదబ్బులు or Mere fictions or Apocryphal Tales".

On fol. 346 (b) he again writes.

"Wrong, the పంచదబ్బు were written by other poets—they are seperate poems (Zuluri Appaya Says) entitled the మైరావణ చరిత్ర, శతముఖ రామాయణం, కృష్ణార్జున సంవాదము, గంగాగౌరి సంవాదము, కుశలవ కథ, యీ ౫ పంచదబ్బులు అని జూలూరి అప్పయ పండితుడు చెప్పినాడు. (వి-వి.)

సమగ్రము - వ్రాత తిన్ననిది - తప్పులు లేకపోలేదు. శైథిల్య గ్రంథ పాతాదులు లేవు సంపుటీకరణమున రెండు పత్రములు తబ్బిబ్బులయినవి. 269 పత్రము తరువాత 278, 299 పత్రములు చేర్చుకోవలెను.

ఇది ట్రై వాల్యూం, 1 వ పార్టు, 8 వ నెం. R 12 రు. న వర్ణితము. అక్కడ చూచునది.

ఆ 12 నెం. పుస్తకము ముఖపత్రమున నీ క్రింద జూపబడు వంశ క్రమము ప్రతిలేఖకుడు వ్రాసెను. అది గ్రంథకర్త యగు పినవీరభద్రుని వంశ క్రమమే కానోపు.

"కూటస్థుడు - గాదెరాజు - పెద ఎరన్న - చిన వీరన్న - గోర్రాజు- తిప్పరాజు - మల్లమరాజు - యల్లమరాజు - విస్సమరాజు - బాపిరాజు - పాపరాజు."

## No. 15. జైమిని భారతము (అశ్వమేధపర్వము)
## JAIMINI BHARATAMU (ASVAMEDHAPARVAMU)

Substance, Palm - leaf. Size 10-3/4 X 1-3/8 inches, Pages 475, Lines 6-7 on a page. Mode of writing, fair but faulty Condition much injured. Appearance old

Complete, but imperfect on account of the disappearance of leaves 1-4 and 234.

Same work as above.

(వి. వి.)

సమగ్రము. వ్రాత యొక్క మాదిరి నున్నది. తప్పులు గలవు శైథిల్యము హెచ్చు. గ్రంథపాతములు గలవు. తొలి పత్రములు నాలుగు పోయినవి. ౨౩౪ వ పత్రము విరుపబడినది.

విలేఖకు డిట్లు వ్రాసెను:

'నందన నామ సం. భాద్రపద శు॥ ౧౩ ॥శు॥ వర్కు అంగర నర సింగన వ్రాసిన ప్రతిక్రమాను పుప్పు దాయన్న జైమిని భారతం సంపూర్ణంగాను వ్రాసెను.'

పూర్వము వలె.

## No. 16. జైమిని భారతము (అశ్వమేధపర్వము)
## JAIMINI BHARATAMU (ASVAMEDHAPARVAMU)

Substance, Palm - leaf. Size, 17-3/4 X 1-1/2 inches. Pages 210 Lines 8 on a page Mode of writing, fairly but not free from mistakes. Condition injured. Appearance old.

Complete, but a little imperfect on account of an omission in the writing on fol. 96.

Same work as the above.

(వి. వి.)

సమగ్రము. వ్రాతతిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము. గ్రంథపాతములు గలవు.

ఇదియు వెనుకటి దాని యట్లే. గ్రంథాంతమునం దిట్లున్నది.

"శ్రీ వనిపేట లక్ష్మి చన్న కేశవార్పణమస్తు ... ... ... ... ... శ్రీముఖ నామ సం. పుష్య శు ౫ సోమవారము వఱకు జైమిని భారతము సంపూర్ణము."

## No 17. జైమిని భారతము (అశ్వమేధపర్వము)
## JAIMINI BHARATAMU (ASVAMEDHAPARVAMU)

Substance, Palm - leaf, Size 13-3/8 X 1½ inches, Pages 162. Lines 9 and 10 on a page. Mode of writing fair but not free from mistakes. Condition much injured. Appearance old.

Complete, but very imperfect on account of the disappearance of some leaves and the broken condition of some others.

(వి. వి.)

సమగ్రమే. వ్రాత తిన్ననిది, తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు మెండు. ౧౧ మొదలు ౨౨ వఱకు నుండవలయు నట్టియు, ౩౬ సంఖ్యతో నుండవలయు నట్టియు, పత్రములు లేవు

వెనుకటి దాని యట్లే.

# దేశీయ తాళపత్రములు

Book : "A Triennial Catalogue of Manuscripts"
(Collected during the Triennium)
1916—1917 To 1918—1919
For the
Govt. Oriental Manuscripts Library
MADRAS.
Prepared under the orders of Govt. of Madras
Vol. III - Part III - Telugu.
MADRAS
Printed by the Superintendent Govt. Press
1925
Page 1307 to 1314
R. No. 5/3.

Paper 10-3/4 X 9-3/4 inches foll. 157, lines 20 on a page. Mode of writing good and fairly correct. In a good condition.

Transcribed in the year 1918-19 from a Ms. of M.R. Ry. Gurajada Venkataramadas Pantulu Garu of Vizianagaram, Viziagapatam Dist.

(C) సీమంతిని పరిణయము (Simanthini Parinayamu)

This Prabandha is composed with a view to point out the efficacy of observing certain vows on Mondays in a specified month and is based on the story found in the Brahmottarakhanda of the Skanda Purana. The author is Ponumalla Somanamatya, Son of Nilayamantrin of Bharadvaja gotra and disciple of Ellanaradhya. He was a minister of the prince Pusapati Thammabhupala. He states that he was induced to write this work by the eulogy of some of his learned friends who described his genealogy, and stated that he was a descendent of Pillalamarri Pina Veerabhadra, author of the Jaiminibharata etc. It is further stated that the Pillalamarri family lived at Penumerlla and was therefore called after the latter name.

Complete in 5 Asvasas excepting a few stanzas in the prefaratory portion.

**VERSES :**

మ ... ... ... ... ... ... ... ... ను
త్తమ వత్సంబు గృహంబు చేసిన జగత్కల్యాణపుంధాత్రి ని
త్య మహేంద్రాది సుపర్వసర్వ శుభ దోదంచత్కృపాలోక
యగమవాక్య స్తుత లక్ష్మి తోడగును మత్కావ్య క్రియాసిద్ధికిన్.

సీ. కౌండిన్య గోత్రజు ఘనుడైన కేదార
గురుపౌత్రు నయగారి కుల పవిత్రు
శార్వతీ హృదయేశ పద పద్మ పూజనా
పరుడైన విశ్వేశ గురుని పుత్రు
బరమ పాతివ్రత్య శవ్య సద్గుణ కదం
బకు నారమాంబకు ప్రాణనాథు
వినయ భూషణుడైన వీరభద్ర గురుండు
శాశ్వత కీర్తి విశ్వేశ్వరుండు

గీ. ననఘు కేదార విభుదు లింగనయు ననగ
వెలయు పుత్రులు సేవింప నలరుచున్న
శైవశాస్త్ర రహస్య విజ్ఞాన చతురు
బ్రస్తుతించెద నెల్లనారాధ్యవరుని.

ఉ. నన్నయభట్టు గావ్యరచనాచణు దిక్కన సోమయాజి వి
ద్వన్నుతు నెఱ్ఱప్రెగ్గడను ధన్యుని నాచనసోము గీర్తిసం
పన్ను హళక్కి భాస్కరుని బమ్మెరపోత కవీంద్రశేఖరున్
సన్నుతి సేతు వారి కరుణా మహిమంబు లభించు కోరికన్.

సీ. వినుత ... ... ... సోమమంత్రీంద్ర సుకవి నేను.
సీ.గీ. మోహనుండు భారద్వాజ ముని వరుండు.
సీ. కవి వర్ణనీయు ... ... ... సోదరవర్గము పాలనుంచి.
గీ. ఇక్కడికి ... ... ... వ్రాతహితకతుండు.
సీ. ఆ యతీంద్రుడు ... ... ... ప్రపత్తిచే నిలిచితేని.
క. ఆ గాదిరాజు వనిత ... ... ... వారి బుత్రుల గాంచెన్.
క. ఘనుడందు ... ... ... నొక్క జడ ధరియించెన్.

సీ. అతి లాలితాకారు ... ... ... కీర్తి విస్ఫూర్తి గనియె.
సీ. మహనీయ పిల్లలమఱ్ఱి ... ... ... కవివరు డెందుగలడు.
సీ. అవతార దర్పణం ... ... ... పినవీరభద్రసుకవి.
గీ. భాగ్య నిధియైన ... ... ... ధర్మపరుఁడు.
సీ. మహనీయతేజు ... ... ... కీర్తి నొందిరందు.
సీ. అగ్రజుండైన వీరన్న ... ... ... యభివృద్ధి గాంచు.
సీ. జయవాదికాపుర ... ... ... సోమప్రధాన
క. అనుచు ... ... ... ప్రకాశిత బుద్ధిన్
సీ. మును నామసంబున ... ... ... తెందుననుచు.

End: వనమయూరము

నీఁగళ ... ... ... వృషాధిపతురంగా.

Colophon గద్య; ఇతి శ్రీశైల నివాస భ్రమరాంబా సమేత మల్లేశ్వర కృపా పాత్ర భారద్వాజ గోత్ర పవిత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య ప్రణీతంబైన సీమంతినీ కల్యాణంబను మహా ప్రబంధంబు నందు పంచమాశ్వాసము సంపూర్ణము.

గ్రంథాంతమున నీ క్రింది పద్యము లున్నవి ·

సీ. అచలాత్మజా మనోహారియౌ శృంగారి
పరమోత్తమాంగుడై పరగు జాణ
కంజాతనేత్రుడై కడు నొప్పు దేవుండు
హరిదంబరాభిఖ్య నలరు భోగి
మన గోత్ర ధర్మంబు కరము వాయని శూరు
డార్యాళి పూజ్యుడై నట్టి మేటి
శుచి వసుధాకార శోభ గల్గు మహాత్ము
డఖిల జగద్వంద్యుడైన ఘనుడు

గీ. అమ్మహాదేవు డీశ్వరుండైన రాము
డఖిల శుభము లొసంగ బెంపలరు ధరణి
బూత సద్గుణ పేటి శ్రీ పూసపాటి,
గోత్ర జాచ్యుత రామ రాట్పుంగవుండు.

శా. కల్యాణాస్పదమౌ తదాజ్ఞ గడువేడ్కన్ వ్రాసె జెంపొప్ప గా
సల్యా సూను కృపా విభూతినీ దుదాశ్వాసంబు సీమంతినీ
కల్యాణంబున గాళ్ళకూరికులు డాఖ్యన్ సూరనార్యుండు మాం
గల్యాధిక్యత మార్గశీర్ష సితపక్ష ద్వాదశిన్ శార్వరిన్. (వి-వి.)

కృత్యారంభ పద్య భాగము కొంత శిథిలతగా గ్రంథమెల్ల గలదు. వ్రాత చక్కనిది. తప్పు లంతగా లేవు శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సీమంతినీ కల్యాణమను పేరు గల యయిదాశ్వాసముల యీ ప్రబంధ మున సోమవాసర వ్రత మాహాత్మ్యము వర్ణింపబడినది. గ్రంథకర్త పెనుమళ్ళ సోమకవి. నీలయ మంత్రి కొడుకు. భారద్వాజ గోత్రుడు. ఎల్లనారాధ్యుని శిష్యుడు. పూసపాటి తమ్మభూపాలుని యొద్ద మంత్రిగా నుండినవాడు. అప్పులగు విద్వాంసులు కృతి రచింప దన్నుత్సాహ పెట్టి వంశాదివర్ణనము చేయగాఁ దాను గృతి రచించి నట్టీతడు చెప్పుకున్నాడు. జైమిని భారతాది కృతికర్త యగు పిల్లలమర్రి పినవీరన యీతని వంశమునకు బూర్వుడని యిందు గలదు. పిల్లల మర్రి వారే పెనుమళ్ళలో వసించుట చేత బెనుమళ్ళ వారన బరగిరట' ఇందలి వంశవర్ణనమును బట్టి చూడ నీ గ్రంథకర్త యా పినవీరనకు బెక్కు తరములు తరువాతి వాడగుచున్నాడు శృంగార శాకుంతలము నందు బిల్లలమర్రి వీరన కాశ్యప గోత్రుడని స్పష్టముగా జెప్పబడి యున్నది. భారద్వాజ గోత్రుడగు నీతడా పినవీరన వంశము వాడగుననుట విశ్వాస్యము గాకున్నది. మఱియు, డిస్క్రిప్టివు క్యాటలాగు నె. 14 రు నఁ గల ప్రాత తాటియాకు పుస్తకము ముఖ పత్రమున వ్రాయబడిన గాదిరాజు వంశక్రమముతో నిది సరిరాక యున్నది.

ఈ ప్రతికి మాతృక పూసపాటి అచ్యుతరామరాజు గారి యాజ్ఞ చొప్పున గాళ్ళకూరి సూరనార్యునిచే వ్రాయబడినది ప్రత్యాశ్వాసాంతమునను నాతఁ డా యచ్యుతరామరాజు గారిని బొగడుచు బద్యములను రచించి చేర్చియున్నాడు.

Book: SOURCES OF VIJAYANAGARA HISTORY

—S.K. Ayyangar

(The Madras University of Historical Series)

Published by the University of MADRAS

(1919)

Page 29. No. 2

(JAIMINI BHARATAMU)-ASVAMEDHAPARVAMU

(Pillalamarri Pina Veerabhadra)

This work is dedicated to Saluva Narasimha, the first king of the second Vijayanagara or/Saluva dynasty. In the introduction it gives some information about the ancestors of Saluva Narasimha of whom the chief was Saluva Mangu. During the reign of the Emperor Bukka and his Minister Gopanarya. The expedition was directed against the chief, Sambuva-raya and the Muhammadans who were then masters of the Madura and Trichinopoly districts. In this extract he said to have defeated the Sultan of the south and given his territory to Simbuvaraya, to have established Sambuva-raya on his throne, to have established the God of Srirangam in his temple and made a present to it of 60,000 Madas (of Gold) and to have killedthe Sultan of Madura in battle.

Canto I (శై. ఖా)

1 "జననం బందిగి.........మ-గాంగుడున్ (ప 80)

2. "పిరలలో కుతితెక్కొను.........కలశాంబుధియై (ప. 81)

3. "దురములో దక్షిణ.........సాళ్వమంగు (ప 82)

4. "అట్టి సాళ్వ మంగయ.........నమదహితులు (ప 88)

Page 85. No. 31

——

JAIMINI BHARATAMU

(By Pillalamarri Pina Veerabhadra)

This is a poem dedicated to the Vijayanagara Emperor Saluva Narasimha, the founder of the second Vijayanagar dynasty. In the introduction the poet gives a long accounts of the achievements of the king's ancestors from Saluva Mangu He explains the meanings of the various titles that Narasimha assumed, and says that he conquered the Tigula Bhumi, meaning by that term the Tamil Country, deprived the Oddiya (the sovereign of Orissa) who invaded his kingdom, of his strength; captured the fort of Baladurgam5 and having gone to the Penugonda destroyed the Pikkillu and other enemies of his Week after week the King Saluva Narasimha made extensive gifts to Brahmanas. He is said to have conquerred many forts the chief among which being Boonagiri (Bhuvanagiri), Gingi, Kommadhari* and Penukonda.

### మానసోల్లాససారము లేక అభిలషితార్థ చింతామణి[7]

ఈ గ్రంథమునకు మూలము సంస్కృతమున గలదు. ఆ గ్రంథము పీఠికలో శ్యామశాస్త్రిగారు ఈ విధముగ తెలిపినారు

"The book consists of five Prakaranas of twenty chapters each. In the first Prakarana are explained general religious ethics, social service, manufacture of idols, and diseases and their remedies. In the second, Polity is treated of in detail ally, his seven heads, such as the king, his minister, his under thetreasury, the kingdom, forts and the army together with the law, both private and interstatal, under such aspects aspeace, war, invasion, neutrality, alliance, and war with o ne and peace with another, not omitting the four well-known stratagems, such as reconciliation, bribary, dissesion, and war. The third prakarana is devoted to the description of architecture, picture - drawing and painting with minutest details, iconography and pleasures of domestic life. In the fourth and fifth, various forms of amusements and recreations are described. Incidentally brief reference is also made to arithmetic, the decimal notation, preparation of calendars, astrology, omens, augury, palmistry, training of horses and elephants together with the treatment of their diseases, mining, alchemy, gems, and precious stones, marriage and child-rearing, cookery, liquor, beverages, music, conveyance, and scents."

---

పిన వీరభద్రుని స్తుతించిన కవులు రచయితలు, గ్రంథోదాహరణములు:

1. ఎడపాటి ఎఱ్ఱన శృంగార మల్హణ చరిత్రము :

వినుతు లొనర్తు నాంధ్ర సుకవి ప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచన సోము సర్వదే
వుని శివదూరు వేము నల పోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్. (1-9)

2. దిలీప చరిత్రము - వెంకటకృష్ణ కవి.

సీ. చతురాస్య వాగనుశాసను సమధిక
పండితత్వాహినుఁ గుండలీంద్రు
మృదుపదాద్భుదిత త్రిభువన శ్రీనాథు
ధరణి సర్వజ్ఞతఁ బరగు భీము
సన్మార్గఘటనావిచక్షణు భాస్కరు
నమిత కళావంతుఁ డైన సోము
ధర్మధర్మజ్ఞతఁ దగు రామభద్రుని
విశ్వవిఖ్యాతుఁ డౌ వీరభద్రు

గీ. సకల నుతిం చెద మత్కావ్య మనెడు కథ
కాయురారోగ్య మౌత్సుక్య మతిశయంబు
మహిమ చల్లదనంబు దాంపత్యసుఖము
శత్రు విజయంబుఁ బ్రేమ నొసఁగు గాఁత. (1-10)

3. "పురాణయుగ కవులందు నాచన సోముడు, భాస్కర కవులు, మడికి సింగన, పిల్లలమఱ్ఱి పినవీరన మొదలగు కవులాంధ్ర వాఙ్మయ నిర్మాతలందు ప్రముఖులు"

—పుట 67 - శ్రీ నాగేశ్వర శతజయంతి సంచిక.

4. "పిన వీరభద్ర కవి కవిత్వమునకు వలసిన యన్ని ముఖ్యాంశము. లోను నేవిధముగను ప్రశస్తులైన యా యుగపు కవులకు, తీసిపోని ప్రజ్ఞాశాలి."

—పీఠిక (పుట 81) శృంగార శాకుంతలము (అకాడమి)

5. "పిన వీరభద్రన భారత కవులతో సరిపోల్పదగినవాడు. ఇతని కవిత్వము మాత్ర మసమానమైనది గంగాప్రవాహము వలె నీ కవిత పవిత్రమై గంభీరభావాలంకృతమై శ్రవణానంద ప్రదమై యలరారుచున్నది"

—పీఠిక-జైమిని భారతము (జనమంచి శేషాద్రి శర్మ)

6. "ఈ నాటక కథావస్తువు మహాశ్వవివర్ణ్యంబును, సాళువ గుండ నరసింహ భూపాలుని సభలో 'వాణి నా రాణి' అని నిస్సందేహముగ నిర్ణయముగాఁ జిక్కిన విద్వచ్ఛిఖామణియునగు, పిల్లలమఱ్ఱి పిన వీరనచే రచింపబడిన జైమిని భారతాంతర్గతమగు నశ్వమేధ పర్వమునుంచి గ్రహింపబడియుండెను."

—వేదాంతం రామానుజాచార్యులు (మహావీర బభ్రువాహన నాటకము)

7. "ఇతడు గొప్ప కవి ఇతని కవిత్వము మిక్కిలి శ్లాఘ్యముగానే యున్నది."

(శబ్ద రత్నాకరము)

8. 'నిరుపమానమైన కవిత్వధార గలవాడు'

—కందుకూరి వీరేశలింగం. (ఆంధ్రకవుల చరిత్ర)

9. "తెలుగు సాహిత్యములో ఇప్పటికి యథామూలముగ అనువాదము చేసిన ఒక కవి కనబడుచున్నందుకు సంతోషించాలి. శ్రీనాథుని ప్రయోగాలకు స్పష్టమైన అర్థాలు తెలియాలంటే పిన వీరయ్య గ్రంథాలు చూడాలేమో అని పిస్తుంది."

—ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యము (తొలి రాయల యుగము)

10 "ద్వంద్వ యుద్ధ మతిస్వాభావికముగను, రమ్యతరముగను పిన వీరభద్రుడు వర్ణించి యుద్ధకళా రహస్యజ్ఞు డనిపించుకొనినాడు"

(పుట 310 - వీరరసము)

11. 'ఇతని పదశయ్యాదులు, రసస్ఫూర్తియు, దక్షిణ సోమయాజి కవనంబు బోలె సరసంబై యుండును '

—శ్రీ గురజాడ శ్రీరామమూర్తి (కవి జీవితములు)

12. "కవిత్వము ద్రాక్షాపాకము. పదము లందలి పొందిక యమూల్య సందర్భ సముచితము."

—కవిత్వవేది (ఆంధ్ర వాఙ్మయ చరిత్ర)

13. "శ్రీనాథ కవి రాజశేఖరునితో పాటు పిన వీరన కూడ పెద్దన కవిత్వమునకు జీవకళ చేకూర్చెనని విశ్వసింపనగు "

—విశ్వనాథ సరసింహము.

14. "ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథుడు సృష్టించిన ప్రబంధ శైలి భిక్షను తా నొకచేత నందుకొని వేరొకచేత ప్రబంధకవులకిచ్చిన సచ్ఛిష్యుడు."

—విజ్ఞాన సర్వస్వము (౪ సం.) పూర్వప్రబంధ యుగము.

15. "అనువాద పద్ధతిలో నాతడు శ్రీనాథుని కంటె నెక్కుడు స్వాతంత్ర్యము వహించి ప్రబంధ యుగము నత్యంత సన్నిహితమునకు దెచ్చినవాడు."

—డాక్టర్ పల్లా దుర్గయ్య గారి సిద్ధాంత వ్యాసము.

16. "పిన వీరనలో కల్పనా శక్తి యున్నది. ఈతని కవితలో పాండిత్యము ప్రతిభ కంటె మిక్కుటముగా కనిపించును. ఈయన లోకానుభవము కల మహాకవి."

—విజయనగరాంధ్ర కవులు.

17. "పినవీరభద్ర కవి యొక్క కవిత్వతత్త్వమందె గాక దైవ మహాత్త్వము నందును ప్రసిద్ధుడు."

— పురాణ మంజరి, శృంగార కవి సర్వారాయడు.

18. "జైమిని భారతం కృష్ణపారమ్యాన్ని చాటే పురాణం"

— ఆచార్య డా బిరుదురాజు రామరాజు.

(కవితాలహరి - పుట 59.)

19 "పిల్లలమఱ్ఱి పిన వీరభద్ర కవి ప్రబంధ యుగోదయమునకు ప్రస్తావన నిర్వహించిన సూత్రధారుడు." —పుట 211.

"పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు"—డా. జి వి. సుబ్రహ్మణ్యం.

20 ఆంధ్ర కావ్యరచనా ప్రణాళిక యందలి వృద్ధి క్షయములను పరివర్తన పరిణామములను నిపుణముగా పరిశీలించు విమర్శకుల దృష్టిలో శ్రీనాథ పెద్దనల నడుమ గల వాఙ్మయాభివృద్ధి భాగము పినవీరుని కావ్యపరిచయము లేకున్న గొఱతపడి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర మసంపూర్ణమగును "

చేకుమళ్ల అచ్యుతరావు (ఆంధ్ర వాఙ్మయ చరిత్ర)

## ఉపయుక్త గ్రంథ సూచిక

### సంస్కృతము

1. సంస్కృత జైమిని భారతము.
2. శతపథ బ్రాహ్మణము - Part V.
3. ఋగ్వేదము - I.
4. భగవద్గీత.
5. ప్రతాపరుద్రీయము.
6. అభిలషితార్థ చింతామణి
7. Apte's Sansk.-Eng Dictionary.
8. Concise Sansk.-Eng. Dictionary.
—V V. Bhide.

### ఆంగ్లము

1. Epigraphica Carnatica XI, XII, XXV.
2. T.T Devasthanam Inscriptions Vol 5
3. Historical Inscriptions of South India
—Sewell.
4. The Suryavamsi Gajapathis of Orissa.
—Dr. R. Subramaniam.
5. History of Sangama Dynasty.
(Unpublished Thesis of Dr. P. Jhansi Laxmi)
6. History of Bengali language.
—D C Sen.
7. Chambers Twentieth Century.
8. Shankaranarayana Dictionary
9. The Adventure of Criticism.
—Prof. K.R Srinivasa Iyengar.
10. New approach to the Ramayana.
—N. R. Navlekar
11. Mathew Arnold—Critical Study.
—C L Sastri
12. A Census of Indic Manuscripts in the United States and Canada.
13. Catalogue of Sanskrit and Prakrit Manuscripts in the Library of the India office.
14. A Descriptive Catalogue of the Telugu MSS in the Govt. Oriental MSS Library, Madras.
15. Indian Ephemeries
16. Sources of Vijayanagar History
—S. K. Ayyangar.

## కన్నడము

1. కన్నడ కవి చరిత్ర - III.
2. జైమిని భారత సంగ్రహ - అవరగౌడ.
3. జైమిని భారత - లక్ష్మీశ.

## హిందీ

1. జైమిని భారతము - (హిందీ) Harvard Univ. (Xerox Copy).
2. హిందీ సాహిత్య ఔర్ ఉస్ కీ ప్రముఖ ప్రవృత్తియాం - గోవింద రామశర్మ.
3. హిందీ సాహిత్య కా సుబోధ ఇతిహాస్ - బాబూ గులాబ్‌రాయ్.

## తెలుగు

1. శృంగార శాకుంతలము - పినవీరభద్రుడు.
2. సీమంతినీ కల్యాణము - పెనుమళ్ళ సోమమంత్రి.
3. ప్రబంధ రత్నావళి - వేటూరి ప్రభాకర శాస్త్రి
4. ఆంధ్రకవుల చరిత్ర - కందుకూరి
5. చాటు పద్య మణిమంజరి - వేటూరి ప్రభాకరశాస్త్రి
6. విజ్ఞాన సర్వస్వము - Vol III.
7. కవితరంగిణి - చాగంటి శేషయ్య (VI)
8. సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర - ఆరుద్ర.
9. కవి జీవితములు - గురజాడ శ్రీరామమూర్తి.
10. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - కవిత్వవేది.
11. History of Andhra Literature in Vijayanagar Empire Part I (Tel.)
12. పిల్లలమర్రి పిన వీరభద్రుడు - డా. జి వి. సుబ్రహ్మణ్యం.
13. ఆంధ్ర సాహిత్య చరిత్రము - ప్రొ. ఖండవల్లి లక్ష్మీరంజనం.
14. అకాడమీ వారి శృంగార శాకుంతల పీఠిక. - డా. నాయని కృష్ణకుమారి.
15. మహా భారత చరిత్ర - పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.
16. నన్నయ భారతము - డా. దివాకర్ల వేంకటావధాని.
17. కవితాలహరిలోని (పిల్లలమర్రి పినవీరభద్రుడు) పరిశోధనా వ్యాసము - ఆచార్య బిరుదురాజు రామరాజు.
18. రామాయణ విశేషములు - సురవరం ప్రతాపరెడ్డి.

19. ఆంధ్రమహాభారతము (అనుశాసనికపర్వ పీఠిక) డా. కులశేఖరరావు.
20. మహాభారతము, ఆది, ద్రోణ, అశ్వమేధ పర్వములు.
21. మహాభాగవతోపన్యాసములు-వేదాళ తిరువేంగళాచార్యులు.
22. మహాభాగవతము - ప్రథమస్కంధము.
23. ఉత్తర భారత సాహిత్యములు (అకాడమీ).
24. దక్షిణ భారత సాహిత్యములు (అకాడమీ).
25. తెలుగులో హరివంశములు - Dr యశోదారెడ్డి
26. హరివంశ పీఠిక - వేలూరి శివరామశాస్త్రి.
27. ఉత్తర హరివంశ పీఠిక - వేదం లక్ష్మీనారాయణ శాస్త్రి
28. జైమిని భారతము - సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు
29. ఆంధ్ర వచన వాఙ్మయము - Dr. కులశేఖరరావు
30. కావ్యానందము - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
31. నాట్యశాస్త్రము - Dr P S R అప్పారావు.
32. వీరరసము - Dr. G. V సుబ్రహ్మణ్యము.
33. సాహిత్య శిల్ప సమీక్ష - శ్రీ పింగళి లక్ష్మీకాంతం
34 కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన.
35. కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి.
36. ప్రథమాంధ్ర మహాపురాణము (Thesis)
Dr G V సుబ్రహ్మణ్యము.
37. మహాభారత ఛందశ్శిల్పము - (Thesis)
Dr పాటిబండ మాధవశర్మ
38. సర్వలక్షణ సార సంగ్రహము - కూచిమంచి తిమ్మకవి
39. ప్రౌఢ వ్యాకరణము (వ్యాఖ్య) - బులుసు వేంకటరమణయ్య.
40. తిక్కన కావ్య శిల్పము (Thesis)
Dr. K V. రామకోటి శాస్త్రి.
41. ఉత్తర రామాయణోపోద్ఘాతము - నేంటూరి రామదాసయ్యంగారు
42. అకాడమీ వారి నిర్వచనోత్తర రామాయణ పీఠిక -
డా. పాటిబండ మాధవశర్మ.
43. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము -
డాక్టర్ దివాకర్ల వెంకటావధాని.
44. తెలుగు నాటక వికాసము-Dr P S R అప్పారావు.
45. నాటక విమర్శ-కోరాడ రామకృష్ణయ్య.
46. ప్రతాపరుద్రీయము - వ్యాఖ్యాత - శ్రీ చలమచర్ల రంగాచార్యులు.

47. జైమిని భారతము (వ్యవహారికము) - అనంతం.
48. ఎఱ్ఱన - అరణ్య పర్వశేషము.
49. జక్కన విక్రమార్క చరిత్రము.
50. ఉత్తర హరివంశము.— నాచన సోమన.
51. శ్రీనాథుడు { కాశీ ఖండము.
52. ,, { శృంగార నైషధము.
53. కనుపర్తి అబ్బయామాత్య - అనిరుద్ధ చరిత్ర.
54. హంసవింశతి - అయ్యలరాజు నారాయణామాత్య.
55. సాహిత్య తత్త్వము - శివ భారతము - సర్దేశాయి తిరుమలరావు.
56. శబ్దరత్నాకరము.
57. ప్రబంధ వాఙ్మయ వికాసము (Thesis)-డా. పల్లా దుర్గయ్య.
58. విజయనగరాంధ్రకవులు - శిష్ట్లా లక్ష్మీకాంత శాస్త్రి.
59. పురాణమంజరి - సర్వారాయుడు.

---

1. "పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు - జైమిని భారతము" వ్యాసము 'భారతి' ప్రభవ - మాఘము [ఫిబ్రవరి - 1928] దేకుమళ్ళ అచ్యుతరావు
2. Indian Ephemeries లో దీనికి 11 సెప్టెంబరు 1772 ఎ డి అను కనబడినది.
3. 'Indian Ephemeries' లో ఈ తేది 27 డిసెంబరు 1818 ఎ డి. గా గుర్తింపబడినది.
4. 'పెనుమళ్ళ' గ్రామము "పెటవాళ్ళ" అను పేరుతో విశాఖపట్టణ మండలములో బొబ్బిలి తాలూకాలో ఉన్నది అది మామిడిపండ్లకు ప్రసిద్ధి
5. Seems to represent udayagiri.
6. The printed editions gave the word as Kommadhara puri, due to a wrong reading. The place seems to stand for Dharapuram in the coimbatore district.
7. 'అభిలషితార్థ చింతామణి' of Chalukya Someshwara Deva - part I Prakaranas 1-3 edited by Dr. R. Shama sasrty, curator, Govt. Oriental Library, Mysore, Univ. of Mysore. Samskrit Series No. 69. Govt. branch press-Mysore 1926. Introduction by R. Shama Sastry.



# :మానసోల్లాససారము—అలభ్య గ్రంథము:

[చాటు పద్య మణిమంజరిలో పేర్కొనబడిన ఈ నవరత్నములు, పై గ్రంథములోనివిగా శ్రీ వేటూరివారిచే ఉదాహృతములు.]

## నవరత్నములు

సీ. దినదినంబును నెల్ల దివిజులఁ బోషించు
గైరవబంధుఁడే కార్యకాంక్ష?
అప్పటప్పటికి లోకాంధకారము మాన్చు
నినుఁడేమి లాభంబు నిచ్చగించి?
సచరాచరంబైన జగతి యెల్ల ధరించు
ఫణిపతి యే ఫల ప్రాప్తిఁ గాంచి?
అదనున వర్షించి యఖిల జీవులఁ బ్రోచు
జలధరం బే ప్రయోజనము గోరి?

గీ. పరహితం బాత్మహితమని పరమ పుణ్యు
లన్యు లొనరించు మేలు తారాసపడరు
సకల భాగ్యోదయ! కరాతి సాళువాంక!
గుండభూపాలు నరసింహ మండలేంద్ర! 1

సీ. ఆకార సంపద ననుకరించిన విద్య
విద్యకుఁ దోడైన వినయగుణము
వినయ గర్భితమైన విక్రమారంభంబు
విక్రమార్జితమైన విభవగుణము
విభవానుగుణమైన వితరణోన్మేషంబు
వితరణోపేతమై వెలయు ప్రియము
ప్రియవచోనిరతమై పెంపొందు సత్కృతి
సత్కృతిఁ జేకొన్న చారుకీర్తి

గీ. చారుకీర్తికి నెలవైన పౌరుషంబు
పౌరుషంబున వర్తించు భాగ్యభూమి
భూమి పాలించు నృపతికి భూషణములు
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర. 2

సీ. సర్వజ్ఞుఁడగు మంత్రి సవదరించిన రాజు
కార్యఖడ్గమ్ముల క్రమమెఱుంగు
కార్యఖడ్గముల క్రమ మెఱింగిన రాజు
బహు విధంబుల మూలబలముఁ గూర్చు
బహు విధంబుల మూలబలము గూర్చిన రాజు
శత్రుల సులీల సంహరించు
శత్రుల సవలీల సంహరించిన రాజు
ధరణి యేకాత పత్రముగ నేలు

గీ. కావున మహా ప్రధానాగ్రగణ్యు బుద్ధి
యధిపు సామ్రాజ్యమునకు సర్వాంగరక్ష
రాయమలపర గండ! వీర ప్రచండ!
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! 3

సీ. సంగీత ధర్మంబు సాహిత్య ధర్మంబు
తెలియనేర్చుట ప్రజ్ఞగల ఫలంబు
వితరణ ప్రౌఢియు వినయసంరూఢియుఁ
గైకొంట సంపద గల ఫలంబు
కుజన శిక్షణమును సుజన రక్షణమును
గల్గుట నిజశక్తిగల ఫలంబు
బ్రాహ్మణ భక్తియుఁ బరహిత శక్తియుఁ
గావింపు విభవంబు గల ఫలంబు

గీ. బట్టు విప్రుండు విద్యార్థి పరఁగదాత
కివియ లక్షణమెన్నంగ నెంమి నెపుడు
సాళువక్షోణిపతి వంశజలధి చంద్ర!
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! 4

సీ. బంగారునకు సౌరభము జనించిన యట్ల
మనుజుఁ డుత్తమ గుణపాలితుఁ డేని
కస్తూరి నికరంపుఁ గాంతిఁ జెందిన యట్టు
ఉత్తమోత్తముఁడు శ్రీ నొందెనేని

భావింపఁ జెటకునఁ బంతు పండినయట్లు
నెఱదాత ప్రియవచో నిరతుఁ డేని
అలరు గందపు ప్రూన నంరు పూచినయట్లు
శ్రీమంతునకుఁ గీర్తి చెందెనేని

గీ. భవ్యగుణసాంద్ర! సకల వైభవ సురేంద్ర!
సహజదానకళీంద్ర! భాషాఫణీంద్ర!
సాళువక్షోణిపతి వంశజలధి చంద్ర!
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! ౬

సీ. వాహ్యాళిచో మత్తవారణ సూకరా
శ్వములఁ గన్గొనుచోట నాయుచోట
ఆరగించెడి చోట నౌషధంబుల చోట
నిద్రవోయెడి చోట నంతచోట
వేఁట వెళ్లెడిచోట విందు చెప్పెడు చోట
నాట్యపాటల వేడ్కసలరు చోట
వైద్యునిచే.........నిటుకటంపై పట్టి
తెరవున నని మొనల్ దీర్చుచోట

గీ. దైవత స్థాన వైభవోత్సవుల చోటఁ
గ్రొత్తవారలఁ గన్పించు కొనెడు చోట
నాత్మరక్ష యేమఱకుండు నతఁడె రాజు
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! ౭

సీ. ప్రియముతో నిజ మాతృ పితృభక్తి గురించు
ధర్మాత్ములకు వేఱైన దైవమేల?
మమతమై సర్వభూతములందు దయగల్గు
ధన్యులకును వేఱు తపము లేల?
సరససత్కవి కావ్యసరణి వినోదించు
సతి పుణ్యులకు వేఱె యమృతమేల?
సతతంబు సత్యభాషానిష్ఠ వదలని
కృతకృత్యులకు వేఱె క్రతువు లేల?

గీ. ప్రాణపదమైన లలితాంగిఁ బాయకుండు
పురమునకు వేఱె దేవేంద్ర పురమదేల
రాయచౌహత్తమల్ల ధరావరాహ!
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! 7

సీ. ధనికులఁ గావింపఁ దగదు సోదర్యులఁ
బడవాలుఁ జేయఁ జొప్పడదు కుటిలు
తగదు దుర్గాధిపత్యము జ్ఞాతి కొసగంగ
ధనము కాపలిఁబెట్టఁ దగదు ఖలుని
దేశాధికారిఁగా ద్రిప్ప నొప్పదు క్రూరుఁ
జనవు ప్రమాదంబు సాహసునకు
కాదు భీరుఁ దలారికము ప్రతిష్ఠింపంగఁ
గీడు వంచకుని వాకిటను నిల్ప

గీ. నమ్మ ననుమానమగు వాని నమ్మఁ దగదు
నమ్మి యుండినచోట వ్రణంబు గనిన
వ్రణమునకుఁ దగఁ జేయంగవలెఁ జికిత్సఁ
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! 8

సీ. మంత్రాధిపుని తోడ మర్మజ్ఞుతో రాజ
హితుని తోడను నిగ్రహింపఁ జనదు
అలి మదాంధునితోడ సంగనాశక్తుతోఁ
జెడుగుతోఁ దన యాత్మ చెప్పఁ దగదు
నిందితుతోఁ బరనిందాభిలాషితోఁ
గ్రూరకర్ముని తోడ గూడఁ జనదు
రాజ విద్వేషితో భూజన ద్రోహితో
వంచకుతోఁ బొత్తువలదు సేయ

గీ. పరఁగ నీ రీతి జరియించు నరవరునకు
నూర కెవ్వారు మూర్ఖులై వైరులగుచు
నడచిరేని యపశ్యంబు చెడకపోరు
గుండ భూపాలు నరసింహ మండలేంద్ర! 9

-: రాజ పద్ధతి :-

సీ. ఉత్తమ కులజుఁడై యుద్యోగశీలుఁడై
భాషల లిపులెల్లఁ బరికళించి
వాక్పటుత్వము గల్గి వ్యసనము మాని య
ర్థముఁ గూర్ప దక్షుఁడై శ్రమము దెలిసి
ప్రజలకుఁ జల్లనై బలములఁ బోషించి
సుకృతియై శూరుఁడై శుద్ధి మెఱసి
రాజదోషములు దూరముగఁ బొందఁగ నీక
పర మర్మ భేదియై వెఱవెఱింగి

గీ. గుప్త మంత్రుఁడై కుశలుఁడై కొలువెఱింగి
దార చక్షుఁడై దేశవిచార మరయు
సట్టి సన్మంత్రి గలిగిన యతఁడు రాజు
గుండ భూపాల నరసింహ మండలేంద్ర ! 10

-: కోశ పద్ధతి :-

గీ. తన భుజార్జితమైన యర్థంబు దెచ్చి
యాయ మెఱిఁగి ప్రయించుచు ననుదినంబు
నరసి భండార మొదఁ గూర్చు నతఁడు రాజు
గుండ భూపాల నరసింహ మండలేంద్ర! 11

-: రాష్ట్ర పద్ధతి :-

సీ. వర్ణాశ్రమంబుల వరుస దప్పఁగ నీక
జార చోరాదుల పేరడంచి
దేవభూ దేవతాస్థితులు పాలించుచు
నల్పు విస్పష్టమైన నాదరించి
అబలుని బలవంతు లదరి త్రోవఁగ నీక
వ్యవహార ధర్మముల్ తివిరి నడపి
కొలువు మన్నీల లోపలిపోరు లడగించు
గళ్ళకూళ్ళకు నలజళ్ళు మాన్పి

గీ. నిఖిల దేశంబులను జక్క నిజగృహంబు
లరయు విధమున దివ్యాజ్ఞలనువు పఱిచి
యప్రమత్తుఁ డై ధరయేలు నతఁడు రాజు
గుండభూపాల నరసింహ మండలేంద్ర ! 12

-: దుర్గ పద్ధతి: -

సీ. తృణకాష్ఠ జల సమృద్ధిని ప్రధానంబుగాఁ
గలకాలమును సమగ్రంబుసేసి
కోట యాళ్వారి కొమ్ము క్రొత్తళంబు లగడ్త
లట్టళ్లు యంత్రంబు లనువు పఱిచి
ధాన్యంబు లాదిగాఁ దగు సవరణ లెల్ల
నొకటియుఁ గొదవలేకుండ నునిచి
నీతి మార్గంబున నెపుడైన దొరలను
బలసి పాళెముండుఁ గొలువు నిలిపి

గీ. నగరి కావలి సావధానముగ నునిచి
చోద్యమిది యెట్టివారి కభేద్య మనెడు
నట్టి దుర్గంబులందుండు నతఁడు రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్ర ! 13

-: బలపద్ధతి :-

సీ. బేడుపై తరువులు పెట్టక చేజేత
తపణదప్పకయ జీతంబు లిచ్చి
చేరువ దొరలిచ్చు జీతంబు వచ్చుట
రాకయుండుట విచారంబు చేసి
యిసుపరై తల ...... తగ్గినపైనను
గట్టకుండిన వాటకముగ నిచ్చి
రణరంగమునఁ గాన రా మెలంగిన చోట
నుచితంబు లొసఁగుచు నుపచరించి

గీ. ప్రాంత వారిని గొల్వాన పదని వారి
మూల బలముల మన్నిల మొనలకంటె
సంగతంబుగ నేలిన యాతఁడు రాజు
గుండభూపాలు నరసింహ మండలేంద్ర ! 14

---

ఈ పద్యములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిచే సంపాదితమైన "చాటు పద్య మణిమంజరి"లో "నవరత్నములు" అను పేరనున్నవి.

"చాటుపద్య మణిమంజరి" 1924

వావిళ్ల ప్రతి - పుట 34 నుండి 41

శ్రీ రస్తు.

సరసకవితాచాతురీధురీణుండగు

పిల్లలమఱ్ఱి, పినవీరభద్రకవిచేఁ దెనిఁగింపఁబడిన

# జైమినిభారతమునందశ్వమేధపర్వము.

శ్రీమాన్-బ- సీతారామాచార్యులవారిచేఁ

జక్కఁగాఁ బరిష్కరింపఁబడి

వంగీపురము, రామకృష్ణమాచార్యులవారిచే

శ్రీసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి.

వంగీపురము, రంగాచార్యులచేఁ

ప్రకటింపఁబడెను.

---

చెన్నపురి.

[illegible], సం

JAIMINI BHARATAMU-SAMSODHANATMAKA
PARISEELANAMU

Ph.D., Thesis of Osmania University in Telugu

By

Dr. M. VEERESHALINGAM.,

Price Rs. Forty.,